శ్రీః

శ్రీవిశ్వనాథో విజయతేతరామ్

# శ్రీశివగీతా

**(పద్మపురాణాంతర్గతా)**

శ్రీఫలమఞ్జరీవ్యాఖ్యా (ఆంధ్రప్రతిపదార్థతాత్పర్యములు)

**మేళ్ళచెఱ్ఱు వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రీ**



ప్రకాశయిత్రీ

**శ్రీమతీ రావి కృష్ణకుమారీ**

**చీరాల - 523 157**



శ్రీః

**శ్రీశివగీతా**

**(పద్మపురాణాంతర్గతా)**

శ్రీఫలమఞ్జరీవ్యాఖ్యా

**మేళ్ళచెఱ్ఱు వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రీ**

ప్రథమముద్రణ :- శ్రీనందన నామ సంవత్సరం ది.24-05-2012 న
**రావి మోహనరావు - కృష్ణకుమారి** దంపతుల
40వ వివాహవార్షికమహోత్సవము సందర్భముగా ఆవిష్కరణ

ప్రతులు : 500
పేజీలు : 264
వెల రూ. : 150-00

© 1. **RAVI MOHAN RAO, M.Sc.,** M.A. (Sanskrit)
Lecturer,
**Residence :**
4-103, I.L.T.D. Colony, Extn.,
Kothapet, Chirala.
Phone : 08594 - **234038**
Cell : **94401 15411, 90522 56311**

2. **M.V. SUBRAHMANYA SASTRY**
Retd. Lecturer,
Cell : **99081 63627**

***Computer Layout by :-***
**J. RAJA**
Ganesh Graphics,
18 Banam Complex,
Munthavari Centre, Chirala.
Cell : 98483 90564

***Printed at :-***
**KARSHAK ART PRINTERS**
Hyderabad.

శ్రీః

శ్రీవిశ్వనాథో విజయతే తరామ్

# శ్రీశివగీతా

(పద్మపురాణాంతర్గతా)

"శ్రీఫలమఞ్జరీవ్యాఖ్యా" (ఆంధ్రప్రతిపదార్థతాత్పర్యములు)

మేళ్ళచెఱ్వు వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రి

## అథ ప్రథమో ఽధ్యాయః
## శివభక్తి నిరూపణయోగః

**సూత ఉవాచ**

**శ్లో॥ అథాతః సంప్రవక్ష్యామి శుద్ధం కైవల్యముక్తిదమ్।**
**అనుగ్రహాన్మహేశస్య భవదుఃఖస్య భేషజమ్॥ 1**

**ప్రతిపదార్థము:-** అథ=తరువాత, అతః=ఇకనుంచి, శుద్ధమ్=నిర్మలమైనదియు, కైవల్య=కైవల్య రూపమైన,ముక్తి=మోక్షమును, దమ్=ఇచ్చునదియు, భవ=సంసార సంబంధమైన, దుఃఖస్య=దుఃఖమునకు,భేషజమ్=ఔషధమైన విషయమును, మహేశస్య=ఈశ్వరునియొక్క, అనుగ్రహాత్=అనుగ్రహమువలన, సంప్రవక్ష్యామి=చెప్పగలను.

**తాత్పర్యము:-** అయ్యా మునులారా! మహేశ్వరుని అనుగ్రహంతో నేను మీకు కైవల్య మోక్షదాయకమైన సంసార దుఃఖహరమైన నిర్మలజ్ఞానవిషయమును చెప్పబోవుచున్నాను.

**శ్లో॥ న కర్మణామనుష్ఠానైర్న దానైస్తపసాపి వా।**
**కైవల్యం లభతే మర్త్యః కిన్తు జ్ఞానేన కేవలమ్॥ 2**

**ప్రతిపదార్థము:-** మర్త్యః=మనిషి, కర్మణామ్=సత్కర్మలయొక్క, అనుష్ఠానైః=ఆచరణలచేత, కైవల్యమ్=మోక్షమును,న లభతే=పొందడు,దానైః=దానములచేత, న=పొందడు,తపసాపి వా=తపస్సుచేతగాని, న=పొందదు, కిన్తు=కాని, జ్ఞానేన కేవలమ్=జ్ఞానముచేతనే, లభతే=పొందును.



**తాత్పర్యము:-** మనిషి సత్కర్మలయొక్క ఆచరణలచేతగాని, దానధర్మములచేతగాని, తపస్సు చేతగాని మోక్షమును పొందజాలడు. కేవలం జ్ఞానముచేతనే పొందగలడు.

**శ్లో॥ రామాయ దణ్డకారణ్యే పార్వతీపతినా పురా।**
**యా ప్రోక్తా శివగీతాఖ్యా గుహ్యాద్గుహ్యతమాపి సా॥ 3**

**ప్రతిపదార్థము:-** పురా=పూర్వము, దండకారణ్యే=దండకారణ్యమునందు, యా=ఏ గీత, రామాయ=రామునకు, పార్వతీపతినా=పార్వతీవల్లభునిచేత, ప్రోక్తా=చెప్పబడినదో, సా=అది, శివగీతాఖ్యా='శివగీత' అనుపేరుగలది, అపి=మఱియు, గుహ్యాత్=రహస్యము కన్న, గుహ్యతమా=మిక్కిలి రహస్యమైనది.

**తాత్పర్యము:-** పూర్వం పరమేశ్వరుడు (పార్వతీవల్లభుడు) శ్రీరామునకు దండకారణ్యంలో ఒక గీతను ఉపదేశించాడు. అదే 'శివగీత'. అది అత్యంత రహస్యమైనది.

**శ్లో॥ యస్యాః శ్రవణమాత్రేణ నృణాం ముక్తిర్ధ్రువం భవేత్।**
**పురా సనత్కుమారాయ స్కన్దేనాభిహితా హి సా॥ 4**

**ప్రతిపదార్థము:-** యస్యాః = దేనియొక్క, శ్రవణమాత్రేణ = వినుటతోనే, నృణామ్ = మనుష్యులకు, ముక్తిః=మోక్షము, ధ్రువమ్=తప్పక, భవేత్=కలుగునో, సా=ఆ గీత, పురా=పూర్వము,స్కందేన= కుమారస్వామిచేత, సనత్కుమారాయ=సనత్కుమారుని కొఱకు, అభిహితా హి=చెప్పబడినది గదా!

**తాత్పర్యము:-** ఈ గీత విన్నంత మాత్రముచేతనే ముముక్షువులకు మోక్షము సిద్ధించును. పూర్వం ఈ గీతను కుమారస్వామి సనత్కుమారునికి ఉపదేశించెను.

**శ్లో॥ సనత్కుమారః ప్రోవాచ వ్యాసాయ మునిసత్తమః।**
**మహ్యం కృపాతిరేకేణ ప్రదదౌ బాదరాయణః॥ 5**

**ప్రతిపదార్థము:-** మునిసత్తమః=మునిశ్రేష్ఠుడైన, సనత్కుమారః=సనత్కుమారుడు, వ్యాసాయ= వ్యాసునకు, ప్రోక్తవాన్=చెప్పెను. బాదరాయణః=వ్యాసమహర్షి, కృపాతిరేకేణ =అధికదయతో, మహ్యమ్=నాకు, ప్రదదౌ=ఇచ్చెను.

**తాత్పర్యము:-** సనత్కుమారమునీంద్రుడు వ్యాసమహర్షికి ఈ 'శివగీత' ను చెప్పెను. ఆ వ్యాసమహర్షి నా మీద దయతో ఆ గీతను నాకు ఉపదేశించెను.

**శ్లో॥ ఉక్తం చ తేన కస్మైచిన్న దాతవ్యమిదం త్వయా ।**
**సూతపుత్రాన్యథా దేవాః క్షుభ్యన్తి చ శపన్తి చ ॥ 6**

**ప్రతిపదార్థము:-** తేన=ఆ వ్యాసమహర్షిచేత, ఉక్తం చ=చెప్పబడినది ఏమనగా, త్వయా= నీచేత (సూతునిచేత) ఇదమ్=ఈ గీతారహస్యము, కస్మైచిత్=ఎవనికి పడితేవానికి, న దాతవ్యమ్= ఇవ్వదగినదికాదు. సూతపుత్ర!=సూతమహర్షీ!, అన్యథా=అలాగాక నీవు ఇచ్చినచో, దేవాః=దేవతలు, క్షుభ్యంతి చ=చిరాకుపడెదరు, శపంతి చ= శపించెదరు గూడ.

**తాత్పర్యము:-** వ్యాసమహర్షి నాకు ఈ గీతోపదేశము చేసి ఇలా అన్నాడు. ఓ సూతపుత్రా! నీవు ఈ గీతాశాస్త్రమును అర్హత విచారించకుండా ఎవరికి పడితే వారికి బోధింపకుము. దానివలన దేవతలు కోపించి శపించెదరు.

**శ్లో॥ అథ పృష్టో మయా విప్రా! భగవాన్ బాదరాయణః।**
**భగవన్! దేవతాస్సర్వాః కిం క్షుభ్యన్తి శపన్తి చ ॥ 7**

**ప్రతిపదార్థము:-**విప్రాః=ఓ వేదవేత్తలారా!, అథ=తర్వాత, మయా=నాచేత, భగవాన్= భగవానుడైన, బాదరాయణః=వ్యాసమహర్షి, పృష్టః=ఇలా అడుగబడెను, భగవన్=మహాత్మా!, దేవతాః=దేవతలు, సర్వాః=అందఱు, కిమ్=ఎందుకు, క్షుభ్యంతి=కలత చెందెదరు?, కిమ్= ఎందుకు, శపంతి చ=శపించుతారు?

**తాత్పర్యము:-** ఓ మహర్షులారా! నేను తర్వాత బాదరాయణ భగవానుని యిలా ప్రశ్నించాను. అయ్యా! దేవతలంతా ఎందుకు శపిస్తారు? ఎందుకు కోపిస్తారు?

**శ్లో॥ తాసామత్రాఽస్తి కా హానిర్యయా కుప్యన్తి దేవతాః।**
**పారాశర్యోఽథ మామాహ యత్పృష్టం శృణు వత్స! తత్॥ 8**

**ప్రతిపదార్థము:-**యయా=ఏ హానిచేత, దేవతాః=దేవతలు,కుప్యంతి=కోపిస్తారో, హానిః =అట్టి నష్టము, తాసామ్=ఆ దేవతలకు, కా=ఏమి, అస్తి=ఉన్నది? అథ=తరువాత, పారాశర్యః=పరాశర పుత్రుడైన వ్యాసుడు, మామ్=నన్ను, అహ=ఇట్లు అనెను, వత్స=బిడ్డా!, యత్=ఏది, పృష్టమ్= అడుగబడెనో, తత్=దానిని, శృణు=వినుము.

**తాత్పర్యము:-** దేవతలు కోపిస్తారు, శపిస్తారు అని అన్నారు గదా! గురుదేవా! ఆ దేవతలకు ఈ గీతోపదేశంవలన ఏమి నష్టం వస్తుందని,వారు కోపపడతారు? అని నేను వ్యాసమహర్షిని అడిగితిని. ఆయన నీవడిగిన విషయం చెపుతాను విను – అన్నాడు.

**శ్లో॥ నిత్యాగ్నిహోత్రిణో విప్రాః సన్తి యే గృహమేధినః।**
**త ఏవ సర్వఫలదాః సురాణాం కామధేనవః॥ 9**



**ప్రతిపదార్థము:-** గృహమేధినః = గృహస్థులై, నిత్యాగ్నిహోత్రిణః = నిత్యం అగ్నిని ఉపాసించునట్టి, విప్రాః = వేదవేత్తలైన బ్రాహ్మణులు, యే = ఎవరు, సంతి = కలరో, త ఏవ = వారే, సురాణామ్ = దేవతలకు, సర్వ = సమస్తమైన, ఫలదాః=ఫలములనిచ్చు, కామధేనవః=కామధేనువులు.

**తాత్పర్యము:-**నిత్యాగ్నిహోత్రులు, వేదవేత్తలున్ను అయిన శ్రోత్రియగృహస్థులు, దేవతలపాలిట కామధేనులు, దేవతలకు సమస్తఫలితములను ఇచ్చువారు వారే.

**శ్లో॥ భక్ష్యం భోజ్యం చ పేయం చ యద్యదిష్టం సుపర్వణామ్।**
**అగ్నౌ హుతేన హవిషా తత్సర్వం లభ్యతే దివి ॥ 10**

**ప్రతిపదార్థము:-** భక్ష్యమ్=పిండివంటగాని, భోజ్యం చ=శాకపాకాదులుగాని, పేయం చ= త్రాగదగిన పానీయముగాని, యద్యత్=ఏది ఏది, సుపర్వణామ్=దేవతలకు, ఇష్టమ్=ఇష్టమో, తత్ సర్వమ్=అది అంతయు,అగ్నౌ=అగ్నియందు,హుతేన=హోమము చేయబడిన హవ్యంతో, దివి=స్వర్గమునందు, లభ్యతే=పొందబడును (దేవతలచేత).

**తాత్పర్యము:-** దేవతలకు ఇష్టమైన సమస్త భక్ష్య, భోజ్య, పానీయములన్నీ వారికి ఈ వేదవేత్తలు హోమంచేయు హవ్యములద్వారా స్వర్గమున లభించును.

**శ్లో॥ నాన్యదస్తి సురేశానామిష్టసిద్ధిప్రదం దివి ।**
**దోగ్ధ్రీ ధేనుర్యథా నీతా దుఃఖదా గృహమేధినామ్॥ 11**

**శ్లో॥ తథైవ జ్ఞానవాన్విప్రో దేవానాం దుఃఖదో భవేత్।**
**త్రిదశాస్తేన విఘ్నన్తి ప్రవిష్టా విషయం నృణామ్। 12**

**ప్రతిపదార్థము:-** సురేశానామ్=దేవశ్రేష్ఠులకు, దివి=స్వర్గమున, ఇష్టసిద్ధి=వాంఛాసిద్ధిని, ప్రదమ్=ఇచ్చునట్టిది, అన్యత్=వేఱొక్కటి, నాస్తి=లేదు, దోగ్ధ్రీ =పాలిచ్చు,ధేనుః=ఆవు, నీతా =హరింపబడినదై, గృహమేధినామ్=గృహస్థులకు,యథా=ఏలా, దుఃఖదా=శోకదాయకమో, తథైవ=అట్లే, జ్ఞానవాన్=జ్ఞానియైన, విప్రః=వేదవేత్త, దేవానామ్=దేవతలకు, దుఃఖదః=దుః ఖం కలిగించువాడు, భవేత్=అగును, తేన=అందుచేత, త్రిదశాః=దేవతలు, నృణామ్ =మనుష్యులయొక్క,విషయమ్=భోగపదార్థము(ల)ను, ప్రవిష్టాః=ప్రవేశించినవారై, విఘ్నంతి =చెడగొట్టెదరు.

**తాత్పర్యము:-** దేవతలకు భక్ష్యభోజ్యాదులు లభించాలంటే, ఈ యజమానులుచేసే హోమాలు హవ్యాలే అవకాశం. ఇవి లేనిచో స్వర్గంలో దేవతలకు ఆహారం లభింపదు. పాలిచ్చే పాడి ఆవును ఎవరైనా తోలుకుపోతే ఏ గృహస్థుకైనా ఎలాంటి బాధ కలుగుతుందో

సరిగా అలాంటి బాధే దేవతలకు కలుగుతుంది. ఈ గీత చదివి ప్రతి గృహస్థుడు జ్ఞానియై కర్మమార్గాన్ని వదిలితే దేవతలకు 'ఆకలి' తప్ప మఱేమియు లేదు. అందువలన జ్ఞాని అయిన విప్రునివలన దేవతలకు దుఃఖము. అందువలన వారు విషయాలలో ప్రవేశించి మనుష్యులను పడగొట్టారు.

శ్లో॥ తతో న జాయతే భక్తిః శివే కస్యాపి దేహినః।
యథా కథఞ్చిజ్జాతాపి మధ్యే విచ్ఛిద్యతే నృణామ్।
జాతం వాఽపి శివజ్ఞానం న విశ్వాసం భజత్యలమ్॥ **13**

**ప్రతిపదార్థము:–** తతః=దేవతలుచేసే ఆటంకంవలన, కస్యాపి=ఏ, దేహినః=శరీరికిగూడా, శివే= శివునియందు, భక్తిః=భక్తి, న జాయతే=కలుగదు, యథా కథంచిత్=ఏదో ఒకరకంగా, జాతాపి= కలిగినను, నృణామ్=మనుష్యులయొక్క భక్తి, మధ్యే=మధ్యలోనే, విచ్ఛిద్యతే= తెగిపోవును, శివజ్ఞానమ్=శివసంబంధమైన ఎఱుక, జాతం వాపి=కలిగినను, అలమ్= తగినంత, విశ్వాసమ్= నమ్మకమును, న భజతి=పొందదు.

**తాత్పర్యము:–** దేవతలు స్వార్థంతో కల్పించే ఆటంకాలు విషయాకర్షణలు, వాటివలన దేహధారులకు శివభక్తి కలుగుటయే కష్టము. ఎలాగో కలిగినా అది మధ్యలోనే మాయమవు తుంది. శివజ్ఞానం కొంతకలిగినా దానిమీద వారికే నమ్మిక ఏర్పడదు.

**ఋషయ ఊచుః - ఋషులు ఇట్లనిరి.**

శ్లో॥ యద్యేవం దేవతా విఘ్నమాచరన్తి తనూభృతామ్।
పౌరుషం తత్ర కస్యాస్తి యేన ముక్తిర్భవిష్యతి।
సత్యం సూతాత్మజ! బ్రూహి తత్రోపాయోఽస్తి వా న వా॥ **14**

**ప్రతిపదార్థము:–** ఏవమ్=ఈవిధంగా, తనూభృతామ్=దేహధారులకు, దేవతాః=దేవతలు, విఘ్నమ్=విఘ్నమును, ఆచరంతి యది=ఆచరించేటట్లయితే, తత్ర=ఆ ఆటంక విషయంలో, యేన=దేనితో, ముక్తిః=మోక్షము, భవిష్యతి=కాగలదో, పౌరుషం=అట్టి పురుష ప్రయత్నం, కస్య=ఎట్టివానికి, అస్తి=కలదు? సూతాత్మజ!=సూతపుత్రా!, తత్ర=ఆ విషయంలో, ఉపాయః =ఏదయినా ఉపాయము, అస్తి వా, న వా=ఉన్నదా? లేదా? సత్యమ్=నిజము, బ్రూహి= చెప్పుము.

**తాత్పర్యము:–** అయ్యా! సూతపుత్రా! దేవతలు ఈవిధంగా ఆటంకపరిస్తే ఈ ఆటంకాలను అధిగమించే పురుషప్రయత్నం – ఎవరికైనా సాధ్యమయినది – ఉన్నదా? మోక్షాన్ని నిరాటంకంగా పొందే ఉపాయం ఉన్నదా? లేదా? సత్యం చెప్పుము.



**సూత ఉవాచ - సూతుడు ఇట్లనెను.**

శ్లో॥ కోటిజన్మార్జితైః పుణ్యైః శివే భక్తిః ప్రజాయతే ॥ **15**

శ్లో॥ ఇష్టాపూర్తాదికర్మాణి తేనాచరతి మానవః।
శివార్పణధియా కామాన్పరిత్యజ్య యథావిధి॥ **16**

**ప్రతిపదార్థము:–** కోటిజన్మ=కోటిజన్మలయందు, ఆర్జితైః=సంపాదింపబడిన, పుణ్యైః= పుణ్యములచేతనే, శివే=శివునియందు, భక్తిః=భక్తి, ప్రజాయతే=పుట్టును, తేన=అందుచేత, మానవః=మనిషి, కామాన్=కోరికలను, పరిత్యజ్య=వదలి, యథావిధి=విధ్యుక్తప్రకారంగా, ఇష్ట=యజ్ఞము, ఆపూర్త=కూపము, ఆది=మొదలైన, కర్మాణి=సత్కర్మలను, శివార్పణ =శివునకు అర్పించుట అను, ధియా=బుద్ధితో, ఆచరతి=ఆచరించును.

**తాత్పర్యము:–** శివభక్తి ఏర్పడటం చిన్నవిషయం కాదు. కోటి జన్మల పుణ్యంవలన అది ఏర్పడుతుంది. దానివలన మనిషి నిష్కాముడై సర్వకర్మలను శివార్పణబుద్ధితో చేయటం మొదలుపెడతాడు.

శ్లో॥ అనుగ్రహాత్తేన శమ్భోర్జాయతే సుదృఢో నరః।
తతో భీతాః పలాయన్తే విఘ్నం హిత్వా సురేశ్వరాః॥ **17**

**ప్రతిపదార్థము:–** తేన=శివార్పణరూపకర్మాచరణతో, శంభోః=శివునియొక్క, అనుగ్రహాత్= అనుగ్రహంవలన, నరః=సాధకుడు (మనిషి) సుదృఢః=మిక్కిలి స్థిరమైనవాడు, జాయతే= అగును, సురేశ్వరాః=దేవతలు, విఘ్నం=విఘ్నకార్యమును, హిత్వా=మానుకొని, తతః= ఆ వ్యక్తినుండి, భీతాః=భయపడినవారై, పలాయంతే=పరుగెత్తెదరు.

**తాత్పర్యము:–** శివార్పణరూపమైన కర్మయోగమును ఆచరించిన వ్యక్తి ఇంద్రియాలకు, విషయాలకు చలించనంత దృఢంగా అవుతాడు. అందుచేత దేవతలు అతనిని చూచి భయపడి దూరంగా పారిపోతారు. ఆటంకపఱచటం మానుకొంటారు.

శ్లో॥ జాయతే తేన శుశ్రూషా చరితే చన్ద్రమౌళినః।
శృణ్వతో జాయతే జ్ఞానం జ్ఞానాదేవ విముచ్యతే॥ **18**

**ప్రతిపదార్థము:–** తేన=అందుచేత, చంద్రమౌళినః=శివునియొక్క, చరితే=చరిత్రయందు, శుశ్రూషా=శ్రవణవాంఛ, జాయతే=కలుగును, శృణ్వతః=వినువానికి, జ్ఞానమ్=జ్ఞానము, జాయతే=కలుగును, జ్ఞానాదేవ=జ్ఞానమువలననే, విముచ్యతే=ముక్తుడుకాగలడు.

**తాత్పర్యము:–** శివార్పణరూపకర్మయోగంవలన విఘ్నకారులయిన దేవతలు పారిపోతారు.

దృఢమానసుడైన సాధకునకు క్రమంగా చంద్రమౌళిచరిత్రశ్రవణవాంఛ కలుగుతుంది. శివగాథాశ్రవణం వలన జ్ఞానం వస్తుంది. జ్ఞానంవలన మోక్షం వస్తుంది.

**శ్లో॥ బహునాత్ర కిముక్తేన యస్య భక్తిః శివే దృఢా।**
**మహాపాపోపపాపౌఘకోటిగ్రస్తోఽపి ముచ్యతే ॥ 19**

**ప్రతిపదార్థము:–** అత్ర=ఈ విషయంలో, బహునా=చాల, ఉక్తేన=చెప్పబడిన దానితో, కిమ్=ఏమి ప్రయోజనము, యస్య=ఎవనికి, శివే=శివునియందు, భక్తిః=భక్తి, దృఢా=దృఢమైనదో, సః=వాడు, మహాపాప=పంచమహాపాపములయొక్క, ఉపపాప=ఉపపాతకముల యొక్క, కోటి=కోట్లచేత, గ్రస్తోపి=మ్రింగబడినవాడైనను, ముచ్యతే=ముక్తుడగును.

**తాత్పర్యము:–** ఇంత చెప్పవలసిన పనిలేదు. దృఢమైన శివభక్తిగలవానికి ఎన్ని పంచమహాపాతకాలు, ఉపపాతకాలు ఉన్నా – తప్పక మోక్షం లభించగలదు.

**శ్లో॥ అనాదరేణ శాఠ్యేన పరిహాసేన మాయయా ।**
**శివభక్తిరతశ్చేత్స్యాదన్త్యజోఽపి విముచ్యతే ॥ 20**

**ప్రతిపదార్థము:–** అనాదరేణ=నిరాదరణతోనైనా, శాఠ్యేన=ద్రోహబుద్ధితోనైనా, పరిహాసేన=పరిహాసంతోనైనా, మాయయా=మాయతోనైనా, శివభక్తి=శివభక్తియందు, రతశ్చేత్ స్యాత్=ఆసక్తుడైయితే,అంత్యజోఽపి=కడజాతిసాధకుడైనను, విముచ్యతే=ముక్తుడగును.

**తాత్పర్యము:–** శివభక్తి అంటూ ఉంటేచాలు. అది నిరాదరణతో ఉన్నా, దంభముతో ఉన్నా, పరిహాసానికి ఉన్నా, మాయగా ఉన్నా – మోక్షం తప్పదు. అట్టి భక్తి చరమజాతి వానికైననూ మోక్షమును ఇవ్వగలదు.

**శ్లో॥ ఏవం భక్తిశ్చ సర్వేషాం సర్వదా సర్వతోముఖీ।**
**తస్యాం తు విద్యమానాయాం యస్తు మర్త్యో న ముచ్యతే।**
**సంసారబన్ధనాత్తస్మాదన్యః కో వాస్తి మూఢధీః॥ 21**

**ప్రతిపదార్థము:–** ఏవమ్=ఇలాగున, భక్తిశ్చ=భక్తి, సర్వేషామ్=అందరికి, సర్వదా=అన్ని ఇచ్చునది, సర్వతోముఖీ=అన్నివైపుల వ్యాపించునది, తస్యాంతు=ఆ భక్తి, విద్యమానాయామ్=ఉండగా, యస్తు=ఏ, మర్త్యః=మనిషి, సంసార=సంసారమను, బంధనాత్=బంధము నుండి, నముచ్యతే=ముక్తిపొందడో, తస్మాత్=ఆ వ్యక్తికన్న, మూఢధీః=మందబుద్ధిగలవాడు, అన్యః=మఱొకడు, కో వా=ఎవడైనా, అస్తి=కలడా?

**తాత్పర్యము:–** సర్వవ్యాప్తమై సర్వవాంఛాప్రదమైన భక్తి ఉండగా దానిని ఉపయోగించికొని మోక్షము పొందనివాడు, పరమమూర్ఖుడు. అంతన్న మూర్ఖుడు మఱొకడుండడు.



**శ్లో॥ నియమాద్యస్తు కుర్వీత భక్తిం వా ద్రోహమేవ వా।**
**తస్యాపి చేత్ప్రసన్నోఽసౌ ఫలం యచ్ఛతి వాఞ్ఛితమ్॥ 22**

**ప్రతిపదార్థము:–** యస్తు=ఎవడు, నియమాత్=తప్పక (కదలకుండా), భక్తిం వా=భక్తినిగాని, ద్రోహమేవ వా=ద్రోహమునుగాని, కుర్వీత=చేయునో, తస్యాపి=వానికైనా, అసౌ=ఈ శివుడు, ప్రసన్నఃచేత్=ప్రసన్నుడైనట్లయితే, వాంఛితమ్=కోరబడిన, ఫలమ్=ఫలితమును, యచ్ఛతి=ఇచ్చును.

**తాత్పర్యము:–** భక్తిగాని, ద్రోహముగాని, నిందగాని – ఏదైనా వదలకుండా తాత్పర్యపూర్వకంగా చేసేవాడికి గూడా ప్రసన్నుడైన పరమేశ్వరుడు వాంఛితఫలితమును ఇవ్వగలడు.

**శ్లో॥ ఋద్ధం కిఞ్చిత్సమాదాయ క్షుల్లకం జలమేవ వా।**
**యో దత్తే నియమేనాసౌ తస్మై దత్తే జగత్త్రయమ్॥ 23**

**ప్రతిపదార్థము:–** యః=ఏ భక్తుడు, ఋద్ధమ్=సిద్ధమైన, క్షుల్లకమ్=ఏదో అల్పవస్తువునుగాని, జలమేవవా=నీటినిగాని, కించిత్=కొంచెం, సమాదాయ=గ్రహించి, నియమేన=నియమంగా (వదలక), దత్తే=నివేదించునో, తస్మై=ఆసాధకునకు, అసౌ=ఈ ఈశ్వరుడు, జగత్త్రయమ్=ముల్లోకములను, దత్తే=ఇచ్చును.

**తాత్పర్యము:–** ఎంతటి అల్పమైన వస్తువునైనా ఆఖరుకు కాసిని నీటినైనా నియమంగా పరమేశ్వరునికి నివేదన చేసే భక్తునకు ఆ శంకరుడు లోకత్రయమునే వశపఱచును.

**శ్లో॥ తత్రాప్యశక్తో నియమాన్నమస్కారం ప్రదక్షిణామ్।**
**యః కరోతి మహేశస్య తస్మై తుష్టో భవేచ్ఛివః॥ 24**

**ప్రతిపదార్థము:–** తత్రాపి=జలనివేదన మొదలగు పూజా విధానమునందుగూడ, అశక్తః = ఓపికలేనివాడు, యః = ఎవడు, నియమాత్ = నియమంగా, మహేశస్య = ఈశ్వరునికి, నమస్కారమ్=నమస్కారమును, ప్రదక్షిణమ్=ప్రదక్షిణమును, కరోతి=చేయునో, తస్మై=అతనికి, శివః=శివుడు,తుష్టః=సంతోషంగలవాడు, భవేత్=అగును.

**తాత్పర్యము:–** జలనివేదనవంటి నిత్యపూజావిధానం గూడా కుదరనివాడు రోజూ శివునకు ప్రదక్షిణ, నమస్కారములను చేసినచో ఆ శివుడు వానిని చూచి మిగుల సంతోషించును.

**శ్లో॥ ప్రదక్షిణాస్వశక్తోఽపి యః స్వాన్తే చిన్తయేచ్ఛివమ్।**
**గచ్ఛన్సముపవిష్టో వా తస్యాభీష్టం ప్రయచ్ఛతి॥ 25**

**ప్రతిపదార్థము:–** యః=ఎవడు, ప్రదక్షిణాసు అపి=ప్రదక్షిణములందు గూడ, అశక్తః=

అశక్తుడో, వాడు, గచ్ఛన్=నడచుచున్నను, సముపవిష్టో వా=కూర్చొనియున్నను, స్వాంతే=మనస్సునందు, శివమ్=శివుని, చింతయేత్=ధ్యానించునో, తస్య=అతనియొక్క, అభీష్టమ్=వాంఛితమును, ప్రయచ్ఛతి=శివుడు ఇచ్చును.

**తాత్పర్యము:–** ప్రదక్షిణములు గూడా చేయలేనివాడు నిత్యము, నడుస్తూ, కూర్చొంటూనైనా, ఆ పరమేశ్వరుని తలచినచో ఆ పరమేశ్వరుడు అతని వాంఛితమును (ముక్తిని) ఇవ్వగలడు.

**శ్లో॥ చన్దనం బిల్వకాష్ఠస్య పుష్పాణి వనజాన్యపి।**
**ఫలాని తాదృశాన్యేవ యస్య ప్రీతికరాణి వై।**
**దుష్కరం తస్య సేవాయాం కిమస్తి భువనత్రయే॥ 26**

**ప్రతిపదార్థము:–** యస్య=ఏ శివునకు, బిల్వకాష్ఠస్య=మారేడు కఱ్ఱయొక్క, చందనమ్=గంధము, వనజాని=అడవిలో పుట్టిన, పుష్పాణ్యపి=పూలున్ను, తాదృశాన్యేవ=అటువంటివే అయిన, ఫలాని=పండ్లు, ప్రీతికరాణి వై=ఆనందకరములో, తస్య=అటువంటి శివునియొక్క, సేవాయామ్=సేవలో, దుష్కరమ్=చేయరానిది, భువనత్రయే=లోకత్రయమునందు, కిమ్=ఏమి, అస్తి=కలదు?

**తాత్పర్యము:–** మారేడుకఱ్ఱగంధము, అడవిపూలు, అడవిపండ్లు – ఇట్టి చవకపూజా సామగ్రికి ఇష్టపడే ఈశ్వరుని సేవలో చేయలేని విషయమేమి ఉన్నది?

**శ్లో॥ వన్యేషు యాదృశీ ప్రీతిర్వర్తతే పరమేశితుః।**
**ఉత్తమేష్వపి నాస్త్యేవ గ్రామజేష్వపి తాదృశీ॥ 27**

**ప్రతిపదార్థము:–** పరమేశితుః=పరమేశ్వరునికి, వన్యేషు=అడవిలోపుట్టిన ఫలపుష్పాదుల యందు, యాదృశీ=ఎటువంటి, ప్రీతిః=ప్రేమ, వర్తతే=ఉండునో, తాదృశీ=అటువంటి ప్రీతి, గ్రామజేష్వపి=గ్రామమునందుపుట్టిన వాటియందైనను, ఉత్తమేష్వపి=ఇంకా ఉత్తమ మైన వాటియందైనను, నాస్త్యేవ=లేనేలేదు.

**తాత్పర్యము:–** పరమేశ్వరునకు ఆటవిక ఫలపుష్పాలయందు ప్రీతి ఎక్కువ. గ్రామఫల పుష్పాలయందుగాని, అంతకన్న ఉత్తమవస్తువులందుగాని ఆయనకు అంతటి ప్రేమ ఉండదు.

**శ్లో॥ తం త్యక్త్వా తాదృశం దేవం యః సేవేతాన్యదేవతామ్।**
**స హి భాగీరథీం త్యక్త్వా కాంక్షతే మృగతృష్ణికామ్॥ 28**

**ప్రతిపదార్థము:–** తాదృశమ్=అంతసులభప్రీతిగల, తమ్=ఆ, దేవమ్=శివదేవుని, త్యక్త్వా=



వదలి, యః=ఎవడు, అన్య=మఱొక, దేవతామ్=దేవతను, సేవేత=సేవించునో, సః=ఆ ఉపాసకుడు, భాగీరథీమ్=గంగను, త్యక్త్వా=విడిచి, మృగతృష్ణికామ్=ఎండమావిని, కాంక్షతే హి=కోరుచున్నాడు గదా!

**తాత్పర్యము:–** అత్యంత సులభసంతోషుడైన శివునివదలి, కఠిన హృదయులైన ఇతర దేవతలను సేవించువాడు గంగానదిని వదలి ఎండమావిలో నీటిని వెదకుచున్నాడని భావింపవలయును.

**శ్లో॥ కిన్తు యస్యాస్తి దురితం కోటిజన్మసు సఞ్చితమ్।**
**తస్య ప్రకాశతే నాయమర్థో మోహాన్ధచేతసః॥ 29**

**ప్రతిపదార్థము:–** కిన్తు=కాని,యస్య=ఎవనికి,కోటిజన్మసు=కోటిజన్మలయందు, సంచితమ్=ప్రోవుచేయబడిన, దురితమ్=పాపము, అస్తి=కలదో, తస్య=ఆ, మోహాంధ=మోహాంధమైన, చేతసః=మనస్సుగలవానికి, అయమ్=ఈ, అర్థః=విషయము, న ప్రకాశతే=తోచదు.

**తాత్పర్యము:–** కోటిజన్మసంపాదితమైన మహాపాపభారంతో మోహంతో గ్రుడ్డిదైన మనసుగల మూర్ఖునకు ఈ శివ విషయము ఎంత చెప్పినా అర్థము కాదు.

**శ్లో॥ న కాలనియమో యత్ర న దేశస్య స్థలస్య చ।**
**యత్రాస్య రమతే చిత్తం తత్ర ధ్యానేన కేవలమ్।**
**స్వాత్మత్వేన శివస్యాసౌ శివసాయుజ్యమాప్నుయాత్॥ 30**

**ప్రతిపదార్థము:–** యత్ర=ఎచ్చట, కాలనియమః=కాలనియమము, న=లేదో, దేశస్య=దేశముయొక్క నియమం, న=లేదో, యత్ర=ఎచ్చట, అస్య=ఇతనియొక్క, చిత్తమ్=మనస్సు, రమతే=ఆనందించునో, తత్ర=అచ్చట, శివస్య=శివునకు, స్వాత్మత్వేన=తన ఆత్మగా, ధ్యానేన కేవలమ్=ధ్యానించుటచేత మాత్రమే,అసౌ=సాధకుడు, శివసాయుజ్యమ్=శివస్వరూపమును, ఆప్నుయాత్=పొందును.

**తాత్పర్యము:–** కాలనియమము, దేశనియయములు లేవు, ఎచ్చట ఇతనియొక్క మనస్సు ఆనందించునో, అచ్చట శివునకు తన ఆత్మగా ధ్యానించుటచేత మాత్రమే, సాధకుడు శివస్వరూపమును పొందును.

**శ్లో॥ అతిస్వల్పతరాయుఃశ్రీర్భూతేశాంశాధిపోఽపి యః।**
**స తు రాజాహమస్మీతి వాదినం హన్తి సాన్వయమ్॥ 31**

**ప్రతిపదార్థము:–** అతిస్వల్పతర=మిక్కిలి స్వల్పమైన,ఆయుఃశ్రీః=ఆయుస్సంపదలు గలవాడు,

యః=ఎవడైనా, భూతేశ=శివునియొక్క అంశ=అంశ అయిన,అధిపోపి=అధిపతి అయినను, సః=వాడు, అహమ్=నేను, రాజా=రాజును, అస్మి=అగుచున్నాను, ఇతి=అని అన్నచో, వాదినమ్=అలా అన్న వానిని, సాన్వయమ్=వంశసహితంగా, హంతి=చంపును (శివుడు).

**తాత్పర్యము:–** అతి స్వల్పతరమైన ఆయుస్సంపదలుగలవాడు, శివాంశసంభూతుడైనను, వాడు "తాను రాజును" అని భేదభావన, గర్వము చూపినచో వానిని శివుడు సకుటుంబముగా చంపును.

**శ్లో॥ కర్తాపి సర్వలోకానామక్షయ్యైశ్వర్యవానపి।**
**శివః శివోఽహమస్మీతి వాదినం యం చ కఞ్చన।**
**ఆత్మనా సహ తాదాత్మ్యభాగినం కురుతే భృశమ్॥ 32**

**ప్రతిపదార్థము:–** సర్వలోకానామ్=సమస్తలోకములకు, కర్తాపి=కర్త అయినను, అక్షయ్య=తఱగని, ఐశ్వర్యవానపి=ఐశ్వర్యముగలవాడైనను, శివః=శివుడు శివోహమస్మి+ఇతి=నేను శివుడిని అని పలికినచో వాదినమ్=అలా పలికిన వానిని, యం చ కంచన=ఎవనినైనా సరే, ఆత్మనా సహ=తనతోగూడా, తాదాత్మ్య=తాదాత్మ్యమును, భాగినమ్=పొందు వానినిగా, భృశమ్=మిక్కిలి, కురుతే=చేయును.

**తాత్పర్యము:–** సర్వలోకకర్త అయినా సరే, అనంతమైన ఐశ్వర్యం ఉన్నాసరే శివుడు "తాను శివుడను" అని శివాభేదమును భావించినచో, సంతోషించి ఎవడైనా ఆతనికి తనతో తాదాత్మ్యముక్తినిస్తాడు.

**శ్లో॥ ధర్మార్థకామమోక్షాణాం పారం యాస్యన్తి యేన వై।**
**మునయస్తత్ప్రవక్ష్యామి వ్రతం పాశుపతాభిధమ్॥ 33**

**ప్రతిపదార్థము:–** మునయః=మునులారా!, యేన వై=ఏ వ్రతంతో, ధర్మ=ధర్మముయొక్క, అర్థ=అర్థముయొక్క, కామ=కామముయొక్క, మోక్షాణామ్=మోక్షముయొక్క, పారమ్=అవతలి తీరమును, యాస్యంతి=చేరగలరో, (జీవులు) తత్=ఆ, పాశుపతాభిధమ్=పాశుపతము అను పేరుగల, వ్రతమ్=వ్రతమును, ప్రవక్ష్యామి=చెప్పగలను.

**తాత్పర్యము:–** ఓ మునులారా! జీవులు ఏ వ్రతం చేస్తే ధర్మార్థకామమోక్షములనెడు నాల్గు పురుషార్థములను పూర్తిగా సాధించగలరో, అట్టి పాశుపతవ్రతమును గురించి మీకు చెప్పగలను.

**శ్లో॥ కృత్వా తు విరజాం దీక్షాం భూతిరుద్రాక్షధారిణః।**
**జపన్తో వేదసారాఖ్యం శివనామసహస్రకమ్॥ 34**



**ప్రతిపదార్థము:–** విరజామ్=విరజ అను పేరుగల, దీక్షామ్=దీక్షను, కృత్వాతు=చేసి, భూతి=భస్మమును, రుద్రాక్ష=రుద్రాక్షలను, ధారిణః=ధరించినవారై, వేదసారాఖ్యమ్= వేదసారము అను పేరుగల, శివనామసహస్రకమ్=శివసహస్రనామములను, జపంతః= జపించుచు, (తర్వాత శ్లోకములోకి సమన్వయం చేయాలి).

**తాత్పర్యము:–** అందువలన మునులారా! మీరు "విరజ" అను దీక్షను చేపట్టి, భస్మరుద్రాక్షలు ధరించి 'వేదసారం' అని ప్రసిద్ధమైన శివసహస్రనామావళిని జపిస్తూ– (వ్రతం అనుష్ఠించండి).

**శ్లో॥ సన్త్యజ్య తేన మర్త్యత్వం శైవీం తనుమవాప్స్యథ।**
**తతః ప్రసన్నో భగవాఞ్ఛఙ్కరో లోకశఙ్కరః।**
**భవతాం దృశ్యతామేత్య కైవల్యం వః ప్రదాస్యతి॥ 35**

**ప్రతిపదార్థము:–** తేన=ఆ వ్రతంచేత, మర్త్యత్వమ్=మానవత్వమును, సంత్యజ్య=వదలి, శైవీమ్=శివసంబంధమైన, తనుమ్=శరీరమును, అవాప్స్యథ=పొందగలరు, తతః=తర్వాత, భగవాన్=భగవంతుడు, లోక=లోకాలకు, శంకరః=క్షేమకరుడైన, శంకరః=ఈశ్వరుడు, ప్రసన్నః=అనుగ్రహంగలవాడై, భవతామ్=మీకు, దృశ్యతాం+ఏత్య=కనబడి, వః=మీకు, కైవల్యమ్=మోక్షమును, ప్రదాస్యతి=ఇవ్వగలడు.

**తాత్పర్యము:–** పాశుపతవ్రతధారణచేత మానవులు తమ మానవలక్షణాన్ని కోల్పోయి శివత్వంపొందుతారు. దానివలన లోకశుభకరుడైన శంకరుడు ప్రసన్నుడై మోక్షం ఇవ్వగలడు.

**శ్లో॥ రామాయ దణ్డకారణ్యే యత్ప్రాదాత్కుమ్భసమ్భవః।**
**తత్సర్వం వః ప్రవక్ష్యామి శృణుధ్వం భక్తియోగినః॥ 36**

**ప్రతిపదార్థము:–** కుంభసంభవః=అగస్త్యమహర్షి, యత్=దేనిని, రామాయ=రామునకు, దండకారణ్యే=దండకారణ్యమునందు, ప్రాదాత్=ఇచ్చెనో, తత్=అది, సర్వమ్=అంతయు, వః=మీకు, ప్రవక్ష్యామి=చెప్పగలను, భక్తియోగినః=ఓ భక్తియోగులారా!, శృణుధ్వమ్=వినండి

**తాత్పర్యము:–** దండకారణ్యంలో అగస్త్యమహర్షి రామునికి ఈ వ్రతమునుపదేశించెను. భక్తియోగులారా! అదంతా మీకు తెలుపగలను.

**ఇతి శ్రీ పద్మపురాణే ఉపరిభాగే శివగీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీ శివరాఘవసంవాదే శివభక్తి–ఉత్కర్ష నిరూపణం నామ ప్రథమోఽధ్యాయః।**

* * * * *

### అథ ద్వితీయో ఽధ్యాయః
# వైరాగ్యోపదేశయోగః

**ఋషయ ఊచుః**

శ్లో॥ కిమర్థమాగతోఽగస్త్యో రామచన్ద్రస్య సన్నిధిమ్।
కథం వా విరజాం దీక్షాం కారయామాస రాఘవమ్।
తతః కిమాప్తవాన్ రామః ఫలం తద్వక్తుమర్హసి॥ **1**

**ప్రతిపదార్థము:–** అగస్త్యః=అగస్త్యుడు, రామచంద్రస్య=రామునియొక్క, సన్నిధిమ్=సమీపమునుగూర్చి, కిమర్థమ్=ఎందుకు, ఆగతః=వచ్చెను, విరజామ్=విరజ అను, దీక్షామ్=దీక్షను, రాఘవమ్=రాముని, కథం వా=ఎట్లు, కారయామాస=చేయించెను, తతః=అందువలన, రామః=రాముడు, కిం ఫలమ్= ఏ ఫలమును, ఆప్తవాన్=పొందెను, తత్=ఆ విషయమును, వక్తుమ్=చెప్పుటకు, అర్హసి=తగుదువు.

**తాత్పర్యము:–** ఋషులు అడిగారు – అయ్యా! అగస్త్య మహర్షి రామచంద్రుని సన్నిధికి ఎందుకు వచ్చాడు? ఆయన రాఘవుని చేత విరజాదీక్షను ఎలా చేయించాడు? దానివలన రాముడు ఏమి ఫలం పొందాడు? – అదంతా చెప్పవలసినది.

**సూత ఉవాచ - సూతమహర్షి ఇట్లనెను.**

శ్లో॥ రావణేన యదా సీతాఽపహృతా జనకాత్మజా।
తదా వియోగదుఃఖేన విలపన్నాస రాఘవః॥ **2**

**ప్రతిపదార్థము:–**జనకాత్మజా=జనకపుత్రి అయిన,సీతా=సీతాదేవి, రావణేన=రావణాసురుని చేత, యదా=ఎప్పుడు, అపహృతా=అపహరింపబడినదో, తదా=అప్పుడు, సః=ఆ, రాఘవః=రాముడు, వియోగదుఃఖేన=విరహదుఃఖంతో, విలపన్=ఏడ్చుచు, ఆస=ఉండెను.

**తాత్పర్యము:–** జనకాత్మజ అయిన సీతను రావణాసురుడు అపహరించినపుడు రాముడు సీతావిరహదుఃఖంతో శోకించుచుండెను.



శ్లో॥ నిర్నిద్రో నిరహఙ్కారో నిరాహారో దివానిశమ్।
మోక్తుమైచ్ఛత్తతః ప్రాణాన్ సానుజో రఘునన్దనః॥ **3**

**ప్రతిపదార్థము:–** నిర్నిద్రః=నిద్రలేనివాడై, నిరహంకారః=అహంకారము లేనివాడై, దివానిశమ్=రేయింబవళ్ళు, నిరాహారః=ఆహారం లేనివాడై, సానుజః=సోదరసహితుడైన, రఘునందనః=రాముడు, తతః=తర్వాత, ప్రాణాన్=ప్రాణములను, మోక్తుమ్=విడుచుటకు, ఐచ్ఛత్=కోరెను.

**తాత్పర్యము:–** సీతావియోగం వలన రాముడు రేయింబవళ్ళు నిరాహారుడై నిద్రాశూన్యుడై, నిరహంకారుడై అనగా దేహాభిమానం లేనివాడై, విలపించి చివఱకు ప్రాణత్యాగం చేయదలచెను.

శ్లో॥ లోపాముద్రాపతిర్జ్ఞాత్వా తస్య సన్నిధిమాగమత్।
అథ తం బోధయామాస సంసారాసారతాం మునిః॥ **4**

**ప్రతిపదార్థము:–** లోపాముద్రా=లోపాముద్రయొక్క, పతిః=భర్త అయిన అగస్త్యుడు, జ్ఞాత్వా=ఈ విషయం తెలిసి, తస్య=ఆ రామునియొక్క, సన్నిధిమ్=సన్నిధినిగూర్చి, ఆగమత్=వచ్చెను, అథ=తర్వాత, మునిః=అగస్త్యముని, తమ్=రామునిగురించి, సంసార=సంసారముయొక్క అసారతామ్=తుచ్ఛత్వమును గూర్చి, బోధయామాస=బోధించెను.

**తాత్పర్యము:–** అగస్త్యుడు రాముని పరిస్థితి తెలిసికొని రామునివద్దకు వచ్చెను. ఆయన రామునికి సంసారము సారహీనమని తత్త్వబోధ చేసెను.

**అగస్త్య ఉవాచ**

శ్లో॥ కిం విషీదసి రాజేన్ద్ర! కాన్తా కస్య విచార్యతామ్।
జడః కిం ను విజానాతి దేహోఽయం పాఞ్చభౌతికః॥ **5**

**ప్రతిపదార్థము:–** రాజేంద్ర!=మహారాజా! రామా!, విషీదసి కిమ్=శోకించుచున్నావేల?, కాంతా=భార్య, కస్య=ఎవనికి? విచార్యతామ్=విచారింపబడుగాక!, పాంచభౌతికః=పంచ భూతాలతో తయారైన, అయమ్=ఈ, జడః=జడమైన (చేతనలేని), దేహః=శరీరము, కింను విజానాతి=ఏమి తెలిసికొనును.

**తాత్పర్యము:–** రాజా! శ్రీరామచంద్రా! ఎందుకు విచారపడుతున్నావు? ఎవరు భార్య? ఎవరు భర్త? ఆలోచించవలసినది. పంచభూతాలతో తయారైన ఈ దేహానికి ఏమి తెలుసు?

**శ్లో॥ నిర్లేపః పరిపూర్ణశ్చ సచ్చిదానన్దవిగ్రహః।**
**ఆత్మా న జాయతే నైవ మ్రియతే న చ దుఃఖభాక్॥ 6**

**ప్రతిపదార్థము:–** నిర్లేపః=ఏ వికారములు అంటనివాడును, పరిపూర్ణశ్చ=అన్ని విషయము లందును కోరదగినదిలేనివాడును, సత్=సత్త్వము, చిత్=జ్ఞానము, ఆనంద=ఆనందములే, విగ్రహః=శరీరముగా గలవాడును అయిన, ఆత్మా=ఆత్మ, న జాయతే=పుట్టదు, నైవమ్రియతే =మరణించదు, దుఃఖభాక్ చ=శోక భాజనము గూడా, న=కాదు.

**తాత్పర్యము:–** రామా! నీవు ఆత్మవు, ఆత్మకు దుఃఖం మొదలైనవి అంటవు. అది నిర్వికారము, నిరంజనము, పూర్ణకామము. సచ్చిదానంద స్వరూపము. అది పుట్టదు గిట్టదు. శాశ్వతము.

**శ్లో॥ సూర్యోఽసౌ సర్వలోకస్య చక్షుష్ట్వేన వ్యవస్థితః।**
**తథాపి చాక్షుషైర్దోషైర్న కదాచిద్విలిప్యతే।**
**సర్వభూతాన్తరాత్మాపి తద్వద్దృశ్యైర్న లిప్యతే ॥ 7**

**ప్రతిపదార్థము:–** అసౌ=ఈ కనబడే, సూర్యః=సూర్యుడు, సర్వలోకస్య=సమస్త లోకము యొక్క చక్షుష్ట్వేన=నేత్రముగా, వ్యవస్థితః=ఉన్నాడు, తథాపి=అలా నేత్రంగా ఉన్నప్పటికి, కదాచిత్=ఒక్కనాడున్నూ, చాక్షుషైః=నేత్రసంబంధమైన, దోషైః=తిమిరము, చత్వారము మొదలగు రోగములచేత, న విలిప్యతే=పూయబడుటలేదు, అనగా ఈ దోషములు ఆయనకు అంటవు, తద్వత్=అట్లే, సర్వభూత=సమస్త జీవులయొక్క అంతరాత్మాపి=అంతరాత్మయును, దృశ్యైః=విషయాలచేత, న లిప్యతే=తాకబడదు.

**తాత్పర్యము:–** రామా! ఈ సూర్యుడు, లోకనేత్రము, ఆయనయే మన అందఱికి వెలుగును ఇచ్చువాడు. అయినను మన కంటికి ఉన్న చత్వారం మొదలగు రోగాలు ఆ లోకనేత్రానికి తాకవు. అట్లే సర్వజీవాంతరాత్మ అయిన భగవంతుని విషయాలు తాకజాలవు.

**శ్లో॥ దేహోఽపి మలపిణ్డోఽయం ముక్తజీవో జడాత్మకః।**
**దహ్యతే వహ్నినా కాష్ఠైః శివాద్యైర్భక్ష్యతేఽపి వా।**
**తథాపి నైవ జానాతి విరహే తస్య కా వ్యథా॥ 8**

**ప్రతిపదార్థము:–** అయమ్=ఈ, దేహః=శరీరము, మల=రక్తమాంసాదిమాలిన్యములయొక్క పిండః=ముద్ద, ముక్త=విడువబడిన, జీవః=జీవుడు గలదైనచో, జడాత్మకః=జడ స్వరూప మైనది, వహ్నినా=అగ్నిచేత, కాష్ఠైః=కట్టెలచేత, దహ్యతే=దహింపబడును,శివ=నక్క ఆద్యైః వా=మొదలగు జంతువులచేతనైనా, భక్ష్యతేపి=తినబడును గూడా, తథాపి=అయినను, నైవజానాతి=బాధను గుర్తించదు, విరహే=వియోగమునందు, తస్య=ఆ దేహానికి, వ్యథా= బాధ, కా=ఏది?



**తాత్పర్యము:–** ఈ దేహం రక్తమాంసాదిమాలిన్య సముదాయమైన ఒక పిండం. అనగా ముద్ద. దీనిలో జీవుడున్నంతవఱకే ఇది ఆడుతుంది. తర్వాత జడమే. దీనిని నిప్పుపై కట్టెలతో కాల్చవచ్చును. నక్క మొదలగు శ్వాపదజంతువులు తినివేయవచ్చును. అయినను బాధ తెలియని శరీరానికి విరహబాధ ఏమిటి? ఎలా తెలుస్తుంది?

**శ్లో॥ సువర్ణగౌరీ దూర్వాయా దలవచ్ఛ్యామలాఽపి వా।**
**పీనోత్తుఙ్గస్తనాభోగభుగ్నసూక్ష్మావలగ్నికా॥ 9**

**ప్రతిపదార్థము:–** సువర్ణ=బంగారంవలె, గౌరీ=పచ్చనిది, దూర్వాయాః=గరికయొక్క దలవత్=ఆకువలె, శ్యామలాపి వా=ఆకుపచ్చనిదిగాని, పీన=బలిసిన, ఉత్తుంగ=ఎత్తయిన, స్తనాభోగ=స్తనభారముచేత, భుగ్న=వంగిన, సూక్ష్మ=సన్నని, అవలగ్నికా=నడుముగలదియు.

**తాత్పర్యము:–** బంగారంవలె పచ్చనిది, లేదా గరికవలె కాస్త నల్లనిదిగాని, బలిష్ఠమైన స్తనభారంచేత కొంచెం వంగిన సన్నని నడుము గలదియు –

**శ్లో॥ బృహన్నితమ్బజఘనా రక్తపాదసరోరుహా।**
**రాకాచన్ద్రముఖీ బిమ్బప్రతిబిమ్బరదచ్ఛదా ॥ 10**

**ప్రతిపదార్థము:–** బృహత్=పెద్ద, నితంబ=పిఱుదులు, జఘనా=వెనుకభాగము గలదియు, రక్త=ఎఱ్ఱని, పాదసరోరుహా=కమలములవంటి పాదములుగలదియు, రాకా=పూర్ణిమనాటి, చంద్ర=చంద్రునివంటి, ముఖీ=ముఖముగలదియు, బింబ=దొండపండునకు, ప్రతిబింబ= సమానమైన, రదచ్ఛదా=అధరోష్ఠముగలదియు.

**తాత్పర్యము:–** పెద్ద నితంబము, జఘనములు, ఎఱ్ఱని పాదకమలములు, పున్నమ చంద్రుని వంటి మొగము, దొండపండువంటి ఎఱ్ఱని పెదవులు గలదియు –

**శ్లో॥ నీలేన్దీవరనీకాశనయనద్వయశోభితా।**
**మత్తకోకిలసల్లాపా మత్తద్విరదగామినీ॥ 11**

**ప్రతిపదార్థము:–** నీల=నల్లని, ఇందీవర=కలువలతో, నీకాశ=సమానమైన, నయనద్వయ= కన్నుల జంటచేత, శోభితా=అందమైనదియు, మత్త=మావిచిగురుతిని మదించిన, కోకిల= కోకిలవంటి, సల్లాపా=మాటలుగలదియు, మత్త=మదించిన, ద్విరద=ఏనుగువలె, గామినీ =నడచునదియు.

**తాత్పర్యము:–** నల్ల కలువలవంటి కళ్ళు, మత్తకోకిలవంటి కంఠధ్వని, మత్తగజమువంటి అందమైన నడక గలదియు అగు స్త్రీ –

**శ్లో॥ కటాక్షైరనుగృహ్ణాతి మాం పఞ్చేషు శరోత్తమైః।**
**ఇతి యో మన్యతే మూర్ఖః స తు పఞ్చేషు శాసితః॥ 12**

**ప్రతిపదార్థము:–** మామ్=నన్ను, పంచేషు=మన్మథునియొక్క, శరోత్తమైః=ఉత్తమబాణములైన, కటాక్షైః=క్రీగంటిచూపులతో, అనుగృహ్ణాతి=అనుగ్రహించుచున్నది, ఇతి=అని, యః=ఏ, మూర్ఖః=మూర్ఖుడు, మన్యతే=తలచునో, సతు=వాడైతే, పంచేషు=మన్మథునిచేత, శాసితః =శాసింపబడినవాడు.

**తాత్పర్యము:–** అటువంటి సుందరమైన స్త్రీ నన్ను మన్మథబాణములవంటి తన కటాక్షములతో అనుగ్రహించుచున్నదని తలచిన మూర్ఖుడు మన్మథునికి వశవర్తియైనట్లే.

**శ్లో॥ తస్యావివేకం వక్ష్యామి శృణుష్వావహితో నృప॥ 13**

**ప్రతిపదార్థము:–** నృప!=రాజా!, తస్య=వానియొక్క, అవివేకమ్=అవివేకమును గురించి, వక్ష్యామి=చెప్పగలను, అవహితః=సావధానుడవై, శృణుష్వ=వినుము.

**తాత్పర్యము:–** రామచంద్రా! అట్టి వ్యక్తియొక్క అవివేకమును వివరిస్తాను. సావధానుడవై వినుము.

**శ్లో॥ న చ స్త్రీ న పుమానేష నైవ చాయం నపుంసకః।**
**అమూర్తః పురుషః పూర్ణో ద్రష్టా దేహే సజీవనః॥ 14**

**ప్రతిపదార్థము:–** అయమ్=వీడు (అనగా ఆత్మ), స్త్రీ చ=స్త్రీ అయినా, న=కాదు, ఏషః= వీడు, పుమాన్=పురుషుడు, న=కాదు, అయమ్=వీడు, నపుంసకః చ=నపుంసకుడున్నూ, నైవ=కానేకాదు, అమూర్తః=మూర్తి (ఆకారము) లేనివాడు, పూర్ణః=పరిపూర్ణుడైన, పురుషః =పురుషుడు, ద్రష్టా=చూచువాడు, దేహే=దేహమునందు సజీవనః=జీవనము గలవాడు.

**తాత్పర్యము:–** తనను స్త్రీ అనుగ్రహిస్తున్నది అని అనుకొనేవాడు ఎవడు? ఆత్మ ఆ ఆత్మకు స్త్రీ, పురుష, నపుంసకలింగ భేదాలు లేవు. ఒక దృఢమైన, కనబడే ఆకారము లేదు. పూర్ణపురుషుడతడు. అతను దేహమునందు నివసించి బ్రతుకువాడు. ఈ జగత్తును అతడు చూచుచుండును.

**శ్లో॥ యా తన్వఙ్గీ మృదుర్బాలా మలపిణ్డాత్మికా జడా।**
**సా న పశ్యతి యత్కిఞ్చిత్ న శృణోతి న జిఘ్రతి॥ 15**

**ప్రతిపదార్థము:–** యా=ఎవరు (ఏ స్త్రీ), తన్వంగీ=సన్నని శరీరముగలదియో, మృదుః= మెత్తనిదో, బాలా=బాలికయో, మల=రక్తమాంసాదిమాలిన్యములయొక్క, పిండాత్మికా=ముద్ద



వంటిదో, సా=ఆ స్త్రీ (అనగా ఆరూపము), జడా=జడమైనది, యత్కించిత్=ఏ కొంచెమును, న పశ్యతి=చూడదు, నశృణోతి=వినదు, న జిఘ్రతి=వాసనచూడదు.

**తాత్పర్యము:–** ఏ స్త్రీని చూచి ఈ మూర్ఖుడు ఆత్మ సౌందర్యమును గాక శరీర సౌందర్యమును గుర్తించాడో, ఇంతకు ఆ స్త్రీ మలపిండస్వరూపమైన ఒక జడపదార్థము. ఆ పదార్థము దేనినీ చూడదు, వినదు, వాసనపట్టదు. అందలి ఆత్మయే ప్రాణమే ఈ పనులన్ని చేసేది. ఆకర్షణ కారణమైనది మాత్రము శరీరం. అది వట్టి జడపదార్థము.

**శ్లో॥ చర్మమాత్రా తనుస్తస్యా బుద్ధ్యా వీక్షస్వ రాఘవ!।**
**యా ప్రాణాదధికా సైవ హన్త తే స్యాద్ ఘృణాస్పదమ్॥ 16**

**ప్రతిపదార్థము:–** తస్యాః=ఆమెయొక్క, తనుః=శరీరము, చర్మమాత్రా=కేవలము చర్మమే, రాఘవ=రామా!, బుద్ధ్యా=బుద్ధితో, వీక్షస్వ=గమనింపుము, యా=ఏ స్త్రీ, ప్రాణాత్=నీ ప్రాణముకన్న, అధికా=అధికురాలో, సైవ=ఆమెయే, తే=నీకు, ఘృణా=జుగుప్సకు, ఆస్పదమ్=స్థానము, స్యాత్=కాగలదు.

**తాత్పర్యము:–** ఆమెను, ఆమె శరీరసౌందర్యమును, చర్మసౌందర్యముగా మాత్రమే గమనించగలిగితే, తత్త్వం తెలుస్తుంది. ఎవరు నీకు ఇంతకుముందు ప్రాణాధికమైన ప్రియురాలో ఆమె ఒకప్పుడు జుగుప్సపడదగిన మాంసమాలిన్య పిండంగా కనబడుతుంది.

**శ్లో॥ జాయన్తే యది భూతేభ్యో దేహినః పాఞ్చభౌతికాః।**
**ఆత్మా యద్యేకలస్తేషు పరిపూర్ణః సనాతనః।**
**కా కాన్తా తత్ర కః కాన్తః సర్వ ఏవ సహోదరాః॥ 17**

**ప్రతిపదార్థము:–** పాంచభౌతికాః=పంచభూతసంయోగ సంబంధమైన, దేహినః= దేహధారులు, భూతేభ్యః=భూతములనుండి, జాయంతే యది=పుట్టుచున్న పక్షమున, తేషు=వాటియందు పరిపూర్ణః=పూర్ణకాముడైన, సనాతనః=అనాది అయిన, ఆత్మా=ఆత్మ, ఏకలో యది=ఒక్కడే అయితే, తత్ర=ఆ పక్షమున, కాంతా=భార్య, కా=ఎవరు?, కాంతః =భర్త, కః=ఎవరు? సర్వే=అందరూ, సహోదరా ఏవ=సోదరులే.

**తాత్పర్యము:–** ఈ పాంచభౌతిక శరీరాలు భూమి మొదలగు భూతములనుండి పుట్టగా, వీటియందున్న పూర్ణుడు అనాది అయిన ఆత్మ ఒక్కటే అయితే, ఇక్కడ భార్య ఎవరు? భర్త ఎవరు? అందరున్ను సోదరులే.

**శ్లో॥ నిర్మితాయాం గృహావల్యాం తదవచ్ఛిన్నతాం గతమ్।**
**నభస్తస్యాం తు దగ్ధాయాం న కాఞ్చిత్ క్షతిమృచ్ఛతి॥ 18**

**ప్రతిపదార్థము:–** గృహావల్యామ్=గృహసముదాయము, నిర్మితాయామ్=కట్టబడగా, తత్= ఆ గృహసముదాయముచేత, అవచ్ఛిన్నతాం గతమ్=వేరు చేయబడినదైన, నభః=ఆకాశము, తస్యాం తు=ఆ గృహాలసముదాయం, దగ్ధాయాం తు=తగులబడినట్లయితే, కాంచిత్=ఏ మాత్రపు, క్షతిమ్=దెబ్బను న ఋచ్ఛతి=పొందదు.

**తాత్పర్యము:–** చక్కని యిల్లుకట్టగా అందులో కొంత ఆకాశం 'ఖాళీ' రూపంలో అసలు ఆకాశం నుంచి విడివడుతుంది. అట్టి విడివడిన 'గృహాకాశం' (ఇంట్లో ఖాళీ ప్రదేశం) గృహం తగులబడినా తగులబడదు.

**శ్లో॥ తద్వదాత్మాపి దేహేషు పరిపూర్ణః సనాతనః।**
**హన్యమానేషు తేష్వేవ స స్వయం నైవ హన్యతే॥ 19**

**ప్రతిపదార్థము:–** తద్వత్=ఆ ఆకాశములాగా, దేహేషు=దేహములందు, ఆత్మాపి=ఆత్మ గూడా, పరిపూర్ణః=పూర్ణమై, సనాతనః=అనాదియై ఉంటున్నది, తేష్వేవ=ఆ శరీరములే, హన్యమానేషు=కొట్టబడుచుండగా / చంపబడుచుండగా, సః=ఆ ఆత్మ, స్వయమ్=తాను, నైవ హన్యతే=కొట్టబడదు / చంపబడదు.

**తాత్పర్యము:–** గృహంలో గృహాకాశం ఉన్నట్లే ఈ శరీరాలలో అనాది పదార్థమైన 'ఆత్మ' పూర్ణరూపంతో ఉంటున్నది. గృహములు తగులబడినా "ఆత్మ" తగులబడనట్లు, శరీరమును కొట్టినా/చంపినా ఆత్మ దెబ్బ తినదు.

**శ్లో॥ హన్తా చేన్మన్యతే హన్తుం హతశ్చేన్మన్యతే హతమ్।**
**తావుభౌ న విజానీతో నాయం హన్తి న హన్యతే॥ 20**

**ప్రతిపదార్థము:–** హంతా=చంపువాడు / కొట్టువాడు, హంతుమ్=కొట్టుటకు, మన్యతే చేత్=తలచినను, హతః=కొట్టబడినవాడు, హతమ్=తనను కొట్టబడిన వానినిగా, మన్యతే చేత్=తలచినను,తౌ=వారు,ఉభౌ=ఇద్దరు, న విజానీతః=ఎఱుగరు, అయమ్=ఈ కొట్టేవాడు, న హంతి=ఆత్మను కొట్టుటలేదు, అయమ్=ఈ కొట్టబడినట్లు తలచువాడు, న హన్యతే=కొట్టబడుటలేదు.

**తాత్పర్యము:–** అవతలి వ్యక్తిని కొట్టాలనుకొనేవారు వ్యక్తిని అనగా ఆత్మను కొట్టలేదు. శరీరాన్ని కొట్టగలడు, తనను ఎవరో కొట్టారు అని అనుకొనేవాడు తన ఆత్మను ఎవరూ కొట్టలేదని తలచుచూ, తన శరీరాన్ని కొట్టినా తననే కొట్టినట్లు భావిస్తాడు. వీరిద్దరికి శరీరమే తామన్న భావనవలన ఈ భ్రాంతికలుగుతున్నది. వారిద్దరికి తెలియదు. కొట్టినవాడు ఆత్మకాదు. కొట్టబడినదీ ఆత్మకాదు.



**శ్లో॥ అస్మాన్నృపాతిదుఃఖేన కిం ఖేదస్యాస్తి కారణమ్।**
**స్వస్వరూపం విదిత్వేదం దుఃఖం త్యక్త్వా సుఖీభవ॥ 21**

**ప్రతిపదార్థము:–** నృప!=రాజా!, అస్మాత్=ఇందువలన, అతిదుఃఖేన=మిక్కిలి శోకముతో, కిమ్=ఏమిపని?, ఖేదస్య=దుఃఖమునకు, కారణమ్=కారణము, కిమ్ అస్తి=ఏమి కలదు? స్వస్వరూపమ్=నీ ఆత్మ స్వరూపమును, విదిత్వా=తెలిసికొని, ఇదమ్=ఈ, దుఃఖమ్= దుఃఖమును, త్యక్త్వా=విడిచి, సుఖీ=సుఖవంతుడవు, భవ=కమ్ము.

**తాత్పర్యము:–** కనుక, ఓ రాజా! అతి దుఃఖము పడకుము. ఇచ్చట దుఃఖమునకు కారణము ఏమున్నది? కనుక ఆత్మ స్వరూపమైన నీ సచ్చిదానందరూపమును గమనించి దుఃఖమును వదలి సుఖంగా ఉండుము.

**శ్రీరామ ఉవాచ-శ్రీరాముడు ఇట్లనెను.**

**శ్లో॥ మునే! దేహస్య నో దుఃఖం నైవ చేత్పరమాత్మనః।**
**సీతావియోగదుఃఖాగ్నిర్మాం భస్మీకురుతే కథమ్॥ 22**

**ప్రతిపదార్థము:–** మునే=మునీ! దేహస్య=శరీరమునకు, దుఃఖమ్=దుఃఖము, నోచేత్= లేకపోతే, పరమాత్మనః=పరమాత్మకు, దుఃఖమ్=దుఃఖము, నైవచేత్=లేకపోతే, సీతా=సీతతో వచ్చిన, వియోగ=విరహంవలన వచ్చిన, దుఃఖాగ్నిః=శోకాగ్ని, మామ్=నన్ను, కథమ్=ఎట్లు, భస్మీకురుతే=భస్మం చేయుచున్నది?

**తాత్పర్యము:–** అగస్త్యమహర్షీ! నా దేహం జడం అన్నారు. దానికి దుఃఖం తెలియదు. నేను పరమాత్మనన్నారు. దానికి అసలు శోకం ఉండదు. అది సచ్చిదానందరూపం. మఱి సీతావిరహాగ్ని నన్నెలా భస్మం చేస్తున్నది? చెప్పండి.

**శ్లో॥ సదానుభూయతే యోఽర్థః స నాస్తీతి త్వయేరితః।**
**జాయతాం తత్ర విశ్వాసః కథం మే మునిపుఙ్గవ!॥ 23**

**ప్రతిపదార్థము:–** యః=ఏ, అర్థః=అర్థము / విషయము, సదా=ఎల్లప్పుడు, అనుభూయతే= అనుభవింపబడుచున్నదో, సః=ఆ అర్థము, నాస్తీతి=లేదని, త్వయా=నీచేత, ఈరితః=చెప్ప బడినది, మునిపుంగవ!=మునిశ్రేష్ఠా!, తత్ర=ఆ విషయమై, మే=నాకు, విశ్వాసః=నమ్మకము, కథమ్=ఎట్లు, జాయతామ్=కలుగవలెను?

**తాత్పర్యము:–** అయ్యా! మహర్షీ! నేను నిత్యము అనుభవిస్తున్న యీ శోకం మిథ్య అని మీరంటున్నారు. ఈ మాటపై నాకు నమ్మకం ఎలా కలుగుతుంది?

శ్లో॥ అన్యోఽత్ర నాస్తి కో భోక్తా యేన జన్తుః ప్రతప్యతే।
సుఖస్య వాఽపి దుఃఖస్య తద్బ్రూహి మునిసత్తమ!॥ **24**

**ప్రతిపదార్థము:–** అన్యః=నేనుకాక మఱొకడు, అత్ర=ఈ దేహంలో, నాస్తి=లేదు, యేన= ఏ శోకంతో, జంతుః=జీవుడు, ప్రతప్యతే=తపించునో, సుఖస్య=అట్టి సుఖమునకు, దుఃఖస్య వాపి=దుఃఖమునకు గాని, భోక్తా=అనుభవకర్త, కః=ఎవడు? మునిసత్తమ!=ముని శ్రేష్ఠా! తత్=ఆ విషయమును గూర్చి, బ్రూహి=చెప్పుము.

**తాత్పర్యము:–** మునీశ్వరా! నా శరీరం జడం. అది అనుభవించదు. నేను ఆనందస్వరూప మైన ఆత్మను. పూర్ణుడను. నాకు సుఖదుఃఖములు లేవు – అంటివి. మఱి యిచ్చట సుఖ దుఃఖాలు అనుభవించటానికి శరీరం, ఆత్మ – తప్ప మఱొకరు ఎవరు ఉన్నారు? మఱి నాకు దుఃఖానుభవం ఉన్నది. ఈ విషయాన్ని గూర్చి వివరింపుము.

**అగస్త్య ఉవాచ-అగస్త్యు డిట్లనెను.**

శ్లో॥ దుర్జ్ఞేయా శామ్భవీ మాయా తయా సంమోహ్యతే జగత్।
మాయాం తు ప్రకృతిం విద్యాన్మాయినం తు మహేశ్వరమ్॥ **25**

**ప్రతిపదార్థము:–** శాంభవీ=శంభు సంబంధిని అయిన, మాయా=మాయ, దుర్జ్ఞేయా= తెలియరానిది, తయా=దానిచే, జగత్=ప్రపంచము, సమ్మోహ్యతే=మోహింపబడును, మాయాం తు=మాయను, ప్రకృతిమ్=ప్రకృతినిగా, మహేశ్వరం తు= ఈశ్వరుని అయితే, మాయినమ్=మాయగలవానినిగా, విద్యాత్= తెలిసికొనవలెను.

**తాత్పర్యము:–** శాంభవమాయ తెలిసికొన శక్యం గానిది. దానివలన ప్రపంచం మోహంలో పడిపోతుంది. మాయను ప్రకృతి అని గ్రహించవలసినది. మాయావి మహేశ్వరుడే.

శ్లో॥ తస్యావయవభూతైస్తు వ్యాప్తం సర్వమిదం జగత్।
సత్యజ్ఞానాత్మకోఽనన్తో విభురాత్మా మహేశ్వరః।
తస్యైవాంశో జీవలోకే హృదయే ప్రాణినాం స్థితః॥ **26**

**ప్రతిపదార్థము:–** తస్య=ఆ మహేశ్వరునియొక్క, అవయవభూతైస్తు=అవయవములైన పదార్థములచేత, ఇదమ్=ఈ, సర్వమ్=సమస్తమైన, జగత్=ప్రపంచం, వ్యాప్తమ్=వ్యాపింప బడినది, మహేశ్వరః=ఈశ్వరుడు, సత్యజ్ఞానాత్మకః=సత్యజ్ఞానస్వరూపుడు, అనంతః=అంత రహితుడు, విభుః=సర్వవ్యాపకుడు, ఆత్మా=ఆత్మ అయినవాడు, తస్య=ఆ మహేశ్వరుని యొక్క, అంశ ఏవ=అంశమే, జీవలోకే=ప్రాణిసమూహమునందు, ప్రాణినామ్=జీవుల యొక్క, హృదయే=హదయమునందు, స్థితః=ఉన్నది.



**తాత్పర్యము:–** ఆ మహేశ్వరునియొక్క అవయవములైన పదార్థములే, ఈ సమస్తమైన ప్రపంచంలో వ్యాపించినవి. ఈశ్వరుడు సత్యజ్ఞానస్వరూపుడు, అంతరహితుడు, సర్వ వ్యాపకుడు, ఆత్మ అయినవాడు. అట్టి మహేశ్వరునియొక్క అంశమే ప్రాణి సమూహము నందు, జీవులయొక్క హృదయమునందు ఉన్నది.

శ్లో॥ విస్ఫులిఙ్గా యథా వహ్నేర్జాయన్తే కాష్ఠయోగతః।
అనాదికర్మసమ్బద్ధాస్తద్వదంశా మహేశితుః।
అనాదివాసనాయుక్తాః క్షేత్రజ్ఞా ఇతి తే స్మృతాః॥ **27**

**ప్రతిపదార్థము:–** కాష్ఠయోగతః=కట్టెలసంబంధంవలన, వహ్నేః=అగ్నినుండి, విస్ఫులింగాః =నిప్పురవ్వలు, యథా=ఎలా, జాయంతే=పుట్టునో, తద్వత్=అలా, మహేశితుః=ఈశ్వరుని యొక్క, అంశాః=అంశలు, అనాది=అనాదినుంచి వచ్చిన, కర్మ=కర్మములతో, సంబద్ధాః =సంబంధముగలవై, అనాది=అనాది అయిన, వాసనా=కర్మసంస్కారములతో, యుక్తాః =కూడినవై, తే=ఆ అంశలు, క్షేత్రజ్ఞా ఇతి=క్షేత్రజ్ఞులని స్మృతాః=చెప్పబడినవి.

**తాత్పర్యము:–** కట్టెలతో సంబంధంవలన నిప్పునుండి రవ్వలు రేగినట్లు మహేశ్వరుని యందు జీవాంశలు వచ్చినవి. అవి అనాది కర్మ సంస్కార వాసనలతో జీవులయినవి. వారికే క్షేత్రజ్ఞులని పేరు.

శ్లో॥ మనోబుద్ధిరహఙ్కారశ్చిత్తం చేతి చతుష్టయమ్।
అన్తఃకరణమిత్యాహుస్తత్ర తే ప్రతిబిమ్బితాః॥ **28**

శ్లో॥ జీవత్వం ప్రాప్నుయుః కర్మఫలభోక్తార ఏవ తే।
తతో వైషయికం తేషాం సుఖం వా దుఃఖమేవ వా।
త ఏవ భుఞ్జతే భోగాయతనేఽస్మిన్ శరీరకే॥ **29**

**ప్రతిపదార్థము:–** మనః=మనస్సు, బుద్ధిః=బుద్ధి, అహంకారః=అహంకారము, చిత్తం చ= చిత్తము (స్మరణశక్తి), ఇతి=అని, చతుష్టయమ్=నాలుగును, అంతఃకరణమితి=అంతః కరణ మని, ఆహుః=చెప్పుచున్నారు, తత్ర=ఆ అంతఃకరణమునందు, ప్రతిబింబితాః= ప్రతిబింబించినవారై, తే=ఆ అంశలు, జీవత్వమ్=జీవత్వమును, ప్రాప్నుయుః=పొందెదరు, తే ఏవ=వారే, కర్మఫల=కర్మఫలితములకు, భోక్తారః=అనుభవకర్తలు. తతః=అందువలన, తేషామ్=వారికి సంబంధించిన, వైషయికమ్=విషయములకు సంబంధించిన, సుఖం వా=సుఖమునుగాని, దుఃఖమేవ వా=దుఃఖమునేగాని, భోగాయతనే=భోగస్థానమైన, అస్మిన్= ఈ, శరీరకే=శరీరమునందు, త ఏవ=వారే, భుంజతే=అనుభవించుదురు.

**తాత్పర్యము:–** మనస్సు బుద్ధి అహంకారం, చిత్తం – అని నాలుగు కలిపి "అంతః కరణం" అంటారు. ఇందులో ప్రతిబింబించిన ఈశ్వరాంశలే జీవులవుతారు. వారే కర్మఫల భోగం పొందేవారు. వారి విషయసుఖదుఃఖాలను వారే ఈ భోగస్థానమైన శరీరంలో ఉండి అనుభవించి తీరవలెను.

**శ్లో॥ స్థావరం జఙ్గమం చేతి ద్వివిధం వపురుచ్యతే।**
**స్థావరాస్తత్ర దేహాః స్యుః సూక్ష్మా గుల్మలతాదయః।**
**అణ్డజాః స్వేదజాస్తద్వదుద్భిజ్జా ఇతి జఙ్గమాః॥ 30**

**ప్రతిపదార్థము:–** వపుః=శరీరము, స్థావరమ్=స్థిరమని, జంగమంచేతి=చరమని, ద్వివిధమ్ =రెండు విధములుగా, ఉచ్యతే=చెప్పబడుచున్నది, తత్ర=అందులో, స్థావరాః=స్థిరమైన (కలదని) దేహాః=దేహములు, సూక్ష్మాః=సూక్ష్మమైన, గుల్మ=పొదలు, లతాదయః=తీగలు మొదలైనవి, తద్వత్=అట్లే, జంగమాః=చరదేహములు, అండజాః=గ్రుడ్డునుంచి వచ్చేవి, స్వేదజాః=చెమటవలన పుట్టేవి, ఉద్భిజ్జాః=చీల్చుకొని వచ్చునవి, ఇతి=అని కలవు.

**తాత్పర్యము:–**స్థావరమని,జంగమమని రెండు రకాలు శరీరాలు. పొదలు తీగలు మొదలైనవి స్థావరములు. అండజములు, స్వేదజములు ఉద్భిజ్జములు మొదలైనవి జంగమములు.

**శ్లో॥ యోనిమన్యే ప్రపద్యన్తే శరీరిత్వాయ దేహినః।**
**స్థాణుమన్యేఽనుసంయన్తి యథాకర్మ యథాశ్రుతమ్॥ 31**

**ప్రతిపదార్థము:–** యథాకర్మ=కర్మనుబట్టి, యథాశ్రుతమ్=శాస్త్రమునుబట్టి, అన్యే=కొందఱు, దేహినః=జీవులు, శరీరిత్వాయ=దేహధారి అగుటకు, యోనిమ్=జాతిని/జన్మను, ప్రపద్యంతే =పొందెదరు, అన్యే=మఱికొందరు, స్థాణుమ్=స్థిర (స్థావర) జాతిని, అనుసంయంతి= అనుసరించెదరు

**తాత్పర్యము:–** దేహధారులు తమ తమ కర్మ, జ్ఞానము మొదలగు వాటినిబట్టి రకరకాల జాతులలోనికి వెళ్ళెదరు. మఱికొందరు స్థావరములైన జన్మలలోనికి పోయెదరు.

**శ్లో॥ సుఖ్యహం దుఃఖ్యహం చేతి జీవ ఏవాఽభిమన్యతే।**
**నిర్లేపోఽపి పరం జ్యోతిర్మోహితః శమ్భుమాయయా॥ 32**

**ప్రతిపదార్థము:–** నిర్లేపః=ఎటువంటి వికారములు అంటని, పరం జ్యోతిః అపి=పరంజ్యోతి అయినను, శంభు=శివుని యొక్క, మాయయా=మాయచేత, మోహితః=మోహం పొందిన వాడై, జీవఏవ=జీవుడే, అహమ్=నేను, సుఖీ=సుఖముగలవాడను, అహమ్=నేను,దుఃఖీ చేతి=దుఃఖముగలవాడను అనియు, అభిమన్యతే=అభిమానపడును.



**తాత్పర్యము:–** జీవుడు పరంజ్యోతి అయిన పరమశివుని అంశయే.ఆయనకు ఏ దుఃఖ వికారాలు అంటవు. కాని "శాంభవమాయ" వలన మోహితుడై తాను దుఃఖినని సుఖినని భావించును.

**శ్లో॥ కామః క్రోధస్తథా లోభో మదో మాత్సర్యమేవ చ।**
**మోహశ్చేత్యరిషడ్వర్గమహఙ్కారగతం విదుః॥ 33**

**ప్రతిపదార్థము:–** కామః=కామము, క్రోధః=క్రోధము, తథా=అట్లే, లోభః=లోభము, మదః =మదము, మాత్సర్యమేవ చ=మాత్సర్యమని, మోహశ్చేతి=మోహమని, పేర్లుగల, అరిషడ్వర్గమ్=ఆరు శత్రువుల సమూహమును, అహంకార=అహంకారమునందు, గతమ్=ఉన్న దానినిగా, విదుః=భావించిరి.

**తాత్పర్యము:–** కామము, క్రోధము, లోభము, మదము, మాత్సర్యము, మోహము – అని ఆరు భావములు శత్రువర్గములని అవి అహంకారంలో అంతర్గతంగా ఉన్నవని అంటారు.

**శ్లో॥ స ఏవ బధ్యతే జీవః స్వప్నజాగ్రదవస్థయోః।**
**సుషుప్తౌ తదభావాచ్చ జీవః శఙ్కరతాం గతః॥ 34**

**ప్రతిపదార్థము:–** స ఏవ=అదే, జీవః=జీవుడు, స్వప్న=స్వప్నావస్థలోను, జాగ్రదవస్థయోః =జాగరణావస్థలోను, బధ్యతే=బంధింపబడును, సుషుప్తౌ=గాఢనిద్రలో, తదభావాత్= అహంకారం లేకపోవుటవలన, జీవః=జీవుడు, శంకరతామ్=శంకరత్వాన్ని, గతః=పొందెను.

**తాత్పర్యము:–**అహంకారం పనిచేయుచుండటంవలన జీవుడు,స్వప్నంలోను, జాగరణలోనూ జీవుడు బంధింపబడును. సుషుప్తిలో అనగా గాఢనిద్రలో అహంకారం అంతఃకరణం పనిచేయవు కనుక జీవుడు 'శంకరుడు' గానే అవుతాడు.

**శ్లో॥ స ఏవ మాయాసంస్పృష్టః కారణం సుఖదుఃఖయోః।**
**శుక్తౌ రజతవద్విశ్వం మాయయా దృశ్యతే శివే॥ 35**

**ప్రతిపదార్థము:–** మాయా=మాయచేత, సంస్పృష్టః=కలసినవాడై, స ఏవ=ఆ జీవుడే, సుఖ దుఃఖయోః=సుఖదుఃఖములకు, కారణమ్=కారణమగును, శుక్తి=ముత్యపు చిప్పయందు, రజతవత్=వెండికనబడినట్లు, శివే=శివునియందు, విశ్వమ్=ప్రపంచము, మాయయా= మాయచేత దృశ్యతే=కనబడును.

**తాత్పర్యము:–** మాయతో కలసిన ఆ జీవుడే జాగరణాది దశలలో సుఖదుఃఖాలకు కారణమవుతున్నాడు. ముత్యపుచిప్పయందు వెండి 'భ్రాంతి'గా కన్పడినట్లు, శివునియందు విశ్వం మాయతో కనబడుతున్నది.

**శ్లో॥ తతో వివేకజ్ఞానేన న కోఽప్యత్రాస్తి దుఃఖభాక్।**
**తతో విరమ దుఃఖాత్ త్వం కిం ముధా పరితప్యసే॥ 36**

**ప్రతిపదార్థము:–** తతః=అందువలన, వివేకజ్ఞానేన=వివేకం తెలిసికొనుటచే, కోఽపి=ఎవడును, దుఃఖభాక్=దుఃఖము పొందువాడు, అత్ర=ఇచ్చట, నాస్తి=లేడు, తతః=అందువలన, దుఃఖాత్=దుఃఖమునుండి, విరమ=విరమింపుము, త్వమ్=నీవు ముధా=వ్యర్థముగా, పరితప్యసే=తపించుచున్నావు.

**తాత్పర్యము:–** కనుక ఆత్మ – అనాత్మ వివేచన ద్వారా జ్ఞానం పొందినవాడెవడును, ఇచ్చట దుఃఖభాజనుడు కాడు. కనుక దుఃఖము మానుము. వృధాగా సంతాపం చెందుతున్నావు ఎందుకు?

**శ్రీరామ ఉవాచ-శ్రీరాముడు ఇట్లనెను.**

**శ్లో॥ మునే! సర్వమిదం తథ్యం యన్మదగ్రే త్వయేరితమ్।**
**తథాపి న జహాత్యేతత్ ప్రారబ్ధాదృష్టముల్బణమ్॥ 37**

**ప్రతిపదార్థము:–** మునే!=అగస్త్యమహర్షీ! మదగ్రే=నా ఎదుట, త్వయా=నీచేత, ఈరితమ్=చెప్పబడినది, యత్=ఏదో, ఇదమ్=అది, సర్వమ్=అంతా, తథ్యమ్=నిజమే, తథాపి=అయినను, ఉల్బణమ్=తీవ్రమైన, ఏతత్=ఈ, ప్రారబ్ధాదృష్టమ్=ప్రారబ్ధం అనబడు అదృష్టము, న జహాతి=విడుచుట లేదు.

**తాత్పర్యము:–** మహర్షీ! నీవు చెప్పినదంతా వాస్తవమే. కాని తీవ్రమైన ప్రారబ్ధం నన్ను వదలుటలేదు.

**శ్లో॥ మత్తం కుర్యాద్యథా మద్యం నష్టావిద్యమపి ద్విజమ్।**
**తద్వత్ప్రారబ్ధభోగోఽపి న జహాతి వివేకినమ్॥ 38**

**ప్రతిపదార్థము:–** మద్యమ్=కల్లు, నష్టావిద్యమ్=జ్ఞానియైన, ద్విజమపి=ద్విజునైనను, యథా =ఎలా, మత్తమ్=మత్తునిగా, కుర్యాత్=చేయునో, తద్వత్=అలా, ప్రారబ్ధభోగోపి=ప్రారబ్ధ కర్మానుభవంగూడా, వివేకినమ్=జ్ఞానినైనను, న జహాతి=వదలదు.



**తాత్పర్యము:–** కల్లు ఎంతటి జ్ఞానినైనా ఎలా మత్తుడిని చేస్తుందో, అలా ప్రారబ్ధానుభవం గూడా వివేకవంతుడైన వానినైనను వదలదు.

**శ్లో॥ తతః కిం బహునోక్తేన ప్రారబ్ధసచివః స్మరః।**
**బాధతే మాం దివారాత్రమహఙ్కారోఽపి తాదృశః॥ 39**

**ప్రతిపదార్థము:–** తతః=అందువలన, బహునా=చాలా, ఉక్తేన=చెప్పుటచేత, కిమ్=ఏమి ప్రయోజనము?, ప్రారబ్ధ=ప్రారబ్ధము, సచివః=మంత్రిగాగల, స్మరః=మన్మథుడు, దివా రాత్రమ్=రేయింబవళ్ళు, మామ్=నన్ను, బాధతే=బాధించుచున్నాడు, అహంకారోపి=అహంకారం గూడా, తాదృశః=అటువంటిదే.

**తాత్పర్యము:–** ఇన్ని మాటలు చెప్పటం ఎందుకు? ప్రారబ్ధాన్ని తోడుగా పెట్టికొని మన్మథుడు నన్ను రేయింబవళ్ళు బాధించుచున్నాడు. అహంకారం గూడా అట్లే బాధించుచున్నది.

**శ్లో॥ అత్యన్తపీడితో జీవః స్థూలదేహం విముఞ్చతి।**
**తస్మాజ్జీవాప్తయే మహ్యముపాయః క్రియతాం ద్విజ!॥ 40**

**ప్రతిపదార్థము:–** అత్యంత=మిక్కిలి, పీడితః=బాధింపబడిన, జీవః=జీవుడు, స్థూలదేహమ్=స్థూలశరీరమును, విముంచతి=విడుచును, ద్విజ!=మహర్షీ!, తస్మాత్=అందువలన, మహ్యమ్=నాకు, జీవాప్తయే=ప్రాణాలుండుటకు, ఉపాయః=ఉపాయము, క్రియతామ్=చేయబడుగాక!

**తాత్పర్యము:–** మిక్కిలి పీడితుడైన జీవుడు బాధ భరించలేక శరీరత్యాగం చేయగలడు. కనుక మహర్షీ! నాకు ప్రాణములు నిలుచు ఉపాయం చెప్పవలసినది.

**ఇతి శ్రీ పద్మపురాణే ఉపరిభాగే శివగీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే**
**శ్రీ శివరాఘవసంవాదే వైరాగ్యోపదేశో నామ**
**ద్వితీయోఽధ్యాయః॥**

## అథ తృతీయో ఽధ్యాయః
# విరజాదీక్షానిరూపణయోగః

**అగస్త్య ఉవాచ-అగస్త్యుడిట్లనెను.**

**శ్లో॥ న గృహ్ణాతి వచః పథ్యం కామక్రోధాదిపీడితః।**
**హితం న రోచతే తస్య ముమూర్షోరివ భేషజమ్॥ 1**

**ప్రతిపదార్థము:-** కామ=కామము, క్రోధ=క్రోధము, ఆది=మొదలగువానిచే, పీడితః=పీడింపబడినవాడు, పథ్యమ్=హితమైన, వచః=మాటను, న గృహ్ణాతి=స్వీకరించడు, ముమూర్షోః = చావదలచినవానికి, భేషజమివ=ఔషధమువలె, తస్య=అట్టివానికి, హితమ్=హితమైన విషయము, న రోచతే=నచ్చదు.

**తాత్పర్యము:-** కామక్రోధాది పీడితుడైన మనిషి మంచి మాటను స్వీకరించడు. చావగోరిన వారికి మందు సహించనట్లు, అట్టివానికి మంచి సలహాలు నచ్చవు.

**శ్లో॥ మధ్యే సముద్రం యా నీతా సీతా దైత్యేన మాయినా।**
**ఆయాస్యతి నరశ్రేష్ఠ! సా కథం తవ సన్నిధిమ్॥ 2**

**ప్రతిపదార్థము:-** నరశ్రేష్ఠ!=పురుషోత్తమా!, మాయినా=మాయావి అయిన, దైత్యేన= రావణాసురునిచేత, మధ్యేసముద్రమ్=సముద్రమధ్యములోకి, యా=ఏ, సీతా=సీత, నీతా= తీసికొనిపోబడినదో, సా=ఆమె, తవ=నీయొక్క, సన్నిధిమ్=సమీపమును, కథమ్=ఎట్లు, ఆయాస్యతి=రాగలదు?

**తాత్పర్యము:-** మహామాయావి అయిన రావణాసురుడు సీతను ఎత్తుకొని పోయి సముద్ర మధ్యంలో ఉంచాడు. అట్టి సీత - రామా! నీ సన్నిధికెలా వస్తుంది? అసాధ్యం కదా!

**శ్లో॥ బధ్యంతే దేవతాః సర్వా ద్వారి మర్కటయూథవత్।**
**కిఞ్చ చామరధారిణ్యో యస్య సన్తి సురాఙ్గనాః॥ 3**



**ప్రతిపదార్థము:-** యస్య=ఏ రావణునియొక్క, ద్వారి=గుమ్మమునందు, సర్వాః=అందఱు, దేవతాః=దేవతలు, మర్కటయూథవత్=క్రోతులగుంపువలె, బధ్యంతే=కట్టివేయబడెదరో, కిఞ్చ=ఇంతేగాక, యస్య=ఎవనికి, సురాంగనాః=దేవతాస్త్రీలు, చామర=వింజామరలను, ధారిణ్యః=ధరించువారై, సంతి=ఉండెదరో.

**తాత్పర్యము:-** దేవతలందఱు రావణాసురుని గుమ్మమున క్రోతులగుంపువలె కట్టివేయబడి యుండెదరు. దేవతాస్త్రీలు అతనికి చామరధారిణులై వింజామరలు వీచెదరు. అంతటి శక్తిమంతుడు ఆ రావణుడు.

**శ్లో॥ భుఙ్క్తే త్రిలోకీమఖిలాం యః శంభువరదర్పితః।**
**నిష్కణ్టకం తస్య జయః కథం తవ భవిష్యతి॥ 4**

**ప్రతిపదార్థము:-** శంభు=శివునియొక్క, వర=వరముచేత, దర్పితః=దర్పించినవాడై, యః =ఏ రావణుడు, అఖిలామ్=సమస్తమైన, త్రిలోకీమ్=లోకత్రయమును, నిష్కంటకమ్= నిరాటంకముగా, భుంక్తే=అనుభవించుచున్నాడో, తస్య=ఆ రావణునియొక్క, జయః= జయము, తవ=నీకు, కథమ్=ఎట్లు, భవిష్యతి=కాగలదు.

**తాత్పర్యము:-** శంభుదత్త వరాలతో దర్పం పెంచికొన్న ఆ రావణుడు ముల్లోకములను నిరాటంకముగా అనుభవించుచున్నాడు. అట్టి ప్రభావశాలిని నీవు ఎట్లు జయించగలవు?

**శ్లో॥ ఇన్ద్రజిన్నామ పుత్రో యస్తస్యాస్తీశ వరోద్ధతః।**
**తస్యాగ్రే సఙ్గరే దేవాః బహువారం పలాయితాః॥ 5**

**ప్రతిపదార్థము:-** తస్య=ఆ రావణునికి, ఈశ=ఈశ్వరునియొక్క, వర=వరములచే, ఉద్ధతః =పొగరెక్కిన, ఇంద్రజిత్ నామ=ఇంద్రజిత్తు అను, పుత్రః=కొడుకు, యః=ఎవడు, అస్తి= ఉన్నాడో, తస్య=అతనియొక్క, అగ్రే=ఎదుట, సంగరే=యుద్ధమునందు, దేవాః=దేవతలు, బహువారమ్=చాలసార్లు, పలాయితాః=పరుగెత్తిరి.

**తాత్పర్యము:-** రావణునికి ఇంద్రజిత్తు అని ఒక కొడుకు ఉన్నాడు. వానికిన్ని ఈశ్వర వర సంపద ఉన్నది. వానిముందర యుద్ధంలో దేవతలు పలుమార్లు పరాజయం పొంది పారిపోయినారు.

**శ్లో॥ కుమ్భకర్ణాహ్వయో భ్రాతా యస్యాఽస్తి సురసూదనః।**
**అన్యో దివ్యాస్త్రసంయుక్తశ్చిరం జీవీ విభీషణః॥ 6**

**ప్రతిపదార్థము:-**యస్య=ఎవనికి, సుర=దేవతలను, సూదనః=చంపునట్టి, కుంభకర్ణాహ్వయః=కుంభకర్ణుడని పేరుగల, భ్రాతా=సోదరుడు, అస్తి=కలడో, అన్యః=మఱొక తమ్ముడు,

దివ్యాస్త్ర=దివ్యాస్త్రములతో, సంయుక్తః=కూడిన, చిరం జీవీ=చిరజీవి అయిన, విభీషణః =విభీషణుడు, కలడో –

**తాత్పర్యము:–** దేవఘాతకుడైన కుంభకర్ణుడను పేరుగల తమ్ముడు, అట్లే దివ్యాస్త్ర సంపన్ను డైన, చిరజీవి అయిన విభీషణుడను మఱొక తమ్ముడు – ఆ రావణాసురునకు రక్షణగా ఉన్నారు.

**శ్లో॥ దుర్గం యస్యాఽస్తి లఙ్కాఖ్యం దుర్జ్ఞేయం దేవదానవైః।**
**చతురఙ్గబలం యస్య వర్తతే కోటి సంఖ్యయా।**
**ఏకాకినా త్వయా జేయః స కథం నృపనన్దన!॥ 7**

**ప్రతిపదార్థము:–** నృపనందన!=రాజపుత్రా!, యస్య=ఎవనికి, దేవదానవైః=సురాసురులచే, దుర్జ్ఞేయమ్=తెలియరాని, లంకాఖ్యమ్=లంక అను పేరుగల, దుర్గమ్=దుర్గము, అస్తి=కలదో, యస్య=ఎవనికి, కోటి సంఖ్యయా=కోట్ల సంఖ్యలో, చతురంగ=గుఱ్ఱములు, ఏనుగులు, రథములు, కాల్బంట్లుగల, బలమ్=సైన్యం, వర్తతే=కలదో, సః=అట్టి రావణుడు, ఏకాకినా= ఒంటరివైన, త్వయా=నీచేత, కథమ్=ఎట్లు, జేయః=జయింపదగును.

**తాత్పర్యము:–** అతని దుర్గం లంకా పట్టణం. అది సురాసురులకు గూడా తెలియని గహనము. వానికి కోట్ల సంఖ్యలో, చతురంగ సైన్యం ఉన్నది. అట్టి రావణుని నీవు ఒంటరిగా ఎలా జయింపగలవు.

**శ్లో॥ అకాంక్షతే కరే ధర్తుం బాలశ్చన్ద్రమసం యథా।**
**తథా త్వం కామమోహేన జయం తస్యాఽభివాఞ్ఛసి॥ 8**

**ప్రతిపదార్థము:–** బాలః=పిల్లవాడు, చంద్రమసమ్=చందమామను, కరే=చేతియందు, ధర్తుమ్=ధరించుటకు, యథా=ఎట్లు, ఆకాంక్షతే=కోరునో, తథా=అట్లు, త్వమ్=నీవు, కామమోహేన = కామముచేత, అజ్ఞానంచేత, తస్య = ఆ రావణునియొక్క, జయమ్ = జయించుటను, అభివాంఛసి=కోరుచున్నావు.

**తాత్పర్యము:–** పిల్లవాడు చందమామను చేత్తో పట్టుకొనవలెనని కోరినట్లు నీవు ఆ రావణుని గెలవాలని కోరుతున్నావు.

**శ్రీరామ ఉవాచ-శ్రీరాముడు ఇట్లనెను.**

**శ్లో॥ క్షత్రియోఽహం మునిశ్రేష్ఠ! భార్యా మే రక్షసా హృతా।**
**యది తం న నిహన్మ్యాశు జీవనే మేఽస్తి కిం ఫలమ్॥ 9**



**ప్రతిపదార్థము:–** మునిశ్రేష్ఠ!=మునీశ్వరా! అహమ్=నేను, క్షత్రియః=రాజవంశీయుడను, మే=నా, భార్యా=భార్య, రక్షసా=రాక్షసునిచేత, హృతా=అపహరింపబడినది, తమ్=ఆ రాక్షసుని, ఆశు=శీఘ్రముగా, న నిహన్మి యది=చంపనట్లయితే,మే=నా, జీవనే= బ్రతుకుటలో, ఫలమ్=ప్రయోజనము, కిమ్=ఏమి?

**తాత్పర్యము:–** అయ్యా! మునీశ్వరా! నేను క్షత్రియుడను. నా భార్యను రాక్షసుడు అపహరించాడు. వానిని నేను శీఘ్రముగా చంపకపోయినచో ఇక నా బ్రతుకుకు అర్థమేమిటి?

**శ్లో॥ అతస్తే తత్త్వబోధేన న మే కిఞ్చిత్ప్రయోజనమ్।**
**కామక్రోధాదయః సర్వే దహన్త్యేతే తనుం మమ।**
**అహఙ్కారోఽపి మే నిత్యం జీవనం హర్తుముద్యతః॥ 10**

**ప్రతిపదార్థము:–** అతః=కనుక, తే=నీ, తత్త్వబోధేన=తత్త్వబోధచేత, కించిత్=కొంచెమైనను, ప్రయోజనమ్=ఫలము, న=లేదు, ఏతే=ఈ కామక్రోదాదయః=కామము, క్రోధము మొదలైనవి,సర్వే=అన్నియును, మమ=నాయొక్క, తనుమ్=శరీరమును, దహంతి=దహించు చున్నవి. అహంకారోపి=అహంకారము గూడా, మే=నా, జీవనమ్=బ్రతుకును, హర్తుమ్= హరించుటకు, ఉద్యతః=సిద్ధమైనది.

**తాత్పర్యము:–** కనుక, మునీంద్రా! నీ తత్త్వబోధవలన నాకు ప్రస్తుతం ప్రయోజనం లేదు. ఈ కామక్రోధాదులు నా శరీరాన్ని దహించివేస్తున్నవి. అహంకారం ప్రాణాలు తీయటానికి సిద్ధపడింది.

**శ్లో॥ హృతాయాం నిజ కాన్తాయాం శత్రుణాఽవమతస్య వా।**
**యస్య తత్త్వబుభుత్సా స్యాత్ స లోకే పురుషాధమః॥ 11**

**ప్రతిపదార్థము:–** నిజ=తన, కాంతాయామ్=భార్య, హృతాయామ్=అపహరింపబడగా, శత్రుణా=శత్రువుచేత, అవమతస్య వా=అవమానింపబడిన వానికి గాని, యస్య=ఎవనికి, తత్త్వ=తత్త్వము యొక్క, బుభుత్సా=జిజ్ఞాస, స్యాత్=కలుగునో, సః=వాడు, లోకే=లోకము నందు, పురుషాధమః=అధమ పురుషుడు.

**తాత్పర్యము:–** అయ్యా! భార్యను అపహరించిన సందర్భంలో గాని, శత్రువువలన అవమానం జరిగిన సందర్భంలో గాని ఎవనికి ప్రతీకారేచ్ఛకు బదులు తత్త్వజిజ్ఞాస కలుగుతుందో వాడు పురుషాధముడు.

**శ్లో॥ తస్మాత్తస్య వధోపాయం లఙ్ఘయిత్వాంబుధిం రణే।**
**బ్రూహి మే మునిశార్దూల! త్వత్తో నాన్యోఽస్తి మే గురుః॥ 12**

ప్రతిపదార్థము:- మునిశార్దూల = మునిశ్రేష్ఠా, తస్మాత్ = అందువలన, అంబుధిమ్ = సముద్రమును, లఙ్ఘయిత్వా = దాటి, తస్య=ఆ రావణునియొక్క, వధోపాయమ్ = చంపే ఉపాయమును, బ్రూహి=చెప్పుము, మే=నాకు, త్వత్తః=నీ కన్న, అన్యః=మఱొక, గురుః =గురువు, న=లేడు.

**తాత్పర్యము:-** ఓ మునీశ్వరా! సముద్రము దాటి లంకకు వెళ్ళి ఆ రాక్షసుని చంపే ఉపాయం చెప్పవలసినది. నీ కన్నా నాకు గొప్ప గురువు మఱొకడు లేదు.

**అగస్త్య ఉవాచ-అగస్త్యుడు ఇట్లనెను.**

**శ్లో॥ ఏవం చేచ్ఛరణం యాహి పార్వతీపతిమవ్యయమ్।**
**స చేత్ప్రసన్నో భగవాన్ వాఞ్ఛితార్థం ప్రయచ్ఛతి॥ 13**

**ప్రతిపదార్థము:-** ఏవం చేత్=అట్లయినచో, అవ్యయమ్=శాశ్వతుడైన, పార్వతీపతిమ్=పార్వతీ భర్త అయిన పరమేశ్వరుని, శరణమ్=శరణు, యాహి=పొందుము, సః=ఆ, భగవాన్= భగవంతుడు, ప్రసన్నః చేత్=ప్రసన్నుడైనచో, వాంఛిత=కోరబడిన, అర్థమ్=విషయమును, ప్రయచ్ఛతి=ఇచ్చును.

**తాత్పర్యము:-** అట్లయినచో, రామా! శాశ్వతుడైన పార్వతీవల్లభుని శరణు వేడుము. ఆయన అనుగ్రహించి నీ కోరిక తీర్చగలడు.

**శ్లో॥ దేవైరజేయః శక్రాద్యైర్హరిణా బ్రహ్మణాపి వా**
**స తే వధ్యః కథం వా స్యాచ్ఛఙ్కరానుగ్రహం వినా॥ 14**

**ప్రతిపదార్థము:-** శక్రాద్యైః=ఇంద్రుడు మొదలగు, దేవైః=దేవతలచేత, హరిణా=విష్ణువుచేత, బ్రహ్మణాపి వా=బ్రహ్మచేతగాని, అజేయః=జయింపశక్యముగాని, సః=ఆ రావణుడు శంకర= శివునియొక్క, అనుగ్రహం వినా=అనుగ్రహం లేకుండా, తే=నీకు, కథం వా=ఎట్లు, వధ్యః =వధింపదగినవాడు, స్యాత్=అగును.

**తాత్పర్యము:-** ఆ రావణుడు ఇంద్రాది దేవతలకుగాని, విష్ణువుకుగాని, బ్రహ్మకుగాని, జయింప శక్యం కాదు. అట్టివానిని నీవు శంకరానుగ్రహం లేకుండా ఎలా గెలువగలవు?

**శ్లో॥ అతస్త్వాం దీక్షయిష్యామి విరజామార్గమాశ్రితః।**
**తేన మార్గేణ మర్త్యత్వం హిత్వా తేజోమయో భవ॥ 15**

**ప్రతిపదార్థము:-** అతః=అందువలన, విరజా=విరజా అను దీక్షయొక్క, మార్గమ్= మార్గమును, ఆశ్రితః=ఆశ్రయించినవాడనై, త్వామ్=నిన్ను, దీక్షయిష్యామి=దీక్షలోకి తేగలను



తేన=ఆ, మార్గేణ=విరజామార్గముతో, మర్త్యత్వమ్=మానవత్వమును, హిత్వా=వదలి, తేజోమయః=తేజోమయుడవు, భవ=కమ్ము.

**తాత్పర్యము:-** కనుక విరజా మార్గమున నీకు దీక్ష ఇస్తాను. ఆ దీక్షతో నీవు నీ మానవ లక్షణమును వదలి తేజోమయుడవు కమ్ము.

**శ్లో॥ యేన హత్వా రణే శత్రూన్ సర్వాన్ కామానవాప్స్యసి।**
**భుక్త్వా భూమణ్డలం చాన్తే శివసాయుజ్యమాప్స్యసి॥ 16**

**ప్రతిపదార్థము:-** యేన=ఏ విరజామార్గముచేత, శత్రూన్=శత్రువులను, రణే=యుద్ధము నందు, హత్వా=చంపి,సర్వాన్=సమస్తమైన, కామాన్=కోరికలను, అవాప్స్యసి=పొందగలవు, భూమండలం చ=భూమండలమునుగూడా, భుక్త్వా=అనుభవించి, అంతే=జీవితాంతమున, శివ=శివునితో, సాయుజ్యమ్=సాయుజ్యమోక్షమును, ఆప్స్యసి=పొందగలవు.

**తాత్పర్యము:-** విరజామార్గమువలన నీవు తప్పక నీ శత్రువులను చంపి, నీ కోరికలన్ని తీర్చుకొనగల్గెదవు. ఈ భూమండలమునకు రాజువై రాజ్యమనుభవించి చివఱకు శివసాయుజ్యమును పొందగలవు.

**సూత ఉవాచ-సూతుడు ఇట్లనెను.**

**శ్లో॥ అథ ప్రణమ్య రామస్తం దణ్డవన్మునిసత్తమమ్।**
**ఉవాచ దుఃఖనిర్ముక్తః ప్రహృష్టేనాన్తరాత్మనా॥ 17**

**ప్రతిపదార్థము:-** అథ=అగస్త్యుని మాటల తర్వాత, రామః=రాముడు, తమ్=ఆ, మునిసత్తమమ్=మునిశ్రేష్ఠుని, దండవత్=దండమువలెపడి,ప్రణమ్య=నమస్కరించి,దుఃఖ= దుఃఖమువలన, నిర్ముక్తః=వదలబడినవాడై, ప్రహృష్టేన=మిక్కిలి సంతోషించిన, అంతరాత్మనా=అంతరాత్మతో, ఉవాచ=ఇట్లనెను.

**తాత్పర్యము:-** అగస్త్యుని మాటలు విని రాముడు దుఃఖ విముక్తుడై, సంతసించిన మనస్సుతో ఆమునికి సాష్టాంగ ప్రణామము చేసి యిట్లనెను.

**శ్రీరామ ఉవాచ-శ్రీరాముడు ఇట్లనెను.**

**శ్లో॥ కృతార్థోఽహం మునే! జాతో వాఞ్ఛితార్థో మమాగతః।**
**పీతామ్బుధిః ప్రసన్నస్త్వం యది మే కిము దుర్లభమ్।**
**అతస్త్వం విరజాదీక్షాం బ్రూహి మే మునిసత్తమ!॥ 18**

**ప్రతిపదార్థము:-** మునే!=అగస్త్యమహర్షీ! అహమ్=నేను, కృతార్థః=కృతార్థుడను, జాతః

=అయితిని, మమ=నాయొక్క, వాంఛితార్థః=కోరిక, ఆగతః=వచ్చినది, పీతాంబుధిః= సముద్రమును త్రాగిన, త్వమ్=నీవు, ప్రసన్నోయది=నాయందనుగ్రహము కలవాడవైనచో, మే=నాకు, దుర్లభమ్=దుర్లభమైనది, కిము=ఏమి కలదు? మునిసత్తమ!=మునిశ్రేష్ఠా!, విరజా=విరజ అనబడు, దీక్షామ్=దీక్షను, బ్రూహి=చెప్పుము.

**తాత్పర్యము:–** మహర్షీ! నేను ధన్యుడనైతిని. నా కోరిక తీరినది. సముద్రమునే త్రాగిన మహాత్ముడవు. నీవు ఇలా అనుగ్రహిస్తే నాకు దుర్లభం ఏమున్నది. కనుక నాకు విరజాదీక్షను అనుగ్రహింపుము.

**అగస్త్య ఉవాచ-అగస్త్యుడు ఇట్లనెను.**

**శ్లో॥ శుక్లపక్షే చతుర్దశ్యామష్టమ్యాం వా విశేషతః।**
**ఏకాదశ్యాం సోమవారే ఆర్ద్రాయాం వా సమారభేత్॥ 19**

**ప్రతిపదార్థము:–** శుక్లపక్షే=శుక్లపక్షమున, విశేషతః=ప్రత్యేకముగా, చతుర్దశ్యామ్=చతుర్దశి లోను, అష్టమ్యాం వా=అష్టమిలోగాని, ఏకాదశ్యామ్=ఏకాదశిలోగాని, సోమవారే=సోమ వారమునందుగాని, ఆర్ద్రాయామ్ వా=ఆర్ద్రయందుగాని, సమారభేత్=ప్రారంభింపవలెను.

**తాత్పర్యము:–** శుక్ల చతుర్దశీ సోమవారం, శుక్లాష్టమీ సోమవారం, శుక్ల ఏకాదశీ సోమవారం గాని, ఆర్ద్రానక్షత్రంలోగాని ఈ దీక్షను ఆరంభింపవలెను.

**శ్లో॥ యం వాయుమాహుర్యం రుద్రం శాశ్వతం పరమేశ్వరమ్।**
**పరాత్పరం పరం చాహుః పరాత్పరతరం శివమ్।**
**బ్రహ్మణో జనకం విష్ణోర్వహ్నేర్వాయోః సదాశివమ్॥ 20**

**శ్లో॥ ధ్యాత్వాగ్నినాఽవసథ్యాగ్నిం విశోధ్య చ పృథక్ పృథక్।**
**పఞ్చభూతాని సంయమ్య దగ్ధ్వా గుణవిధిక్రమాత్॥ 21**

**ప్రతిపదార్థము:–** యమ్=ఎవరిని, వాయుమ్=వాయువునుగాను, యమ్=ఎవనిని, రుద్రమ్ =రుద్రునిగా, శాశ్వతమ్=శాశ్వతుడైన, పరమేశ్వరమ్=పరమేశ్వరునిగా, పరాత్పరమ్= పరాత్పరునిగాను, పరం చ=పరునిగాను, పరాత్పరతరం చ=పరాత్పరతరునిగాను, శివమ్= శివునిగాను,బ్రహ్మణః=బ్రహ్మకు,విష్ణోః=విష్ణువుకు, వహ్నేః=అగ్నికి, వాయోః=వాయువునకు, జనకమ్=మూలకారణమైన, సదాశివమ్=ఆ సదాశివుని, ధ్యాత్వా=ధ్యానముచేసి, అగ్నినా= అగ్నితోను, ఆవసథ్యాగ్నిమ్=ఆవసథ్యాగ్నిని, పృథక్ పృథక్=విడివిడిగా, విశోధ్య చ=శోధించి, పంచభూతాని=పంచభూతాలను, సంయమ్య=నియమించి, గుణ=గుణములయొక్క, విధి= విధులయొక్క, క్రమాత్=వరసతో, ధ్యాత్వా=ధ్యానించి.



**తాత్పర్యము:–** వేదవేత్తలు ఎవరిని వాయువని, రుద్రుడని, శాశ్వతుడైన పరమేశ్వరుడని, పరాత్పరుడని, పరుడని, పరాత్పరతరుడని, శివుడని చెప్పుచున్నారో. బ్రహ్మ విష్ణు వహ్ని వాయ్వాదులకు జనకుడైన ఆ సదాశివుని ధ్యానించి,అగ్నితో ఆవసథ్యాగ్నిని శోధించి,విడిగా అగ్నులను శోధించాలి. పంచభూతాలను నియమించాలి. గుణవిధిప్రకారం ధ్యానించాలి.

**శ్లో॥ మాత్రాః పఞ్చ చతస్రశ్చ త్రిమాత్రా ద్విస్తతఃపరమ్।**
**ఏకమాత్రమమాత్రం చ ద్వాదశాన్తవ్యవస్థితమ్॥ 22**

**శ్లో॥ స్థిత్వా స్థాప్యామృతో భూత్వా వ్రతం పాశుపతం చరేత్।**
**ఇదం వ్రతం పాశుపతం వదిష్యామి సమాసతః॥ 23**

**ప్రతిపదార్థము:–** మాత్రాః=మాత్రలు, పంచ=ఐదును, చతస్రశ్చ=నాలుగును, త్రిమాత్రాః =మూడును,ద్విః=రెండును,తతఃపరమ్=తర్వాత,ఏకమాత్రమ్=ఒకమాత్రను,అమాత్రం చ =మాత్రారహితముగా, ద్వాదశాంత=ద్వాదశాంతపీఠమునందు, వ్యవస్థితమ్=ఉన్నవాడును అగు, ఈశ్వరుని, స్థిత్వా=తత్త్వస్థితిలో ఉండి, స్థాప్య=ఉంచి, అమృతః=అమృతరూపుడుగా, భూత్వా= అయి, పాశుపతమ్=పాశుపతవ్రతమును, చరేత్=ఆచరింపవలయును, ఇదమ్=ఈ, పాశుపతమ్=పాశుపతమను, వ్రతమ్=వ్రతమును, సమాసతః=సంక్షిప్తంగా, కథయిష్యే= చెప్పబోవుచున్నాను.

**తాత్పర్యము:–** పంచభూతములయొక్క పంచతన్మాత్రలను వరసగా ధ్యానించి, మాత్రా రహితుడై ద్వాదశాంత పీఠమున నున్న ఆ నిష్కల పరబ్రహ్మమును తత్త్వ స్థితిలో ఉంచి అమృత రూపుడై పాశుపతవ్రతమును చేయవలయును. ఈ వ్రతవిధానమంతా నేను సంక్షిప్తంగా చెబుతాను.

**శ్లో॥ ప్రాతరేవం తు సంకల్ప్య నిధాయాగ్నిం స్వశాఖయా।**
**ఉపోషితః శుచిః స్నాతః శుక్లామ్బరధరః స్వయమ్॥ 24**

**ప్రతిపదార్థము:–** ప్రాతః=ప్రొద్దున, ఏవంతు=ఇలా, సంకల్ప్య=సంకల్పించి, స్వశాఖయా= తమశాఖ ప్రకారం, అగ్నిమ్=అగ్నిని, నిధాయ=ఉంచి, ఉపోషితః=ఉపవసించినవాడై, శుచిః=పరిశుద్ధుడై, స్నాతః=స్నానముచేసినవాడై, స్వయమ్=స్వయంగా శుక్లాంబర=తెల్లని వస్త్రాలను, ధరః=ధరించినవాడై –

**తాత్పర్యము:–** ప్రొద్దున "పాశుపతవ్రతం కరిష్యే" అని సంకల్పించి తన వేదశాఖనుబట్టి అగ్నిని ఆరాధించి, స్నానంచేసి శుచియై, శుక్లాంబరధరుడై ఉపవసించవలయును.

**శ్లో॥ శుక్లయజ్ఞోపవీతశ్చ శుక్లమాల్యానులేపనః।**
**జుహుయాద్ విరజామన్త్రైః ప్రాణాపానాదిభిస్తతః॥ 25**

**శ్లో॥ అనువాకాన్తమేకాగ్రః సమిదాజ్యచరూన్ పృథక్।**
**ఆత్మన్యగ్నిం సమారోప్య యాతే అగ్నేతి మన్త్రతః॥ 26**

**ప్రతిపదార్థము:–** శుక్ల=తెల్లని, యజ్ఞోపవీతశ్చ=జందెముగలవాడై, శుక్ల=తెల్లని, మాల్య=పుష్పమాలలు మొదలైనవి, అనులేపనః=గంధము గలవాడై, తతః=తరువాత, ప్రాణాపానాదిభిః=ప్రాణాపానములు మొదలైన, విరజామంత్రైః=విరజామంత్రములతో, అనువాకాంతం=అనువాకము పూర్తి అయ్యేదాకా, సమిత్=సమిధలను, ఆజ్య=నేతిని, చరూన్=అన్నపదార్థమును,పృథక్=విడిగా, ఏకాగ్రః=శ్రద్ధగలవాడై, జుహుయాత్=హోమము చేయవలయును. యాతే అగ్నేతిమన్త్రతః=యాతే అగ్నే అనుమంత్రంతో, ఆత్మని=తనయందు, అగ్నిమ్=అగ్నిని, సమారోప్య=న్యాసముచేసి.

**తాత్పర్యము:–** తెల్లని జందెము, తెల్లని గంధమాల్యములు ధరింపవలయును. తరువాత ప్రాణాపానాది మంత్రాలతో అనువాకము పూర్తి అయ్యేంతవఱకు విరజాహోమం చేయవలయును, సమిధలు, నేయి, చరువు (అన్నము) వీటిని ఆ మంత్రాలతో విడివిడిగా హోమం చేయవలయును. తరువాత "యాతే అగ్నే" మొదలైన మంత్రాలతో అగ్నిని తనయందు న్యాసము చేయవలయును.

**శ్లో॥ భస్మాదాయాగ్నిరిత్యాద్యైః విమృజ్యాఙ్గాని సంస్పృశేత్।**
**భస్మచ్ఛన్నో భవేద్విద్వాన్ మహాపాతకసంభవైః।**
**పాపైర్విముచ్యతే సత్యముచ్యతే చ న సంశయః॥ 27**

**ప్రతిపదార్థము:–** అగ్నిరిత్యాద్యైః=అగ్నిః మొదలగు మంత్రములతో, భస్మ=భస్మమును, ఆదాయ=గ్రహించి,విమృజ్య=నలిపి, అంగాని=తన అవయములను, సంస్పృశేత్=స్పృశింపవలయును. విద్వాన్=విద్వాంసుడు, భస్మ=భస్మముచేత, ఛన్నః=కప్పబడినవాడుగా, భవేత్=కావలయును. మహాపాతక=పంచమహాపాతకములనుండి, సంభవైః=పుట్టిన, పాపైః=పాపములచేత, విముచ్యతే=విడువబడును, సత్యమ్=సత్యము, ఉచ్యతే=చెప్పబడుచున్నది, సంశయః=సందేహము, న=లేదు.

**తాత్పర్యము:–**'అగ్నిః' మొదలగు మంత్రాలతో భస్మమునుమంత్రించి దానితో సర్వాంగములు తాకాలి. శరీరమంతా భస్మం పూసికొనాలి. దానివలన మహాపాతకములు ఉపపాతకములు అన్ని అతనిని వదలిపోవును. ఇది పూర్తిగా సత్యము. సందేహము లేదు.

**శ్లో॥ అగ్నివీర్యం యతో భస్మ వీర్యవాన్భస్మసంయుతః।**
**భస్మస్నానరతో విప్రో భస్మశాయీ జితేన్ద్రియః।**
**సర్వపాపవినిర్ముక్తః శివసాయుజ్యమాప్నుయాత్॥ 28**



**ప్రతిపదార్థము:–** యతః=ఎందువలన, భస్మ=భస్మము, అగ్నివీర్యమ్=అగ్ని సారమో, అందువలన, భస్మసంయుతః=భస్మం పూసికొన్నవాడు, వీర్యవాన్=బలంగలవాడు, భస్మ=భస్మముతో, స్నాన=స్నానమునందు, రతః=ఆసక్తుడైనవాడు, భస్మ=భస్మమునందు శాయీ=పరుండువాడు, జితేంద్రియః=ఇంద్రియనిగ్రహం గలవాడున్ను అయిన, విప్రః=బ్రాహ్మణుడు, సర్వపాప=సమస్త పాపములనుండి, వినిర్ముక్తః=విడువబడినవాడై, శివసాయుజ్యమ్ = శివైక్యమును, ఆప్నుయాత్=పొందును.

**తాత్పర్యము:–** భస్మము – అగ్నివీర్యము. భస్మలిప్తుడు వీర్యవంతుడు. భస్మస్నానము, భస్మశయనము చేయు జితేంద్రియుడైన విప్రుడు సర్వపాపవిముక్తుడై శివసాయుజ్యమును పొందును.

**శ్లో॥ ఏవం కురు మహాభాగ! శివనామసహస్రకమ్।**
**ఇదం తు సమ్ప్రదాస్యామి తేన సర్వార్థమాప్స్యసి॥ 30**

**ప్రతిపదార్థము:–** మహాభాగ=మహాశయా!, ఏవమ్=ఈ విధముగా, కురు=చేయుము. ఇదంతు=ఈ, శివనామసహస్రకమ్=శివసహస్రనామములను, సంప్రదాస్యామి=ఇచ్చెదను. తేన=అందుచేత, సర్వార్థమ్=సమస్త ప్రయోజనమును, ఆప్స్యసి=పొందగలవు.

**తాత్పర్యము:–** మహాశయా! నేను చెప్పినట్లు చేయుము. అందుకు తోడుగా నీకు ఈ శివసహస్రనామములను ఇచ్చెదను. వీటివలన నీవు సమస్త ప్రయోజనమును పొందెదవు–

**సూత ఉవాచ-సూతుడు ఇట్లనెను.**

**శ్లో॥ ఇత్యుక్త్వా ప్రదదౌ తస్మై శివనామసహస్రకమ్।**
**వేదసారాభిదం నిత్యం శివప్రత్యక్షకారకమ్॥ 31**

**ప్రతిపదార్థము:–** ఇతి=అని, ఉక్త్వా=పలికి, తస్మై=ఆరామునికొఱకు, వేదసారాభిధమ్=వేదసారమను పేరుగలదియు, నిత్యమ్=నిత్యమైనదియు, శివ=శివునియొక్క ప్రత్యక్షకారకమ్=ప్రత్యక్షమును కలిగించునదియు అగు, శివనామసహస్రకమ్=శివుని నామసహస్రమును, ప్రదదౌ=ఇచ్చెను.

**తాత్పర్యము:–** అని పలికి అగస్త్యుడు రామునికి వేదసారమైన శివసహస్రనామమును ఇచ్చెను. అది శివప్రత్యక్షాన్ని కలిగించును.

**శ్లో॥ ఉక్తం చ తేన రామ! త్వం జప నిత్యం దివానిశమ్।**
**తతః ప్రసన్నో భగవాన్మహాపాశుపతాస్త్రకమ్।**
**తుభ్యం దాస్యతి తేన త్వం శత్రూన్ హత్వాప్స్యసి ప్రియమ్॥ 32**

**ప్రతిపదార్థము:–** తేన=ఆ అగస్త్యునిచేత, ఉక్తం చ=చెప్పబడినది. రామ!=ఓ రామా!

త్వమ్=నీవు, దివానిశమ్=రేయింబవళ్ళు, నిత్యమ్=ఎల్లప్పుడు, జప=జపించుము, తతః =అందువలన, ప్రసన్నః=అనుగ్రహం గలవాడైన, భగవాన్=శివభగవానుడు, తుభ్యమ్= నీకు, మహాపాశుపతాస్త్రకమ్=మహాపాశుపతాస్త్రాన్ని, దాస్యతి=ఇవ్వగలడు. యేన=దేనితో, త్వమ్=నీవు, శత్రూన్=శత్రువులను, హత్వా=చంపి, ప్రియామ్=నీ భార్యను, ఆప్స్యసి= పొంద గలవు.

**తాత్పర్యము:–** అగస్త్యుడు రామునికి శివసహస్రనామములను చెప్పి – ఇలా అన్నాడు – అయ్యా! వీటిని రేయింబవళ్ళు నిత్యం జపించుము. దానివలన ప్రసన్నుడైన శివభగవానుడు నీకు మహాపాశుపతాస్త్రము ఇవ్వగలడు. దానితో నీవు శత్రువులను జయించి నీ భార్యను తిరిగి తెచ్చికొనగలవు.

**శ్లో॥ తస్యైవాస్త్రస్య మాహాత్మ్యాత్సముద్రం శోషయిష్యసి।**
**సంహారకాలే జగతామస్త్రం తత్పార్వతీపతేః॥ 33**

**ప్రతిపదార్థము:–** తస్య=ఆ, అస్త్రస్యైవ=అస్త్రముయొక్క, మాహాత్మ్యాత్=మహిమవలన, సముద్రమ్=సముద్రమును, శోషయిష్యసి=ఎండబెట్టగలవు, జగతామ్=లోకములయొక్క, సంహారకాలే=సంహార సమయమునందు, పార్వతీపతేః=శివునకు తత్=అదే, అస్త్రమ్= అస్త్రము సాధనము.

**తాత్పర్యము:–** ఆ అస్త్ర మహిమతోనే నీవు సముద్రాన్ని ఎండగట్టగలవు. ప్రళయకాలంలో శివునకు ఉపయోగపడేది ఆ అస్త్రమే.

**శ్లో॥ తదలాభే దానవానాం జయస్తవ సుదుర్లభః।**
**తస్మాల్లబ్ధుం తదేవాస్త్రం శరణం యాహి శఙ్కరమ్॥ 34**

**ప్రతిపదార్థము:–** తత్=ఆ అస్త్రముయొక్క, అలాభే=దొరకని పక్షమున, దానవానామ్= రాక్షసులయొక్క, జయః=గెలవడం, తవ=నీకు, సుదుర్లభః=మిక్కిలి దుర్లభము, తస్మాత్= కనుక, తదేవ=అదే, అస్త్రమ్=అస్త్రమును, లబ్ధుమ్=పొందుటకు, శంకరమ్=శంకరుని, శరణమ్=శరణుగా, యాహి=పొందుము.

**తాత్పర్యము:–** మహాపాశుపతాస్త్రము లేనిదే రావణాది రాక్షసులను జయించటం నీకు అసాధ్యము. కనుక ఆ అస్త్రం పొందాలంటే నీవు ఆ శంకరునే శరణువేడుము.

**ఇతి శ్రీ పద్మపురాణే ఉపరిభాగే శివగీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీ శివరాఘవసంవాదే విరజాదీక్షానిరూపణం నామ తృతీయోధ్యాయః॥**

* * * * *



## అథ చతుర్థోఽధ్యాయః
# శివప్రాదుర్భావ యోగః

**సూత ఉవాచ-సూతుడు ఇట్లనెను.**

**శ్లో॥ ఏవముక్త్వా మునిశ్రేష్ఠే గతే తస్మిన్నిజాశ్రమమ్।**
**అథ రామగిరౌ రామః పుణ్యే గోదావరీతటే॥ 1**

**ప్రతిపదార్థము:–** ఏవమ్=ఇట్లు, ఉక్త్వా=పలికి, తస్మిన్=ఆ, మునిశ్రేష్ఠే=మునీంద్రుడు, నిజ=తనదైన, ఆశ్రమమ్=ఆశ్రమమును గూర్చి, గతే=పోగా, అథ=తర్వాత, రామః= రాముడు, పుణ్యే=పవిత్రమైన, గోదావరీ=గోదావరీనదియొక్క, తటే=తీరమున –

**తాత్పర్యము:–** ఇలా చెప్పి – అగస్త్యముని తన ఆశ్రమమునకు వెళ్ళగా రాముడు పవిత్ర గోదావరీ తీరమున రామగిరియందు శివలింగమును ప్రతిష్ఠించెను.

**శ్లో॥ శివలిఙ్గం ప్రతిష్ఠాప్య కృత్వా దీక్షాం యథావిధి।**
**భూతిభూషితసర్వాఙ్గో రుద్రాక్షాభరణైర్యుతః॥ 2**

**ప్రతిపదార్థము:–** శివలింగమ్=శివలింగమును, ప్రతిష్ఠాప్య=ప్రతిష్ఠించి, యథావిధి=విధ్యుక్త ప్రకారముగా, దీక్షామ్=దీక్షను, కృత్వా=చేసి, భూతి=భస్మముచేత, భూషిత=అలంకరింప బడిన, సర్వాంగః=సమస్త శరీరముగలవాడును, రుద్రాక్షాభరణైః=రుద్రాక్షలనే సొమ్ములతో, యుతః=కూడినవాడై –

**తాత్పర్యము:–** గోదావరి తీరమున రామగిరియందు శివలింగమును ప్రతిష్ఠించి, యథావిధిగా, విరజాదీక్ష స్వీకరించి భస్మోద్ధూళిత శరీరుడై రుద్రాక్షభూషణములు ధరించెను.

**శ్లో॥ అభిషిచ్య జలైః పుణ్యైర్గౌతమీసిన్ధుసమ్భవైః।**
**అర్చయిత్వా వన్యపుష్పైస్తద్వత్ వన్యఫలైరపి॥ 3**

**ప్రతిపదార్థము:–** గౌతమీసింధు=గోదవరీనది యందు, సంభవైః=పుట్టునట్టి, పుణ్యైః=

పవిత్రమైన, జలైః=నీటిచేత, అభిషిచ్య=అభిషేకముచేసి, వన్య=అడవిసంబంధమైన, పుష్పైః =పూలతో, తద్వత్=అట్లే, వన్య=అడవిలో పుట్టిన, ఫలైరపి=పండ్లతోను, అర్చయిత్వా= పూజించి –

**తాత్పర్యము:–** గోదావరీ పవిత్ర జలాలతో శివునకు అభిషేకము చేసి అడవిలో పుట్టిన పుష్పఫలాలతో రాముడు అర్చన చేసెను.

**శ్లో॥ భస్మచ్ఛన్నో భస్మశాయీ వ్యాఘ్రచర్మాసనే స్థితః।**
**నామ్నాం సహస్రం ప్రజపన్ నక్తందివమనన్యధీః॥ 4**

**ప్రతిపదార్థము:–** భస్మ=భస్మముచేత, ఛన్నః=కప్పబడినవాడై, భస్మ=భస్మమునందు, శాయీ= పరుండినవాడై, వ్యాఘ్రచర్మ=పెద్దపులిచర్మమైన, ఆసనే=ఆసనమునందు, స్థితః=ఉన్నవాడై, నక్తందివమ్=రేయింబవళ్ళు, అనన్యధీః=ఏకాగ్రమానసుడై, నామ్నామ్=శివనామముల యొక్క, సహస్రమ్=వేయిని, ప్రజపన్=జపించుచు ఉండెను.

**తాత్పర్యము:–** ఒంటినిండా భస్మం ధరించి, భస్మశయ్యయందు పరుండినవాడై రాముడు రాత్రింబవళ్ళు వ్యాఘ్రచర్మాసనముమీద ఆసీనుడై శివనామసహస్రమును రేయింబవళ్ళు జపించుచుండెను.

**శ్లో॥ మాసమేకం ఫలాహారో మాసం పర్ణాశనః స్థితః।**
**మాసమేకం జలాహారో మాసం చ పవనాశనః॥ 5**

**ప్రతిపదార్థము:–**ఏకమ్=ఒక, మాసమ్=నెల పొడవునా, ఫలాహారః=ఫలములే ఆహారముగా గలవాడై, మాసమ్=మఱొక నెలంతా, పర్ణ=ఆకులే, ఆశనః=ఆహారముగా గలవాడుగా, ఏకమ్=మఱొక, మాసమ్=నెలపొడవునా, జల=నీరే, ఆహారః=ఆహారముగా గలవాడుగా, మాసం చ=మఱొక నెలపొడవునా, పవన=గాలియే ఆశనః=ఆహారముగా గలవాడుగా, స్థితః= ఉండెను.

**తాత్పర్యము:–** ఒక నెలంతా పండ్లను, ఒక నెలంతా ఆకులను, మఱొక నెలపొడవునా నీటిని, ఇంకొక నెలంతా గాలిని ఆహారంగా స్వీకరించుచు రాముడు తపస్సు చేసెను.

**శ్లో॥ శాన్తో దాన్తః ప్రసన్నాత్మా ధ్యాయన్నేవం మహేశ్వరమ్।**
**హృత్పఙ్కజే సమాసీనముమాదేహార్ధధారిణమ్॥ 6**

**ప్రతిపదార్థము:–** శాంతః=అంతరింద్రియములను, నిగ్రహించినవాడై, దాంతః=బాహ్యేంద్రి –యములను నిగ్రహించినవాడై, ప్రసన్న=తేరిన, ఆత్మా=మనస్సుగలవాడై, ఏవమ్=ఈ విధముగా, మహేశ్వరమ్=ఈశ్వరుని, ధ్యాయన్=ధ్యానము చేయుచు ఉండెను. హృత్పంకజే



=హృదయకమలమునందు, సమాసీనమ్=ఆసీనుడైన వానిగను, ఉమా=పార్వతియొక్క దేహార్ధ=సగము దేహముయొక్క, ధారిణమ్=ధరించినవానినిగను, ధ్యానించుచుండెను.

**తాత్పర్యము:–** రాముడు జ్ఞానేంద్రియ కర్మేంద్రియములను నిగ్రహించి, ప్రసన్నుడై, నిర్మల మనస్సుతో పరమేశ్వరుని ఈ విధముగా ధ్యానించుచుండెను. తన హృదయ పద్మమునందు ఆసీనుడైన వానినిగను, అర్ధనారీశ్వరుడుగను, ధ్యానించెను.

**శ్లో॥ చతుర్భుజం త్రినయనం విద్యుత్పిఙ్గజటాధరమ్।**
**కోటిసూర్యప్రతీకాశం చన్ద్రకోటిసుశీతలమ్॥ 7**

**ప్రతిపదార్థము:–** చతుర్భుజమ్=నాల్గు భుజములు గలవాడును, త్రినయనమ్=మూడు కన్నులు గలవాడును, విద్యుత్=మెరుపు తీగలవలె, పింగ=పింగళవర్ణమైన, జటా=జడలను, ధరమ్=ధరించినవాడును,కోటిసూర్య=కోటిసూర్యులతో, ప్రతీకాశమ్=సమానమైనవాడును, చంద్రకోటి =కోటిచంద్రులతో సమానముగా, సుశీతలమ్=చల్లనివాడును –

**తాత్పర్యము:–** నాల్గు చేతులు, 3 కన్నులు, మెఱుపుతీగవంటి లోహిత జటలు కోటి సూర్యులతో సమానమైన కాంతి, కోటిచంద్రులతో సమానమైన ఆహ్లాదకరరూపముగల శివుని రాముడు ధ్యానించెను.

**శ్లో॥ సర్వాభరణసంయుక్తం నాగయజ్ఞోపవీతినమ్।**
**వ్యాఘ్రచర్మామ్బరధరం వరదాభయధారిణమ్॥ 8**

**ప్రతిపదార్థము:–** సర్వ=సమస్తమైన, ఆభరణ=సొమ్ములతో, సంయుక్తమ్=కూడినవాడును, నాగ=పాములే, యజ్ఞోపవీతినమ్=జందెముగాగలవాడును, వ్యాఘ్రచర్మ=పెద్దపులిచర్మమనే అంబర=వస్త్రమును, ధరమ్=ధరించినవాడును, వరద=వరదహస్తమును, అభయ=అభయ హస్తమును, ధారిణమ్=ధరించువాడును.

**తాత్పర్యము:–** సర్వాభరణములను ధరించినవానిగను, పాములను జందెముగా ధరించిన వాడును, వ్యాఘ్రచర్మమును వస్త్రముగా ధరించినవాడును, వరాభయహస్తములను పట్టిన శివుని రాముడు ధ్యానించెను.

**శ్లో॥ వ్యాఘ్రచర్మోత్తరీయం చ సురాసురనమస్కృతమ్।**
**పఞ్చవక్త్రం చన్ద్రమౌళిం త్రిశూలడమరూధరమ్॥ 9**

**ప్రతిపదార్థము:–** వ్యాఘ్రచర్మ=పెద్దపులిచర్మమే, ఉత్తరీయం చ=ఉత్తరీయముగా గలవాడును, సురాసుర=దేవదానవులచేత, నమస్కృతమ్=నమస్కరింపబడినవాడును, పంచవక్త్రమ్= ఐదు ముఖములు గలవాడును, చంద్ర=చంద్రుడు, మౌళిమ్=శీర్షమునందు గలవాడును,

త్రిశూల=శూలము, డమరూ=డమరుకమును, ధరమ్=ధరించినవాడును, అయిన శివుని ధ్యానించెను.

**తాత్పర్యము:–** పెద్ద పులిచర్మమును ఉత్తరీయముగా ధరించినవాడుగాను, దేవదానవులచే నమస్కరింపబడుచున్నట్లుగను, ఐదు ముఖములతోను, తలపైచంద్రునితోను, చేతిలో త్రిశూల డమరుకములతోను ఉన్నవాడుగా రాముడు శివుని ధ్యానించెను.

**శ్లో॥ నిత్యం చ శాశ్వతం శుద్ధం ధ్రువమక్షరమవ్యయమ్।**
**ఏవం నిత్యం ప్రజపతో గతం మాసచతుష్టయమ్॥ 10**

**ప్రతిపదార్థము:–** నిత్యమ్=నిత్యుడును, శాశ్వతమ్=శాశ్వతుడుగను, శుద్ధమ్=నిర్మలుడుగను, ధ్రువమ్=ధ్రువునిగను, అక్షరమ్=అక్షరునిగను, అవ్యయమ్=నాశములేనివానిగను, ఏవమ్= ఈ విధముగాను, నిత్యమ్=నిత్యముగా, ప్రజపతః=జపించుచుండగా, మాసచతుష్టయమ్= నాలుగు నెలలు, గతమ్=గడిచిపోయినవి.

**తాత్పర్యము:–** ఇట్లు నిత్యుడు, శాశ్వతుడు, నిర్మలుడు, ధ్రువుడు, అక్షరుడు, అవ్యయుడైన శివుని ధ్యానించి, జపించుచుండగా నాలుగు మాసముల కాలము గడచినది.

**శ్లో॥ అథ జాతో మహానాదః ప్రళయామ్బుదభీషణః।**
**సముద్రమథనోద్భూతమన్దరావనిభృద్ధ్వనిః।**
**రుద్రబాణాగ్నిసందీప్తభ్రశ్యత్త్రిపురవిభ్రమః॥ 11**

**ప్రతిపదార్థము:–**అథ=తరువాత, ప్రళయాంబుద=ప్రళయకాలమేఘముయొక్క ఉఱుమువలె, భీషణః=భయంకరమైనదియు, సముద్రమథన=క్షీరసాగర మథనమునందు, ఉద్భూత= ఉద్భవించిన, మందరావనిభృత్=మందరాచలముయొక్క ధ్వనిః=ధ్వనివంటి ధ్వనిగలదియు రుద్ర=ఈశ్వరునియొక్క, బాణాగ్ని=బాణాగ్నిచేత, సందీప్త=దగ్ధమై, భ్రశ్యత్=జారిపడుచున్న, త్రిపుర=త్రిపురములయొక్కవిభ్రమః=విలాసముగలదియు అగు,మహానాదః=గొప్పనాదము, జాతః=పుట్టినది.

**తాత్పర్యము:–** మాసచతుష్టయం తర్వాత ఒకనాడు శ్రీరామునకు ప్రలయ భయంకరమైన నాదము, వినబడెను. అది సముద్ర మథనం చేసే మందరాచలపు నాదంవలె, శివబాణాగ్నికి పెటిల్లుమని పేలిపోవుచున్న త్రిపుర ధ్వని వలె అనిపించింది.

**శ్లో॥ తమాకర్ణ్యాథ సంభ్రాన్తో యావత్పశ్యతి పుష్కరమ్॥ 12**

**శ్లో॥ తావదేవ మహాతేజో రామస్యాసీత్పురో ద్విజాః।**
**తేజసా తేన సమ్భ్రాన్తో నాపశ్యత్స దిశో దశ॥ 13**



**ప్రతిపదార్థము:–** ద్విజాః=ఓ మునులారా!, అథ=తర్వాత, తమ్=ఆ ధ్వనిని, ఆకర్ణ్య=విని, సంభ్రాంతః=కంగారుపడిన రాముడు, పుష్కరమ్=ఆకాశమును, యావత్పశ్యతి తావదేవ= చూచునంతలోనే, రామస్య=రామునియొక్క, పురః=ఎదుట, మహాతేజః=గొప్పకాంతి ఆసీత్= నిలిచెను. తేన=ఆ, తేజసా=తేజస్సుతో, సంభ్రాంతః=కంగారుపడినవాడై, సః=అతడు, దశ=పది, దిశః=దిక్కులను, నాపశ్యత్=గమనింపలేదు.

**తాత్పర్యము:–** ఆ ధ్వనిని విని రాముడు అమాంతంగా ఆకాశమువైపు చూచెను. అంతలోనే ఒక మహాతేజస్సు ఆయనముందర నిలిచెను. ఆ తేజస్సుకు దిమ్మెరపోయిన రాముడు పది దిక్కులను చూడలేకపోయెను.

**శ్లో॥ అన్ధీకృతేక్షణస్తూర్ణం మోహం యాతో నృపాత్మజః।**
**విచిన్త్య తర్కయామాస దైత్యమాయాం ద్విజేశ్వరాః॥ 14**

**ప్రతిపదార్థము:–** ద్విజేశ్వరాః=మునీంద్రులారా! నృపాత్మజః=ఆ రాజపుత్రుడు, అంధీకృత= గ్రుడ్డిగాచేయబడిన,ఈక్షణః=కన్నులు గలవాడై,తూర్ణమ్=శీఘ్రముగా, మోహమ్=మూర్ఛను, యాతః=పొందెను, విచింత్య=తర్వాత ఆలోచించి, దైత్యమాయామ్=రాక్షస మాయనుగా, తర్కయామాస=ఊహించెను.

**తాత్పర్యము:–** ఆ తేజస్సు దెబ్బకు కళ్ళు చీకట్లు కమ్మినవి. రాముడు దిమ్మెరపోయి తేరుకొని, ఇదంతయు 'రాక్షసమాయ' అని ఊహించెను.

**శ్లో॥ అథోత్థాయ మహావీరః సజ్యం కృత్వా స్వకం ధనుః।**
**అవిధ్యన్నిశితైర్బాణైర్దివ్యాస్త్రైరభిమన్త్రితైః॥ 15**

**ప్రతిపదార్థము:–** అథ=తర్వాత, మహావీరః=వీరుడైన రాముడు, ఉత్థాయ=లేచి స్వకమ్=తనదైన, ధనుః=ధనుస్సును, సజ్యమ్=అల్లెత్రాటితో గూడిన దానినిగా, కృత్వా=చేసి, నిశితైః=పదునైన, బాణైః=బాణములచేత, అభిమంత్రితైః=మంత్రింపబడిన, దివ్యాస్త్రైః =దివ్యమైన ఆ అస్త్రముల తోను, అవిధ్యత్=కొట్టెను.

**తాత్పర్యము:–**ఊహించిన వెంటనే ఆ మహావీరుడు తన ధనుస్సును నారి బిగించి సిద్ధం చేసి పదునైన బాణాలను ప్రయోగించెను. మంత్రించి ఆ తేజస్సుపై దివ్యాస్త్రములను ప్రయోగించెను.

**శ్లో॥ ఆగ్నేయం వారుణం సౌమ్యం మోహనం సౌరపావకమ్।**
**విష్ణుచక్రం మహాచక్రం కాలచక్రం చ వైష్ణవమ్॥ 16**

**ప్రతిపదార్థము:–** ఆగ్నేయమ్=ఆగ్నేయాస్త్రమును, వారుణమ్=వారుణాస్త్రమును, సౌమ్యమ్= సౌమ్యాస్త్రమును, మోహనమ్=మోహనాస్త్రమును, సౌర=సౌరాస్త్రమును, పావకమ్=పావకా

-స్త్రమును, విష్ణుచక్రమ్=విష్ణుచక్రాస్త్రమును, మహాచక్రమ్=మహాచక్రాస్త్రమును, కాలచక్రం చ=కాలచక్రాస్త్రమును, వైష్ణవమ్=వైష్ణవాస్త్రమును ప్రయోగించెను.

**తాత్పర్యము:-** ఇంకనూ ఆగ్నేయాస్త్రమును, వారుణాస్త్రమును, సౌమ్యాస్త్రమును, మోహనాస్త్రమును, సౌరాస్త్రమున, పావకాస్త్రమును, విష్ణుచక్రాస్త్రమును, మహాచక్రాస్త్రమును, కాలచక్రాస్త్రము లను, వైష్ణవాస్త్రమును ప్రయోగించెను.

**శ్లో॥ రౌద్రం పాశుపతం బ్రాహ్మం కౌబేరం కులిశానిలమ్।**
**భార్గవాదిబహూన్యస్త్రాణ్యయం ప్రాయుంక్త రాఘవః॥ 17**

**ప్రతిపదార్థము:-** రౌద్రమ్=రౌద్రాస్త్రమును, పాశుపతమ్=పాశుపతాస్త్రమును, బ్రాహ్మమ్=బ్రహ్మాస్త్రమును, కుబేరమ్=కుబేరాస్త్రమును, కులిశ=వజ్రమును, అనిలమ్=వాయువ్యాస్త్ర-మును, భార్గవాది=భార్గవం మొదలగు, బహూని=అనేకమైన, అస్త్రాణి=అస్త్రములను, అయమ్=ఈ, రాఘవః=రామచంద్రుడు, ప్రాయుంక్త=ప్రయోగించెను.

**తాత్పర్యము:-** తదుపరి రౌద్రాస్త్రమును, పాశుపతాస్త్రమును, బ్రహ్మాస్త్రమును, కుబేరాస్త్రమును, వజ్రమును, వాయువ్యాస్త్రమును, భార్గవం మొదలగు అనేకమైన అస్త్రములను ఈ రామచంద్రుడు ప్రయోగించెను.

**శ్లో॥ తస్మింస్తేజసి శస్త్రాణి చాస్త్రాణ్యస్య మహీపతేః।**
**విలీనాని మహాభ్రస్య కరకా ఇవ నీరధౌ॥ 18**

**ప్రతిపదార్థము:-** అస్య=ఈ, మహీపతేః=రాజుయొక్క, శస్త్రాణి=శస్త్రములు, అస్త్రాణి చ=అస్త్రములున్ను, తస్మిన్=ఆ, తేజసి=తేజస్సునందు, మహాభ్రస్య=గొప్పమేఘముయొక్క, కరకాః=పడగళ్ళు, నీరధావివ=సముద్రమునందువలె, విలీనాని=కరిగిపోయినవి.

**తాత్పర్యము:-** ఆ మహాతేజస్సులో రాముని శస్త్రాస్త్రాలు అన్ని సముద్రంలో పడగండ్లు పడినట్లు పడి లీనమైపోయినవి.

**శ్లో॥ తతః క్షణేన జజ్వాల ధనుస్తస్య కరాచ్చ్యుతమ్।**
**తూణీరం చాఙ్గుళిత్రాణం గోధికాపి మహీపతేః॥ 19**

**ప్రతిపదార్థము:-** తతః=తదుపరి, తస్య=ఆ రామునియొక్క, కరాత్=చేతినుండి, చ్యుతమ్=జారిన, ధనుః=ధనుస్సు, క్షణేన=క్షణకాలంలో జజ్వాల=మండెను, తూణీరం చ=అమ్ముల పొదియు, అంగుళిత్రాణమ్=వ్రేలికవచం, గోధికాపి=ఎడమచేతి కవచమున్ను, జజ్వాల=మండెను.



**తాత్పర్యము:-** అంతలోనే రామునిచేతినుండి ధనుస్సు జారిపడి మండిపోయినది. అమ్ములపొది, వ్రేలికవచం గోధిక గూడా మండిపోయినవి.

**శ్లో॥ తద్దృష్ట్వా లక్ష్మణో భీతః పపాత భువిమూర్ఛితః।**
**అథాకిఞ్చిత్కరో రామో జానుభ్యామవనిం గతః॥ 20**

**ప్రతిపదార్థము:-** తత్=ఆ స్థితిని, దృష్ట్వా=చూచి, లక్ష్మణః=లక్ష్మణుడు, భీతః= భయపడిన వాడై, మూర్ఛితః=మూర్ఛపోయి, భువి=భూమియందు, పపాత=పడెను. అథ=తరువాత, అకించిత్కరః=ఏమిచేయలేని, రామః=రాముడు, జానుభ్యామ్=మోకాళ్లతో, అవనిమ్=భూమిని, గతః=పొందెను.

**తాత్పర్యము:-** ఆ పరిస్థితిని చూచి లక్ష్మణుడు భయంతో మూర్ఛపోయెను. రాముడు ఏమీ చేయలేనివాడై, మోకాళ్ళమీద దిగబడెను.

**శ్లో॥ మీలితాక్షో భయావిష్టః శఙ్కరం శరణం గతః।**
**స్వరేణాప్యుచ్చరన్నుచ్చైః శంభోర్నామసహస్రకమ్॥ 21**

**ప్రతిపదార్థము:-**మీలితాక్షః=కనులుమూసికొన్నవాడై, ఉచ్చైః=పెద్దగా, శంభోః=శివునియొక్క నామసహస్రకమ్=సహస్రనామములను, ఉచ్చైః=బిగ్గర అయిన, స్వరేణాపి=స్వరంతో, ఉచ్చరన్=ఉచ్చరించుచు, భయావిష్టః=భయంకలవాడై, శంకరమ్=శంకరుని, శరణమ్=శరణుగా, గతః=పొందెను.

**తాత్పర్యము:-** రాముడు భయంతో కనులు మూసికొని, ఉచ్చస్వరముతో శివుని నామ సహస్రమును ఉచ్చరించుచు శంకరునే శరణువేడెను.

**శ్లో॥ శివం చ దణ్డవద్భూమౌ ప్రణనామ పునః పునః।**
**పునశ్చ పూర్వవచ్చాసీచ్ఛబ్దో దిఙ్మణ్డలం గ్రసన్॥ 22**

**ప్రతిపదార్థము:-** దండవత్=కర్రవలె, భూమౌ=భూమియందుపడి, శివమ్=శివుని, పునః పునః=మాటిమాటికి, ప్రణనామ చ=నమస్కరించెను, పునశ్చ=మరల, పూర్వవచ్చ=వెనుకటి వలెనే, దిఙ్మండలమ్=దిక్కులను, గ్రసన్=మ్రింగుచున్న, శబ్దః=ధ్వని, ఆసీత్=అయ్యెను.

**తాత్పర్యము:-**రాముడు శివుని శరణువేడి సాష్టాంగదండ ప్రణామపరంపర కొనసాగించెను. అంతలోనే ఆ శబ్దము మఱల దిక్కులు పిక్కటిల్లునట్లు వినబడెను.

**శ్లో॥ చచాల వసుధా ఘోరం పర్వతాశ్చ చకమ్పిరే।**
**తతః క్షణేన శీతాంశుశీతలం తేజ ఆపతత్॥ 23**

**ప్రతిపదార్థము:–** వసుధా=భూమి, ఘోరమ్=ఘోరముగా, చచాల=కదలెను, పర్వతాశ్చ= పర్వతములున్ను, చకంపిరే=కంపించినవి, తతః=తర్వాత, క్షణేన=క్షణంలో, శీతాంశు, చంద్రునివలె, శీతలం, చల్లని, తేజః=తేజస్సు, ఆపతత్=వచ్చిపడెను.

**తాత్పర్యము:–** భూమి ఘోరంగా కంపించింది. పర్వతాలు గడగడలాడినవి. ఆ క్షణంలో చంద్రశీతలమైన ఒక తేజస్సు ఆవిర్భవించింది.

**శ్లో॥ ఉన్మీలితాక్షో రామస్తు యావదేతత్ప్రపశ్యతి।**
**తావద్దదర్శ వృషభం సర్వాలఙ్కారసంయుతమ్॥ 24**

**ప్రతిపదార్థము:–** రామస్తు=రాముడు, ఉన్మీలిత=తెఱువబడిన, అక్షః=కన్నులు కలవాడై, ఏతత్=ఈ కాంతిని, యావత్ప్రపశ్యతి తావత్=చూచునంతలో, సర్వాలంకార=అన్ని సొమ్ములతో, సంయుతమ్=కూడిన, వృషభమ్=నందిని, దదర్శ=చూచెను.

**తాత్పర్యము:–** చంద్రశీతలమైన ఆ తేజస్సును రాముడు గమనించునంతలో సర్వాలంకార భూషితుడైన "నందికేశ్వరుడు" కనబడెను.

**శ్లో॥ పీయూషమథనోద్భూతనవనీతస్య పిణ్డవత్।**
**ప్రోతస్వర్ణం మరకతచ్ఛాయశృఙ్గద్వయాఞ్చితమ్॥ 25**

**ప్రతిపదార్థము:–** పీయూష=అమృతం కొఱకు జరిగిన, మథన=చిలుకుటచే, ఉద్భూత, పుట్టిన, నవనీతస్య=వెన్నయొక్క, పిండవత్=ముద్దవలె తెల్లనిదియు, ప్రోత=కూర్చబడిన, స్వర్ణమ్=బంగారం కలదియు, మరకతచ్ఛాయ=మరకతమణుల ఛాయవంటి ఛాయగల, శృంగద్వయ=జంటకొమ్ములతో, అంచితమ్=కూడినదియు –

**తాత్పర్యము:–** ఆ నంది సముద్ర మథనంలో పుట్టిన వెన్నముద్దవలె తెల్లగా ఉన్నది. బంగారముతో అలంకరింపబడినది. మరకతమణులవంటి ఛాయగల జంట కొమ్ములు గలది.

**శ్లో॥ నీలరత్నేక్షణం హ్రస్వకణ్ఠం కమ్బలభూషితమ్।**
**రత్నపల్యాణసంయుక్తం నిబద్ధం శ్వేతచామరైః॥ 26**

**ప్రతిపదార్థము:–** నీలరత్న=నీలాలవంటి, ఈక్షణమ్=కన్నులు కలదియు, హ్రస్వ=పొట్టిదైన, కంఠమ్=కంఠంకలదియు, కంబల=కంబలితో, భూషితమ్=అలంకరింపబడినదియు, రత్న=రత్నము లతో కూడిన, పల్యాణ=కళ్ళెముచే, సంయుక్తమ్=కూడినదియు, శ్వేత= తెల్లని, చామరైః=చామరములతో, నిబద్ధమ్=కట్టబడినదియు –



**తాత్పర్యము:–** నీలాలవంటి కన్నులు, మెడవద్ద చిన్న కంబళిహారము, రత్నాలు పొదిగిన కళ్ళెము, చామరములుగల నందిని చూచెను.

**శ్లో॥ ఘణ్టికా ఘర్ఘరీశబ్దైః పూరయన్తం దిశో దశ।**
**తత్రాసీనం మహాదేవం శుద్ధస్ఫటికవిగ్రహమ్॥ 27**

**ప్రతిపదార్థము:–** ఘంటికా=చిరుగంటలయొక్క, ఘర్ఘరీశబ్దైః=గరగరశబ్దములతో, దశ=పది, దిశః=దిక్కులను, పూరయంతమ్=నింపుచున్న నందిని చూచెను. తత్ర=ఆ నందిపై, ఆసీనమ్=కూర్చొనియున్నవాడును, శుద్ధ=నిర్మలమైన, స్ఫటిక=స్ఫటికమువంటి, విగ్రహమ్= శరీరముగల వాడును, మహాదేవమ్=మహాదేవుని చూచెను.

**తాత్పర్యము:–** మెడలో మువ్వల సవ్వడితో పది దిక్కులను నింపుచున్న నందిని రాముడు గమనించెను. ఆ నందిపై ఆసీనుడైయున్న నిర్మలస్ఫటిక శరీరుడైన పరమేశ్వరుని రాముడు చూచెను.

**శ్లో॥ కోటిసూర్యప్రతీకాశం కోటిశీతాంశుశీతలమ్।**
**వ్యాఘ్రచర్మామ్బరధరం నాగయజ్ఞోపవీతినమ్॥ 28**

**ప్రతిపదార్థము:–** కోటి=కోటిమంది, సూర్య=సూర్యులతో, ప్రతీకాశమ్=సమానమైన వాడును, కోటి=కోటిమంది, శీతాంశు=చంద్రులవలె, శీతలమ్=చల్లనివాడును, వ్యాఘ్రచర్మ =పులిచర్మము అనే, అంబర=వస్త్రమును, ధరమ్=ధరించినవాడును, నాగ=పాములే, యజ్ఞోపవీతినమ్=జందెముగా గలవాడును.

**తాత్పర్యము:–** కోటి సూర్యులతో సమానమైన కాంతి, కోటి చంద్రులతో సమానమైన చల్లదనముగల వాడును, వ్యాఘ్రచర్మధారియు, నాగయజ్ఞోపవీతధరుడును అయిన పరమేశ్వరుని చూచెను.

**శ్లో॥ సర్వాలఙ్కారసంయుక్తం విద్యుత్పిఙ్గజటాధరమ్।**
**నీలకణ్ఠం వ్యాఘ్రచర్మోత్తరీయం చన్ద్రశేఖరమ్॥ 29**

**ప్రతిపదార్థము:–** సర్వ=సమస్తమైన, అలంకార=అలకారములతో, సంయుక్తమ్=కూడిన వాడును, విద్యుత్=మెఱుపుతీగలవంటి, పింగ=పింగళవర్ణముగల, జటా=జడలను, ధరమ్= ధరించినవాడును, నీలకంఠమ్=నీలమైన కంఠముగలవాడును, వ్యాఘ్రచర్మ=పులిచర్మము, ఉత్తరీయమ్=ఉత్తరీయముగా గలవాడును, చంద్రశేఖరమ్=చంద్రమౌళియును అగు శివుని చూచెను.

**తాత్పర్యము:–**సర్వాలంకార శోభితుడు, పింగళజటాధరుడు, నీలకంఠుడు, వ్యాఘ్రచర్మాంబర ధరుడు అయిన చంద్రశేఖరుని చూచెను.

శ్లో॥ నానావిధాయుధోద్భాసిదశబాహుం త్రిలోచనమ్।
యువానం పురుషశ్రేష్ఠం సచ్చిదానన్దవిగ్రహమ్॥ 30

**ప్రతిపదార్థము:–** నానావిధ=అనేక విధములైన, ఆయుధ=ఆయుధములచేత, ఉద్భాసి=ప్రకాశించునట్టి, దశ=పది, బాహుమ్=చేతులుగలవాడును, త్రిలోచనమ్=మూడు కన్నులు గలవాడును, యువానమ్=యువకుడును, పురుషశ్రేష్ఠమ్=పురుషోత్తముడును, సచ్చిదానంద విగ్రహమ్=సచ్చిదానంద స్వరూపుడును అగు శివుని చూచెను.

**తాత్పర్యము:–** నానావిధములైన ఆయుధాలుగల పది బాహువులుగలవాడు, మూడు కన్నులు గలవాడు, యువకుడు, పురుషోత్తముడు, సచ్చిదానందరూపుడు అయిన శివుని చూచెను.

శ్లో॥ తత్రైవ చ సుఖాసీనాం పూర్ణచన్ద్రనిభాననామ్।
నీలేన్దీవరదామాభాముద్యన్మరకతప్రభామ్॥ 31

**ప్రతిపదార్థము:–** తత్రైవ చ=ఆ నందియందే, సుఖాసీనామ్=సుఖముగా కూర్చొనినదియు, పూర్ణచంద్ర=పూర్ణచంద్రునితో, నిభ=సమానమైన, ఆననామ్=ముఖము కలదియు, నీల=నల్లని, ఇందీవర=కలువలయొక్క, దామాభామ్=మాలికవంటి కాంతిగలదియు, ఉద్యత్=పైకి విరజిమ్ముచున్న, మరకత=మరకతమణియొక్క, ప్రభామ్=కాంతివంటి కాంతిగలదియు అగు పార్వతిని చూచెను.

**తాత్పర్యము:–** ఆ నంది మీదనే సుఖంగా ఈశ్వరునిచెంత కూర్చొనియున్న పార్వతిని చూచెను. ఆమె ముఖము పూర్ణచంద్రునివలె ఉన్నది. ఆమె శరీరము నల్లని కలువలవలె, మరకతమణులవలె, ఆకుపచ్చని ఛాయగా అలరారుచున్నది.

శ్లో॥ ముక్తాభరణసంయుక్తాం రాత్రిం తారాఞ్చితామివ।
విన్ధ్యక్షితిధరోత్తుఙ్గకుచభారభరాలసామ్॥ 32

**ప్రతిపదార్థము:–** ముక్తాభరణ=ముత్యాల ఆభరణములతో, సంయుక్తామ్=కూడినది, కనుకనే, తారాంచితామ్=నక్షత్రములుగల, రాత్రిమివ=రాత్రివలె నున్నదియు, వింధ్య=వింధ్యమను, క్షితిధర=పర్వతమువలె, ఉత్తుంగ=ఎత్తైన, కుచభార=భారమైన స్తనములయొక్క భర=బరువుచే, అలసామ్=నెమ్మదిగానున్నదియు అగు, పార్వతిని చూచెను.

**తాత్పర్యము:–** ముత్యాల హారాలతో నక్షత్రాలుదయించిన రాత్రివలె మనోహరముగా నున్నదియు, వింధ్యపర్వతమువలె ఎత్తైన స్తనభారముగలదియు అగు పార్వతిని చూచెను.



శ్లో॥ సదసత్సంశయావిష్టమధ్యదేశాన్తరాం వరామ్।
దివ్యాభరణసంయుక్తాం దివ్యగన్ధానులేపనామ్॥ 33

**ప్రతిపదార్థము:–** సత్=ఉన్నదా, అసత్=లేదా, అను సంశయ=సందేహముతో, ఆవిష్ట=కూడిన, మధ్యదేశాంతరామ్=నడుము (మధ్యభాగము కలదియు), వరామ్=శ్రేష్ఠమైనదియు, దివ్యాభరణ=దివ్యమైన సొమ్ములతో, సంయుక్తామ్=కూడినదియు, దివ్య=దివ్యమైన, గంధ=గంధము, అనులేపనామ్=పూతగాగలదియు –

**తాత్పర్యము:–** ఉన్నదా? లేదా? అని సందేహము పుట్టునంత సన్నని నడుము, దివ్యాభరణము, దివ్యచందనలేపనముగల ఆ స్త్రీరత్నమును చూచెను.

శ్లో॥ దివ్యమాల్యామ్బరధరాం నీలేన్దీవరలోచనామ్।
అలకోద్భాసివదనాం తామ్బూలగ్రాసశోభితామ్ 34

**ప్రతిపదార్థము:–** దివ్య=దివ్యమైన, మాల్యాంబర=మాలికలు, వస్త్రములను, ధరామ్=ధరించినదియు, నీల=నల్లని, ఇందీవర=కలువలవంటి, లోచనామ్=కన్నులగలదియు, అలకోద్భాసి=ముంగురులతో అందమైన, వదనామ్=ముఖము గలదియు, తాంబూలగ్రాస=తాంబూలము నమలుటచే, శోభితామ్=అందమైనదియు అగు పార్వతిని చూచెను.

**తాత్పర్యము:–** దివ్యగంధ పుష్ప వస్త్రములను ధరించినదియు, నల్ల కలువలవంటి కన్నులు గలదియు, తాంబూల శోభితయు అగు ఆ పార్వతిని శ్రీ రామచంద్రుడు చూచెను.

శ్లో॥ శివాలిఙ్గనసంజాతపులకోద్భాసివిగ్రహామ్।
సచ్చిదానన్దరూపాఢ్యాం జగన్మాతరమమ్బికామ్
సౌన్దర్యసారసన్దోహాం దదర్శ రఘునన్దనః॥ 35

**ప్రతిపదార్థము:–** శివ=శివునియొక్క, ఆలింగన=కౌగిలింతవలన, సంజాత=కలిగిన, పులక=పులకరింతచేత, ఉద్భాసి=ప్రకాశించు, విగ్రహామ్=శరీరము కలదియు, సచ్చిదానంద=సచ్చిదానందమయమైన, రూప=రూపములతో, ఆఢ్యామ్=కూడినదియు, సౌందర్యసార=సౌందర్యసారములయొక్క, సందోహామ్=సమూహరూపమైనదియు, జగన్మాతరమ్=జగన్మాత అయిన, అంబికామ్=అంబికను, రఘునందనః=రాముడు, దదర్శ=చూచెను.

**తాత్పర్యము:–** శివాలింగనమువలన పులకరించిన శరీరముగలదియు, సచ్చిదానందరూపమైనదియు, సర్వసౌందర్యసారలహరి అయిన జగన్మాత అంబికను రాఘవుడు దర్శించెను.

శ్లో॥ స్వస్వవాహనసమ్బద్ధాన్ నానాయుధలసత్కరాన్।
బృహద్రథంతరాదీని సామాని పరిగాయతః॥ 36

**ప్రతిపదార్థము:–** స్వస్వ=తమతమ, వాహన=వాహనములతో, సంబద్ధాన్=కూడియున్న వారును, నానాయుధ=నానాయుధములు, లసత్కరాన్=ధరించినవారును, బృహ–ద్రథంతరాదీని=బృహత్, రథంతరము మొదలగు, సామాని=సామవేదసూక్తులను, పరిగాయతః=గానము చేయుచున్నవారును –

**తాత్పర్యము:–** తమ తమ వాహనములతో గూడిన వారును, నానాయుధములు ధరించిన వారును, బృహద్రథంతరాది సామసూక్తములను గానము చేయువారును –

**శ్లో॥ స్వస్వకాన్తాసమాయుక్తాన్ దిక్పాలాన్పరితః స్థితాన్।**
**అగ్రగం గరుడారూఢం శఙ్ఖచక్రగదాధరమ్॥ 37**

**ప్రతిపదార్థము:–** స్వస్వ=తమతమ, కాంతా=భార్యలతో, సమాయుక్తాన్=కలిసినవారును అయి, పరితః=శివునిచుట్టూ, స్థితాన్=ఉన్న, దిక్పాలాన్=దిక్పాలకులను చూచెను. అగ్రగమ్=ముందుగాఉన్నవాడును, గరుడ=గరుడునిపై, ఆరూఢమ్=ఎక్కినవాడును, శంఖ=శంఖమును, చక్ర=చక్రమును, గదా=గదలను, ధరమ్=ధరించినవాడును –

**తాత్పర్యము:–** తమ తమ భార్యలతో కలిసి శివుని చుట్టు కొలువుతీరిన దిక్పాలకులను చూచెను. వారికి ముందుగా శంఖచక్రగదాధరుడై గరుడారూఢుడై విష్ణువుండెను.

**శ్లో॥ కాలామ్బుదప్రతీకాశం విద్యుత్కాన్త్యాశ్రియాయుతమ్।**
**జపన్తమేకమనసా రుద్రాధ్యాయం జనార్దనమ్॥ 38**

**ప్రతిపదార్థము:–** కాలాంబుద=నీలిమేఘములతో, ప్రతీకాశమ్=సమానమైన వాడును, విద్యుత్కాంత్యా=మెఱుపు కాంతితో సమానమైన కాంతిగల, శ్రియా=లక్ష్మితో, యుతమ్=కూడిన వాడును, ఏకమనసా=ఏకాగ్రమైనమనస్సుతో, రుద్రాధ్యాయమ్=రుద్రాధ్యాయమును, జపంతమ్=జపించుచున్న, జనార్దనమ్=విష్ణువును చూచెను.

**తాత్పర్యము:–** నీలిమేఘమువంటి వాడును, మెఱుపుతీగవంటి లక్ష్మితో కూడినవాడును, ఏకాగ్రమనస్సుతో రుద్రాధ్యాయమును జపించుచున్నవాడును అగు విష్ణువును రాముడు చూచెను.

**శ్లో॥ పశ్చాచ్చతుర్ముఖం దేవం బ్రహ్మాణం హంసవాహనమ్।**
**చతుర్వక్త్రైశ్చతుర్వేదరుద్రసూక్తైర్మహేశ్వరమ్।**
**స్తువన్తం భారతీయుక్తం దీర్ఘకూర్చజటాధరమ్॥ 39**

**ప్రతిపదార్థము:–** పశ్చాత్=వెనుకగా, చతుర్ముఖమ్=నాలుగు ముఖములుగలవాడును, హంసవాహనమ్=హంస వాహనముగా గలవాడును, చతుర్వక్త్రైః=నాలుగు ముఖములతో,



చతుర్వేద=నాలుగు వేదములందలి, రుద్రసూక్తైః=రుద్రసూక్తములతో, మహేశ్వరమ్=శివుని, స్తువంతమ్=స్తుతించువాడును, భారతీయుక్తమ్=సరస్వతితో కూడిన వాడును, దీర్ఘ కూర్చ జటాధరమ్=పెద్ద గడ్డముగలవాడును, జడలు ధరించినవాడును అగు, బ్రహ్మాణమ్=బ్రహ్మను, చూచెను.

**తాత్పర్యము:–** విష్ణువుకు వెనుక హంసవాహనుడు, చతుర్ముఖములతో చతుర్వేద రుద్రసూక్తములతో ఈశ్వరుని స్తుతించినవాడును, సరస్వతీ సమేతుడును అయిన బ్రహ్మను చూచెను.

**శ్లో॥ అథర్వశిరసా దేవం స్తువన్తం మునిమణ్డలమ్।**
**గఙ్గాదితటినీయుక్తమమ్బుధిం నీలవిగ్రహమ్।**
**శ్వేతాశ్వతరమన్త్రేణ స్తువన్తం గిరిజాపతిమ్॥ 40**

**ప్రతిపదార్థము:–** అథర్వశిరసా=అథర్వశిర ఉపనిషత్తుతో, దేవమ్=ఈశ్వరుని, స్తువంతమ్=స్తుతించుచున్న, మునిమండలమ్=ముని సమూహమును, గంగాది=గంగ మొదలగు, తటినీ=నదులతో, యుక్తమ్=కూడినవాడును, నీల=చల్లని, విగ్రహమ్=శరీరముగల వాడును, శ్వేతాశ్వతరమంత్రేణ=శ్వేతాశ్వతరోపనిషత్తుతో, గిరిజాపతిమ్=పరమేశ్వరుని, స్తువంతమ్= స్తుతించుచున్న, అంబుధిమ్=సముద్రుని చూచెను.

**తాత్పర్యము:–** అథర్వశిరోపనిషత్తుతో ఈశ్వరుని స్తుతించుచున్న మునిగణమును స్తుతించెను. గంగాదినదులతో కలిసి, శ్వేతాశ్వతరమంత్రముతో భగవంతుని స్తుతించుచున్న నీలవర్ణుడైన సముద్రుని చూచెను.

**శ్లో॥ అనన్తాదిమహానాగాన్ కైలాసగిరిసన్నిభాన్।**
**కైవల్యోపనిషత్పాఠాన్ మణిరత్నవిభూషితాన్॥ 41**

**ప్రతిపదార్థము:–** మణిరత్న=మణులతో, రత్నములతో, విభూషితాన్=అలంకరింపబడిన వారును, కైవల్యోపనిషత్=కైవల్యోపనిషత్తును, పాఠాన్=చదువుచున్నవారును, కైలాసగిరి సన్నిభాన్=కైలాసపర్వతంతో సమానులైనవారును అగు, అనంతాది=అనంతుడు మొదలగు, మహానాగాన్=మహానాగులను చూచెను.

**తాత్పర్యము:–** మణిరత్నభూషణాలంకృతులై కైవల్యోపనిషత్తును చదువుచున్న కైలాసపర్వత సమానులైన అనంతాది మహానాగులను గమనించెను.

**శ్లో॥ సువర్ణవేత్రహస్తాఢ్యం నన్దినం పురతః స్థితమ్।**
**దక్షిణే మూషకారూఢం గణేశం పర్వతోపమమ్॥ 42**

**ప్రతిపదార్థము:–** సువర్ణ=బంగారు, వేత్ర=బెత్తము గల, హస్తాఢ్యమ్=చేయిగలవాడై, పురతః =ఎదురుగా, స్థితమ్=ఉన్న, నందినమ్=నందిని, దక్షిణే=దక్షిణమువైపు / కుడివైపు, మూషకారూఢమ్=ఎలుకనెక్కిన, పర్వతోపమమ్=కొండంతటి, గణేశమ్=గణపతిని చూచెను.

**తాత్పర్యము:–** బంగారు బెత్తము చేపట్టిన నందిని దక్షిణపార్శ్వమున మూషకారూఢుడైన కొండంత గణపతిని గమనించెను.

**శ్లో॥ మయూరవాహనారూఢముత్తరే షణ్ముఖం తథా।**
**మహాకాలం చ చణ్డీశం పార్శ్వయోర్భీషణాకృతిమ్॥ 43**

**ప్రతిపదార్థము:–** ఉత్తరే=ఉత్తర పార్శ్వమున, మయూరవాహన=నెమలి వాహనమును, ఆరూఢమ్=ఎక్కిన, షణ్ముఖమ్=కుమారస్వామిని, తథా=అట్లే, పార్శ్వయోః=ప్రక్కలలో, మహాకాలం చ=మహాకాలుని, చండీశమ్=చండీశుని గమనించెను.

**తాత్పర్యము:–** నెమలి వాహనమెక్కి ఉత్తరభాగమున కుమారస్వామి ఉండెను. రెండు పార్శ్వములందు భయంకరులైన మహాకాల చండీశ్వరులుండిరి.

**శ్లో॥ కాలాగ్నిరుద్రం దూరస్థం జ్వలద్దావాగ్నిసన్నిభమ్।**
**త్రిపాదం కుటిలాకారం నటద్భృఙ్గిరిటిం పురః।**
**నానావికారవదనాన్ కోటిశః ప్రమథాధిపాన్॥ 44**

**ప్రతిపదార్థము:–** జ్వలత్=మండుచున్న, దావాగ్ని=దావాగ్నితో, సన్నిభమ్=సమానమైన వాడును, దూరస్థమ్=దూరమునందున్నవాడును అగు, కాలాగ్ని రుద్రమ్=కాలాగ్నిరుద్రుని, త్రిపాదమ్=మూడు పాదాలుగలవాడును,కుటిలాకారమ్=వక్రస్వరూపము గలవాడును అగు, నటత్=నటించునట్టి, భృంగిరిటింపునః=భృంగిరిటిని, నానావికార=నానా వికారములు గల, వదనాన్=ముఖములుగల, ప్రమథాధిపాన్=ప్రమథ ప్రభువులను, కోటిశః=కోట్ల కొలదిగా చూచెను.

**తాత్పర్యము:–** మండుచున్నదావాగ్నివంటి కాలాగ్ని రుద్రుడు దూరముగా కనబడెను. మూడు పాదములు వంకర దేహములతో నాట్యము చేయుచున్న భృంగిరిటిని చూచెను. అంతేగాక, నానా వికార ముఖములుగల ప్రమథగణములు కోట్లకొలది కనబడిరి.

**శ్లో॥ నానావాహనసంయుక్తం పరితో మాతృమణ్డలమ్।**
**పఞ్చాక్షరీజపాసక్తాన్ సిద్ధవిద్యాధరాదికాన్॥ 45**

**ప్రతిపదార్థము:–** నానా=అనేకములైన, వాహన=వాహనములతో, సంయుక్తమ్=కలసిన దైన, మాతృమండలమ్=మాతృ సమూహమును, పరితః=చుట్టూ చూచెను. పంచాక్షరీ=



పంచాక్షరీ మంత్రముయొక్క, జప=జపమునందు, ఆసక్తాన్=ఆసక్తిగల, సిద్ధ=సిద్ధులు, విద్యాధర=విద్యాధరులు, ఆదికాన్=మొదలగువారిని –

**తాత్పర్యము:–** అనేకవాహనారూఢమైన మాతృమండలము చుట్టూ కనబడినది. పంచాక్షరీ జపము చేయుచున్న సిద్ధులు, విద్యాధరులు మొదలైన వారు కనబడిరి.

**శ్లో॥ దివ్యరుద్రకగీతాని గాయత్కిన్నరబృన్దకమ్।**
**తత్ర త్రైయమ్బకం మన్త్రం జపద్ద్విజకదమ్బకమ్॥ 46**

**ప్రతిపదార్థము:–** దివ్య=దివ్యమైన, రుద్రక=రుద్రుడుగల, గీతాని=పాటలను, గాయత్=గానముచేయుచున్న, కిన్నరబృందకమ్ = కిన్నరసమూహమును, తత్ర = అందులో, త్రైయంబకమ్=త్రియంబక సంబంధమైన, మంత్రమ్=మంత్రమును, జపత్=జపించుచున్న, ద్విజకదంబకమ్=బ్రాహ్మణసమూహమును చూచెను.

**తాత్పర్యము:–** దివ్యమైన రుద్రకీర్తనలను గానముచేయుచున్న కిన్నర సమూహమును, త్రియంబకమంత్రము జపించుచున్న బ్రాహ్మణసమూహమును–

**శ్లో॥ గాయన్తం వీణయా గీతం నృత్యన్తం నారదం దివి।**
**నృత్యతో నాట్యనృత్యేన రంభాదీనప్సరో గణాన్॥ 47**

**ప్రతిపదార్థము:–** వీణయా=వీణతో, గీతమ్=పాటను, గాయంతమ్=పాడుచు, దివి= ఆకాశమున,నృత్యంతమ్=నృత్యము చేయుచున్న,నారదమ్=నారదుని, నాట్యనృత్యేన=నాట్య నృత్యములతో, నృత్యతః=నృత్యము చేయుచున్న, రంభాదీన్=రంభ మొదలగు, అప్సరోగణాన్ =అప్సరలను –

**తాత్పర్యము:–** వీణతో గానము చేస్తూ నృత్యము చేయుచున్న నారదుని చూచెను. నాట్య నృత్యము చేయుచున్న రంభాది అప్సరసలను గూడా చూచెను.

**శ్లో॥ గాయచ్చిత్రరథాదీనాం గన్ధర్వాణాం కదమ్బకమ్।**
**కమ్బలాశ్వతరౌ శమ్భుకర్ణకుణ్డలతాం గతౌ॥ 48**

**ప్రతిపదార్థము:–** గాయత్=పాడుచున్న, చిత్రరథాదీనామ్=చిత్రరథుడు మొదలగు, గంధర్వాణామ్=గంధర్వులయొక్క, కదంబకమ్=సమూహమును, శంభోః=శివునియొక్క, కర్ణ=చెవికి, కుండలతామ్=కుండలములగుటను, గతౌ=పొందిన, కంబలాశ్వతరౌ= కంబలుడు, అశ్వతరుడు అను నాగులను చూచెను.

**తాత్పర్యము:–** పాటలు పాడుచున్న చిత్రరథుడు మొదలగు గంధర్వులసమూహమును గమనించెను. శివునకు కర్ణకుండలాలుగా ఏర్పడిన కంబలాశ్వతరులను గమనించెను.

శ్లో॥ గాయన్తౌ పన్నగౌ గీతం కపాలం కమ్బలం తథా।
ఏవం దేవసభాం దృష్ట్వా కృతార్థో రఘునన్దనః॥ **49**

**ప్రతిపదార్థము:–** గీతమ్=పాటను, గాయంతౌ=పాడుచున్న, పన్నగౌ=పాములయిన, కపాలమ్=కపాలుని, తథా=అట్లే, కంబలమ్=కంబలుని చూచెను. ఏవమ్=ఈవిధముగా, దేవసభామ్=దేవసభను, దృష్ట్వా=చూచి, రఘునందనః=రాముడు, కృతార్థః=ధన్యుడయ్యెను.

**తాత్పర్యము:–** కపాలము, కంబలము అనే నాగులు గానము చేయటం కనబడింది. ఇలా నిండు దేవసభను చూచి రాముడు ధన్యుడయ్యెను.

శ్లో॥ హర్షగద్గదయా వాచా స్తువన్ దేవం మహేశ్వరమ్।
దివ్యనామసహస్రేణ ప్రణనామ పునః పునః॥ **50**

**ప్రతిపదార్థము:–** హర్ష=సంతోషముచే, గద్గదయా=గద్గదస్వరమువచ్చిన, వాచా=మాటతో, దివ్యనామసహస్రేణ=దివ్యమైన సహస్రనామములతో, దేవమ్=దేవుడైన, మహేశ్వరమ్=ఈశ్వరుని, స్తువన్=స్తుతించుచు, పునః పునః=మాటి మాటికి, ప్రణనామ=నమస్కరించెను.

**తాత్పర్యము:–** సంతోషంతో డగ్గుత్తిక స్వరముతో రామచంద్రుడు శివసహస్రనామములతో మహేశ్వరుని స్తుతించి మాటిమాటికి ప్రణమిల్లెను.

**ఇతి శ్రీ పద్మపురాణే ఉపరిభాగే శివగీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీ శివరాఘవసంవాదే శివప్రాదుర్భావాఖ్యః చతుర్థోఽధ్యాయః॥**

* * * * *



## అథ పఞ్చమోఽధ్యాయః
# రామవరప్రదానయోగః

**సూత ఉవాచ**

శ్లో॥ అథ ప్రాదురభూత్తత్ర హిరణ్మయరథో మహాన్।
అనేకదివ్యరత్నాంశుకిర్మీరితదిగన్తరః॥ **1**

**ప్రతిపదార్థము:–** అథ=తరువాత, తత్ర=అచ్చట, అనేక=అనేకములైన, దివ్య=దివ్యమైన, రత్న=రత్నములయొక్క, అంశు=కిరణములచే, కిర్మీరిత=రంగులుగా చేయబడిన, దిగంతరః=దిక్కులమధ్యభాగముగల, మహాన్=పెద్ద, హిరణ్మయరథః=బంగారు రథమ్, ప్రాదురభూత్=ఆవిర్భవించెను.

**తాత్పర్యము:–** అంతట అచ్చట ఒక బ్రహ్మాండమైన బంగారురథం ఆవిర్భవించెను. అది అనేక రత్నకిరణములతో దిగంతరమంతా రంగులీనెను.

శ్లో॥ నద్యుపాన్తికపఙ్కాఢ్యమహాచక్రచతుష్టయః।
ముక్తాతోరణసంయుక్తః శ్వేతచ్ఛత్రశతావృతః॥ **2**

**ప్రతిపదార్థము:–** నదీ=నదియొక్క, ఉపాంతక=తీరమునకు దగ్గర ఉన్న, పంక=బురదతో, ఆఢ్య=కూడిన, మహా=పెద్ద, చక్రచతుష్టయః=నాలుగు చక్రములు గలదియు, ముక్తాతోరణ=ముత్యాలతోరణాలతో, సంయుక్తః=కూడినదియు, శ్వేతచ్ఛత్రశత=వందల తెల్లగొడుగులతో, ఆవృతః=ఆవరింపబడినదియు (రథము).

**తాత్పర్యము:–** మహానది పంకము అంటిన నాలుగు పెద్ద చక్రములు గలది ఆ రథము. దానికి ముత్యాల తోరణాలు వ్రేలాడుచున్నవి. తెల్ల గొడుగులు వందల సంఖ్యలో ఉన్నవి.

శ్లో॥ శుద్ధహేమఖలీనాఢ్యతురఙ్గగణసంయుతః।
ముక్తావితానవిలసదూర్ధ్వదివ్యవృషధ్వజః॥ **3**

**ప్రతిపదార్థము:–** శుద్ధ=స్వచ్ఛమైన, హేమఖలీన=బంగారుపగ్గములతో, ఆఢ్య=కూడిన, తురంగగణ=గుర్రముల గుంపుచే, సంయుతః=కూడినదియు, ముక్తావితాన=ముత్యాల చాందినిచే, విలసత్=ప్రకాశించుచున్న, ఊర్ధ్వ=ఎత్తయిన, దివ్య=దివ్యమైన, వృషధ్వజః=ఎద్దుజెండాగలదియు (అగు రథము).

**తాత్పర్యము:–** స్వచ్ఛమైన పగ్గములుగల గుర్రములు గల ఆ రథముపై ముత్యాల చాందినీతో గూడిన గొప్ప వృషభపతాకము ఉండెను.

**శ్లో॥ మత్తవారణికాయుక్తపట్టతల్పోపశోభితః।**
**పారిజాతతరూద్భూతపుష్పమాలాభిరఞ్చితః॥ 4**

**ప్రతిపదార్థము:–**మత్త=మదించిన,వారణికా=ఏనుగు బొమ్మలతో, యుక్త=కూడిన, పట్టతల్ప =పట్టుశయ్యతో, ఉపశోభితః=శోభించినదియు, పారిజాత=పారిజాతమను, తరు=చెట్టు నుండి, ఉద్భూత=ఉద్భవించిన, పుష్పమాలాభిః=పూలదండలచేత, అంచితః=అలంకరింప బడినదియు (అగు రథము).

**తాత్పర్యము:–** మత్తగజపు బొమ్మలతో అలంకరించిన పట్టుశయ్య పారిజాత పుష్పమాలలతో అలంకరణలు గలది/రథము.

**శ్లో॥ మృగనాభిసముద్భూతకస్తూరీమదపఙ్కిలః।**
**కర్పూరాగరుధూపోత్థగన్ధాకృష్టమధువ్రతః॥ 5**

**ప్రతిపదార్థము:–** మృగ=కస్తూరీమృగము యొక్క, నాభి=బొడ్డునుండి, సముద్భూత=ఉద్భవించిన, కస్తూరీ=కస్తూరి అనబడు, మద=మదద్రవముచేత, పంకిలః=బురదగా అయినదియు, కర్పూర=కర్పూరముయొక్క, అగరు=అగరుయొక్క, ధూప=ధూపమునుండి ఉత్థ=బయలుదేరిన, గంధ=వాసనచేత, ఆకృష్ట=ఆకర్షింపబడిన, మధువ్రతః=తుమ్మెదలు గలదియు.

**తాత్పర్యము:–** కస్తూరీ పంకము పూయబడినదియు, కర్పూరాగరుధూపవాసనలవలన తుమ్మెదలు మూగినదియు (రథము).

**శ్లో॥ సంవర్తఘనఘోషాఢ్యో నానావాద్యసమన్వితః।**
**వీణావేణుస్వనాసక్తకిన్నరీగణసఙ్కులః॥ 6**

**ప్రతిపదార్థము:–** సంవర్తఘన=ప్రళయకాలమునందలి మేఘముయొక్క, ఘోష=ధ్వనితో, ఆఢ్యః=కూడినదియు,నానా=అనేకములైన, వాద్య=వాద్యములతో, సమన్వితః=కూడినదియు



వీణా=వీణలయొక్క, వేణు=పిల్లనగ్రోవులయొక్క, స్వన=ధ్వనియందు, ఆసక్త=ఆసక్తిగల, కిన్నరీగణ=కిన్నరస్త్రీసమూహముచేత, సంకులః=వ్యాప్తమైనదియు –

**తాత్పర్యము:–** సంవర్తకాలమేఘమువలె గంభీరధ్వనిగలదియు, అనేక వాద్యములతో అలరారునదియు, వీణావేణుధ్వనులతో గానము చేయుచున్న కిన్నరస్త్రీలు కలదియు (రథము).

**శ్లో॥ ఏవం దృష్ట్వా రథశ్రేష్ఠం వృషాదుత్తీర్య శఙ్కరః।**
**అమ్బయా సహితస్తత్ర పట్టతల్పేఽవిశత్తదా॥ 7**

**ప్రతిపదార్థము:–** ఏవమ్=పైన చెప్పినట్లుగా ఉన్న, రథశ్రేష్ఠమ్=శ్రేష్ఠమైన రథమును, దృష్ట్వా=చూచి, తదా=అప్పుడు, శంకరః=శివుడు, వృషాత్=వృషభమునుండి, ఉత్తీర్య=లేచి, అంబయా=అంబికతో, సహితః=కూడినవాడై, తత్ర=ఆ రథమునందున్న, పట్టతల్పే=పట్టు శయ్యపై, అవిశత్=ప్రవేశించెను.

**తాత్పర్యము:–** అలా ఆవిర్భవించిన రథమును చూచి మహేశ్వరుడు వృషభమునుండి లేచి అంబికతో సహా రథముపైనున్న పట్టుశయ్యపై కూర్చొనెను.

**శ్లో॥ నీరాజనైః సురస్త్రీణాం శ్వేతచామరచాలనైః।**
**దివ్యవ్యజనవాతైశ్చ ప్రహృష్టో నీలలోహితః॥ 8**

**ప్రతిపదార్థము:–** సురస్త్రీణామ్=దేవతాస్త్రీలయొక్క, నీరాజనైః=హారతులచే, శ్వేత=తెల్లని, చామర=వింజామరలయొక్క, చాలనైః=విసురుటచేత, దివ్య=దివ్యమైన, వ్యజన=వీవనల యొక్క, వాతైశ్చ=గాలులచేత, నీలలోహితః=పరమేశ్వరుడు, ప్రహృష్టః=మిక్కిలి సంతసించెను.

**తాత్పర్యము:–** దేవతాస్త్రీల హారతులతో వింజామరల కదలికలతో, దివ్యమైన విసనకర్రల వీవనలతోను, ఆ పరమేశ్వరుడు సంతోషించెను.

**శ్లో॥ క్వణత్కఙ్కణనిధ్వానైర్మఞ్జుమఞ్జీరశిఞ్జితైః।**
**వీణావేణుస్వనైర్గీతైః పూర్ణమాసీజ్జగత్రయమ్॥ 9**

**ప్రతిపదార్థము:–** క్వణత్=మ్రోగుచున్న, కంకణ=కంకణములయొక్క, నిధ్వానైః=ధ్వనుల తోను, మంజు=కమ్మని, మంజీర=అందెలయొక్క, శింజితైః=ధ్వనులతోను, వీణా=వీణల యొక్క, వేణు=వేణువులయొక్క, స్వనైః=ధ్వనులతోను, గీతైః=గానములతోను, జగత్రయమ్=ముల్లోకములు, పూర్ణమ్=నిండినవి, ఆసీత్=అయ్యెను.

**తాత్పర్యము:–** మ్రోగుచున్న కంకణ ధ్వనులతోను కమ్మని అందెల ధ్వనులతోను, వీణావేణు రవములతోను, గీతములతోను ముల్లోకములు నిండెను.

**శ్లో॥ శుకకేకికులారావైః శ్వేతపారావతస్వనైః।**
**ఉన్నిద్రభూషాఫణినాం దర్శనాదేవ బర్హిణః।**
**ననృతుర్దర్శయన్తః స్వాంశ్చన్ద్రకాన్కోటిసంఖ్యయా॥ 10**

**ప్రతిపదార్థము:–** శుక=చిలుకలయొక్క, కేకి=నెమళ్ళయొక్క, కుల=గుంపులయొక్క, ఆరావైః =ధ్వనులచేత, శ్వేత=తెల్లని, పారావత=పావురములయొక్క, స్వనైః=ధ్వనులచేత లోకత్రయం నిండినది, బర్హిణః= నెమళ్ళు, ఉన్నిద్ర=నిద్రలేచిన, భూషా=అలంకారములైన, ఫణినామ్= సర్పములయొక్క, దర్శనాదేవ=దర్శనంచేతనే, స్వాన్=తమ, చంద్రకాన్=పింఛపుమచ్చలను, కోటిసంఖ్యయా= కోట్లసంఖ్యతో, దర్శయంతః=చూపుచు, ననృతుః=నృత్యము చేసినవి.

**తాత్పర్యము:–**చిలుకలు నెమళ్ళ ధ్వనులతోను,తెల్లని పావురాల ధ్వనులతోను ముల్లోకములు నిండినవి. పడగలెత్తిన సర్పముల మణులను చూచి, నెమళ్ళు పింఛములు విప్పి ఆడుచుండెను.

**శ్లో॥ ప్రణమన్తం తతో రామముత్థాప్య వృషభధ్వజః।**
**ఆనినాయ రథం దివ్యం ప్రహృష్టేనాన్తరాత్మనా॥ 11**

**ప్రతిపదార్థము:–** తతః=తరువాత, ప్రణమంతమ్=తనకు నమస్కరించుచున్న, రామమ్= రాముని, ఉత్థాప్య=లేపి, వృషభధ్వజః=శివుడు, ప్రహృష్టేన=సంతోషించిన, అంతరాత్మనా= అంతఃకరణముతో, దివ్యమ్=దివ్యమైన, రథమ్=రథమునుగూర్చి, ఆనినాయ=తెచ్చెను.

**తాత్పర్యము:–** తనకు నమస్కరించుచున్న రామును చూచి శివుడు సంతోషంతో ఆయనను తన దివ్యరథమువద్దకు తెచ్చెను.

**శ్లో॥ కమణ్డలుజలైః స్వచ్ఛైః స్వయమాచమ్య యత్నతః।**
**సమాచామ్యాఽథ పురతః స్వాఙ్కే రామముపానయత్॥ 12**

**ప్రతిపదార్థము:–** స్వచ్ఛైః=శుభ్రములైన, కమండలు=కమండలముయొక్క, జలైః=నీటితో, యత్నతః=ప్రయత్నపూర్వకముగా, స్వయమ్=స్వయముగా, ఆచమ్య=ఆచమించి, అథ= తరువాత, సమాచామ్య=ఆచమనము చేయించి (రామునిచేత), పురతః=ఎదురుగా ఉన్న, రామమ్=రాముని, స్వాంకే=తన తొడమీదకు, ఉపానయత్=తీసికొనెను.

**తాత్పర్యము:–** కమండలు జలములతో తాను ఆచమనం చేసి, రామునిచేత చేయించి, రాముని తన తొడపై కూర్చుండబెట్టికొనెను.

**శ్లో॥ అథ దివ్యం ధనుస్తస్మై దదౌ తూణీరమక్షయమ్।**
**మహాపాశుపతం నామ దివ్యమస్త్రం దదౌ తతః॥ 13**



**ప్రతిపదార్థము:–** అథ=తర్వాత, తస్మై=ఆ రామునికొఱకు, దివ్యమ్=దివ్యమైన, ధనుః= వింటిని, అక్షయమ్=తఱుగని, తూణీరమ్=అంబులపొదిని, దదౌ=ఇచ్చెను, తతః=తరువాత, మహాపాశుపతం నామ=మహాపాశుపతము అను పేరుగల, దివ్యమ్=దివ్యమైన, అస్త్రమ్= అస్త్రమును, దదౌ=ఇచ్చెను.

**తాత్పర్యము:–** పరమేశ్వరుడు, రామునకు దివ్యధనుస్సును, అక్షయ తూణీరమును ఇచ్చెను. మహాపాశుపతము అను దివ్యాస్త్రమును గూడా ఇచ్చెను.

**శ్లో॥ ఉక్తశ్చ తేన రామోఽపి సాదరం చన్ద్రమౌళినా।**
**జగన్నాశకరం రౌద్రముగ్రమస్త్రమిదం నృప!॥ 14**

**ప్రతిపదార్థము:–** తేన=ఆ, చంద్రమౌళినా=శివునిచేత, రామః=రాముడు, సాదరమ్= ఆదరముగా, ఉక్తశ్చ=ఇట్లు చెప్పబడెను, నృప=రాజా! ఇదమ్=ఈ, రౌద్రమ్=రుద్రదేవతకు సంబంధించిన, అస్త్రమ్=అస్త్రము, జగన్నాశ=ప్రపంచ నాశమును, కరమ్=చేయునట్టిది.

**తాత్పర్యము:–** చంద్రమౌళీశ్వరుడు తన అస్త్రమునిచ్చి రామునితో ఇట్లనెను. రాజా! ఈ అస్త్రము రౌద్రము. జగత్ప్రళయ కారకము.

**శ్లో॥ అతో నేదం ప్రయోక్తవ్యం సామాన్యసమరాదికే।**
**అన్యన్నాస్తి ప్రతీఘాతమేతస్య భువనత్రయే॥ 15**

**ప్రతిపదార్థము:–** అతః=ఇందువలన, ఇదమ్=ఈ అస్త్రము, సామాన్య=సాధారణమైన, సమరాదికే=యుద్ధము మొదలగు వానియందు, న ప్రయోక్తవ్యమ్=ప్రయోగింపబడదగినది కాదు, ఏతస్య=దీనికి, భువనత్రయే=ముల్లోకములయందు, ప్రతీఘాతమ్=ప్రతిక్రియ చేయునట్టిది, అన్యత్=మఱొకటి, న=లేదు.

**తాత్పర్యము:–** కనుక దీనిని సామాన్యమైన యుద్ధము, కలహములయందు ప్రయోగింప రాదు. దీనికి ముల్లోకములయందు ప్రతిక్రియ చేయగలది లేదు.

**శ్లో॥ తస్మాత్ప్రాణాత్యయే రామ! ప్రయోక్తవ్యముపస్థితే।**
**అన్యథైతత్ప్రయుక్తం తు జగత్సంక్షయకృద్భవేత్॥ 16**

**ప్రతిపదార్థము:–** తస్మాత్=కనుక, రామ!=ఓ రామా!, ప్రాణాత్యయే=ప్రాణప్రమాదము, ఉపస్థితే=ప్రాప్తమైనపుడు, ప్రయోక్తవ్యమ్=ప్రయోగింపదగినది, అన్యథా=మఱొక విధముగా, ప్రయుక్తం తు=ప్రయోగింపబడినచో, ఏతత్=ఇది, జగత్=ప్రపంచముయొక్క, సంక్షయ= ప్రళయమునకు, కృత్=కారకముగా, భవేత్=అగును.

**తాత్పర్యము:–** కనుక, రామా! నీకు ప్రాణ సంకట పరిస్థితిలో దీనిని ప్రయోగింపవలెను. ఇతర విధంగా ప్రయోగించినచో, ఇది ప్రపంచానికే ప్రళయమును కలిగించును.

**శ్లో॥ అథాహూయ సురశ్రేష్ఠాన్ లోకపాలాన్ మహేశ్వరః।**
**ఉవాచ పరమప్రీతః స్వం స్వమస్త్రం ప్రయచ్ఛత॥ 17**

**ప్రతిపదార్థము:–** అథ=తరువాత, మహేశ్వరః=శివుడు, లోకపాలాన్=లోకపాలకులైన, సురశ్రేష్ఠాన్=దేవతాశ్రేష్ఠులను, ఆహూయ=పిలచి, పరమ ప్రీతః=మిక్కిలి ప్రీతిగలవాడై, స్వంస్వమ్=తమ తమ, అస్త్రమ్=అస్త్రమును, ప్రయచ్ఛత=ఇవ్వండి అని, ఉవాచ=పలికెను.

**తాత్పర్యము:–** తరువాత ఈశ్వరుడు లోకపాలకులైన దేవతలను పిలిచి మీమీ అస్త్రములను రామునకు ఇవ్వండని చెప్పెను.

**శ్లో॥ రాఘవోఽయం చ తైరస్త్రైః రావణం నిహనిష్యతి।**
**తస్మై దేవైరవధ్యస్త్వమితి దత్తో వరో మయా॥ 18**

**ప్రతిపదార్థము:–** అయమ్=ఈ, రాఘవః చ=రాముడున్ను, తైః=ఆ, అస్త్రైః=అస్త్రములతో, రావణమ్=రావణుని, నిహనిష్యతి=చంపగలడు. తస్మై=అతనికి, దేవైః=దేవతలచేత, త్వమ్=నీవు, అవధ్యః=చంపబడవు, ఇతి=అను, వరః=వరము, మయా=నాచేత, దత్తః=ఇవ్వబడినది.

**తాత్పర్యము:–** ఈ రాముడు మీరిచ్చిన అస్త్రములతో ఆ రావణాసురుని తప్పక చంపును. వానికి దేవతలైన మీ చేతుల్లో చావులేకుండా వరమును నేనే ఇచ్చాను.

**శ్లో॥ తస్మాద్వానరతామేత్య భవన్తో యుద్ధదుర్మదాః।**
**సాహాయ్యమస్య కుర్వన్తు తేన సుస్థా భవిష్యథ॥ 19**

**ప్రతిపదార్థము:–** తస్మాత్=కనుక, వానరతామ్=మర్కటత్వమును, ఏత్య=పొంది, యుద్ధ దుర్మదాః=యుద్ధం దర్పంగల, భవంతః=మీరు, అస్య=ఈ రామునకు, సాహాయ్యమ్=సహాయమును, కుర్వంతు=చేయుదురుగాక!, తేన=అందుచేత, సుస్థాః=స్వస్థులుగా, భవిష్యథ =కాబోయెదరు.

**తాత్పర్యము:–** కనుక మీరందఱు వానరులై ఈ రాజుకు యుద్ధదర్పంతో సహాయకులు కాబోవుచున్నారు. దానివలన మీరు మీ లోకములలో స్వస్థులయ్యెదరు.

**శ్లో॥ తదాజ్ఞాం శిరసా గృహ్య సురాః ప్రాఞ్జలయస్తదా।**
**ప్రణమ్య చరణౌ శమ్భోః స్వం స్వమస్త్రం దదుర్ముదా॥ 20**



**ప్రతిపదార్థము:–** తదాజ్ఞామ్=ఆ శివుని ఆజ్ఞను, శిరసా=శిరస్సుతో, గృహ్య=గ్రహించి, సురాః=దేవతలు, ప్రాంజలయః=అంజలిపట్టినవారై, తదా=అప్పుడు, శంభోః=శివునియొక్క చరణౌ=పాదములను, ప్రణమ్య=నమస్కరించి, ముదా=సంతోషముతో, స్వంస్వమ్=తమ తమ, అస్త్రమ్=అస్త్రమును, దదుః=ఇచ్చిరి.

**తాత్పర్యము:–** శివుని ఆజ్ఞ శిరసావహించి, దేవతలు అంజలిబద్ధులై శివునకు ప్రణమిల్లి రామునకు తమ తమ అస్త్రములను ఇచ్చిరి.

**శ్లో॥ నారాయణాస్త్రం దైత్యారిరైన్ద్రమస్త్రం పురన్దరః।**
**బ్రహ్మాపి బ్రహ్మదణ్డాస్త్రమాగ్నేయాస్త్రం ధనఞ్జయః॥ 21**

**ప్రతిపదార్థము:–** దైత్యారిః=విష్ణువు, నారాయణాస్త్రమ్=నారాయణాస్త్రమును, పురందరః =దేవేంద్రుడు, ఐంద్రమ్=ఇంద్రసంబంధమైన, అస్త్రమ్=అస్త్రమును, బ్రహ్మాపి=బ్రహ్మాయు, బ్రహ్మదండాస్త్రమ్=బ్రహ్మదండాస్త్రమును, ధనంజయః=అగ్నిహోత్రుడు, ఆగ్నేయాస్త్రమ్= ఆగ్నేయాస్త్రమును ఇచ్చెను.

**తాత్పర్యము:–** విష్ణువు–నారాయణాస్త్రమును, దేవేంద్రుడు–ఇంద్రసంబంధమైన అస్త్రమును, బ్రహ్మ–బ్రహ్మదండాస్త్రమును, అగ్నిహోత్రుడు–ఆగ్నేయాస్త్రమును ఇచ్చెను.

**శ్లో॥ యామ్యం యమోఽపి మోహాస్త్రం రక్షోరాజస్తథా దదౌ।**
**వరుణో వారుణం ప్రాదాద్ వాయవ్యాస్త్రం ప్రభఞ్జనః॥ 22**

**ప్రతిపదార్థము:–** యమోఽపి=యముడున్ను, యామ్యమ్=యమాస్త్రమును, తథా=అట్లే, రక్షోరాజః=నిర్-ృతి, మోహాస్త్రమ్=మోహాస్త్రమును, దదౌ=ఇచ్చెను, వరుణః=వరుణుడు, వారుణమ్=వారుణాస్త్రమును, ప్రభంజనః=వాయుదేవుడు, వాయవ్యాస్త్రమ్=వాయవ్యాస్త్రము, ప్రాదాత్=ఇచ్చెను.

**తాత్పర్యము:–** యముడు–యమాస్త్రమును, అట్లే నిర్-ృతి=మోహాస్త్రమును, వరుణుడు–వారుణాస్త్రమును, వాయుదేవుడు–వాయవ్యాస్త్రమును ఇచ్చెను.

**శ్లో॥ కౌబేరం చ కుబేరోఽపి రౌద్రమీశాన ఏవ చ।**
**సౌరమస్త్రం దదౌ సూర్యః సౌమ్యం సోమశ్చ పావకమ్॥**
**విశ్వేదేవా దదుస్తస్మై వసవో వాసవాభిదమ్॥ 23**

**ప్రతిపదార్థము:–**కుబేరోఽపి=కుబేరుడును,కౌబేరమ్=కౌబేరాస్త్రమును,ఈశానః= ఈశానుడు, రౌద్రమ్=రౌద్రాస్త్రమును, సూర్యః=సూర్యుడు, సౌరమస్త్రమ్=సౌరాస్త్రమును,

సోమః= సోముడు, సౌమ్యమ్=సౌమ్యాస్త్రమును, దదౌ=ఇచ్చెను. విశ్వేదేవాః=విశ్వేదేవతలు, పావకమ్ =పావకాస్త్రమును, వసవః=వసువులు, వాసవాభిధమ్=వాసవాస్త్రమును, తస్మై=ఆ రాముని కొఱకు, దదుః=ఇచ్చిరి.

**తాత్పర్యము:–** కుబేరుడు–కుబేరాస్త్రమును, ఈశానుడు–రౌద్రాస్త్రమును, సూర్యుడు–సౌరా –స్త్రమును, సోముడు–సౌమ్యాస్త్రమును, విశ్వేదేవతలు–పావకాస్త్రమును, వసువులు–వాసవా –స్త్రమును ఆ రామునికొఱకు ఇచ్చిరి.

**శ్లో॥ అథ తుష్టః ప్రణమ్యేశం రామో దశరథాత్మజః।**
**ప్రాఞ్జలిః ప్రణతో భూత్వా భక్తియుక్తో వ్యజిజ్ఞపత్॥ 24**

**ప్రతిపదార్థము:–** అథ=తరువాత, తుష్టః=సంతోషించిన, దశరథాత్మజః=దశరథ పుత్రుడైన, రామః=రాముడు, ఈశమ్=ఈశ్వరుని, ప్రణమ్య=నమస్కరించి, ప్రాంజలిః=అంజలి పట్టిన వాడై, ప్రణతోభూత్వా=నమ్రుడై,భక్తి=భక్తితో,యుక్తః=కూడినవాడై,వ్యజిజ్ఞపత్=విన్నవించెను.

**తాత్పర్యము:–** దాశరథి అయిన రాముడు సంతోషంతో పరమేశ్వరునకు నమస్కరించి, అంజలి గట్టి వినమ్రుడై భక్తితో ఇట్లనెను.

**శ్రీరామ ఉవాచ-శ్రీరాముడిట్లనెను.**

**శ్లో॥ భగవన్మానుషేణైవ నోల్లంఘ్యో లవణామ్బుధిః।**
**తత్ర లఙ్కాభిధం దుర్గం దుర్జయం దేవదానవైః॥ 25**

**ప్రతిపదార్థము:–** భగవన్=దేవా! మానుషేణైవ=మానవమాత్రునిచేతనే, లవణాంబుధిః= లవణసముద్రము, ఉల్లంఘ్యః=దాటదగినది, న=కాదు, తత్ర=అందులోనూ, లంకాభిధమ్= లంక అను పేరుగల, దుర్గమ్=కోట, దేవదానవైః=సురాసురులచేత, దుర్జయమ్=జయింప శక్యము గానిది.

**తాత్పర్యము:–** దేవా! లవణ సముద్రము మానవ మాత్రునికి దాటశక్యము కానిది. అందునా అచ్చట 'లంక' అనేది మహాదుర్గము. అది దేవదానవులకు అజేయము.

**శ్లో॥ అనేకకోటయస్తత్ర రాక్షసా బలవత్తరాః।**
**సర్వే స్వాధ్యాయనిరతాః శివభక్తా జితేన్ద్రియాః॥ 26**

**ప్రతిపదార్థము:–** తత్ర=ఆ లంకలో, బలవత్తరాః=అత్యంత బలవంతులైన, రాక్షసాః= రాక్షసులు, అనేక కోటయః=అనేక కోట్లు గలరు. సర్వే=వారందరు, స్వాధ్యాయ=వేద శాఖాధ్యయనమునందు, నిరతాః=అసక్తులు, శివభక్తాః=శివభక్తులు, జితేంద్రియాః= ఇంద్రియాలను జయించినవారు.



**తాత్పర్యము:–** అందులోను అచ్చటి రాక్షసులు బలవత్తరులు. సంఖ్యలో అనేక కోట్లు. అందరును వేదాధ్యయన నిరతులు. శివభక్తులు. జితేంద్రియులు. ఎలా వారిని జయింప గలను?

**శ్లో॥ అనేకమాయాసంయుక్తా బుద్ధిమన్తోఽగ్నిహోత్రిణః**
**కథమేకాకినా జేయా మయా భ్రాత్రా చ సంయుగే॥ 27**

**ప్రతిపదార్థము:–**అనేక=పలురకములైన, మాయా=మాయలతో, సంయుక్తాః=కూడినవారు, బుద్ధిమంతః=తెలివిగలవారు, అగ్నిహోత్రిణః=అగ్నిహోత్ర పూజకులు, ఏకాకినా=ఒంటరి వాడైన, మయా=నాచేత, భ్రాత్రా చ=సోదరుడైన లక్ష్మణునిచేత, సంయుగే=యుద్ధము నందు, కథమ్=ఎట్లు జేయాః=జయింపదగును.

**తాత్పర్యము:–** వారందరు తెలివైనవారు. మాయావులు. పైగా అగ్నిహోత్రోపాసకులు. ఇలా శక్తియుక్తి భక్తిగలవారిని నేను నా తమ్ముడు పోరులో ఒంటరిగా ఎలా జయించ గలము?

**శ్రీ శివ ఉవాచ-శివుడు ఇట్లనెను.**

**శ్లో॥ రావణస్య వధే రామ! రక్షసామపి మారణే।**
**విచారో న త్వయా కార్యస్తస్య కాలోఽయమాగతః॥ 28**

**ప్రతిపదార్థము:–** రామ!=ఓ రామా!, రావణస్య=రావణునియొక్క, వధే=వధయందు, రక్షసామ్=రాక్షసులయొక్క, మారణేపి=వధయందున్ను, త్వయా=నీచేత, విచారః=విచారము, న కార్యః=చేయదగదు, తస్య=వారివధకు, అయమ్ కాలః=ఈ కాలము, ఆగతః=వచ్చినది.

**తాత్పర్యము:–** రామా! రావణవధకు, రాక్షస సంహారానికి నీవు విచారపడవలసిన పనిలేదు. అందుకు ఇదిగో–కాలం వచ్చినది.

**శ్లో॥ అధర్మే తు ప్రవృత్తాస్తే దేవబ్రాహ్మణపీడనే।**
**తస్మాదాయుః క్షయం యాతం తేషాం శ్రీరపి సువ్రత!॥ 29**

**ప్రతిపదార్థము:–** సువ్రత!=మంచి తపస్సుగలవాడా!, తే తు=ఆ రావణాది రాక్షసులు, అధర్మే=అధర్మమునందును, దేవ=దేవతలయొక్క, బ్రాహ్మణ=ఋషులయొక్క, పీడనే= పీడించుటయందు, ప్రవృత్తాః=ప్రవర్తించిరి, తస్మాత్=కనుక, తేషామ్=వారియొక్క, ఆయుః =ఆయుర్దాయము, క్షయమ్=నాశమును, యాతమ్=పొందినది, శ్రీరపి=సంపదయున్ను నశించినది.

**తాత్పర్యము:–** ఉత్తమంగా పాశుపతవ్రతము నెరవేర్చిన రామా! ఆ రావణాది రాక్షసులు బాగా అధర్మాసక్తులయిరి. దేవతలను, మునులను పీడించుచున్నారు. ఈ అధర్మాలవలన, శాపాలవలన వారి ఆయుష్షులు తగ్గిపోయినవి.

**శ్లో॥ రాజస్త్రీలంఘనాసక్తం రావణం నిహనిష్యసి।**
**పాపాసక్తో రిపుర్జేతుం సుకరః సమరాఙ్గణే॥ 30**

**ప్రతిపదార్థము:–** రాజస్త్రీ=రాణి అయిన సీతను, లంఘన=ఆక్రమించుటయందు, ఆసక్తమ్= ఆసక్తిగల, రావణమ్=రావణుని, నిహనిష్యసి=చంపగలవు. పాపాసక్తః =పాపిష్ఠుడైన, రిపుః=శత్రువు, సమరాంగణే=యుద్ధప్రాంగణమున, జేతుమ్=జయించుటకు, సుకరః=తేలిక అగును.

**తాత్పర్యము:–** సీతపై దురాక్రమణ చేయు తలంపుతో ఉన్న రావణుని నీవు తేలికగా చంపగలవు. పాపాసక్తుడైన శత్రువు యుద్ధంలో చాలా తేలికగా చావగలడు.

**శ్లో॥ అధర్మే నిరతః శత్రుర్భాగ్యేనైవ హి లభ్యతే।**
**అధీతవేదశాస్త్రోఽపి సదా వేదరతోఽపి వా।**
**వినాశకాలే సమ్ప్రాప్తే ధర్మమార్గాచ్చ్యుతో భవేత్॥ 31**

**ప్రతిపదార్థము:–** అధర్మే=అధర్మమునందు, నిరతః=ఆసక్తుడైన, శత్రుః=శత్రువు, భాగ్యేనైవ హి=భాగ్యంచేతనే, లభ్యతే=పొందబడును, అధీత=చదువబడిన, ధర్మశాస్త్రోపి=ధర్మశాస్త్రము గలవాడైనను, సదా=నిత్యము, వేద=వేదమునందు రతోపివా=ఆసక్తిగలవాడైనను, వినాశకాలే=వినాశసమయము సంప్రాప్తే=సంభవించినపుడు, ధర్మమార్గాత్=ధర్మమార్గము నుండి, చ్యుతః=జారినవాడు, భవేత్=అగును.

**తాత్పర్యము:–** అధర్మంతో క్రుంగిపోయిన శత్రువును జయించటం బహు సులభం. అట్టి శత్రువు దొరకటం అదృష్టం. ధర్మశాస్త్రాలు చదివినా, వేదపారాయణం చేస్తున్నా, వినాశకాలం దాపురించినవాడు, ధర్మం తప్పి ప్రవర్తిస్తాడు. దాంతో అతనికి నాశనంవస్తుంది.

**శ్లో॥ పీడ్యన్తే దేవతాః సర్వాః సతతం యేన పాపినా।**
**బ్రాహ్మణా ఋషయశ్చైవ తస్య నాశః స్వయం స్థితః॥ 32**

**ప్రతిపదార్థము:–** యేన=ఏ, పాపినా=పాపిచేత, సతతమ్=నిత్యము, సర్వాః=సమస్తమైన, దేవతాః=దేవతలు, బ్రాహ్మణాః=బ్రహ్మవేత్తలైన, ఋషయశ్చైవ=ఋషులున్ను, పీడ్యంతే= పీడింపబడుచున్నారో, తస్య=వానికి, నాశః=నాశనము, స్వయమ్=తనంతటతాను, స్థితః =సిద్ధమై ఉన్నది.



**తాత్పర్యము:–** ఏ పాపి నిత్యము దేవబ్రాహ్మణులను బాధించుచుండునో, వానికి నాశనము – ఒకరి ప్రయత్నము లేకుండా – తనంతట తానే సిద్ధమై వచ్చును.

**శ్లో॥ కిష్కిన్ధానగరే రామ! దేవానామంశసమ్భవాః।**
**వానరా బహవో జాతా దుర్జయా బలవత్తరాః॥ 33**

**ప్రతిపదార్థము:–** రామా! ఓ రామా! కిష్కింధా=కిష్కింధ అను, నగరే=పురమున, దేవానామ్ =దేవతలయొక్క, అంశ=అంశలవలన, సంభవాః=సంభవించిన, వానరాః=క్రోతులు, బహవః=చాలమంది, జాతాః=పుట్టిరి. తే=వారు, దుర్జయాః=జయింపశక్యముకానివారు, బలవత్తరాః=మిక్కిలి బలమైనవారు.

**తాత్పర్యము:–** ఓ రామా! కిష్కింధానగరము నందు దేవతాంశలతో బహువానర వీరు లుద్భవించిరి. వారు అజేయ బలసంపన్నులు.

**శ్లో॥ సాహాయ్యం తే కరిష్యన్తి తైర్బధాన పయోనిధిమ్।**
**అనేకశైలసమ్బద్ధే సేతౌ యాన్తు వలీముఖాః॥ 34**

**ప్రతిపదార్థము:–** తే=ఆ వానరవీరులు, సాహాయ్యమ్=నీకు సహాయమును, కరిష్యంతి=చేయ గలరు. తైః=వారితో, పయోనిధిమ్=సముద్రమును, బధాన=బంధింపుము, అనేక=చాల, శైల=కొండలతో, సంబద్ధే=కట్టబడిన, సేతౌ=సేతువునందు, వలీముఖాః=వానర వీరులు, యాంతు=లంకకు పోయెదరు గాక!

**తాత్పర్యము:–** ఆ వానరవీరులు నీకు సహాయమును చేయగలరు. వారితో సముద్రమును, బంధింపుము చాల కొండలతో కట్టబడిన సేతువునందు వానర వీరులు లంకకు పోయెదరు గాక!

**శ్లో॥ రావణం సగణం హత్వా తామానయ నిజాం ప్రియామ్।**
**శస్త్రైర్యుద్ధే జయో యత్ర తత్రాస్త్రాణి న యోజయేత్॥ 35**

**ప్రతిపదార్థము:–** రావణమ్=రావణాసురుని, సగణమ్=గుంపుతోసహా!, హత్వా=చంపి, తామ్=ఆ, నిజామ్=నీదైన, ప్రియామ్=భార్యను, ఆనయ=తెచ్చికొనుము. శస్త్రైః= ఆయుధములతో యత్ర=ఏ, యుద్ధే=రణమునందు, జయః=జయముకలదో, తత్ర=ఆ యుద్ధమునందు, అస్త్రాణి=అస్త్రములను, న యోజయేత్=ప్రయోగింపరాదు.

**తాత్పర్యము:–** రావణాసురుని రాక్షసగణముతో సహా చంపి నీ భార్యను తెచ్చికొనుము. యుద్ధంలో శస్త్రప్రయోగంతో సరిపోయినచోట అస్త్రప్రయోగం చేయరాదు సుమా!

శ్లో॥ నిరస్త్రేష్వల్పశస్త్రేషు పలాయనపరేషు చ।
అస్త్రాణి ముఞ్చన్ దివ్యాని స్వయమేవ వినశ్యతి॥ **36**

**ప్రతిపదార్థము:–** నిరస్త్రేషు=ఆయుధ హీనులయందు, అల్పశస్త్రేషు=కొద్ది శస్త్రములు గలవారియందు, పలాయన పరేషు చ=పారిపోవు వారియందున్ను, దివ్యాని=దివ్యములైన, అస్త్రాణి=అస్త్రములను, ముంచన్=వదలుచున్న యోధుడు, స్వయమేవ=తనే, వినశ్యతి= నశించును.

**తాత్పర్యము:–** శస్త్రహీనులు, అల్పాయుధులు, పారిపోవువారు – వీరిపైన దివ్యాస్త్రములను ప్రయోగింపరాదు. అట్లు ప్రయోగించినచో ప్రయోక్తయే నశించును.

శ్లో॥ అథవా కిం బహూక్తేన మయైవోత్పాదితం జగత్।
మయైవ పాల్యతే నిత్యం మయా సంహ్రియతేఽపి చ॥ **37**

**ప్రతిపదార్థము:–**అథవా=లేదా,బహూక్తేన=ఎక్కువ చెప్పటంతో, కిమ్=ఏమి ప్రయోజనము? మయైవ=నా చేతనే, జగత్=ప్రపంచము, ఉత్పాదితమ్=సృష్టింపబడినది. మయైవ=నాచేతనే, నిత్యమ్=నిత్యము, పాల్యతే=పాలింపబడుచున్నది. మయా=నాచేత, సంహ్రియతేఽపి చ= సంహరింపబడుచున్నది.

**తాత్పర్యము:–** ఇదంతా చెప్పటమెందుకు? రామా! ఈ ప్రపంచాన్ని నేనే సృష్టించాను. నేను పాలిస్తున్నాను. నేనే సంహరిస్తున్నాను.

శ్లో॥ అహమేకో జగన్మృత్యుర్మృత్యోరపి మహీపతే!।
గ్రసేఽహమేవ సకలం జగదేతచ్చరాచరమ్॥ **38**

**ప్రతిపదార్థము:–** మహీపతే=రాజా!, అహమ్=నేను, ఏకః=ఒక్కడినే, జగత్=ప్రపంచమును, మృత్యుః=దానికి మృత్యుదేవతను, మృత్యోరపి=మృత్యువుకుగూడా, మృత్యుః=మృత్యువును, అహమేవ=నేనే, ఏతత్=ఈ, సకలమ్=సమస్తమైన, చరాచరమ్=చరాచరరూపమైన, జగత్=ప్రపంచమును, గ్రసే=మ్రింగెదను.

**తాత్పర్యము:–** రామా! ఈ ప్రపంచము నేనే – దాని మృత్యువును నేను – మృత్యుదేవతకు కూడానేను మృత్యువును. ఈ చరాచర ప్రపంచమును మొత్తాన్ని నేనే చివరకు మ్రింగి వేయు లయకారుడను.

శ్లో॥ మమ వక్త్రగతాస్సర్వే రాక్షసా యుద్ధదుర్మదాః।
నిమిత్తమాత్రం త్వం భూయాః కీర్తిమాప్స్యసి సఙ్గరే॥ **39**



**ప్రతిపదార్థము:–** యుద్ధ=యుద్ధమునందు, దుర్మదాః=మదమెక్కిన, సర్వే=అందఱు, రాక్షసాః =రాక్షసులు, మమ=నాయొక్క, వక్త్రగతాః=నోటిలో చిక్కుకొనిరి. త్వమ్=నీవు, నిమిత్త మాత్రమ్=నిమిత్తమాత్రుడవు, భూయాః=కమ్ము, సంగరే=యుద్ధమున, కీర్తిమ్=కీర్తిని, ఆప్స్యసి=పొందగలవు.

**తాత్పర్యము:–** యుద్ధ దుర్మదులైన రాక్షసులు అందరు కాలస్వరూపుడైనను నా నోట చిక్కినారు. నీవు నిమిత్తమాత్రముగా నుండి వారిని సంహరించి, వీరుడుగా కీర్తిపొందుము.

**ఇతి శ్రీ పద్మపురాణే ఉపరిభాగే శివగీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీశివరాఘవసంవాదే రామవరప్రదానం నామ పఞ్చమోఽధ్యాయః॥**

* * * * *

## అథ షష్ఠోఽధ్యాయః
# విభూతియోగః

**శ్రీరామ ఉవాచ-శ్రీరాముడు ఇట్లనెను.**

**శ్లో॥ భగవన్నత్ర మే చిత్రం మహదేతత్ప్రజాయతే।
శుద్ధస్ఫటికసఙ్కాశస్త్రినేత్రశ్చన్ద్రశేఖరః॥ 1**

**ప్రతిపదార్థము:-** భగవన్=దేవా!, అత్ర=ఈ విషయంలో, మే=నాకు, ఏతత్=ఇది, మహత్=గొప్ప, చిత్రమ్=ఆశ్చర్యము, ప్రజాయతే=కలుగుచున్నది, శుద్ధ=నిర్మలమైన, స్ఫటిక=స్ఫటికముతో, సంకాశః=సమానుడును, త్రినేత్రః=ముక్కంటియును, చంద్ర=చంద్రరేఖ, శేఖరః=తలపైనకలవాడవును అగు -

**తాత్పర్యము:-** తదుపరి శ్లోకముతో అన్వయించబడినది.

**శ్లో॥ మూర్తస్త్వం తు పరిచ్ఛిన్నాకృతిః పురుషరూపధృత్।
అమ్బయా సహితోఽత్రైవ రమసే ప్రమథైః సహ॥ 2**

**ప్రతిపదార్థము:-** మూర్తః=మూర్తిగలవాడవును అగు, త్వం తు=నీవయితే, పరిచ్ఛిన్న=పరిమితమైన, ఆకృతిః=ఆకారముగలవాడవు, పురుష=పురుషునియొక్క రూప=రూపమును, ధృత్=ధరించినవాడవున్ను అయి, అంబయా=అంబికతో, సహితః=కలసినవాడవై, ప్రమథైః సహ=ప్రమథగణములతోసహా, అత్రైవ=ఇచ్చటనే, రమసే=క్రీడించుచున్నావు.

**తాత్పర్యము:-** మహాదేవా! నీ మాటలో నాకొక చిత్రము గోచరించినది. నీవు చక్కని పరిమితమైన శరీరంతో కనబడుచున్నావు. శుద్ధ స్ఫటికమువంటి శరీరము, మూడు కన్నులు, చంద్రరేఖ, పురుషాకారము - ఇట్టి నీవు అంబికతో కలసి ఉండి ప్రమథ పరివారముతో క్రీడించుచున్నావు గదా!

**శ్లో॥ త్వం కథం పఞ్చభూతాది జగదేతచ్చరాచరమ్।
తద్బ్రూహి గిరిజాకాన్త! మయి తేఽనుగ్రహో యది॥ 3**



**ప్రతిపదార్థము:-** త్వమ్=అట్టి పరిమితాకారముగల నీవు, పంచభూతాది=పంచభూతములు మొదలుగాగల, ఏతత్=ఈ, చరాచరమ్=స్థావరజంగమాత్మకమైన, జగత్=ప్రపంచముగా, కథమ్=ఎట్లు అగుదువు? గిరిజాకాంత!=పార్వతీవల్లభా!, మయి=నాయందు, తే=నీకు, అనుగ్రహో యది=అనుగ్రహమున్నచో, తత్=ఆ విషయమును, బ్రూహి=చెప్పుము.

**తాత్పర్యము:-** పరిమితాకారంతో కనబడుతున్న నీవు అపరిమితాకారమయి వ్యాప్తమైన ఈ పంచభూత ప్రపంచముగా ఎలా అవుతావు. నేనే ప్రపంచమును అని అన్నావు గదా! అది ఎలా సాధ్యము? నాయందు అనుగ్రహమున్నచో ఈ సందేహము తీర్చుము.

**శ్రీ శివ ఉవాచ-శ్రీ శివుడు ఇట్లనెను.**

**శ్లో॥ సాధు పృష్టం మహాభాగ! దుర్జ్ఞేయమమరైరపి।
తత్ప్రవక్ష్యామి తే భక్త్యా బ్రహ్మచర్యేణ సువ్రత!।
పారం యాస్యస్యనాయాసాద్ యేన సంసారనీరధేః॥ 4**

**ప్రతిపదార్థము:-** సువ్రత=మంచి వ్రతముగలవాడా!, మహాభాగ!=మహాత్మా!, సాధు=చక్కగా, పృష్టమ్=ప్రశ్నించబడెను, అమరైరపి=దేవతలచేతను, దుర్జ్ఞేయమ్=తెలియశక్యము గాని, తత్=ఆ విషయమును, తే=నీయొక్క, భక్త్యా=భక్తిచేత, బ్రహ్మచర్యేణ=బ్రహ్మచర్యము చేత, ప్రవక్ష్యామి=చెప్పగలను, యేన=ఏ విషయ జ్ఞానము చేత, సంసార=సంసారమను, నీరధేః=సముద్రముయొక్క, పారమ్=అవతలి ఒడ్డును, అనాయాసాత్=తేలికగా, యాస్యసి=చేరగలవో అది చెప్పెదను.

**తాత్పర్యము:-** మహాత్మా! పాశుపతవ్రతా! రామా! నీ ప్రశ్న మంచిది. దేవతలకు గూడా తెలియని అరుదైన ఈ విషయాన్ని నీకు చెప్తాను. నీ భక్తికి బ్రహ్మచర్యానికి ఇది ఫలము. దీనివలన నీవు సంసార సముద్రమును అనాయాసముగా దాటగలవు.

**శ్లో॥ దృశ్యన్తే పఞ్చభూతాని యే చ లోకాశ్చతుర్దశ।
సముద్రాః సరితో దేవా రాక్షసా ఋషయస్తథా॥ 5**

**ప్రతిపదార్థము:-** పంచభూతాని=ఏ పంచభూతములు, యే=ఏ, చతుర్దశ=పదునాల్గు, లోకాః చ=లోకములున్ను, సముద్రాః=సముద్రములు, సరితః=నదులు, దేవాః=దేవతలు, రాక్షసాః=రాక్షసులు, తథా=అట్లే, ఋషయః=ఋషులున్ను, దృశ్యంతే=కనబడుచున్నారో-

**తాత్పర్యము:-** రామా! ఈ పంచభూతములు, ఈ పదునాల్గు లోకాలు, సముద్రాలు, నదులు, దేవతలు, రాక్షసులు, ఋషులు ఈ కనబడుచున్నవన్నియు నా విభూతులే.

**శ్లో॥ దృశ్యన్తే యాని చాన్యాని స్థావరాణి చరాణి చ।**
**గన్ధర్వాః ప్రమథా నాగాః సర్వే తే మద్విభూతయః॥ 6**

**ప్రతిపదార్థము:–** యాని చ=ఏ, అన్యాని=ఇతరములైన, స్థావరాణి=అచరములు, చరాణి చ=జంగమములు అయిన దృశ్యములు, గంధర్వాః=గంధర్వులు, ప్రమథాః=ప్రమథులు, నాగాః=నాగులు, దృశ్యంతే=కనబడుచున్నారో, తే=అవి,సర్వే=అన్నియును/అందరును, మత్=నాయొక్క విభూతయః= ఐశ్వర్యాంశలు.

**తాత్పర్యము:–** ఇవిగాక ఇంకాకనబడుచున్న చరాచర పదార్థములు, గంధర్వులు, నాగులు, ప్రమథులు అందఱును అన్నియు నా ఐశ్వర్య కణికలే.

**శ్లో॥ పురా బ్రహ్మాదయో దేవా ద్రష్టుకామా మమాకృతిమ్।**
**మన్దరం ప్రయయుః సర్వే మమ ప్రియతరం గిరిమ్॥ 7**

**ప్రతిపదార్థము:–** పురా=పూర్వము, బ్రహ్మాదయః=బ్రహ్మ మొదలగు, దేవాః=దేవతలు, మమ=నాయొక్క ఆకృతిమ్=తత్త్వరూపమును, ద్రష్టుకామాః=చూడదలచినవారై, సర్వే= అందరును, మమ=నాకు, ప్రియతరమ్=మిక్కిలి ప్రియమైన, మందరమ్=మందరము అను, గిరిమ్=కొండను, ప్రయయుః=చేరిరి.

**తాత్పర్యము:–** పూర్వము బ్రహ్మాది దేవతలు నా తాత్త్విక రూపమును చూడగోరినవారై నాకు అత్యంత ప్రియమైన మందర పర్వతమువద్దకు చేరిరి.

**శ్లో॥ తాన్ దృష్ట్వాఽథ మయా దేవాన్ లీలాకులితచేతసా।**
**తేషామపహృతం జ్ఞానం బ్రహ్మాదీనాం దివౌకసామ్॥ 8**

**ప్రతిపదార్థము:–** అథ=తర్వాత, తాన్=ఆ, దేవాన్=దేవతలను, దృష్ట్వా=చూచి, లీలా= విలాసముతో, ఆకులిత=వ్యాకులమైన, చేతసా=మనస్సుగల, మయా=నాచేత, తేషామ్= ఆ, బ్రహ్మాదీనామ్=బ్రహ్మమొదలగు,దివౌకసామ్=దేవతలయొక్క,జ్ఞానమ్=తెలివి,అపహృతమ్ =అపహరింపబడినది.

**తాత్పర్యము:–** అలా వచ్చిన బ్రహ్మాది దేవతలను చూచి నేను వారిని ఆటపట్టించాలని కుతూహలంతో వారికున్న జ్ఞానాన్ని అపహరించాను.

**శ్లో॥ అథ తేఽపహృతజ్ఞానా మామాహుః కో భవానితి।**
**అథాబ్రవమహం దేవానహమేవ పురాతనః॥ 9**

**ప్రతిపదార్థము:–** అథ=తర్వాత, అపహృత=అపహరింపబడిన, జ్ఞానాః=జ్ఞానముకల, తే=ఆ



దేవతలు, భవాన్=నీవు, కః=ఎవడవు? ఇతి=అని, మామ్=నన్ను, ఆహుః=పలికిరి, అథ= తర్వాత, అహమ్=నేను, అహమేవ=నేనే, పురాతనః=సనాతనుడను అని, దేవాన్= దేవతలను, అబ్రవమ్=పలికితిని.

**తాత్పర్యము:–** జ్ఞానం తొలగిన తర్వాత వారు నన్ను చూచి, 'నీ వెవరవు' అని నన్నే అడిగారు. నే నన్నాను 'నేనే సనాతనుడను' అని.

**శ్లో॥ ఆసం ప్రథమమేవాహం వర్తామి చ సురేశ్వరాః।**
**భవిష్యామి చ లోకేఽస్మిన్ మత్తో నాన్యోఽస్తి కశ్చన॥ 10**

**ప్రతిపదార్థము:–** సురేశ్వరాః!=దేవతాశ్రేష్ఠులారా!, అహమ్=నేను, ప్రథమమేవ=ఆది నుంచియే, ఆసమ్=ఉంటిని, వర్తామి చ=ఉంటున్నాను గూడ, భవిష్యామి చ=శాశ్వతంగా ఉండగలను గూడా, అస్మిన్=ఈ, లోకే=లోకమునందు, మత్తః=నా కన్న, అన్యః=ఇతరుడు, కశ్చన=ఎవడున్ను, నాస్తి=లేడు.

**తాత్పర్యము:–** దేవతలారా! అనాది కాలమునుంచీ నేనే ఉన్నాను. వర్తమానమునందు అవిచ్ఛిన్నముగా నేనే ఉన్నాను. శాశ్వతముగా భవిష్యత్తులోనూ నేనే ఉండగలను. నా కన్న వేరయినవాడు ఈ ప్రపంచములో ఎవడును లేడు, అనగా అందఱు, అన్ని నా స్వరూపమే.

**శ్లో॥ వ్యతిరిక్తం చ మత్తోఽస్తి నాన్యత్కిఞ్చిత్సురేశ్వరాః।**
**నిత్యోఽనిత్యోఽహమనఘో బ్రహ్మాణాం బ్రహ్మణస్పతిః॥ 11**

**ప్రతిపదార్థము:–** సురేశ్వరాః!=దేవతా శ్రేష్ఠులారా!, మత్తః=నాకన్న, వ్యతిరిక్తం చ= భిన్నమైనది, అన్యత్=మఱొకటి, కించిత్=ఏదైనను, నాస్తి=లేదు, అహమ్=నేను, నిత్యః= నిత్యుడను, అనిత్యః=అనిత్యుడను, అనఘః=పాపరహితుడను, బ్రహ్మాణామ్=బ్రహ్మలకే, బ్రహ్మణః=వేదమునకు, పతిః=ప్రభువును.

**తాత్పర్యము:–** దేవతలారా! నాకన్న భిన్నమైన అస్తిత్వం కలది ఈ ప్రపంచమున వేఱొకటి లేదు. నేనే నిత్యుడను. అనిత్య పదార్థములున్ను నా స్వరూపమే. పాపరహితుడను. బ్రహ్మలకు, వేదమునకున్ను నేను ప్రభువును.

**శ్లో॥ దక్షిణాశ్చ ఉదఞ్చోఽహం ప్రాఞ్చః ప్రత్యఞ్చ ఏవ చ।**
**అధశ్చోర్ధ్వం చ విదిశో దిశశ్చాహం సురేశ్వరాః॥ 12**

**ప్రతిపదార్థము:–**సురేశ్వరాః!=దేవతలారా!, దక్షిణాః=దక్షిణములు, ఉదంచశ్చ=ఉత్తరములైన దిక్కులును, అహమ్=నేనే, ప్రాంచః=తూర్పులు, ప్రత్యంచ ఏవ చ=పడమరలు, అధశ్చ=

అధోభాగమున్ను, ఊర్ధ్వం చ=ఊర్ధ్వమున్ను అయిన, దిశశ్చ=దిక్కులున్ను, విదిశః =విదిక్కులు, మూలలున్ను, అహమ్=నేనే.

**తాత్పర్యము:–** దక్షిణము, ఉత్తరము, తూర్పు, పడమర, అధరం, ఊర్ధ్వము అను దిక్కులు వాటిమూలలు అన్నియు నేనే. లేదా ఇంకొక అర్థం చెప్పవచ్చును. దక్షిణులు అయినవారు ఉత్తములైనవారు, పూజ్యులు, వ్యతిరేకులు, అధములు, ఊర్ధ్వ–అథోలోకవాసులు, వారున్ను దిక్కులు, విదిక్కులు అన్నీ నేనే.

**శ్లో॥ సావిత్రీ చాపి గాయత్రీ స్త్రీపుమానపుమానపి।**
**త్రిష్టుబ్జగత్యనుష్టుప్ చ పంక్తిశ్ఛన్దస్త్రయీమయః॥ 13**

**ప్రతిపదార్థము:–** సావిత్రీ చాపి=సావిత్రి, గాయత్రీ=గాయత్రి, స్త్రీ=స్త్రీ, పుమాన్=పురుషుడు, అపుమానపి=నపుంసకుడు / నపుంసకమున్ను, త్రిష్టుప్=త్రిష్టుప్ అనబడు ఛందస్సు, జగతీ=జగతీ అనబడు ఛందస్సు, అనుష్టుప్ చ=అనుష్టుప్ఛందస్సున్ను, పంక్తిః=పంక్తి ఛ్ఛందస్సును, ఛందః=సకల ఛ్ఛందస్సులున్ను నేనే, త్రయీమయః=వేదత్రయస్వరూపుడను నేనే.

**తాత్పర్యము:–** సావిత్రి, గాయత్రి, స్త్రీ, పురుషుడు, నపుంసకుడు, త్రిష్టుప్ఛందస్సు, జగతీ ఛందస్సు, అనుష్టుప్ఛందస్సు, పంక్తిచ్ఛందస్సు, సకల ఛందస్సులును మరియు వేదత్రయ స్వరూపుడను నేనే.

**శ్లో॥ సత్యోఽహం సర్వగః శాన్తస్త్రేతాగ్నిర్గౌరవం గురుః।**
**గౌరహం గహ్వరం చాహం ద్యౌరహం జగతాం విభుః॥ 14**

**ప్రతిపదార్థము:–** అహమ్=నేను, సత్యః=సత్యమును, సర్వగః=సర్వగతుడను, శాంతః= శాంతుడను, త్రేతాగ్నిః=త్రేతాగ్ని స్వరూపుడను, గౌరవమ్=గురుత్వరూపుడను, గురుః= గురుస్వరూపుడను, అహమ్=నేను, గౌః=గో స్వరూపుడను, లేదా భూ స్వరూపుడను, అహమ్=నేను, గహ్వరం చ=ఆకాశ స్వరూపుడను, అహమ్=నేను, ద్యౌః=స్వర్గలోక రూపుడను, జగతామ్=ఈ లోకములన్నింటికి, విభుః=సర్వవ్యాపి అయిన ప్రభువును.

**తాత్పర్యము:–** నేను సత్యమును, సర్వగతుడను, శాంతుడను, త్రేతాగ్ని స్వరూపుడను, గురుత్వరూపుడను, గురుస్వరూపుడను, గో స్వరూపుడను లేదా భూ స్వరూపుడను, ఆకాశ స్వరూపుడను, స్వర్గలోకరూపుడను, ఈ లోకములన్నింటికి సర్వవ్యాపి అయిన ప్రభువును.

**శ్లో॥ జ్యేష్ఠః సర్వసురశ్రేష్ఠో వర్షిష్ఠోహమపాంపతిః।**
**ఆర్యోఽహం భగవానీశ స్తేజోఽహం చాదిరప్యహమ్॥ 15**



**ప్రతిపదార్థము:–** జ్యేష్ఠః=అందరికన్న పెద్దవాడను, అహమ్=నేను, సర్వసుర=సమస్త దేవతలలో శ్రేష్ఠః=శ్రేష్ఠుడను, వర్షిష్ఠః=వృద్ధుడను, అహమ్=నేను, అపాంపతిః=సముద్రుడను నేను, అహమ్=నేను, ఆర్యః=పూజ్యుడను, భగవాన్=ఆరువిధములైన ఐశ్వర్యము గలవాడను ఈశః=అణిమాది అష్టైశ్వర్యములు గలవాడను, అహమ్=నేను, తేజః చ=తేజస్సును, అహమ్=నేను, ఆదిరపి=ఆదిరూపుడను లేదా అకారాది వాఙ్మయ రూపుడను. (ఉత్పత్తి లయము, భూతగమనాగమనములు, విద్య, అవిద్య ఇవి భగము/ఐశ్వర్యము)

**తాత్పర్యము:–** అందరికన్న పెద్దవాడను నేను. నేను సమస్త దేవతలలో శ్రేష్ఠుడను, వృద్ధుడను. నేను సముద్రుడను, నేను పూజ్యుడను. ఆరువిధములైన ఐశ్వర్యము గలవాడను, అణిమాది అష్టైశ్వర్యములు గలవాడను. నేను తేజస్సును, నేను ఆదిరూపుడను లేదా అకారాది వాఙ్మయ రూపుడను.

**శ్లో॥ ఋగ్వేదోఽహం యజుర్వేదః సామవేదోఽహమాత్మభూః।**
**అథర్వణశ్చ మన్త్రోఽహం తథా చాంగిరసో వరః॥ 16**

**ప్రతిపదార్థము:–** ఆత్మభూః=స్వయంభువునైన, అహమ్=నేనే, ఋగ్వేదః=ఋగ్వేదమును, యజుర్వేదమును, అహమ్=నేనే, సామవేదః=సామవేదమును, అహమ్=నేను, అథర్వణశ్చ= అథర్వ ఋషియొక్క, మంత్రః=మంత్రమైన అథర్వణవేదమును, అహమ్=నేను,తథా చ =అట్లే, ఆంగిరసః=ఆంగిరసుడను నేను, వరః=గొప్పవాడను.

**తాత్పర్యము:–** స్వయంభువునైన నేనే ఋగ్వేదమును, యజుర్వేదమును, సామవేదమును అయి ఉన్నాను. అథర్వ ఋషియొక్క మంత్రమైన అథర్వణవేదమును అట్లే ఆంగిరసుడను నేనే. నేను గొప్పవాడను.

**శ్లో॥ ఇతిహాసపురాణాని కల్పోఽహం కల్పవానహమ్।**
**నారాశంసీ చ గాథాఽహం విద్యోపనిషదోఽస్మ్యహమ్॥ 17**

**ప్రతిపదార్థము:–** ఇతిహాస=ఇతిహాసములు, పురాణాని=పురాణములు, కల్పః=కల్పము, అహమ్=నేను, కల్పవాన్=కల్పముగలవాడను, అహమ్=నేను, నారాశంసీ చ=ఊర్వశీ పురూరవాది సంబంధమైన, గాథా=కథ, అహమ్=నేను, విద్యా=విద్యను, అహమ్=నేను, ఉపనిషదః =ఉపనిషత్తులు, అస్మి=నేను.

**తాత్పర్యము:–** ఇతిహాసములు, పురాణములు, కల్పము నేనే. కల్పము గలవాడను నేనే. ఊర్వశీ పురూరవాది నరగాథలున్ను నేనే. విద్యయునూ, ఉపనిషత్తులునూ నేనే.

**విశేషము:–** అసలు పాఠం అన్ని పుస్తకాలలో 'నారాశంసీ' అని ఉన్నది. 'నారాశంసీ' అంటే మనుష్యుల ఇతివృత్తము అని కొందరు, ఊర్వశీపురూరవగాథ అని కొందరు వ్రాశారు.

**శ్లో॥ శ్లోకాః సూత్రాణి చైవాహమనువ్యాఖ్యానమేవ చ।**
**వ్యాఖ్యానాని తథా విద్యా ఇష్టం హుతమథాహుతిః॥ 18**

**ప్రతిపదార్థము:–** శ్లోకాః=శ్లోకాలు, సూత్రాణిచైవ=సూత్రములుగూడ, అహమ్=నేనే, అనువ్యాఖ్యానమేవ చ=వ్యాఖ్యానమునకు చేయు వ్యాఖ్యానమును, వ్యాఖ్యానాని=వ్యాఖ్యానములు, తథా=అట్లే, విద్యాః=విద్యలు, ఇష్టమ్=యజ్ఞము, హుతమ్=హోమము చేయబడినది, అథ=అట్లే, ఆహుతిః=ఆహుతి, నేనే.

**తాత్పర్యము:–** శ్లోకాలు, సూత్రములుగూడా నేనే. వ్యాఖ్యానములు, వ్యాఖ్యానమునకు చేయు వ్యాఖ్యానమును అట్లే విద్యలు, యజ్ఞము, హోమము చేయబడినది, అట్లే ఆహుతి అన్నియు నేనే.

**శ్లో॥ దత్తాదత్తమయం లోకః పరలోకోఽహమక్షరః।**
**క్షరః సర్వాణి భూతాని దాన్తిః శాన్తిరహం ఖగః॥ 19**

**ప్రతిపదార్థము:–** దత్త=ఇవ్వబడినది, అదత్తమ్=ఇవ్వబడనిది, అయమ్=ఈ, లోకః=లోకము పరలోకః=పరలోకము, అహమ్=నేనే, అక్షరః=అక్షర పురుషుడను నేనే, క్షరః=క్షరమైనదీ నేనే, సర్వాణి=అన్నిరకాల, భూతాని=భూతాలు నేనే, దాంతిః=దమము, శాంతిః=శమము నేనే, అహమ్=నేను, ఖగః=పక్షిని.

**తాత్పర్యము:–** ఇవ్వబడినది, ఇవ్వబడనిది, ఈ లోకము, పరలోకము అన్నియు నేనే. అక్షర పురుషుడను నేనే. క్షరమైనదీ నేనే, అన్నిరకాల భూతాలు నేనే. దమము, శమము నేనే. నేను పక్షిని.

**శ్లో॥ గుహ్యోఽహం సర్వవేదేషు ఆరణ్యోఽహమజోఽప్యహమ్।**
**పుష్కరం చ పవిత్రం చ మధ్యం చాహమతః పరమ్॥ 20**

**ప్రతిపదార్థము:–** సర్వవేదేషు=అన్నివేదములందు, గుహ్యః=రహస్య పదార్థము, అహమ్=నేను, ఆరణ్యః=ఆరణ్య పదార్థము లేదా అరణివలన పుట్టిన యజ్ఞాగ్ని, అహమ్=నేను, అజోఽపి=బ్రహ్మయును లేదా గొఱ్ఱెయును, అహమ్=నేను, పుష్కరం చ=ఆకాశము, పవిత్రం చ=పవిత్రమున్ను,మధ్యం చ=మధ్యమున్ను, అతః=ఇంతకన్న, పరమ్=పరమై–
–నదియు, నేను.



**తాత్పర్యము:–** అన్నివేదములందు రహస్యపదార్థము నేను. ఆరణ్య పదార్థము లేదా అరణివలన పుట్టిన యజ్ఞాగ్ని నేను. బ్రహ్మయును లేదా గొఱ్ఱెయును నేను. ఆకాశము, పవిత్రమున్ను, మధ్యమున్ను, ఇంతకన్న పరమైనదియు నేనే.

**శ్లో॥ బహిశ్చాహం తథా చాన్తః పురస్తాదహమవ్యయః।**
**జ్యోతిశ్చాహం తమశ్చాహం తన్మాత్రాణీంద్రియాణ్యహమ్॥ 21**

**ప్రతిపదార్థము:–** బహిశ్చ=బాహ్యప్రదేశమున్ను, అహమ్=నేనే, తథాచ=అట్లే, అంతః=అంతర్గతప్రదేశం నేనే, పురస్తాత్=ఎదుటనున్నవాడిని నేనే, అహమ్=నేను, అవ్యయః=నాశము లేనివాడను, జ్యోతిశ్చ=వెలుగున్ను, అహమ్=నేనే, తమశ్చ=చీకటియును, అహమ్=నేనే, తన్మాత్రాణి=పంచతన్మాత్రలు, ఇంద్రియాణి=పంచేంద్రియాలు, అహమ్=నేనే.

**తాత్పర్యము:–** బాహ్యప్రదేశమున్నూ, అంతర్గత ప్రదేశం నేనే. ఎదుటనున్నవాడిని, నాశము లేనివాడను నేనే. వెలుగున్ను, చీకటియును నేనే. పంచతన్మాత్రలు, పంచేంద్రియాలు నేనే.

**శ్లో॥ బుద్ధిశ్చాహమహఙ్కారో విషయాణ్యహమేవ హి।**
**బ్రహ్మావిష్ణుర్మహేశోఽ హముమా స్కన్దో వినాయకః॥ 22**

**ప్రతిపదార్థము:–** బుద్ధిశ్చ=బుద్ధియును, అహమ్=నేనే, అహంకారః=అహంకారము, విషయాణి=విషయాలు, అహమేవ హి=నేనేగదా!, అహమ్=నేనే, బ్రహ్మా=బ్రహ్మను, విష్ణుః=విష్ణువును, మహేశః=మహేశ్వరుడను, ఉమా=పార్వతిని, స్కందః=కుమారస్వామిని, వినాయకః=వినాయకుడను నేను.

**తాత్పర్యము:–** బుద్ధియును, అహంకారమును నేనే. విషయాలు నేనేగదా! నేనే బ్రహ్మను, విష్ణువును, మహేశ్వరుడను, పార్వతిని, కుమారస్వామిని, వినాయకుడను.

**శ్లో॥ ఇన్ద్రోఽగ్నిశ్చ యమశ్చాహం నిరృతిర్వరుణోఽనిలః।**
**కుబేరోఽహం తథేశానో భూర్భువః స్వర్మహర్జనః॥ 23**

**ప్రతిపదార్థము:–** ఇంద్రః=ఇంద్రుడు, అగ్నిశ్చ=అగ్నియును, యమశ్చ=యముడున్ను, అహమ్=నేనే, నిరృతిః=నిరృతి, వరుణః=వరుణుడు, అనిలః=గాలి, కుబేరః=కుబేరుడున్ను, అహమ్=నేనే, తథా=అట్లే, ఈశానః=ఈశానుడను నేనే, భూః=భూలోకము, భువః=భువర్లోకము, స్వః=స్వర్లోకము, మహః=మహర్లోకము, జనః=జనోలోకము నేనే.

**తాత్పర్యము:–** ఇంద్రుడు, అగ్నియును, యముడున్ను నేనే. నిరృతి, వరుణుడు, గాలి, కుబేరుడున్ను నేనే. అట్లే ఈశానుడను,భూలోకము, భువర్లోకము, స్వర్లోకము, మహర్లోకము, జనోలోకమునూ నేనే.

**శ్లో॥ తపస్సత్యం చ పృథివీచాపస్తేజోఽనిలోఽప్యహమ్।**
**ఆకాశోఽహం రవిః సోమో నక్షత్రాణి గ్రహాస్తథా॥ 24**

**ప్రతిపదార్థము:–** తపః=తపోలోకము, సత్యం చ=సత్యలోకమున్ను నేనే. పృథివీచ=నేల, ఆపః=నీళ్ళూ, తేజః=అగ్ని, అనిలోపి=గాలియును, అహమ్=నేనే. అహమ్=నేనే, ఆకాశః =ఆకాశము, రవిః=సూర్యుడు, సోమః=చంద్రుడు, నక్షత్రాణి=నక్షత్రములు, తథా=అట్లే, గ్రహాః=గ్రహములు నేనే.

**తాత్పర్యము:–** తపోలోకము, సత్యలోకమున్ను నేనే. నేల, నీళ్ళూ, అగ్ని, గాలియును నేనే. నేనే ఆకాశము, సూర్యుడు, చంద్రుడు, నక్షత్రములు, గ్రహములును.

**శ్లో॥ ప్రాణః కాలస్తథా మృత్యురమృతం భూతమప్యహమ్।**
**భవ్యం భవిష్యత్కృత్స్నం చ విశ్వం సర్వాత్మకోఽప్యహమ్॥ 25**

**ప్రతిపదార్థము:–** ప్రాణః=ప్రాణము, కాలః=కాలము, తథా=అట్లే, మృత్యుః=మృత్యువు, అమృతమ్=అమృతము, భూతమపి=భూతకాలమున్ను, అహమ్=నేనే, భవ్యమ్=జరుగుచున్నది, భవిష్యత్=జరుగబోవునది, కృత్స్నమ్=సమస్తమైన, విశ్వం చ=విశ్వమున్ను, అహమ్ =నేను, సర్వ=ఈ సర్వ పదార్థములకు ఆత్మకోపి=ఆత్మను గూడా, అహమ్=నేను.

**తాత్పర్యము:–** ప్రాణము, కాలము, అట్లే, మృత్యువు, అమృతము, భూతకాలమున్ను నేనే. జరుగుచున్నది, జరుగబోవునది, సమస్తమైన, విశ్వమున్ను నేను. ఈ సర్వ పదార్థములకు ఆత్మను గూడా నేను.

**శ్లో॥ ఓమాదౌ చ తథా మధ్యే భూర్భువః స్వస్తథైవ చ।**
**తతోఽహం విశ్వరూపోఽస్మి శీర్షం చ జపతాం సదా॥ 26**

**ప్రతిపదార్థము:–** ఓమాదౌ=ఓంకారముయొక్క ఆదియందు, తథా=అట్లే, మధ్యే చ=మధ్యయందును, భూర్భువఃస్వః=భూ, భువః, సువః లోకములలోను, తథైవ చ=అట్లే ఉంటిని. తతః=అందువలన, అహమ్=నేను, విశ్వరూపః=విశ్వస్వరూపుడను, అస్మి=అగుచున్నాను, సదా=ఎల్లప్పుడు, జపతామ్=జపించువారికి, శీర్షం చ=తలను నేనే.

**తాత్పర్యము:–** ఓంకారము యొక్క ఆది మధ్యలయందు నేనే ఉన్నాను. దానికిముందున్నదీ నేనే. మధ్యలోని భూః, భువః, స్వః – నేనే. ఈ జపించు వారి తలను నేనే. కనుక నేను విశ్వరూపుడను.

**శ్లో॥ అశితం పాయితం చాహం కృతం చాకృతమప్యహమ్।**
**పరం చైవాపరం చాహమహం సర్వపరాయణః॥ 27**



**ప్రతిపదార్థము:–** అశితమ్=తినుట, పాయితం చ=త్రాగించుటయు, అహమ్=నేనే, కృతం చ=చేయబడినది, అకృతమ్=చేయబడనిదియు, అహమ్=నేనే, పరం చైవ=పరము, అపరం చ=అపరమున్ను, అహమ్=నేనే, అహమ్=నేనే, సర్వ=సమస్తమునకు, పరాయణః =గమ్యము.

**తాత్పర్యము:–** తినుట, తినిపించుట, త్రాగుట, త్రాగించుట, చేయుట, చేయకుండుట, పరము, అపరము అన్నియు నేనే. నేను సర్వలక్ష్యమైన స్థానమును.

**శ్లో॥ అహం జగద్ధితం దివ్యమక్షరం సూక్ష్మమప్యహమ్।**
**ప్రాజాపత్యం పవిత్రం చ సౌమ్యమగ్రాహ్యమగ్రియమ్॥ 28**

**ప్రతిపదార్థము:–** అహమ్=నేను, జగత్=ప్రపంచమునకు, హితమ్=శ్రేయస్సును, దివ్యమ్= దివ్యమైన, అక్షరమ్=అక్షరమును, అహమ్=నేను, సూక్ష్మమపి=సూక్ష్మమును, పవిత్రమ్= పవిత్రమైన, ప్రాజాపత్యం చ=ప్రాజాపత్యమును, సౌమ్యమ్=సౌమ్యమును, అగ్రాహ్యమ్= గ్రహింపదగనిదానిని, అగ్రియమ్=అగ్రపూజార్హమైన వానిని లేదా మొదటి వస్తువును.

**తాత్పర్యము:–** నేను జగత్తుకు శ్రేయస్సును, అక్షరమైన దివ్యమైన వస్తువును. సూక్ష్మ పదార్థమును నేను పవిత్రమైన ప్రాజాపత్యమును, సౌమ్యయాగమును నేను, అగ్రాహ్యము నేనే. అగ్రియము నేనే.

**శ్లో॥ అహమేవోపసంహర్తా మహాగ్రాసౌజసాం నిధిః।**
**హృది యో దేవతాత్వేన ప్రాణత్వేన ప్రతిష్ఠితః॥ 29**

**ప్రతిపదార్థము:–** అహమేవ=నేనే, ఉపసంహర్తా=సర్వమునుపసంహరించువాడను, మహాగ్రాస=మహాహారము గ్రసించునట్టి, ఓజసామ్=తేజస్సులకు, నిధిః=నిక్షేపమును నేను. యః=ఏ నేను, హృది=ప్రాణి హృదయమునందు, దేవతాత్వేన=దేవతగా, ప్రాణత్వేన= ప్రాణముగా, ప్రతిష్ఠితః=ప్రతిష్ఠింపబడినవాడను.

**తాత్పర్యము:–** నేను ఉపసంహరించువాడను. ప్రాణుల హృదయములందు ప్రాణరూపంగాను, దేవతారూపంగాను, ఉన్న నేను మహాగ్రాసములైన ఓజస్సులకు నిక్షేపమును.

**శ్లో॥ శిరశ్చోత్తరతో యస్య పాదౌ దక్షిణతస్తథా।**
**యశ్చ సర్వాన్తరః సాక్షాదోంకారోహం త్రిమాత్రకః 30**

**ప్రతిపదార్థము:–** యస్య=దేనియొక్క, శిరశ్చ=శిరస్సు, ఉత్తరతః=ఉత్తరముగాను, తథా=అట్లే, పాదౌ=పాదములు, దక్షిణతః=దక్షిణముగాను ఉండునో, యశ్చ=ఏది, సాక్షాత్=నేరుగా, సర్వ=సమస్త ప్రాణులకు, ఆంతరః=లోపలిదో, త్రిమాత్రకః=మూడు మాత్రలు గల, ఓంకారః =ఆ ఓంకారము, అహమ్=నేనే.

**తాత్పర్యము:–** దేని శిరస్సు ఉత్తరముగానూ, దేని పాదములు దక్షిణముగానూ ఉండునో, ఏది సాక్షాత్తుగా, సర్వ ప్రాణులయందు శ్వాసరూపముగా, ప్రాణనాద రూపముగా ఉండునో ఆ మాత్రాత్రయ (అఉమ్) రూపమైన 'ఓం' కారము నేనే.

**శ్లో॥ ఊర్ధ్వం చోన్నామయే యస్మాదధశ్చాపనయామ్యహమ్।**
**తస్మాదోఙ్కార ఏవాహమేకో నిత్యః సనాతనః॥ 31**

**ప్రతిపదార్థము:–** యస్మాత్=ఎందువలన, అహమ్=నేను, ఊర్ధ్వం చ=పైకి, ఉన్నామయే=లాగగలనో, అధశ్చ=క్రిందకున్ను, అపనయామి=దించగలనో, తస్మాత్=అందువలన, అహమ్=నేను, ఓంకార ఏవ=ఓంకారమునే, ఏకః=ఒక్కడను, నిత్యః=నిత్యుడను, సనాతనః=సనాతనుడను.

**తాత్పర్యము:–** ఊర్ధ్వమునకు తేగలను, అథోభాగమునకు పంపగలను. కనుక నేను ఓంకారమును. అనగా ఓంకారము ఉద్గీథమై ఊర్ధ్వలోకములకు అనగా సువర్లోకమునకు తీసికొని పోగలను. తర్వాత మఱల 'భూ' లోకమునకు దింపగలదు. అట్లే నేనును చేయగలను. కనుక ఓంకారము నేనే. ఏకాకిని, నిత్యుడను, సనాతనుడను.

**శ్లో॥ ఋచో యజూంషి సామాని యో బ్రహ్మ యజ్ఞకర్మణి।**
**ప్రణామయే బ్రాహ్మణేభ్యస్తేనాహం ప్రణవో మతః॥ 32**

**ప్రతిపదార్థము:–** యః=ఏ నేను, బ్రహ్మ=బ్రహ్మమునై / ఓంకారమునై, యజ్ఞ=యాగ సంబంధమైన, కర్మణి=పనియందు, ఋచః=ఋక్కులను, యజూంషి=యజుస్సులను, సామాని=సామములను, బ్రాహ్మణేభ్యః=వేదవేత్తలకు, ప్రణామయే=అందించెదను, తేన=అందుచేత, అహమ్=నేను, ప్రణవః=ప్రణవముగా, మతః=తలచబడితిని.

**తాత్పర్యము:–** ఓంకారము వేదవేత్తలకు యజ్ఞకర్మలలో ఋగ్వేదాది మంత్రములను అందించును గనుక, ప్రణవము. అట్లే నేనును చేసెదను కనుక నేనే ఆ ప్రణవస్వరూపుడను.

**శ్లో॥ స్నేహో యథా మాంసపిణ్డం వ్యాప్నోతి వ్యాపయత్యపి।**
**సర్వాన్ లోకానహం తద్వత్సర్వవ్యాపీ తతోఽ స్మ్యహమ్॥ 33**

**ప్రతిపదార్థము:–**స్నేహః=నూనె,మాంసపిండమ్=మాంసపు ముద్దను,యథా=ఏవిధముగా, వ్యాప్నోతి=వ్యాపించునో, వ్యాపయత్యపి=వ్యాపింపజేయునో, తద్వత్=అలా, అహమ్=నేను, సర్వాన్=సమస్తమైన, లోకాన్=లోకములను, వ్యాపించి=వ్యాపింపజేయుచున్నాను, తతః=అందువలన, అహమ్=నేను, సర్వవ్యాపీ=సర్వవ్యాపిని, అస్మి=అగుచున్నాను.



**తాత్పర్యము:–** నూనె, మాంసపిండమునందు వ్యాపించి దానిని ఎలా వ్యాపింపజేయుచున్నదో నేను అలా సర్వలోకములను వ్యాపింపజేయుచున్నాను. కనుక నన్ను 'సర్వవ్యాపి' అందురు.

**శ్లో॥ బ్రహ్మా హరిశ్చ భగవానాద్యన్తం నోపలబ్ధవాన్।**
**తతోఽన్యే చ సురాః యస్మాదనన్తోఽహమితీరితః॥ 34**

**ప్రతిపదార్థము:–** బ్రహ్మా=బ్రహ్మయు, భగవాన్=భగవంతుడైన, హరిశ్చ=విష్ణువున్ను, ఆద్యంతమ్=నా తుది మొదళ్ళను, నోపలబ్ధవాన్=పొందలేదో, అన్యే=ఇతరులైన, సురాః చ=దేవతలున్ను పొందలేక పోయినారో, తతః=అందువలన, అహమ్=నేను, అనంత ఇతి=అనంతుడని, ఈరితః=చెప్పబడితిని.

**తాత్పర్యము:–** పురాణ కథలలోని లింగోద్భవ వృత్తాంతంలో ఆవిర్భవించిన శివలింగము యొక్క ఆదిని విష్ణువు, అంతమును బ్రహ్మయు కనుగొనలేదు. అట్లే కేనోపనిషత్తులో ఆవిర్భవించిన 'యక్ష తేజస్సును' గూర్చి దేవతలు తెలిసికొనజాలకపోయిరి. కనుక నా ఆద్యంతములు ఎవరికి తెలియవు, కనుక నన్ను అనంతుడని పిలిచెదరు.

**శ్లో॥ గర్భజన్మజరామృత్యుసంసారభవసాగరాత్।**
**తారయామి తతో భక్తం తస్మాత్తారోఽహమితీరితః॥ 35**

**ప్రతిపదార్థము:–**గర్భ=గర్భవాసము, జన్మ=జననము, జరా=వార్ధకము, మృత్యు=మరణము, సంసార=సంసరించుట అను, భవసాగరాత్=సంసారసముద్రమునుండి, భక్తమ్=భక్తుని, యతః=ఎందువలన, తారయామి=దాటించెదనో, తస్మాత్=అందువలన, అహమ్=నేను, తారః=తారుడను, ఇతి=అని, ఈరితః=పలుకబడితిని.

**తాత్పర్యము:–** గర్భవాసము, జననము, సంసారములో ఉండటం, ముసలితనం, మరణం అనే యీ సంసారసముద్రమునుండి భక్తుని తరింపజేయు వాడను కనుక నన్ను "తారుడు" అందురు.

**శ్లో॥ చతుర్విధేషు దేహేషు జీవత్వేన వసామ్యహమ్।**
**సూక్ష్మో భూత్వా చ హృద్దేశే యత్తత్సూక్ష్మః ప్రకీర్తితః॥ 36**

**ప్రతిపదార్థము:–** చతుర్విధేషు=అండజము మొగలు నాల్గురకముల, దేహేషు=దేహముల యందు, అహమ్=నేను, సూక్ష్మః=సూక్ష్మరూపుడను, భూత్వా=అయి, హృద్దేశే=హృదయ దేశమునందు, జీవత్వేన=జీవుడుగా, యత్=ఎందువలన, వసామి=నివసించుచున్నానో, తత్=అందువలన, సూక్ష్మః=సూక్ష్ముడని, ప్రకీర్తితః=చెప్పబడితిని.

**తాత్పర్యము:-** అండజ జరాయుజాది చతుర్విధ ప్రాణిదేహములయందు నేను సూక్ష్మ రూపుడనై హృదయప్రాంతమున జీవుడుగా నుండెదను. గనుక నన్ను "సూక్ష్ముడు" అందురు.

**శ్లో॥ మహాతమసి మగ్నేభ్యో భక్తేభ్యో యత్ప్రకాశయే।**
**విద్యుద్వదతులం రూపం తస్మాద్వైద్యుతమస్మ్యహమ్॥ 37**

**ప్రతిపదార్థము:-** మహాతమసి=గాఢమైన అజ్ఞానమునందు, మగ్నేభ్యః=మునిగిన, భక్తేభ్యః =భక్తులకొఱకు, విద్యుద్వత్=మెఱపుతీగవలె, అతులమ్=నిరూపమానమైన, రూపమ్=నా రూపమును, యత్=ఎందువలన, ప్రకాశయే=ప్రకటించెదనో, తత్=అందువలన, అహమ్= నేను, తస్మాత్=ఆ, వైద్యుతమ్=వైద్యుతమును, అస్మి=అగుచున్నాను.

**తాత్పర్యము:-** అజ్ఞాన గాఢాంధకారమున మునిగిపోయిన భక్తులకు మెఱపు తీగవలె నా జ్ఞాన స్వరూపమును ప్రకటించెదను గనుక నన్ను "వైద్యుత" మందురు.

**శ్లో॥ ఏక ఏవ తతో లోకాన్ విసృజామి సృజామి చ।**
**వివాసయామి గృహ్ణామి తస్మాదేకోఽహమీశ్వరః॥ 38**

**ప్రతిపదార్థము:-**ఏక ఏవ=ఒక్కడనే,లోకాన్=లోకములను, యతః=ఎందువలన, విసృజామి =వదలెదను, సృజామి=సృజించెదను, వివాసయామి=వెళ్ళగొట్టెదను, గృహ్ణామి=స్వీకరించె- -దను, తస్మాత్=అందువలన, అహమ్=నేను, ఏకః=ఒకడయిన, ఈశ్వరః=ఈశ్వరుడను.

**తాత్పర్యము:-** ఈలోకములను నేను ఒకడనే సృష్టించెదను, లయించెదను, నెట్టివేసెదను, స్వీకరించెదను కనుక నన్ను "ఏక" అని ఈశ్వరుడని అందురు.

**శ్లో॥ న ద్వితీయో యతస్తస్థే తురీయం బ్రహ్మ యత్స్వయమ్।**
**భూతాన్యాత్మని సంహృత్య చైకో రుద్రో వసామ్యహమ్ 39**

**ప్రతిపదార్థము:-** యతః=ఏ, నాకన్న, ద్వితీయః=రెండవవాడు, న తస్థే=లేదో, యత్= ఏ, నేను స్వయమ్=స్వయముగా, తురీయమ్=నాల్గవదశలోని, బ్రహ్మ=బ్రహ్మమునో, అందువలన, భూతాని=భూతములను, ఆత్మని=నాయందు, సంహృత్య చ=ముడుచుకొని, అహమ్=నేను, ఏకః=ఒక, రుద్రః=రుద్రుడుగా, వసామి=నివసిచుచున్నాను.

**తాత్పర్యము:-** నా కన్న భిన్నముగా రెండవవాడు లేడు. నేనే స్వయముగా తురీయ తత్త్వమును, ఈ భూతములను అన్నింటిని లయకాలమున నాయందు ఉపసంహరించికొని ఏకస్వరూపముతో 'రుద్రుడు' గా నుండెదను. కనుక నన్ను 'ఏకమని' రుద్రుడని అనెదరు.

**శ్లో॥ సర్వాన్ లోకాన్ యదీశేఽహమీశనీభిశ్చ శక్తిభిః।**
**ఈశానమస్య జగతః స్వర్దృశం చక్షురీశ్వరమ్॥ 40**



**ప్రతిపదార్థము:-** ఈశనీభిః=ఈశ్వరత్వముగల, శక్తిభిశ్చ=శక్తులతోను, సర్వాన్=సమస్తమైన, లోకాన్=లోకములను, ఈశే యత్=ఏలుచున్నాను గనుక, స్వర్దృశమ్=స్వర్లోక దృష్టిగల అనగా తృతీయజ్ఞాననేత్రముగల, ఈశ్వరమ్=ఈశ్వరుడైన నన్ను, అస్య=ఈ, జగతః= ప్రపంచమునకు, ఈశానమ్=ఈశానునిగా, చక్షుః=చెప్పిరి.

**తాత్పర్యము:-** సర్వలోకములను నా యీశనీ శక్తులతో ఏలుచున్నాను గనుక, త్రినేత్రుడనైన నన్ను జగత్తుకు ఈశానునిగా చెప్పుచున్నారు.

**శ్లో॥ ఈశానశ్చాస్మి జగతాం సర్వేషామపి సర్వదా।**
**ఈశానః సర్వవిద్యానాం యదీశానస్తతోఽస్మ్యహమ్॥ 41**

**ప్రతిపదార్థము:-** సర్వేషామ్=సమస్తమైన, జగతామ్=లోకములకు, సర్వదాపి=ఎల్లప్పుడు, ఈశానశ్చ=ఈశ్వరుడను, అస్మియత్=అయినందువలన, సర్వవిద్యానామ్=సకలవిద్యులకు, ఈశానః యదస్మి=ఈశ్వరుడనైనందున, తతః=అందువలన, అహమ్=నేను, ఈశానః= ఈశానుడను, అస్మి=అగుచున్నాను.

**తాత్పర్యము:-** సర్వలోకములకు, సర్వకాలములందు ఈశ్వరుడనైనందువలన సకల విద్యలకు అధిపతినైనందువలన నేను ఈశానుడనైతిని.

**శ్లో॥ సర్వభావాన్నిరీక్షేఽహమాత్మజ్ఞానం నిరీక్షయే।**
**యోగం చ గమయే తస్మాద్భగవాన్మహతో మతః॥ 42**

**ప్రతిపదార్థము:-** సర్వ=సమస్తమైన, భావాన్=భావములను/పదార్థములను, అహమ్=నేను, నిరీక్షే=పరిశీలించెదను, ఆత్మజ్ఞానమ్=ఆత్మజ్ఞానమును గూడా, నిరీక్షయే=గమనించెదను, యోగం చ=యోగమును గూడా, గమయే=లక్ష్యమును పొందించెదను, తస్మాత్=ఆ, మహతః=మహాగుణమువలన, భగవాన్=భగవంతుడుగా, మతః=తలచబడితిని.

**తాత్పర్యము:-**సర్వపదార్థములను,సర్వభావములను గమనించెదను గనుక,ఆత్మజ్ఞానమును, నిరీక్షించెదను కనుక, యోగమును పొందించెదను గనుక, నన్ను భగవంతుడందురు.

**శ్లో॥ అజస్రం యచ్చ గృహ్ణామి విసృజామి సృజామి చ।**
**సర్వాంల్లోకాన్వాసయామి తేనాహం వై మహేశ్వరః॥ 43**

**ప్రతిపదార్థము:-** అజస్రమ్=ఎల్లప్పుడు, సర్వాన్=సమస్తమైన, లోకాన్=లోకములను, గృహ్ణామి=గ్రహించెదను, విసృజామి=వదలెదను, సృజామి చ=సృష్టించెదను, వాసయామి చ=ఉంచెదను, యత్=ఎందువలన, ఈ పనులు చేస్తున్నానో, తేన=అందుచేత, అహం వై=నేను, మహేశ్వరః=మహేశ్వరుడను.

**తాత్పర్యము:–** నిత్యము ఈ లోకమును, గ్రహించుట, విడుచుట, సృష్టించుట, నిలుపుట అనగా వ్యక్తి గతముగా సమష్టిగతముగా సృష్టి స్థితిలయములు చేయుచున్నాను గనుక నేను "మహేశ్వరుడను".

**శ్లో॥ మహత్స్వాత్మజ్ఞానయోగైశ్వర్యైర్యస్తు మహీయతే।**
**సర్వాన్భావాన్మహాదేవః సృజత్యవతి సోఽస్మ్యహమ్॥ 44**

**ప్రతిపదార్థము:–** మహత్=గొప్ప, స్వాత్మజ్ఞాన=ఆత్మజ్ఞానముతోను, యోగ=యోగము తోను, ఐశ్వర్యైః=ఐశ్వర్యముతోను, యస్తు=ఎవడైతే, మహీయతే=ప్రకాశించుచున్నాడో, సర్వాన్=సమస్తములైన, భావాన్=భావములను, సృజతి=సృష్టించుచున్నాడో, అవతి=రక్షించు చున్నాడో, సః=ఆ, అహమ్=నేను, "మహాదేవః"=మహాదేవుడను, అస్మి=అగుచున్నాను.

**తాత్పర్యము:–** గొప్ప ఆత్మజ్ఞాన, యోగ, ఐశ్వర్యములు అధికంగా ప్రకాశించటం వలన, సర్వభావములను సృష్టించి రక్షించుటవలన నన్ను మహాదేవుడందురు.

**శ్లో॥ ఏషోఽస్మి దేవః ప్రదిశోఽను సర్వాః।**
**పూర్వో హి జాతోఽస్మ్యహమేవ గర్భే।**
**అహం హి జాతశ్చ జనిష్యమాణః।**
**ప్రత్యగ్జనాస్తిష్ఠతి సర్వతోముఖః॥ 45**

**ప్రతిపదార్థము:–** సర్వాః=సమస్తమైన, ప్రదిశః+అను=అన్ని దిక్కులకు వ్యాపించియున్న, ఏషః=ఈ, దేవః=దేవుడను, అస్మి=నేను అగుచున్నాను, గర్భే=గర్భమునందు, జాతః= పుట్టిన, పూర్వః=మొదటి వాడను, అహమేవ=నేనే, అస్మి=అగుచున్నాను. అహంహి=నేనే, జాతశ్చ=పుట్టినవాడను,జనిష్యమాణశ్చ=పుట్టబోవువాడను, ప్రత్యగ్జనాః=జీవులకు భిన్నముగా (అంతర్ముఖుడుగాను), సర్వతోముఖః=బహుముఖమైనవాడను లేదా బహిర్ముఖుడను, తిష్ఠతి =ఉన్నాను.

**తాత్పర్యము:–** సర్వదిక్కుల వ్యాపించిన దేవుడను నేను. ప్రథమ గర్భజాతుడను నేను. నేనే జాతుడను, జనింపబోవువాడను. జీవులకు భిన్నముగానుండువాడను నేనే. విశ్వ ముఖాలతో బహిర్ముఖంగా ఉండునదియు నేనే.

**శ్లో॥ విశ్వతశ్చక్షురుత విశ్వతో ముఖో**
**విశ్వతోబాహురుత విశ్వతస్పాత్।**
**సమ్బాహుభ్యాం ధమతి సమ్పతత్రైర్**
**ద్యావా భూమీ జనయన్దేవ ఏకః॥ 46**



**ప్రతిపదార్థము:–** విశ్వతః=అన్నివైపుల, చక్షుః=కన్నులు గలవాడై, ఉత=మరియు, విశ్వతోముఖః=అన్నివైపుల ముఖములుగలవాడై,విశ్వతో బాహుః=అన్నివైపుల బాహువులు గలవాడై, ఉత=మరియు, విశ్వతస్పాత్=అన్నివైపుల పాదములు గలవాడును అగు, ఏకః =ఒక, దేవః=దేవుడు (నేను) ద్యావాభూమీ=భూమ్యాకాశములను, జనయన్=పుట్టించుచు, బాహుభ్యామ్=రెండు చేతులతో, సంధమతి=చక్కగా ఊదుచున్నాడు, పతత్రైః=రెక్కలతో, సంధమతి=రగిలించుచున్నాడు.

**తాత్పర్యము:–** అన్నివైపుల నేత్రములు, అన్నివైపుల ముఖములు, అన్నివైపుల బాహువులు, అన్నివైపుల పాదములు గల ఒక దేవుడు ఈ ద్యావాభూములను సృజించి వాటిని తన చేతులతో, రెక్కలతో రక్షించుచున్నాడు.

**శ్లో॥ వాలాగ్రమాత్రం హృదయస్య మధ్యే**
**విశ్వం దేవం జాతవేదం వరేణ్యమ్।**
**మామాత్మస్థం యేఽనుపశ్యన్తి ధీరా**
**స్తేషాం శాంతిః శాశ్వతీ నేతరేషామ్॥ 47**

**ప్రతిపదార్థము:–** హృదయస్య=హృదయముయొక్క, మధ్యే=మధ్యలో ఉన్నవాడును, వాలాగ్రమాత్రమ్=వెంట్రుక కొన మాత్రపు పరిమాణపువాడను, విశ్వమ్=విశ్వరూపుడును, దేవమ్=వెలుగువాడను, జాతవేదమ్=జ్ఞానాగ్నిస్వరూపుడును, వరేణ్యమ్=వరింపదగిన వాడును అగు, మామ్=నన్ను,యే=ఏ, ధీరాః=ధైర్యవంతులు, అనుపశ్యంతి=చూచుచున్నారో, తేషామ్=వారికి, శాంతిః=శాంతి/నిర్వికారత్వమ్, శాశ్వతీ=శాశ్వతమైనది, ఇతరేషామ్= వేరేవారికి, న=శాంతి లేదు.

**తాత్పర్యము:–** హృదయ మధ్యలో కేశాగ్ర ప్రమాణములో నేను ఉన్నాను. విశ్వరూపుడను, దేవుడను, జ్ఞానాగ్ని రూపుడను. వరణీయుడను. అట్టి నేను తనయందు ఉన్నానని గ్రహించి నిత్యము కనుగొనగల ధీరులు శాశ్వతశాంతిని పొందగలరు. ఇతరులకు అనగా అలా కనుగొలలేని వారికి అట్టి శాంతి లభింపదు.

**శ్లో॥ అహం యోనిం యోనిమధితిష్ఠామి చైకో**
**మయేదం పూర్ణం పఞ్చవిధం చ సర్వమ్।**
**మామీశానం పురుషం దేవమీడ్యం**
**నిచాయ్యేమాం శాన్తిమత్యన్తమేతి॥ 48**

**ప్రతిపదార్థము:–** అహమ్=నేను, ఏకః=ఒక్కడినే, యోనిం యోనిమ్=జాతిని జాతిని

అధితిష్ఠామి=అధిష్ఠించియుందును, మయా=నాచేత, ఇదమ్=ఈ, పంచవిధమ్=ఐదు రకములైన, సర్వమ్=సమస్త ప్రపంచము, పూర్ణమ్=నిండినది, ఈశానమ్=ఐశ్వర్యవంతుడను పురుషమ్=పురుషుడను, ఈడ్యమ్=స్తుతింపదగినవాడను, దేవమ్=వెలుగుచున్నవాడనగు, మామ్=నన్ను, నిచాయ్య=సంపాదించి, ఇమామ్=ఈ, శాంతిమ్=శాంతిని, అత్యంతమ్=శాశ్వతముగా, ఏతి=పొందును.

**తాత్పర్యము:–** నిమిత్తములైన సర్వపదార్థములందు, సర్వజాతులయందు నేనున్నాను. ఈ పంచవిధ ప్రపంచము నాతో నిండియున్నది. నేను ఈశుడను. శ్లాఘ్యపురుషుడను. అట్టి నన్ను పొంది జీవులు శాశ్వత శాంతి పొందెదరు.

**శ్లో॥ ప్రాణేష్వన్తర్మనసో లిఙ్గమాహు–**
**ర్యస్మిన్నశనాయా చ తృష్ణాఽక్షమా చ।**
**తృష్ణాం హిత్వా హేతుజాలస్య మూలమ్**
**బుద్ధ్యా చిత్తం స్థాపయిత్వా మయీహ।**
**ఏవం యే మాం ధ్యాయమానా భజన్తే**
**తేషాం శాన్తిః శాశ్వతీ నేతరేషామ్॥ 49**

**ప్రతిపదార్థము:–**ప్రాణేషు=ప్రాణములలో, అంతః=లోపల,మనసః=మనస్సుయొక్క, లింగమ్=గమకమును, ఆహుః=ఉన్నదని చెప్పెదరు, యస్మిన్=దేనియందు, అశనాయా చ=ఆకలియు, తృష్ణా=దప్పికయు, అక్షమా చ=అసూయయు ఉందునో, హేతుజాలస్య=కారణ సమూహమునకు, మూలమ్=మూలమైన, తృష్ణామ్=దప్పికను అనగా దురాశను, హిత్వా=వదలి, బుద్ధ్యా=బుద్ధితో, ఇహ=ఈ, మయి=నాయందు, చిత్తమ్=మనస్సును, స్థాపయిత్వా=నిలిపి, ఏవమ్=ఈవిధముగా, యే=ఎవరు, మామ్=నన్ను, ధ్యాయమానాః=ధ్యానము చేయుచున్నవారై, భజంతే=సేవించెదరో, తేషామ్=వారికి, శాంతిః=శాంతి, శాశ్వతీ=శాశ్వత మైనది, ఇతరేషామ్=ఇతరులకు, న=శాశ్వతశాంతి లేదు.

**తాత్పర్యము:–** ప్రాణముల మధ్య మనస్సుయొక్క గమకం ఉంటుందని, ప్రసిద్ధి. అందులో ఆకలి, దప్పిక, అసూయ ఉంటాయి. ఇవి విషయపరమైనవి. దప్పిక అనగా విషయములపై తీరని ఆసక్తిని విడిచి సంకల్పబలంతో చిత్తమును నాయందునిలిపిన వారికి శాశ్వత శాంతి లభించును.

**శ్లో॥ యతో వాచో నివర్తన్తే అప్రాప్య మనసా సహ।**
**ఆనన్దం బ్రహ్మ మాం జ్ఞాత్వా న బిభేతి కుతశ్చన॥ 50**



**ప్రతిపదార్థము:–** యతః=దేనినుండి, వాచః=వాక్కులు, మనసాసహ=మనస్సుతోగూడా అప్రాప్య=చేరలేక, నివర్తంతే=వెనుదిరుగునో, ఆనందమ్=ఆనందస్వరూపమైన, బ్రహ్మ=బ్రహ్మమునైన, మామ్=నన్ను, జ్ఞాత్వా=ఎఱిగి, కుతశ్చన=దేనినుంచియు, న బిభేతి=భయపడడు.

**తాత్పర్యము:–** ఏ బ్రహ్మమును తెలిసికొనుటకు బయలుదేరిన వాక్కులు,చేతగాక మనస్సుతో సహా వెనుదిరుగునో, ఆనంద స్వరూపమైన ఆ బ్రహ్మనైన నన్ను తెలిసికొనినవాడు ఎవరికీ భయపడడు.

**శ్లో॥ శ్రుత్వేతి దేవా మద్వాక్యం కైవల్యజ్ఞానముత్తమమ్।**
**జపన్తో మమ నామాని మమ ధ్యానపరాయణాః॥ 51**

**శ్లో॥ సర్వే తే స్వస్వదేహాన్తే మత్సాయుజ్యం గతాః పురా।**
**తతో యే పరిదృశ్యన్తే పదార్థా మద్విభూతయః॥ 52**

**ప్రతిపదార్థము:–** ఇతి=ఈ విధముగా, దేవాః=దేవతలు, ఉత్తమమ్=ఉత్తమమైనదియు, కైవల్యజ్ఞానమ్=మోక్షజ్ఞానమయమైన, మద్వాక్యమ్=నా మాటను, శ్రుత్వా=విని, మమ=నా, నామాని=పేర్లను, జపంతః=జపించుచు, మమ=నా, ధ్యాన=ధ్యానమునందు, పరాయణాః=ఆసక్తులై, తే సర్వే=వారందరు, స్వస్వ=తమతమ, దేహాంతే=నిర్యాణసమయమున, పురా=పూర్వము, మత్సాయుజ్యమ్=నాతోసాయుజ్యమను మోక్షమును, గతాః=పొందిరి.

**తాత్పర్యము:–** మందర పర్వతానికి వచ్చిన దేవతలంతా నా మాటలు విని వాటిలోని జ్ఞానమును పొంది నా నామజపంతో, నా ధ్యానంతో పవిత్రులయి చివఱకు తమ అవసాన కాలమున మోక్షమును పొందిరి.

**శ్లో॥ మయ్యేవ సకలం జాతం మయి సర్వం ప్రతిష్ఠితమ్।**
**మయి సర్వం లయం యాతి తద్బ్రహ్మాద్వయమస్మ్యహమ్॥ 53**

**ప్రతిపదార్థము:–** సకలమ్=సమస్తము, మయ్యేవ=నాయందే, జాతమ్=పుట్టినది, మయి=నాయందే, సర్వమ్=సమస్తము, ప్రతిష్ఠితమ్=నిలిచియున్నది, మయి=నాయందే, సర్వమ్=సమస్తము, లయమ్=ప్రలయమును, యాతి=పొందును, అద్వయమ్=ద్వైతరహితమైన తత్=ఆ, బ్రహ్మ=బ్రహ్మము, అహమ్=నేను, అస్మి=అగుచున్నాను.

**తాత్పర్యము:–** సర్వమునా యందే పుట్టి, నాయందే నిలిచి, నాయందే లయమగును. అద్వితీయము సర్వవ్యాప్తము సర్వాధారము అయిన ఆ బ్రహ్మమును నేనే.

శ్లో॥ అణోరణీయానహమేవ తద్వత్
మహానహం విశ్వమహం విశుద్ధః।
పురాతనోఽహం పురుషోఽహమీశో
హిరణ్మయోఽహం శివరూపమస్మి॥ **54**

**ప్రతిపదార్థము:–** అహమేవ=నేనే, అణోః=అణువుకన్న, అణీయాన్=స్వల్ప పరిమాణుడను, తద్వత్=అట్లే, మహాన్=మహత్తుకన్న మహాప్రమాణుడను, అహమ్=నేను, విశ్వమ్=విశ్వమును, అహమ్=నేను, విశుద్ధః=శుద్ధుడను, అహమ్=నేను, పురాతనః=సనాతనుడను, అహమ్=నేను, పురుషః=పురుషుడను, ఈశః=ఈశుడను, అహమ్=నేను, హిరణ్మయః=హిరణ్మయుడను, శివరూపమ్=శివరూపుడను, అస్మి=అగుచున్నాను.

**తాత్పర్యము:–** అణువుకన్న అణువును నేను. మహత్తు కన్న మహత్తును నేను. నేను విశ్వమును. నేను విశుద్ధుడను. పురాతన పురుషుడను నేను. ఈశ్వరుడను నేను. హిరణ్మయుడను నేను. శివస్వరూపము నేనే.

శ్లో॥ అపాణిపాదోఽహమచిన్త్యశక్తిః
పశ్యామ్యచక్షుః స శృణోమ్యకర్ణః।
అహం విజానామి వివిక్తరూపో
న చాస్తి వేత్తా మమ చిత్సదాహమ్॥ **55**

**ప్రతిపదార్థము:–**అహమ్=నేను, అపాణిపాదః=కాలుసేతులు మొదలైన అవయవ విభాగము లేనివాడను, అచింత్య=అనూహ్యమైన, శక్తిః=శక్తిగలవాడను, అచక్షుః=నేత్రరహితుడనైనను, పశ్యామి=చూచుచున్నాను, అకర్ణః=కర్ణరహితుడనైన, సః=ఆ నేను, శృణోమి=వినుచున్నాను, వివిక్త=అతీతమైన, రూపః=రూపముగలవాడనై, అహమ్=నేను, విజానామి=అంతా ఎఱుగుదును, మమ=నాయొక్క (స్వరూపమును) వేత్తా=ఎఱిగినవాడు, నాస్తి చ=లేడు, సదా=నిత్యము, అహమ్=నేను, చిత్=జ్ఞానమును.

**తాత్పర్యము:–** కాళ్ళు చేతులు మొదలగు అవయవ విభాగములు లేని ఏకాకారుడను నేను. నా శక్తి అనూహ్యము. నేత్రరహితుడనై చూడగలను. కర్ణరహితుడనై వినగలను. అతీతరూపుడనైనను, నేను అంతా ఎఱుగుదును. నన్ను చక్కగా ఎఱిగిన వారెవ్వరును లేరు. నేను సదా జ్ఞానరూపుడను.

శ్లో॥ వేదైరశేషైరహమేవ వేద్యో
వేదాన్తకృద్వేదవిదేవ చాహమ్।



న పుణ్యపాపే మమ నాస్తి నాశో
న జన్మ దేహేన్ద్రియబుద్ధిరస్తి॥ **56**

**ప్రతిపదార్థము:–** అశేషైః=సమస్తమైన, వేదైః= వేదములచేత, వేద్యః=తెలియదగినవాడను, అహమేవ=నేనే, అహమేవ=నేనే, వేదాంతకృత్=ఉపనిషత్తులను చేసిన వాడను, వేదవిదేవచ =వేద హృదయమునెఱిగినవాడను, మమ=నాకు, పుణ్యపాపే=పుణ్యపాపములు, న=లేవు, నాశః=చావు, నాస్తి=లేదు, జన్మ=పుట్టుక, న=లేదు, దేహేంద్రియ=దేహేంద్రియములే అనే నేను, బుద్ధిః=అభిమానము, నాస్తి=లేదు.

**తాత్పర్యము:–** సకల వేదార్థమును నేనే. ఉపనిషత్కర్తను నేనే. వేదహృదయవేత్తను నేనే. నాకు పుణ్యపాపములు, జననమరణములు, దేహాభిమానము, ఇంద్రియాభిమానము వంటివి లేవు.

శ్లో॥ న భూమిరాపో మమ వహ్నిరస్తి
న చానిలో మేఽస్తి న మే నభశ్చ।
ఏవం విదిత్వా పరమాత్మరూపం
గుహాశయం నిష్కళమద్వితీయమ్॥
సమస్తసాక్షిం సదసద్విహీనం
ప్రయాతి శుద్ధం పరమాత్మరూపమ్॥ **57**

**ప్రతిపదార్థము:–** మమ=నాకు, భూమిః=భూమి, ఆపః=జలములు, వహ్నిః=అగ్ని, నాస్తి=లేదు, మే=నాకు, అనిలః చ=వాయువున్ను, నాస్తి=లేదు, మే=నాకు, నభశ్చ=ఆకాశమున్ను, న=లేదు, ఏవమ్=ఈవిధంగా, విదిత్వా=తెలిసికొని, గుహాశయమ్=హృదయగుహయందు ఉన్నదియు, నిష్కళమ్=ఇంద్రియాది కళాభేదము లేనిదియు, అద్వితీయమ్=అఖండ మైనదియు అగు, పరమ్=అతీతమైన, ఆత్మరూపమ్=తన నిజరూపమును, విదిత్వా=గ్రహించి, సమస్తసాక్షిమ్=సర్వసాక్షియు, సదసత్=మంచిచెడ్డలులేదా ఉన్నది లేదు అను భ్రాంతితో, విహీనమ్=రహితమైన, శుద్ధమ్=నిర్మలమైన, పరమాత్మరూపమ్=పరమాత్మ స్వరూపమును, ప్రయాతి=పొందును.

**తాత్పర్యము:–** భూమి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము – ఇవన్నియు మిథ్యలు, మాయా జనితములు. కనుక నాకు అంటవు. కనుక జ్ఞానినైన నాకు లేవు అని గ్రహింపవలెను. అట్లే, హృదయ గుహాస్థితమైన నిష్కళమైన, అద్వితీయమైన, అఖండ నిజస్వరూపమును గ్రహించినవాడు, చివఱకు సర్వసాక్షి అయిన శుద్ధ పరమాత్మ రూపమును పొందగలడు.

శ్లో॥ ఏవం మాం తత్త్వతో వేత్తి యస్తు రామ! మహామతే!।
స ఏవ నాఽన్యో లోకేషు కైవల్యఫలమశ్నుతే॥ 58

**ప్రతిపదార్థము:–** మహామతే!=మహాబుద్ధిశాలీ! రామ!=రామా!, యస్తు=ఎవడైతే, మామ్=నన్ను, ఏవమ్=ఈవిధముగా, తత్త్వతః=తత్త్వరీత్యా, వేత్తి=తెలిసికొనునో, స ఏవ=వాడే, కైవల్య=మోక్షమను, ఫలమ్=ఫలమును, అశ్నుతే=పొందగలడు, లోకేషు=లోకులలో, అన్యః=మఱొకడు, న=పొందదు.

**తాత్పర్యము:–** ఈ విధంగా నన్ను తత్త్వరీత్యా ఎఱిగినవాడే, రామా! కైవల్యమును పొందగలడు. లోకులలో ఇతరుడెవడును పొందజాలడు.

**ఇతి శ్రీపద్మపురాణే ఉపరిభాగే శివగీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీశివరాఘవసంవాదే విభూతియోగో నామ షష్ఠోఽధ్యాయః॥**

* * * * *



## అథ సప్తమోఽధ్యాయః
# విశ్వరూప సన్దర్శనయోగః

**శ్రీరామ ఉవాచ-శ్రీరాముడిట్లనెను.**

శ్లో॥ భగవన్! యన్మయా పృష్టం తత్తథైవ స్థితం విభో!।
అత్రోత్తరం మయా లబ్ధం త్వత్తో నైవ మహేశ్వర!॥ 1

**ప్రతిపదార్థము:–** భగవన్=భగవంతుడా!, మహేశ్వరా!=ఈశ్వరా!, విభో!=ప్రభూ!, యత్=ఏది, మయా=నాచేత, పృష్టమ్=అడుగబడినదో, తత్=అది, తథైవ=అట్లే, స్థితమ్=ఉండి పోయినది, తత్ర=ఆ విషయములో, త్వత్తః=నీనుండి, ఉత్తరమ్=సమాధానము, మయా=నాచేత, లబ్ధమేవ న=పొంబడనేలేదు.

**తాత్పర్యము:–** పరమేశ్వరా! నేను మిమ్ములను అడిగిన ప్రశ్నకు సమాధానం నాకు లభింపలేదు. అది అట్లే నిలిచిపోయినది.

శ్లో॥ పరిచ్ఛిన్నపరిమాణే దేహే భగవతస్తవ।
ఉత్పత్తిః సర్వభూతానాం స్థితిర్వా విలయః కథమ్॥ 2

**ప్రతిపదార్థము:–** భగవతః=భగవంతుడవైన, తవ=నీయొక్క, పరిచ్ఛిన్న=పరిమితమైన / ఖండమైన, పరిమాణే=పరిమాణము / కొలతగల, దేహే=ఈ శరీరమునందు, సర్వ భూతానామ్=సకల భూతములయొక్క, ఉత్పత్తిర్వా=పుట్టుకగాని, స్థితిర్వా=నిలకడగాని, విలయో వా=లీనమగుటగాని, కథమ్=ఎట్లు సాధ్యము?

**తాత్పర్యము:–** అతి పరిమితమైన ఈ దేహఖండంతో కనబడుతున్నావు. ఇంతటి యీ దేహంలో సువిశాలమైన ఈ పాంచభౌతిక ప్రపంచానికి సృష్టిస్థితిలయలు ఎలా జరుగుతాయి?

శ్లో॥ స్వస్వాధికారసమ్బద్ధాః కథం నామ స్థితాః సురాః।
తే సర్వే త్వం కథం దేవ! భువనాని చతుర్దశ॥ 3

**ప్రతిపదార్థము:–** దేవ!=ఓ ప్రభూ!, సురాః=దేవతలు, స్వస్వ=తమ తమ, అధికార= అధికారములతో, సంబద్ధాః=సంబంధించినవారై, కథం నామ=ఎలా, స్థితాః=ఉన్నారు?, తే సర్వే=వారంతా, త్వమ్=నీవు, కథమ్=ఎలా అవుతారు దేవ!=ప్రభూ!, చతుర్దశ=పదునాల్గు అయిన, భువనాని =లోకాలు, నీవు ఎలా అవుతావు?

**తాత్పర్యము:–** దేవ! ఈ దేవతలందరు సంఖ్యలో అధికారంలో విడివిడిగా ఉన్నారు. ఈ లోకములు పదునాలుగు ఉన్నాయి. ఇంతటి భిన్న వస్తువులు భిన్న వ్యక్తులు వీరి బహుత్వము నీయందు, నీ ఒక్కటియందు ఎలా ఇమిడిపోతాయి. అనగా వారు అవి నీవు ఎలా ఒక్కటి అవుతారు?

**శ్లో॥ త్వత్తః శ్రుత్వాపి దేవాత్ర సన్దేహో మే మహానభూత్।**
**అప్రత్యాయితచిత్తస్య సంశయం ఛేత్తుమర్హసి॥ 4**

**ప్రతిపదార్థము:–** దేవ=ప్రభూ!, త్వత్తః=నీ నుంచి, శ్రుత్వాపి=వినియును, మే=నాకు, అత్ర=ఈ విషయములో, మహాన్=గొప్ప, సందేహః=సంశయము, అభూత్=అయ్యెను, అప్రత్యాయిత=నమ్మింపబడని, చిత్తస్య=మనస్సుయొక్క / మనస్సుగల నాయొక్క, సంశయమ్ =సందేహమును, ఛేత్తుమ్=తెంచుటకు, అర్హసి=తగియున్నావు.

**తాత్పర్యము:–** దేవ! నీ వెంతగా నీ విభూతియోగమును వివరించినను, నీ ఖండశరీరము అఖండ ప్రపంచమెలా అయిందో నాకు నిశ్చయంగా అవగాహన అగుటలేదు. కనుక నమ్మకము కుదరని నా మనస్సున ఉన్న సంశయమును నీవు నిర్మూలింపవలెను.

**శ్రీ శివ ఉవాచ-శ్రీ శివుడిట్లనెను.**

**శ్లో॥ వటబీజే సుసూక్ష్మేఽపి మహావటతరుర్యథా।**
**సర్వదాస్తేఽన్యథా వృక్షః కుత ఆయాతి తద్వద॥ 5**

**ప్రతిపదార్థము:–** సుసూక్ష్మేపి=అతి సూక్ష్మమైనదైనను, వటబీజే=మఱ్ఱివిత్తనమునందు, మహా=పెద్ద, వటతరుః=మఱ్ఱిచెట్టు, యథా=ఎట్లు, సర్వదా=ఎల్లప్పుడు, ఆస్తే=ఉంటుందో, (అలా నాయందు ప్రపంచము ఉన్నది), అన్యథా=అట్లాలేనట్లయితే, వృక్షః=మఱ్ఱిచెట్టు, కుతః=ఎందువలన / దేనినుండి, ఆయాతి=వచ్చుచున్నదో, తత్=ఆ విషయమును, వద= చెప్పుము.

**తాత్పర్యము:–** రామా! నా ఖండ శరీరమునుండి అఖండ ప్రపంచము వచ్చుటలో అసంభవము లేదు. అతి సూక్ష్మమైన మఱ్ఱివిత్తనమునుండి మఱ్ఱిచెట్టు ఎలా వచ్చుచున్నదో ఆలోచించుము.



**శ్లో॥ తద్వన్మమ తనౌ రామ! భూతానామాగతిర్లయః।**
**మహాసైన్ధవపిణ్డోఽపి జలే క్షిప్తో విలీయతే॥ 6**

**ప్రతిపదార్థము:–** రామ!=శ్రీరామా!, తద్వత్=అట్లే, మమ=నాయొక్క, తనౌ=శరీరమునందు, భూతానామ్=పంచభూతములయొక్క ఆగతిః=రాక, లయః=పోక జరుగును. మహాసైంధవ పిందోపి=పెద్ద ఉప్పురాయి అయినా, జలే=నీటియందు, క్షిప్తః=వేయబడినదై, విలీయతే= కరిగిపోవును.

**తాత్పర్యము:–** రామా! అలాగే ఈ సృష్టి అంతయు నా నుంచి రాగలదు. అట్లే నాయందే కఱిగిపోగలదు. ఎంత పెద్ద ఉప్పురాయి అయినా నీటిలో కఱిగిపోవును గదా!

**శ్లో॥ న దృశ్యతే పునః పాకాత్ తత ఆయాతి పూర్వవత్।**
**ప్రాతః ప్రాతర్యథాలోకో జాయతే సూర్యమణ్డలాత్॥ 7**

**ప్రతిపదార్థము:–** న దృశ్యతే=(ఉప్పు) కనబడదు, పునః=మఱల, పాకాత్=పంటవలన / పండుటవలన, తతః=ఆ నీటినుండి, పూర్వవత్=వెనుకటివలెనే, ఆయాతి=(ఉప్పు) వచ్చును. ప్రాతఃప్రాతః=ప్రతి ప్రభాతకాలమున, సూర్యమండలాత్=సూర్యమండలమునుండి ఆలోకః=వెలుతురు (లోకః=లోకము), యథా=ఎట్లు, జాయతే పుట్టునో (అలానా నుంచి యీ సృష్టి పుట్టును).

**తాత్పర్యము:–** నీటిలో వేసిన ఉప్పు చక్కగా కరిగిపోయి మనకు కనబడదు. కాని మఱల ఉప్పును సృష్టించే ప్రయత్నం చేసినచో ఆ ఉప్పు మఱల కనబడును. అట్లే ఈ ప్రపంచము నా నుండి మఱల పుట్టును. ప్రతి ప్రొద్దున సూర్యుని నుంచి యీ లోకము 'మెలకువ' రూపంలో పుట్టును. అట్లే సూర్య మండలమునుంచి వెలుగు పుట్టును. అట్లే నా నుంచి జగము పుట్టును.

**శ్లో॥ ఏవం మత్తో జగత్సర్వం జాయతేఽస్తి విలీయతే।**
**మయ్యేవ సకలం రామ! తద్వజ్జానీహి సువ్రత!॥ 8**

**ప్రతిపదార్థము:–** ఏవమ్=ఈ విధంగా, సర్వమ్=సమస్తమైన, జగత్=ప్రపంచము మత్తః =నా నుండి, జాయతే=పుట్టును, అస్తి=ఉండును. విలీయతే=కఱుగును, సువ్రత!=మంచి వ్రతముగలవాడా!, రామ!=రామా!, సకలమ్=సమస్తము, మయ్యేవ=నాయందే, తద్వత్= అలా జరుగునని, జానీహి=తెలిసికొనుము.

**తాత్పర్యము:–** రామా! పాశుపతవ్రతా! ఈ ప్రపంచమంతయు, నా యందే పుట్టును. నా

యందే ఉండును. నాయందే లయించును. ఇదంతయు నీటిలో ఉప్పువలె నాయందే అమరియున్నది. ఈ విషయమును గ్రహింపుము.

**శ్రీరామ ఉవాచ-శ్రీరాముడిట్లనెను.**

**శ్లో॥ కథితేఽపి మహాభాగ! దిగ్జడస్య యథా దిశి।**
**నివర్తతే భ్రమో నైవ తద్వన్మమ కరోమి కిమ్॥ 9**

**ప్రతిపదార్థము:–** మహాభాగ!=మహాదేవా!, కథితేపి=ఎంత చెప్పబడినను, దిగ్జడస్య=దిక్కులు తెలియనివానికి, దిశి=దిక్కు విషయంలో, భ్రమః=భ్రాంతి, యథా=ఎట్లు, నైవనివర్తతే= వెనుదిరుగదో, తద్వత్=అట్లే, మమ=నాయొక్క భ్రమ తీరుటలేదు, కిమ్=ఏమి, కరోమి= చేసెదను.

**తాత్పర్యము:–** అయ్యా! తమరెంత వివరించినను, నా భ్రమ తీరుటలేదు. దిక్కులు తెలియని వానికి, ఇది ఫలానా దిక్కు అని ఎంత చెప్పినను భ్రమ తీరుట కష్టం కదా! నా పరిస్థితి అట్లే యున్నది.

**శ్రీ శివ ఉవాచ-శ్రీ శివుడు ఇట్లనెను.**

**శ్లో॥ మయి సర్వం యథా రామ! జగదేతచ్చరాచరమ్।**
**వర్తతే తద్దర్శయామి న ద్రష్టుం క్షమతే భవాన్॥ 10**

**ప్రతిపదార్థము:–** రామ!=శ్రీరాముడా!, మయి=నాయందు, సర్వమ్=సమస్తమైన, ఏతత్= ఈ, చరాచరమ్=స్థావరజంగమాత్మకమైన, జగత్=ప్రపంచము, యథా=ఏవిధముగా, వర్తతే =ఉన్నదో, తత్=అది, దర్శయామి=చూపుచున్నాను, భవాన్=నీవు, ద్రష్టుమ్=చూచుటకు, నక్షమతే=తట్టుకొనలేవు.

**తాత్పర్యము:–**నాయందు ఈ సమస్త ప్రపంచము ఎలా ఉన్నదో అది నేను నీకు ప్రత్యక్షముగా చూపగలను. కాని నీవు ఆ స్వరూపమును చూచి తట్టుకొనలేవు.

**శ్లో॥ దివ్యం చక్షుః ప్రదాస్యామి తుభ్యం దశరథాత్మజ!।**
**తేన పశ్య భయం త్యక్త్వా మత్తేజోమణ్డలం ధ్రువమ్॥ 11**

**ప్రతిపదార్థము:–** దశరథాత్మజ!=దాశరథీ, తుభ్యమ్=నీకు, దివ్యమ్=దివ్యమైన, చక్షుః= నేత్రమును, ప్రదాస్యామి=ఇవ్వగలను, భయమ్=భయమును, త్యక్త్వా=వదలి, తేన=ఆ కంటితో, ధ్రువమ్=వాస్తవమైన, మత్=నాయొక్క, తేజోమండలమ్=కాంతివలయమును, పశ్య=చూడుము.



**తాత్పర్యము:–** దాశరథీ! దివ్యదృష్టిని ప్రసాదించెదను. దానితో నీవు భయం విడిచి – నీ దివ్య విశ్వవ్యాప్త కాంతి వలయమును దర్శింపుము.

**శ్లో॥ న చర్మచక్షుషా ద్రష్టుం శక్యతే మామకం మహః।**
**నరేణ వా సురేణాపి తన్మమానుగ్రహం వినా॥ 12**

**ప్రతిపదార్థము:–** మామకమ్=నాదైన, మహః=తేజస్సు, మమ=నా, అనుగ్రహం వినా= అనుగ్రహము లేకుండగా, నరేణవా=నరుని చేతగాని, సురేణాపి=దేవతచేతగాని, చర్మ చక్షుషా=చర్మనేత్రములతో, ద్రష్టుమ్=చూచుటకు, నశక్యతే=సాధ్యంకాదు.

**తాత్పర్యము:–** రామా! నా అనుగ్రహం లేనిదే నా విశ్వరూపమును చర్మనేత్రములతో చూడడం నరులకైనా సురలకైనా సాధ్యంకాదు.

**శ్లో॥ ఇత్యుక్త్వా ప్రదదౌ తస్మై దివ్యం చక్షుర్మహేశ్వరః।**
**అథాఽదర్శయదేతస్మై వక్త్రం పాతాలసన్నిభమ్॥ 13**

**ప్రతిపదార్థము:–** ఇతి=అని, ఉక్త్వా=పలికి, మహేశ్వరః=శివుడు, తస్మై=ఆ రామునకు, దివ్యమ్=దివ్యమైన, చక్షుః=నేత్రమును, ప్రదదౌ=ఇచ్చెను, అథ=తరువాత, ఏతస్మై=ఈ రాముని కొఱకు, పాతాల=పాతాలముతో, సన్నిభమ్=సమానమైన, వక్త్రమ్=నోటిని, ఆదర్శయత్=చూపెను.

**తాత్పర్యము:–** అలా అని శివుడు రామునకు దివ్యదృష్టిని కలిగించి, తన నోరు పాతాల మంత లోతుగా వెడల్పుగా తెఱచి చూపెను.

**శ్లో॥ విద్యుత్కోటిప్రభం దీప్తమతిభీమం భయావహమ్।**
**తద్ దృష్ట్వైవ భయాద్రామో జానుభ్యామవనిం గతః॥ 14**

**ప్రతిపదార్థము:–** విద్యుత్కోటి=కోటి మెఱుపులతో సమానమైన, ప్రభమ్=కాంతిగలదియు, దీప్తమ్=వెలిగినదియు, అతిభీమమ్=అతి భయంకరమైనదియు, భయావహమ్=భయము కలిగించునదియు (తనకు) అగు, తత్=ఆ నోటిని, దృష్ట్వైవ=చూచినంతనే, రామః= రాముడు, భయాత్=భయమువలన, జానుభ్యామ్=మోకాళ్ళతో, అవనిమ్=నేలను, గతః =చేరెను.

**తాత్పర్యము:–** కోటి మెఱుపు తీగల వెలుగుతో త్రుళ్ళిపడుచున్న అతిభయంకరమైన ఆ ముఖమును చూచి రాముడు తీవ్రభయముతో నేలపై మోకరిల్లెను.

శ్లో॥ ప్రణమ్య దణ్డవద్భూమౌ తుష్టావ చ పునః పునః।
అథోత్థాయ మహావీరో యావదేవ ప్రపశ్యతి॥ **15**

శ్లో॥ వక్త్రం పురభిదస్తావదన్తర్బ్రహ్మాణ్డకోటయః।
చటకా ఇవ లక్ష్యన్తే జ్వాలామాలాసమాకులాః॥ **16**

**ప్రతిపదార్థము:–** భూమౌ=నేలమీద, దండవత్=కఱ్ఱవలె పడి, ప్రణమ్య=నమస్కరించి, పునః పునః=మాటిమాటికి, తుష్టావ చ=స్తుతించెను, అథ=తర్వాత, ఉత్థాయ=లేచి, మహావీరః=ఆ మహావీరుడైన రాముడు, యావదేవ=ఎంతలో, ప్రపశ్యతి=చూచునో – తావత్=అంతలో, పురభిదః=పురహరుని యొక్క, వక్త్రమ్=నోటి పొడుగునా, అంతః=లోపల, బ్రహ్మాండకోటయః=కోట్ల బ్రహ్మాండములు, జ్వాలామాలా=మండల గుంపులో, సమాకులాః =వ్యాకులపడుచున్న, చటకా ఇవ=పిచ్చుకలవలె, లక్ష్యంతే=కనబడుచున్నవి.

**తాత్పర్యము:–** రాముడు నేలమీద సాష్టాంగదండ ప్రణామము చేసి మాటిమాటికి స్తోత్రము చేసెను. తర్వాత లేచి ఆ మహావీరుడు శివుని భీషణముఖమును చూచెను. అంతలో జ్వాలామాలికలమధ్య చిక్కి పిచ్చుకలవలె నానా బ్రహ్మాండ పంక్తులు గిరగిర తిరుగుచున్నట్లు కనబడెను.

శ్లో॥ మేరుమన్దరవిన్ధ్యాద్యా గిరయః సప్తసాగరాః।
దృశ్యన్తే చన్ద్రసూర్యాద్యాః పఞ్చభూతాని తే సురాః॥ **17**

**ప్రతిపదార్థము:–** మేరు=మేరు పర్వతము, మందర=మందర పర్వతము, వింధ్యాద్యాః= వింధ్యము మొదలైన, గిరయః=పర్వతములు, సప్త=ఏడు, సాగరాః=సముద్రములు, చంద్ర=చంద్రుడు, సూర్య=సూర్యుడు, ఆద్యాః=మొదలుగాగల తారాగోళములు, పంచ భూతాని=పంచభూతములు, తే=ఆ, సురాః=దేవతలు, దృశ్యంతే=కనబడుచుండిరి.

**తాత్పర్యము:–**మేరుపర్వతము, మందరపర్వతము, వింధ్యపర్వతము మొదలైన పర్వతములు; ఏడు సముద్రములు, సూర్య–చంద్రులు మొదలుగాగల తారాగోళములు, పంచభూతములు, ఆ దేవతలు కనబడిరి.

శ్లో॥ అరణ్యాని మహానాగాః భువనాని చతుర్దశ !
ప్రతి బ్రహ్మాణ్డమేవం తద్దృష్ట్వా దశరథాత్మజః॥ **18**

**ప్రతిపదార్థము:–** అరణ్యాని=అడవులు, మహా=గొప్ప, నాగాః=సర్పములు, గజములు, చతుర్దశ=పదునాల్గు, భువనాని=లోకములు, ఏవమ్=ఈవిధముగా, ప్రతిబ్రహ్మాండమ్= ప్రతిగోళమునందు, దృష్ట్వా=చూచి, దశరథాత్మజః=దాశరథి (ఆశ్చర్యపడెను.)



**తాత్పర్యము:–** అడవులు, గొప్ప సర్పములు, గజములు, పదునాల్గు లోకములు, ఈ విధముగా ప్రతిగోళమునందు చూచి దాశరథి ఆశ్చర్యపడెను.

శ్లో॥ సురాసురాణాం సంగ్రామాన్తత్ర పూర్వాపరానపి।
విష్ణోర్దశావతారాంశ్చ తత్తత్కర్మాణ్యపి ద్విజాః॥ **19**

**ప్రతిపదార్థము:–**ద్విజాః=మునులారా!,తత్ర=ఆ ముఖమున,పూర్వాపరాన్=ముందు వెనుకల జరిగిన, సురాసురాణామ్=దేవరాక్షసులయొక్క, సంగ్రామాన్=యుద్ధములను, విష్ణోః =విష్ణువుయొక్క, దశావతారాంశ్చ=పది అవతారములనున్ను, తత్తత్= ఆయా అవతారముల యొక్క, కర్మాణ్యపి=కార్యములనున్ను గమనించెను.

**తాత్పర్యము:–**మునులారా! రాముడు ఆ పరమేశ్వర భయంకర వదనగుహలో పూర్వాపరము లైన దేవాసుర సంగ్రామములను, విష్ణునిదశావతారములును,దశావతార వీరకార్యములను (రావణవధతో సహా) గమనించెను.

శ్లో॥ పరాభవాంశ్చ దేవానాం పురదాహం మహేశితుః।
ఉత్పద్యమానానుత్పన్నాన్ సర్వానపి వినశ్యతః॥ **20**

శ్లో॥ దృష్ట్వా రామో భయావిష్టః ప్రణనామ పునః పునః।
ఉత్పన్నతత్త్వజ్ఞానోఽపి బభూవ రఘునన్దనః॥ **21**

శ్లో॥ అథోపనిషదాం సారైరర్థైస్తుష్టావ శఙ్కరమ్॥ **22**

**ప్రతిపదార్థము:–** దేవానామ్=దేవతలయొక్క, పరాభవాంశ్చ=పరాభవములను, మహేశితుః =ఈశ్వరునియొక్క, పురదాహమ్=త్రిపురదహనమును, ఉత్పద్యమానాన్=పుట్టుచున్నవారిని, ఉత్పన్నాన్=పుట్టినవారిని, వినశ్యతః=మరణించుచున్నవారిని, సర్వానపి=అందరిని, దృష్ట్వా =చూచి, రామః=రాముడు, భయావిష్టః=భయపడినవాడై, పునః పునః=మాటిమాటికి, ప్రణనామ=నమస్కరించెను, రఘునందనః=రాఘవుడు, ఉత్పన్న=కలిగిన, తత్త్వజ్ఞానోపి= తత్త్వజ్ఞానము కలవాడుగాను,బభూవ=అయ్యెను, అథ=తర్వాత, ఉపనిషదామ్=ఉపనిషత్తుల యొక్క, సారైః=సారములైన, అర్థైః=అర్థములతో, శంకరమ్=శంకరుని, తుష్టావ=స్తోత్రము చేసెను.

**తాత్పర్యము:–** దేవతల పరాజయమును, పరమేశ్వరుడు చేసిన త్రిపుర దహనమును, రాముడు గమనించెను. జాతులను, జీవితులను, మృతులను అందరిని గమనించెను. ఆ భైరవ రూపమును చూచి భయపడినను రామునకు తత్త్వజ్ఞానము చక్కగా కలిగెను. తర్వాత శ్రీరాముడు వేదాంత సారములైన విషయములతో స్తోత్రము కావించెను.

**శ్రీరామ ఉవాచ-శ్రీరాముడు ఇట్లనెను.**

**శ్లో॥ దేవ! ప్రపన్నార్తిహర ! ప్రసీద**
**ప్రసీద విశ్వేశ్వర ! విశ్వవన్ద్య।**
**ప్రసీద గఙ్గాధర ! చన్ద్రమౌళే !**
**మాం త్రాహి సంసారభయాదనాథమ్॥ 23**

**ప్రతిపదార్థము:-** దేవ!=దేవా, ప్రపన్న=శరణాగతులయొక్క, ఆర్తి=బాధలను, హర=హరించినవాడా!,ప్రసీద=అనుగ్రహింపుము, విశ్వేశ్వర!=జగదీశ్వరా!, విశ్వ=ప్రపంచమునకు వంద్య=నమస్కరింప / స్తుతింపదగినవాడా!, ప్రసీద=ప్రసన్నుడవుకమ్ము, గంగాధర!=గంగామౌళీ, చంద్రమౌళే!=చంద్రశేఖరా!, ప్రసీద=ప్రసన్నుడవు కమ్ము, అనాథమ్=దిక్కులేని, మామ్=నన్ను, సంసారభయాత్=సంసారభయమునుండి, త్రాహి=రక్షింపుము.

**తాత్పర్యము:-** శరణాగత రక్షకా! విశ్వేశ్వరా! విశ్వస్తవనీయా! గంగాధరా! చంద్రశేఖరా! రక్షింపుము. అనుగ్రహింపుము. అనాథుడను, సంసారభయమునుండి నన్ను రక్షింపుము.

**శ్లో॥ త్వత్తో హి జాతం జగదేతదీశ !**
**త్వయ్యేవ భూతాని వసన్తి నిత్యమ్।**
**త్వయ్యేవ శంభో ! విలయం ప్రయాన్తి**
**భూమౌ యథా వృక్షలతాదయోఽపి॥ 24**

**ప్రతిపదార్థము:-** ఈశ=ప్రభూ!, ఏతత్=ఈ, జగత్=ప్రపంచము, త్వయ్యేవ=నీయందే, జాతమ్=పుట్టినది, భూతాని=భూతములు, త్వయ్యేవ=నీయందే, నిత్యమ్=ఎల్లప్పుడు, వసంతి=ఉంటున్నవి, శంభో!=శివా!, త్వయ్యేవ=నీయందే, విలయమ్=లయమును, ప్రయాంతి=పొందుచున్నవి, వృక్ష=చెట్లు, లతా=గీతలు, ఆదయోపి=మొదలైన పదార్థములు యందు, భూమౌ=భూమియందు, యథా=ఎట్లు పుట్టి, ఉండి, లయించుచున్నవో అట్లే ఇది జరుగుచ్నుది.

**తాత్పర్యము:-** భూమియందు పుట్టినలతా వృక్షాదులు భూమియందే పుట్టి పెరిగి భూమియందే కలిసిపోవుచున్నావు. అట్లే మొత్తం ప్రపంచము నీయందు పుట్టి నీయందే పెరిగి నీయందే చివరకు లయమగుచున్నవి.

**శ్లో॥ బ్రహ్మేన్ద్రరుద్రాశ్చ మరుద్గణాశ్చ**
**గన్ధర్వయక్షాసురసిద్ధసంఘాః।**
**గఙ్గాదినద్యో వరుణాలయాశ్చ**
**వసన్తి శూలింస్తవ వక్త్రయన్త్రే॥ 25**



**ప్రతిపదార్థము:-** శూలిన్=శూలీ, తవ=నీయొక్క, వక్త్రయంత్రే=ముఖయంత్రమున, బ్రహ్మేంద్రరుద్రాశ్చ=బ్రహ్మ, ఇంద్రుడు, రుద్రుడున్ను, మరుద్గణాశ్చ=వాయుగణాలున్ను, గంధర్వ = గంధర్వులు, యక్ష = యక్షులు, అసుర = రాక్షసులు, సిద్ధసంఘాః = సిద్ధుల సమూహమున్ను, గంగాది=గంగమొదలగు, నద్యః=నదులు, వరుణాలయాశ్చ=సముద్రము -లున్నూ, వసంతి=ఉన్నవి.

**తాత్పర్యము:-** శూలీ! నీ ముఖయంత్రమున, బ్రహ్మ, ఇంద్రుడు, రుద్రుడున్ను, వాయుగణాలున్ను, గంధర్వులు, యక్షులు, రాక్షసులు, సిద్ధుల సమూహమున్ను గంగ మొదలగు నదులు, సముద్రములున్నూ ఉన్నవి.

**శ్లో॥ త్వన్మాయయా కల్పితమిన్దుమౌళే**
**త్వయ్యేవ దృశ్యత్వముపైతి విశ్వమ్।**
**భ్రాన్త్యా జనః పశ్యతి సర్వమేత-**
**చ్ఛుక్తౌ యథా రౌప్యమహిం చ రజ్జౌ॥ 26**

**ప్రతిపదార్థము:-** ఇందుమౌళే!=చంద్రశేఖరా!, త్వన్మాయయా=నీ మాయచేత, ఏతత్=ఈ, సర్వమ్=సమస్త ప్రపంచము, కల్పితమ్=కల్పింపబడినది, త్వయ్యేవ=నీయందే, నిత్యమ్ =ఎల్లప్పుడు, దృశ్యత్వమ్=దృశ్యమగుటను, ఉపైతి=పొందుచున్నది, జనః=జనము, శుక్తి=ముత్యపుచిప్పయందు, రౌప్యమ్=వెండిని, రజ్జౌ=త్రాటియందు,అహిం చ=పామును, యథా =ఎలా చూస్తారో, తథా=అట్లు, భ్రాంత్యా=భ్రాంతితో, నీయందు, పశ్యతి=కనుగొనుచున్నది.

**తాత్పర్యము:-** చంద్రమౌళీశ్వరా! ఈ ప్రపంచమంతయు, నీ మాయచేత కల్పితము. అది నీయందే మాకు కనబడుచున్నది. అందుకు కారణము భ్రాంతి. మేము ముత్యపు చిప్పను చూచి వెండియని, చీకటిలో పామును చూచి త్రాడని భ్రాంతిపడినట్లే నిన్ను చూచి ప్రపంచమని భ్రాంతి పడుచున్నాము.

**శ్లో॥ తేజోభిరాపూర్యజగత్సమస్తం**
**ప్రకాశమానం కురుషే ప్రకాశమ్।**
**వినా ప్రకాశం తవ దేవ! దేవ!**
**న దృశ్యతే విశ్వమిదం క్షణేన॥ 27**

**ప్రతిపదార్థము:-** అప్రకాశమ్=వెలుగులేని, జగత్=ప్రపంచమును, సమస్తమ్=అంతటిని, తేజోభిః=నీ తేజస్సులతో, ఆపూర్య=నింపి, ప్రకాశమానమ్=ప్రకాశించుచుదానినిగా, కురుషే=చేయుచున్నావు, దేవదేవ!=దేవాధిదేవ!, తవ=నీయొక్క ప్రకాశంవినా=వెలుగులేనిదే, ఇదమ్ =ఈ, విశ్వమ్=ప్రపంచము, క్షణేన=ఒక్కక్షణంలో, న దృశ్యతే=కనబడకపోవును.

**తాత్పర్యము:–** ఈ ప్రపంచమంతా, దేవదేవా! గాంధాంధకారబంధురం. దీనిని నీ తేజస్సుతో వెలిగించి నింపి ప్రకాశమానంగా చేస్తున్నావు, నీ వెలుగు లేకపోతే మఱుక్షణమే ఈ ప్రపంచం కనబడదు.

**శ్లో॥ అల్పాశ్రయో నైవ బృహన్తమర్థం**
**ధత్తేఽణురేకో న హి విన్ధ్యశైలమ్।**
**త్వద్వక్త్రమాత్రే జగదేతదస్తి**
**త్వన్మాయయైవేతి వినిశ్చినోమి॥ 28**

**ప్రతిపదార్థము:–** అల్పాశ్రయః=అల్పమైన ఆధారము, బృహంతమ్=తనకన్న పెద్దదైన, అర్థమ్=పదార్థమున్ను, నైవ ధత్తే=ధరింపలేదు, ఏకః=ఒక్క, అణుః=అణువు, వింధ్యశైలమ్=వింధ్యపర్వతమును, న ధత్తేహి=ధరింపలేదు గదా!, ఏతత్=ఈ, జగత్=ప్రపంచము, త్వత్=నీయొక్క, వక్త్రమాత్రే=కేవలం నోటిలో, త్వన్మాయయైవ=నీ మాయవలననే, అస్తి=ఉన్నది, ఇతి=అని, వినిశ్చినోమి=నిశ్చయించుచున్నాను.

**తాత్పర్యము:–** దేవ! చిన్నవస్తువు తనకన్న చాల పెద్ద వస్తువును తనలో ఇమిడించుకొనలేదు. కాని నీ నోరు ఇంత విశాలప్రపంచమును ఎలా ఇమిడించికొనగలదు. ఇదంతా నీ మాయవలననే సాధ్యమని నా నిశ్చయము.

**శ్లో॥ రజ్జౌ భుజఙ్గో భయదో యథైవ**
**న జాయతే నాస్తి న చైతి నాశమ్।**
**త్వన్మాయయా కేవలమాత్తరూపమ్**
**తథైవ విశ్వం త్వయి నీలకణ్ఠ!॥ 29**

**ప్రతిపదార్థము:–** నీలకంఠ=పరమేశ్వరా!, భయదః=భయంకరమైన, భుజంగః=పాము, యథైవ=ఎట్లు, రజ్జౌ=త్రాటియందు, న జాయతే=పుట్టుటలేదో, నాస్తి=అసలు లేదో, నాశమ్=చావును, న ఏతి చ=పొందనే పొందదో, తథైవ=అట్లే, విశ్వమ్=ఈ ప్రపంచము, త్వయి=నీయందు, త్వన్మాయయా కేవలమ్=నీ మాయచేత మాత్రమే, ఆత్త=గ్రహింపబడిన, రూపమ్=రూపముగలది.

**తాత్పర్యము:–** నీలకంఠా! చీకటిలో రజ్జువును చూసి సర్పమని మేము భ్రాంతిపడినా, నిజానికి అచ్చట సర్పము పుట్టదు లేదా చావదు, పారిపోదు. అలానే మేము నిన్నుచూచి ప్రపంచము అనుకొన్నా ఈ ప్రపంచము నిజానికి లేదు. పుట్టదు. లయము కాదు. అంతా మా భ్రాంతిని బట్టి అలా అనిపిస్తుంది.



**శ్లో॥ విచార్యమాణే తవ యచ్ఛరీర–**
**మాధారభావం జగతాముపైతి।**
**తదప్యవశ్యం మదవిద్యయైవ**
**పూర్ణశ్చిదానన్దమయో యతస్త్వమ్॥ 30**

**ప్రతిపదార్థము:–** తవ=నీయొక్క, శరీరమ్=దేహము, జగతామ్=లోకములకు, ఆధార భావమ్=ఆధారమగుటను, ఉపైతి యత్=పొందుచున్నదనుట ఏది గలదో, తదపి=అది, విచార్యమాణే=విచారింపబడుచుండగా, అవశ్యమ్=తప్పక, మద్=నాయొక్క, అవిద్యయైవ=అజ్ఞానముచేతనే అని, తెలియుచున్నది. యతః=ఎందుకంటే, త్వమ్=నీవు, పూర్ణః=పూర్ణ పురుషుడవు, చిదానందమయః=జ్ఞానానంద స్వరూపుడవు.

**తాత్పర్యము:–** నీ శరీరమునందు ఈ ప్రపంచమంతయు ఉన్నట్లు కనబడుటకు నా అవిద్య అనగా అజ్ఞానమే కారణము. ఎందుకంటే నీవు పూర్ణపురుషుడవు. నిష్కాముడవు. జ్ఞానానందస్వరూపుడవు.

**శ్లో॥ పూజేష్టపూర్తాదివరక్రియాణామ్**
**భోక్తుః ఫలం యచ్ఛసి శస్తమేవ।**
**మృషైతదేవం వచనం పురారే !**
**త్వత్తోఽస్తి భిన్నం న చ కిఞ్చిదేవ॥ 31**

**ప్రతిపదార్థము:–** పురారే=పురహరా!, పూజా=అర్చన, ఇష్ట=యజ్ఞము, పూర్త=సత్రము, ఆది=మొదలగు, వర=మంచి, క్రియాణామ్=కర్మలకు, శస్తమ్=మంచిదైన, ఫలమేవ=ఫలితమునే, భోక్తుః=భోక్తకు, యచ్ఛసి=ఇచ్చుచున్నావు, ఏవమ్=ఈ విధముగా ఉన్న, ఏతత్=ఈ, వచనమ్=మాట, మృషా=అసత్యము, త్వత్తః=నీ కన్న, భిన్నమ్=వేరైనది, కించిత్ చ=కొంచమైనను, నైవ=లేనేలేదు.

**తాత్పర్యము:–** దేవా! యజ్ఞయాగాది సత్కర్మలకు నీవు మంచి ఫలితమును ఇచ్చెదవనుట అసత్యము. ఎందుకంటే ప్రపంచముగాని, యీ కర్మలుగాని, క్రియలుగాని, కర్తలుగాని నీ కన్నభిన్నమైనవికావుగదా! ఎవరు ఎవరికి దేనికి ఏమి ఇచ్చెదరు?

**శ్లో॥ అజ్ఞానమూఢా మునయో వదన్తి**
**పూజోపచారాదిబలిక్రియాభిః।**
**తోషం గిరీశో భజతీతి మిథ్యా**
**కుతస్త్వమూర్తస్య తు భోగలిప్సా॥ 32**

**ప్రతిపదార్థము:–** పూజా=పూజలు, ఉపచార=షోడశోపచారములు, ఆది=మొదలుగాగల, బలిక్రియాభిః=అర్చనావిధానాలతో, గిరీశః=శివుడు, తోషమ్=సంతోషమును, భజతి=పొందగలడు, ఇతి=అని, అజ్ఞాన=అవిద్యచేత, మూఢాః=మూఢులైన, మునయః=మునులు, వదంతి=చెప్పుచున్నారు, మిథ్యా=ఇది మిథ్య, అమూర్తస్య=శరీరరహితునకు, భోగ=భోగములయందు, లిప్సా తు=వాంఛ అయితే, కుతః=ఎక్కడిది?

**తాత్పర్యము:–** షోడశోపచార పూజలు, బలులు మొదలగువానితో ఈశ్వరుడు సంతోషిస్తాడని అజ్ఞానులమైన మునులు కొందరు చెప్తుంటారు. అది మిథ్య. శరీరరహితుడైన పరమాత్మకు పైన చెప్పిన భోగాలపై వాంఛ ఎట్లుండును?

**శ్లో॥ కిఞ్చిద్దలం వా చులుకోదకం వా**
**యత్త్వం మహేశ! ప్రతిగృహ్య దత్సే।**
**త్రైలోక్యలక్ష్మీమపి తజ్జనేభ్యః**
**సర్వం త్వవిద్యాకృతమేవ మన్యే॥ 33**

**ప్రతిపదార్థము:–**మహేశ=మహేశ్వరా!, కించిత్=ఏదో ఒక, దలం వా=ఆకునుగాని, చులుక =చారెడు, ఉదకం వా=నీటినిగాని, త్వమ్=నీవు, ప్రతిగృహ్య=తీసికొని, జనేభ్యః=జనుల కొఱకు, త్రైలోక్య=మూడు లోకములయొక్క, లక్ష్మీమపి=సంపదను గూడా, దత్సే ఇతి యత్=ఇస్తావనేమాట ఏది గలదో, తత్=దానిని, సర్వం తు=అంతటిని, అవిద్యాకృతమేవ=అజ్ఞానంవలన వచ్చినదానినిగానే, మన్యే=తలచెదను.

**తాత్పర్యము:–** మహేశ్వరా! ఫలమో పత్రమో తీసికొని అలా ఇచ్చిన భక్తులకు నీవు మూడులోకాలసంపదను ఇచ్చెదవని చెప్పిన మాటగూడా 'అవిద్య' వలన వచ్చిన వదంతిగానే భావించెదను.

**శ్లో॥ వ్యాప్నోషి సర్వా విదిశో దిశశ్చ**
**త్వం విశ్వమేకః పురుషః పురాణః।**
**నష్టేఽపి తస్మింస్తవ నాస్తి హాని–**
**ర్ఘటే వినష్టే నభసో యథైవ॥ 34**

**ప్రతిపదార్థము:–** త్వమ్=నీవు, ఏకః=ఒక్కడవు, పురాణః=ప్రాచీనుడవు, పురుషః=పురుషుడవు, విశ్వమ్=ప్రపంచమును, సర్వాః=సమస్తమైన, దిశః=దిక్కులను, విదిశశ్చ=మూలలను, వ్యాప్నోషి=వ్యాపించుచున్నావు, తస్మిన్=ఆ విశ్వము, నష్టేపి=నశించినను, తవ=నీకు, యథైవ=ఎట్లు, ఘటే=కుండ, వినష్టే=నశింపగా, నభసః=ఆకాశమునకు హాని లేనట్లు, హానిః=హాని, నాస్తి=లేదు.



**తాత్పర్యము:–** దేవా! నీవు ఒక్కడవే పురాణ పురుషుడవు. ఈ విశ్వమునందు దిక్కులు విదిక్కులూ అన్ని వ్యాపించినవాడవు. ఈ విశ్వము అంతా నశించినా నీకు హాని లేదు. కుండలో వ్యాపించిన ఆకాశమునకు కుండ పగిలినందువలన హాని లేదు గదా!

**శ్లో॥ యథైకమాకాశగమర్కబిమ్బమ్**
**క్షుద్రేషు పాత్రేషు జలాన్వితేషు।**
**భజత్యనేకప్రతిబిమ్బభావం**
**తథా త్వమన్తఃకరణేషు దేవ॥ 35**

**ప్రతిపదార్థము:–** దేవ=దేవా!, ఆకాశగమ్=ఆకాశములోగల, అర్కబింబమ్=సూర్యబింబము, ఏకమ్=ఒక్కటే, జలాన్వితేషు=నీరుగల, క్షుద్రేషు=చిన్నచిన్న, పాత్రేషు=పాత్రలయందు, అనేక=చాల, ప్రతిబింబ=ప్రతిబింబములుగా, భావమ్=అగుటను, యథా=ఎలా, భజతి=పొందునో, తథా=అలాగా, త్వమ్=నీవు, అంతఃకరణేషు=మా అంతఃకరణములలో ప్రతిబింబించి బహుత్వము పొందితివి.

**తాత్పర్యము:–** దేవా! ఆకాశమున సూర్యుడు ఒక్కడే అయినను, క్రిందనేలమీద ఉన్న బహుపాత్రలలో బహుసూర్యులుగా ప్రతిబింబిస్తాడు. అలానే నీవు ఒక్కడివే. కాని మా అంతఃకరణ యంత్రములందు ప్రతిబింబించి బహుజీవులుగా కనబడుచున్నావు.

**శ్లో॥ సంసర్జనే వాఽప్యవనే వినాశే**
**విశ్వస్య కిఞ్చిత్ తవ నాస్తి కార్యమ్।**
**అనాదిభిః ప్రాణభృతామదృష్టై –**
**స్తథాపి తత్స్వప్నవదాతనోషి॥ 36**

**ప్రతిపదార్థము:–**విశ్వస్య=ప్రపంచముయొక్క, సంసర్జనేవా=సృష్టియందుగాని,అవనేఽపి =రక్షణయందుగాని, వినాశే=నాశమునందుగాని, తవ=నీకు, కించిత్=కొంచమైనను, కార్యమ్=చేయదగిన, ప్రయోజనము, నాస్తి=లేదు, తథాపి=అయినను, ప్రాణభృతామ్ =ప్రాణులయొక్క, అనాదిభిః=అనాది కాలమునుండియున్న, అదృష్టైః=ప్రారబ్ధములచేత, తత్=వారియొక్క, లేదా ఆ విశ్వమును, స్వప్నవత్=కలనువలె, ఆతనోషి=విశ్వమును నిర్మించుచున్నావు.

**తాత్పర్యము:–** ఈ ప్రపంచాన్ని సృష్టించినా రక్షించినా, లయంచేసినా – ఇందులో నీకు ఏ ప్రయోజనమూ లేదు. అయినా ప్రాణులయొక్క అనాది కాలపు ప్రారబ్ధాలవలన స్వప్నము వంటి ఈ విశ్వమును అలా నడపుతున్నావు.

శ్లో॥ స్థూలస్య సూక్ష్మస్య జడస్య భోగో
దేహస్య శమ్భో! న చిదం వినాస్తి।
అతస్త్వదారోపణమాతనోతి
శ్రుతిః పురారే! సుఖదుఃఖయోస్సదా॥ 37

**ప్రతిపదార్థము:–** పురారే!=పురహరా!, శంభో!=శివా!, స్థూలస్య=స్థూలమైన, సూక్ష్మస్య=సూక్ష్మము అయిన ఈ, జడస్య=జడమైన, దేహస్య=శరీరమునకు, భోగః=అనుభవము, చిదంవినా=జ్ఞానములేక, నాస్తి=లేదు, అతః=ఇందువలన, శ్రుతిః=వేదము,సుఖదుఃఖయోః=సుఖదుఃఖములకు, త్వత్=నీయందు, ఆరోపణమ్=ఆరోపించుటను, ఆతనోతి=చేయుచున్నది.

**తాత్పర్యము:–** దేవ! పురహరా! ఈ దేహము అది స్థూలముగాని, సూక్ష్మముగాని – అది జడపదార్థమే. కావున వాటికి అనుభవం సొంతంగాఉండదు. అందుకు 'చిత్' అనగా జ్ఞానము అవసరము. జ్ఞానము అనగా నీ స్వరూపమే. కనుకనే శ్రుతి సుఖదుఃఖములన్నియు నీయందు ఆరోపించుచున్నది. ఆవిధంగా అది లోకరీతిని అనుసరించి చెప్తున్నది.

శ్లో॥ నమః సచ్చిదంభోధిహంసాయ తుభ్యం
నమః కాలకాలాయ కాలాత్మకాయ।
నమస్తే సమస్తాఘసంహారకర్త్రే
నమస్తే మృషాచిత్తవృత్త్యేకభోక్త్రే॥ 38

**ప్రతిపదార్థము:–** సచ్చిదంభోధి=సచ్చిదానందసముద్రమునందలి, హంసాయ=హంసవైన, తుభ్యమ్=నీకు, నమః=నమస్కారము, కాలకాలాయ=కాలునకే కాలుడవును, కాలాత్మకాయ=కాలస్వరూపుడవును అయిన, నీకు, నమః=నమస్కారము, సమస్త=సమస్తమైన, అఘ=పాపములయొక్క, సంహార=సంహరించుటను, కర్త్రే=చేయునాడవగు, తే=నీకు, నమః=నమస్కారము, మృషా=మిథ్యలయిన, చిత్తవృత్తి=మనోవృత్తులకు, ఏకభోక్త్రే=ఒకే భోక్తవైన, తే=నీకు, నమః=నమస్కారము.

**తాత్పర్యము:–** సత్యజ్ఞానసముద్ర హంసవు, దేవా! నీకు నమస్కారము. కాలకాలుడవైన మహాకాలా! నీకు నమస్కారము. సమస్త పాపసంహారకారీ! నీకు నమస్కారము. జీవుల యొక్క మిథ్యాచిత్తవృత్తులకు ఏకభోక్తవు, సాక్షివి అయిన నీకు నమస్కారము.

**సూత ఉవాచ-సూతుడు ఇట్లనెను.**

శ్లో॥ ఏవం ప్రణమ్య విశ్వేశం పురతః ప్రాఞ్జలిః స్థితః।
విస్మితః పరమేశానం జగాద రఘునన్దనః॥ 39



**ప్రతిపదార్థము:–** ఏవమ్=ఈ విధముగా, విశ్వేశమ్=విశ్వేశ్వరుని, ప్రణమ్య=నమస్కరించి, ప్రాంజలిః=అంజలి పట్టినవాడై, స్థితః=ఉండిన, రఘునందనః=రఘువీరుడు, విస్మితః=విస్మయపడినవాడై, పరమేశానమ్=పరమేశ్వరునిగూర్చి, జగాద=ఇట్లనెను.

**తాత్పర్యము:–** రాముడు ఈ విధంగా స్తోత్రం చేసి ప్రాంజలియై విశ్వేశ్వరుని యెదుట నిలిచి విస్మయముతో ఇట్లనెను.

**శ్రీరామ ఉవాచ-శ్రీరాముడిట్లనెను.**

శ్లో॥ ఉపసంహర విశ్వాత్మన్! విశ్వరూపమిదం తవ।
ప్రతీతం జగదైకాత్మ్యం శంభో! భవదనుగ్రహాత్॥ 40

**ప్రతిపదార్థము:–** విశ్వాత్మన్=విశ్వరూప!, ఇదమ్=ఈ, తవ=నీయొక్క, విశ్వరూపమ్=విశ్వరూపమును, ఉపసంహర=ఉపసంహరింపుము, శంభో!=ఈశ్వరా!, భవత్=నీ, అనుగ్రహాత్=అనుగ్రహమువలన, జగత్=జగత్తుయొక్క, ఐకాత్మ్యమ్=ఒకే ఆత్మ కలిగి ఉండుట, ప్రతీతమ్=తెలిసినది.

**తాత్పర్యము:–** హే విశ్వేశ్వరా! విశ్వరూపా! నీ విశ్వరూప ప్రదర్శనను విరమింపుము. దేవా! నీ అనుగ్రహం వలన నాకు ఈ ప్రపంచమునకు నీవే ఆత్మ అని తెలిసినది.

**శ్రీ శివ ఉవాచ-శ్రీ శివుడిట్లనెను.**

శ్లో॥ పశ్య రామ! మహాబాహో! మత్తో నాన్యోఽ స్తి కశ్చన।

**ప్రతిపదార్థము:–** మహాబాహో!=మహావీరా!, రామ=రామా!, పశ్య=చూడుము, మత్తః=నా కన్న, అన్యః=మఱొకడు, కశ్చన=ఎవడున్ను, నాస్తి=లేదు.

**తాత్పర్యము:–** మహావీరా! రామా! నాకన్న వేఱొకడు ఈ ప్రపంచమున లేదు.

**సూత ఉవాచ-సూతుడిట్లనెను.**

ఇత్యుక్త్వోపసఞ్జహ్రే స్వదేహే దేవతాదికాన్॥ 41

**ప్రతిపదార్థము:–** ఇతి=ఇలాగని,ఉక్త్వైవ=చెప్పి, స్వదేహే=తన శరీరమునందలి, దేవతాదికాన్=దేవతలుమొదలగు, దృశ్యములను, ఉపసంజహ్రే=ఉపసంహరించెను.

**తాత్పర్యము:–** ఇట్లని పరమశివుడు తన విశ్వరూపమును, అందుగనబడిన దేవతారూపములను ఉపసంహరించెను.

శ్లో॥ మీలితాక్షః పునర్ద్రష్టాద్యావద్రామః ప్రపశ్యతి।
తావదేవ గిరేః శృఙ్గే వ్యాఘ్రచర్మోపరిస్థితమ్॥ 42

శ్లో॥ దదర్శ పఞ్చవదనం నీలకణ్ఠం త్రిలోచనమ్।
వ్యాఘ్రచర్మామ్బరధరం భూతిభూషితవిగ్రహమ్॥ 43

**ప్రతిపదార్థము:–** హర్షాత్=సంతోషమువలన, రామః=రాముడు, మీలితాక్షః=మూసిన కన్నులుగలవాడై, యావత్=ఎంతలో, పునః=మఱల, ప్రపశ్యతి=చూచునో, తావదేవ= అంతలోనే గిరేః=పర్వతముయొక్క, శృంగే=శిఖరమునందు, వ్యాఘ్రచర్మ=పులిచర్మముపైన, ఉపరిస్థితమ్=ఆసీనుడైన, పంచ=ఐదు, వదనమ్=ముఖములుగలవాడును, నీలకంఠమ్= నల్లని కంఠము గలవాడును అగు, వ్యాఘ్రచర్మ=పులితోక, అంబర=వస్త్రముగా, ధరమ్= ధరించినవాడును, భూతి= బూడిద చేత, భూషిత=అలంకరింపబడిన, విగ్రహమ్=శరీరము గలవాడును అగు, త్రిలోచనమ్=ముక్కంటిని దదర్శ=చూచెను.

**తాత్పర్యము:–** సంతోషాతిశయంతో కన్నులుమూసి ధ్యానించిన రాముడు మఱల కళ్ళు తెఱచిచూచెను. అంతలోనే, పర్వతశిఖరమున వ్యాఘ్రచర్మమున ఆసీనుడైన శివుని చూచెను. నీలకంఠుడు, త్రినేత్రుడు, పంచవదనుడు, వ్యాఘ్రచర్మాంబరధరుడు, భస్మోద్ధూళిత విగ్రహుడుగా స్వామి దర్శనయ్యెను.

శ్లో॥ ఫణికఙ్కణభూషాఢ్యం నాగయజ్ఞోపవీతినమ్।
వ్యాఘ్రచర్మోత్తరీయం చ విద్యుత్పిఙ్గజటాధరమ్॥ 44

**ప్రతిపదార్థము:–** ఫణికంకణ=నాగకంకణములే, భూషాఢ్యమ్=సొమ్ములుగా గలవాడును, నాగ=పాములే, యజ్ఞోపవీతినమ్=జందెముగా గలవాడును, వ్యాఘ్రచర్మ=పులిచర్మమే, ఉత్తరీయమ్=ఉత్తరీయముగా గలవాడును, విద్యుత్=మెఱపు తీగలవంటి, పింగ=పింగళవర్ణ మైన, జటాధరమ్=జడలు ధరించినవాడును అగు స్వామిని చూచెను.

**తాత్పర్యము:–** నాగకంకణములు, నాగయజ్ఞోపవీతము,వ్యాఘ్రచర్మోత్తరీయము, మెఱపు తీగలవంటి పింగళజడలుగల శివుని చూచెను.

శ్లో॥ ఏకాకినం చన్ద్రమౌళిం వరేణ్యమభయప్రదమ్।
చతుర్భుజం ఖణ్డపరశుం మృగహస్తం జగత్పతిమ్॥ 45

**ప్రతిపదార్థము:–**ఏకాకినమ్=ఒంటరివాడును, చంద్రమౌళిమ్=చంద్రశేఖరుడును, వరేణ్యమ్ =వరణీయుడును,అభయప్రదమ్=అభయమునిచ్చువాడును, చతుర్భుజమ్=నాల్గుభుజములు గలవాడును, మృగ=లేడిని,హస్తమ్=చేతధరించినవాడును, జగత్పతిమ్=ప్రపంచవల్లభుడును అగు శివుని చూచెను.



**తాత్పర్యము:–** ఒంటరివాడు, సిగపూవుగా నెలవంకను దాల్చినవాడు, వరము లడుగదగిన వాడు, అభయప్రదుడు, నాలుగు భుజములుగలవాడు, గండ్రగొడ్డలి బూనినవాడు, జింకను చేపట్టినవాడు అయిన ఆ జగదీశ్వరుని రాముడు చూచెను.

శ్లో॥ అథాజ్ఞయా పురస్తస్య ప్రణమ్యోపవివేశ సః।
అథాహ రామం దేవేశో యద్యత్ప్రష్టుమభీప్ససి।
తత్సర్వం పృచ్ఛ రామ! త్వం మత్తో నాన్యోఽ స్తి తే గురుః॥ 46

**ప్రతిపదార్థము:–** అథ=తర్వాత, తస్య=ఆ శివునియొక్క, ఆజ్ఞయా=ఆనతితో, సః=రాముడు, పురః=ఆయన ఎదుట, ప్రణమ్య=నమస్కరించి, ఉపవివేశ=కూర్చొనెను, అథ=తర్వాత, దేవేశః=దేవాధిదేవుడు, రామమ్=రామునిగూర్చి, ఆహ=ఇట్లు పలికెను. రామ=రామా! యత్, యత్=ఏదేది, ప్రష్టుమ్=అడుగుటకు, అభీప్ససి=కోరుచున్నావో, తత్=అది, సర్వమ్=అంతా, త్వమ్=నీవు, పృచ్ఛ=అడుగుము, తే=నీకు, మత్తః=నాకన్న, అన్యః =వేఱయిన,గురుః=గురువు, నాస్తి=లేడుగదా!

**తాత్పర్యము:–** రాముడు శివుని ఆజ్ఞతో ఆయన ఎదుట నమస్కరించి ఆసీనుడయ్యెను. శివుడు రామునితో ఇట్లనెను. రామా! నీకు నా కన్నవేరే గురువు లేడు. కనుక నీవు అడుగదలచినదేదయినా నిస్సంకోచముగా అడుగుము.

**ఇతి శ్రీ పద్మపురాణే ఉపరిభాగే శివగీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీ శివరాఘవసంవాదే విశ్వరూపదర్శనం నామ సప్తమోఽధ్యాయః॥**

**ఓం తత్సత్ ఓం.**

* * * * *

# అథ అష్టమోఽ ధ్యాయః
# పిణ్డోత్పత్తి వర్ణనయోగః

**శ్రీరామ ఉవాచ**

**శ్లో॥ పాఞ్చభౌతికదేహస్య చోత్పత్తిర్విలయః స్థితిః।**
**స్వరూపం చ కథం దేవ! భగవన్ వక్తుమర్హసి॥ 1**

**ప్రతిపదార్థము:–** దేవ=దేవా!, పాంచభౌతిక=పంచభూతనిర్మితమైన, దేహస్య చ= దేహమునకు, ఉత్పత్తిః=జననము, విలయః=లయము, స్థితిః=స్థితి, స్వరూపం చ= స్వరూపము, కథమ్=ఎట్లు?, భగవన్=ప్రభూ!, వక్తుమర్హసి=చెప్పదగును.

**తాత్పర్యము:–** దేవ! ఈ పాంచభౌతిక శరీరము ఎలా జన్మిస్తున్నది? ఎలా నిలుస్తున్నది? ఎలా లయిస్తున్నది? ఈ సందేహమును తీర్చవలసినది.

**శ్రీ శివ ఉవాచ-శివుడిట్లనెను.**

**శ్లో॥ పఞ్చభూతైః సమారబ్ధో దేహోఽయం పాఞ్చభౌతికః।**
**తత్ర ప్రధానం పృథివీ శేషాణాం సహకారితా॥ 2**

**ప్రతిపదార్థము:–** పంచభూతైః=పంచభూతములచేత, సమారబ్ధః=ప్రారంభింపబడిన, అయమ్=ఈ, దేహః=శరీరము, పాంచభౌతికః=పాంచభౌతికము, తత్ర=అందులో, పృథివీ= భూమి అనబడు భూతము,ప్రధానమ్=ముఖ్యమైనది,శేషాణామ్=మిగిలినవాటికి, సహకారితా=సహాయకత్వము మాత్రమే.

**తాత్పర్యము:–** పంచభూతములచేత ప్రారంభింపబడిన ఈ శరీరము పాంచభౌతికము. అందులో భూమి అనబడు భూతము ముఖ్యమైనది. మిగిలినవాటికి సహాయకత్వము మాత్రమే.

**శ్లో॥ జరాయుజోఽణ్డజశ్చైవ స్వేదజశ్చోద్భిదస్తథా।**
**ఏవం చతుర్విధః ప్రోక్తో దేహోఽయం పాఞ్చభౌతికః॥ 3**



**ప్రతిపదార్థము:–** జరాయుజః=జరాయుజమని, అండజశ్చైవ=అండజమని, స్వేదజశ్చ= స్వేదజమని, తథా=అట్లే, ఉద్భిదః=ఉద్భిజ్జమని, ఏవమ్=ఇట్లు, అయమ్=ఈ, పాంచభౌతికః =పాంచభౌతికమైన, దేహః=శరీరము, చతుర్విధః=నాల్గువిధములుగా, ప్రోక్తః=చెప్పబడినది.

**తాత్పర్యము:–** ఈ పాంచభౌతిక శరీరము నాలుగు విధములు. 1) జరాయుజము, 2) అండజము, 3) స్వేదజము, 4) ఉద్భిజ్జము అని.

**శ్లో॥ మానసస్తు పరః ప్రోక్తో దేవానామేవ స స్మృతః।**
**తత్ర వక్ష్యే ప్రథమతః ప్రధానత్వాజ్జరాయుజమ్॥ 4**

**ప్రతిపదార్థము:–** పరః=తరువాతది, మానసః=మానసమని, ప్రోక్తః=చెప్పబడినది, స తు =అది అయితే, దేవానామేవ=దేవతలయొక్క శరీరమే అని, స్మృతః=చెప్పబడినది, తత్ర= ఆ శరీరాలలో,ప్రధానత్వాత్=ముఖ్యమైనదగుటవలన, జరాయుజమ్=జరాయుజశరీరమును గూర్చి, ప్రథమతః=ముందుగా, వక్ష్యే=చెప్పగలను.

**తాత్పర్యము:–** నాలుగు విధముల శరీరములకన్న తరువాతది మానస శరీరము. అది దేవతలది. వీనిలో ప్రధానమైనది గనుక ముందుగా 'జరాయుజ' శరీరమును గూర్చి వివరించెదను.

**శ్లో॥ శుక్రశోణితసమ్భూతవృత్తిరేవ జరాయుజః।**
**స్త్రీణాం గర్భాశయే శుక్రమృతుకాలే విశేద్యదా।**
**యోషితో రజసాయుక్తం తదేవ స్యాజ్జరాయుజమ్॥ 5**

**ప్రతిపదార్థము:–**శుక్ర=పురుష వీర్యము,శోణిత=స్త్రీశోణితములచేత, సంభూత=సంభవించిన వృత్తిరేవ=ప్రవర్తనకలదే, జరాయుజః=జరాయుజము, ఋతుకాలే=ఋతుసమయమున, స్త్రీణామ్=స్త్రీలయొక్క, గర్భాశయే=గర్భకోశమున, శుక్రమ్=వీర్యము, యదా=ఎపుడు, విశేత్= ప్రవేశించునో అప్పుడు, యోషితః=స్త్రీయొక్క, రజసా=శోణితముచేత, యుక్తమ్=కలిసినదై, తదేవ=అదే, జరాయుజమ్=జరాయుజశరీరముగా, స్యాత్=అగును.

**తాత్పర్యము:–** శుక్ర శోణితములు కలియుటవలన ఏర్పడు శరీరము, 'జరాయుజము' పురుష వీర్యము ఋతుకాలములో స్త్రీ గర్భాశయమున ప్రవేశించి శోణితముతో కలిసినదై 'జరాయుజ' శరీరమగును.

**శ్లో॥ బాహుల్యాద్రజసః స్త్రీ స్యాచ్ఛుక్రాధిక్యే పుమాన్ భవేత్।**
**శుక్రశోణితయోః సామ్యే జాయతే చ నపుంసకః॥ 6**

**ప్రతిపదార్థము:–** రజసః=శోణితముయొక్క, బాహుల్యాత్=ఆధిక్యమువలన, స్త్రీ=స్త్రీ, స్యాత్=అగును, శుక్ర=వీర్యము యొక్క, ఆధిక్యే=ఆధిక్యమునందు, పుమాన్=పురుషుడు, భవేత్=అగును, శుక్రశోణితయోః=రజోరేతస్సులయొక్క, సామ్యే=సామ్యావస్థలో, నపుంసకః చ= నపుంసకుడున్ను, జాయతే=పుట్టును.

**తాత్పర్యము:–** శోణితము అధికమైనచో సంతానము స్త్రీ అగును. రేతస్సు అధికభాగమైనచో పురుషుడగును. రెండూ సమపాళ్ళయినచో సంతానము నపుంసకము కావచ్చును.

**శ్లో॥ ఋతుస్నాతా భవేన్నారీ చతుర్థే దివసే తతః।**
**ఋతుకాలస్తు నిర్దిష్ట ఆ షోడశదినావధి।**
**తత్రాయుగ్మదినే స్త్రీ స్యాత్పుమాన్యుగ్మదినే భవేత్॥ 7**

**ప్రతిపదార్థము:–** నారీ=స్త్రీ, చతుర్థే=నాల్గవ, దివసే=రోజున, ఋతుస్నాతా=ఋతుస్నానము చేసినది, భవేత్=అగును, తతః=తర్వాత, ఆ షోడశదినావధి=16 రోజుల వఱకు, ఋతుకాలస్తు=ఋతుకాలము, నిర్దిష్టః=చెప్పబడినది, తత్ర=ఆ 16 రోజులలో, అయుగ్మ=బేసి అయిన, దినే=రోజున, స్త్రీ=స్త్రీ, స్యాత్=అగును, యుగ్మ=సరి అయిన, దినే=రోజున, పుమాన్=పురుషుడు, భవేత్=అగును.

**తాత్పర్యము:–** ఋతుకాలమును ఋతువు ఆరంభించినది మొదలు నాల్గవరోజున ఋతుస్నానము జరుగును. నాటి నుండి 16 రోజులవఱకు ఋతుకాలమందురు. అందులో సరిరోజున గర్భమువచ్చినచో పురుష సంతానము కలుగును, బేసిరోజున గర్భము వచ్చినచో స్త్రీ సంతానమును కలుగును.

**శ్లో॥ షోడశే దివసే గర్భో జాయతే యది సుభ్రువః।**
**చక్రవర్తీ భవేద్రాజా జాయతే నాఽత్ర సంశయః॥ 8**

**ప్రతిపదార్థము:–** సుభ్రువః=స్త్రీకి, షోడశే=పదహారవ, దివసే=రోజున, గర్భః=గర్భము, యది జాయతే=కలిగినచో, ఆ గర్భము, చక్రవర్తీ=చక్రవర్తిగాని, భవేత్=అగును, రాజా=రాజు, జాయతే=పుట్టును, అత్ర=ఈవిషయములో, సంశయః=సందేహము, న=లేదు.

**తాత్పర్యము:–** పదహారవ రోజున స్త్రీ గర్భము ధరించినచో ఆ గర్భబాలుడు తప్పక రాజో, చక్రవర్తియో కాగలడు. ఇందులో సందేహము లేదు.

**శ్లో॥ ఋతుస్నాతా యస్య పుంసః సాకాఙ్క్షం ముఖమీక్షతే।**
**తదాకృతిర్భవేద్గర్భస్తత్పశ్యేత్స్వామినో ముఖమ్॥ 9**



**ప్రతిపదార్థము:–** ఋతుస్నాతా=ఋతుస్నానము చేసిన స్త్రీ, యస్య=ఏ పురుషునియొక్క, ముఖమ్=మొగమును, సాకాంక్షమ్=వాంఛతో, ఈక్షతే=చూచునో, గర్భః=గర్భము, తదాకృతిః=ఆ పురుషుని పోలిక గలది, భవేత్=అగును, తత్=అందువలన, స్వామినః=భర్తయొక్క, ముఖమ్=ముఖమును, పశ్యేత్=స్త్రీ చూడవలెను.

**తాత్పర్యము:–** ఋతుస్నానము చేసిన స్త్రీ ఆ సమయమున వాంఛతో ఎవరి ముఖమును చూచునో ఆ పురుషుని పోలికతో బిడ్డను కనగలదు. కనుక ఋతుస్నాత తప్పక తన భర్త ముఖమునే సాకాంక్షగా చూడవలెను.

**శ్లో॥ యాస్తి చర్మావృతిః సూక్ష్మా జరాయుః సా నిగద్యతే।**
**శుక్రశోణితయోర్యోగస్తస్మిన్నేవ భవేద్యతః।**
**తత్ర గర్భో భవేద్యస్మాత్ తేన ప్రోక్తో జరాయుజః॥ 10**

**ప్రతిపదార్థము:–** సూక్ష్మా=సూక్ష్మమైన, చర్మావృతిః=చర్మావరణము, యాస్తి=ఏది గలదో, సా=అది, జరాయుః='మావి' అని, నిగద్యతే=చెప్పబడుచున్నది, తస్మిన్నేవ=దానియందే, శుక్రశోణితయోః=రజోరేతస్సులకు, యోగః=సంబంధము, యతో భవేత్=కలుగును గనుక, తత్ర=అందే, గర్భః=గర్భము, యస్మాద్భవేత్=కలుగును గనుక, తేన=అందుచేత, జరాయుజః=జరాయుజమని, ప్రోక్తః=చెప్పబడినది.

**తాత్పర్యము:–** సూక్ష్మమైన చర్మావరణము ఒక్కటి ఉండును. దానిని 'జరాయువు' (మావి) అందురు. శుక్రశోణిత సంబంధము ఇందులో జరుగును గనుక, గర్భమున్ను ఇందులో ఏర్పడును గనుక ఈ విధంగా పుట్టిన సంతానమునకు 'జరాయుజము' అని పేరు.

**శ్లో॥ అణ్డజాః పక్షిసర్పాద్యాః స్వేదజా మశకాదయః।**
**ఉద్భిజ్జాస్తృణగుల్మాద్యా మానసాశ్చ సురర్షయః॥ 11**

**ప్రతిపదార్థము:–** పక్షిసర్పాద్యాః=పక్షులు, పాములు మొదలగు జీవులు, అండజాః=గ్రుడ్డు నుండి పుట్టినవి, మశకాదయః=దోమలు మొదలగునవి, స్వేదజాః=స్వేదమునుండి (వేడితో ఆవిరితో చెమటలు పుట్టించే కుప్పతొట్టి మొదలగు చోట్లు) పుట్టినవి, తృణ=గడ్డి, గుల్మ=పొదలు, ఆద్యాః=మొదలైన జీవులు, ఉద్భిజ్జాః=నేలను పొడుచుకొని బయటకు వచ్చునవి, సుర=దేవతలు, ఋషయః=దేవర్షులు, మానసాః=మనస్సునుండి పుట్టువారు.

**తాత్పర్యము:–** పక్షులు, పాములు గ్రుడ్డునుండి పుట్టును. దోమల మొదలగు కీటకములు స్వేదము నుండి పుట్టును. గడ్డిగాదము మొదలగు ఉద్భిజ్జములు, దేవతలు, దేవర్షులు మానస సంజాతులు. కాగా మానవులు మొదలగువారు జరాయుజులు.

**శ్లో॥ జన్మకర్మవశాదేవ నిషిక్తం స్మరమన్దిరే।**
**శుక్రం రజస్సమాయుక్తం ప్రథమే మాసి తద్ద్రవమ్॥ 12**

**ప్రతిపదార్థము:–** జన్మకర్మ=పూర్వజన్మప్రారబ్ధముయొక్క, వశాదేవ=వశమువలననే, స్మర మందిరే=యోనియందు, నిషిక్తమ్=నిషేకముచేయబడిన, శుక్రమ్=వీర్యము, రజస్సమా యుక్తమ్=రజస్సుతో గూడినదై, తత్=అది, ప్రథమే=మొదటి, మాసి=నేలయందు, ద్రవమ్= ద్రవముగా ఉండును.

**తాత్పర్యము:–** ప్రారబ్ధకర్మవలన యోనియందు ఉంచబడిన వీర్యము రజస్సుతో కలిసి మొదటి మాసమున 'ద్రవ' రూపముగానుండును.

**శ్లో॥ కలలం బుద్బుదం తస్మాత్తతః పేశీ భవేదిదమ్।**
**పేశీఘనం ద్వితీయే తు మాసి పిణ్డః ప్రజాయతే॥ 13**

**ప్రతిపదార్థము:–** తస్మాత్=తర్వాత, కలలమ్=కలలముగాను, బుద్బుదమ్=బుడగగాను, తతః=తర్వాత,ఇదమ్=ఇది, 'పేశీ'=పేశి, భవేత్=కాగలదు, ద్వితీయే=రెండవదైన, మాసితు= మాసమునందు, పేశీఘనమ్=పేశీఘనము, పిండః=పిండముగా, ప్రజాయతే=పుట్టును.

**తాత్పర్యము:–** ఆ ద్రవము కలలముగాను, తర్వాత బుద్బుదము లేదా బుడగలాగాను, తర్వాత ఒక 'పేశి' గాను అది ఘనమై రెండవ నెలలో పిండముగాను కనిపించును.

**శ్లో॥ కరాంఘ్రిశీర్షకాదీని తృతీయే సమ్భవన్తి హి।**
**అభివ్యక్తిశ్చ జీవస్య చతుర్థే మాసి జాయతే॥**
**తతశ్చలతి గర్భోఽపి జనన్యా జఠరే స్వతః॥ 14**

**ప్రతిపదార్థము:–** తృతీయే=మూడవనెలలో, కర=చేతులు, అంఘ్రి=కాళ్ళు, శీర్షకాదీని= తల మొదలగునవి, సంభవంతి హి=కలుగును గదా!, చతుర్థే=నాల్గవ, మాసి=నెలయందు, జీవస్య=జీవునియొక్క, అభివ్యక్తిః=స్పష్టత, జాయతే=కలుగును, తతః=అక్కడినుండి, జనన్యాః =తల్లియొక్క, జఠరే=గర్భమున, స్వతః=స్వయముగా, గర్భోపి=గర్భముగూడా, చలతి =కదలుచుండును.

**తాత్పర్యము:–** పాణిపాదములు, తల మొదలగు అవయ విభాగము 3వ మాసమున ప్రారంభించును. నాల్గవ మాసమున జీవము ప్రస్ఫుటమగును. అచ్చట నుంచి తల్లి ఉదరమున, కదలికలు కనిపించును.

**శ్లో॥ పుత్రశ్చేత్ దక్షిణే పార్శ్వే కన్యా వామే చ తిష్ఠతి।**
**నపుంసకస్తూదరస్య భాగే తిష్ఠతి మధ్యతః॥ 15**



**ప్రతిపదార్థము:–** పుత్రశ్చేత్=గర్భము 'మగ' అయినచో, ఉదరస్య=పొట్టయొక్క, దక్షిణే= కుడి అయిన, పార్శ్వే=ప్రక్కన, కన్యాచేత్=కూతురయితే, వామేచ=ఎడమభాగమున, తిష్ఠతి= ఉండును. నపుంసకస్తు=నపుంసకుడయితే, ఉదరస్య=పొట్టయొక్క, భాగే=భాగమున, మధ్యతః=మధ్యగా, తిష్ఠతి=ఉండును.

**తాత్పర్యము:–** గర్భమున ఉన్న సంతానము 'మగ' అయినచో దక్షిణభాగమున 'ఆడ' అయినచో 'ఎడమ' భాగమున స్థితి కనబడును. నపుంసకమైనచో మధ్యగా ఉన్నట్లనిపించును.

**శ్లో॥ అతో దక్షిణపార్శ్వే తు శేతే మాతా పుమాన్ యది।**
**అఙ్గప్రత్యఙ్గభాగాశ్చ సూక్ష్మాః స్యుర్యుగపత్తదా।**
**విహాయ శ్మశ్రుదన్తాదీన్ జన్మానన్తరసమ్భవాన్॥ 16**

**ప్రతిపదార్థము:–** అతః=కనుక, పుమాన్ యది='మగ గర్భం' అయినచో, మాతా=గర్భవతి అయిన తల్లి, దక్షిణ=కుడిదయిన, పార్శ్వే తు=భాగమునందే, శేతే=పరుండును, తదా=ఆ తర్వాత,జన్మానంతర=పుట్టిన తర్వాత, సంభవాన్=సంభవించునట్టి, శ్మశ్రుదంతాదీన్= గడ్డాలు, పన్నులు మొదలగువాటిని, విహాయ=విడిచి, సూక్ష్మః=సూక్ష్మ పరిమాణముగల, అంగ= అవయములయొక్క, ప్రత్యంగ=ఉప అవయవములయొక్క, భాగాశ్చ=భాగాలు, యుగపత్= ఒక్కసారిగా, స్యుః=ఏర్పడగలవు.

**తాత్పర్యము:–** అందువలననే 'మగగర్భం' గల గర్భవతి కుడివైపు తిరిగి పరుండును. నాల్గవమాసమున అవయవాలు, ఉప అవయవాలు ఒకేసారి సూక్ష్మరూపముతో ఏర్పడును. జన్మ తరువాత ఏర్పడవలసిన గడ్డాలు, మీసాలు, దంతాలు వంటివి మాత్రం అప్పుడు ఏర్పడవు.

**శ్లో॥ చతుర్థే వ్యక్తతా తేషాం భావానామపి జాయతే॥ 17**

**ప్రతిపదార్థము:–** తేషామ్=సూక్ష్మాంగములకు, చతుర్థే=నాల్గవ మాసమున, భావానామ్= అభిప్రాయముయొక్క, వ్యక్తతాపి=స్పష్టత గూడా, జాయతే=కలుగును.

**తాత్పర్యము:–** రామా! గర్భశిశువులలో భావవ్యక్తి గూడా చతుర్థమాసములో ఏర్పడును.

**శ్లో॥ పుంసాం స్థైర్యాదయో భావా భీరుత్వాద్యాస్తు యోషితామ్।**
**నపుంసకే చ తే మిశ్రా భవన్తి రఘునన్దన॥ 18**

**ప్రతిపదార్థము:–** రఘునందన=రాఘవా!, పుంసామ్=పురుషులకు, స్థైర్యాదయః=ధైర్యం మొదలగు, భావాః=భావములు, యోషితాం తు=స్త్రీలకైతే, భీరుత్వాద్యాః=బిడియము మొదలగు గుణములు, నపుంసకే చ=నపుంసకునియందు, తే=ఆ భావాలు, మిశ్రాః= సంకరముగా, భవంతి=కలుగును.

**తాత్పర్యము:–** పురుష శిశువులకు ధైర్యము మొదలగు గుణములు, స్త్రీ శిశువులకు బిడియము మొదలగు గుణములు నపుంసకులలో ఇట్టి స్త్రీపురుష గుణమిశ్రమము ఏర్పడును. ఇదంతా నాల్గవమాసములోనే ప్రారంభమగును.

**శ్లో॥ మాతృజం చాఽస్య హృదయం విషయానభికాంక్షతి।**
**తతో మాతృమనోభీష్టం కుర్యాద్ గర్భవివృద్ధయే॥ 19**

**ప్రతిపదార్థము:–** మాతృజమ్=తల్లివలన కలిగిన, అస్య=ఇతని, హృదయమ్=హృదయము, విషయాన్ చ=విషయములనుగూడా, అభికాంక్షతి=కోరును, తతః=అందువలననే, గర్భ=గర్భముయొక్క, వివృద్ధయే=పెరుగుదల కొఱకు,మాతృ=తల్లియొక్క, మనోభీష్టమ్=వాంఛను, కుర్యాత్=చేయవలయును.

**తాత్పర్యము:–** తల్లివలన వచ్చిన హృదయమే గర్భశిశువుది. అందువలన అది విషయ కాంక్షతో నిండి ఉంటుంది. అది తల్లిహృదయం ద్వారా వ్యక్తమవుతుంది. అందువలన గర్భవతియొక్క వాంఛలను తీర్చవలెను. అట్లయినచో గర్భవృద్ధి జరుగును.

**శ్లో॥ తాం చ ద్విహృదయాం నారీమాహుర్దౌహృదినీం తతః।**
**అదానాద్దౌహృదానాం స్యుర్గర్భస్య వ్యఙ్గతాదయః॥ 20**

**ప్రతిపదార్థము:–** ద్విహృదయామ్=రెండు హృదయములుగల, తామ్=ఆ, నారీమ్=గర్భవతి అయిన స్త్రీని, తతః=అందువలన దౌహృదినీమ్='దౌహృదిని' గా, ఆహుః=అందురు, దౌహృదానామ్=గర్భవతీ హృదయవాంఛలయొక్క, అదానాత్=ఇవ్వకపోవుటవలన, గర్భస్య= గర్భమునకు, వ్యంగతాదయః=వికలాంగత మొదలైనవి కలుగును.

**తాత్పర్యము:–** అలా గర్భహృదయము స్వంత హృదయము అని రెండు హృదయాలు గలది గనుక గర్భవతిని "దౌహృదిని" అందురు. దౌహృదములు (రెండు హృదయాలకు సంబంధించి కోరబడినవి) సమకూర్చనిచో గర్భమునకు అంగలోపములు సంభవించును.

**శ్లో॥ మాతుర్యద్విషయే లోభస్తదార్తో జాయతే సుతః।**
**ప్రబుద్ధం పఞ్చమే చిత్తం మాంసశోణితపుష్టతా॥ 21**

**ప్రతిపదార్థము:–** మాతుః=తల్లికి, యద్విషయే=ఏ విషయమున, లోభః=కోరికయో, సుతః=కొడుకు / గర్భశిశువు, తదార్తః=దాంతో బాధపడినవాడుగా, జాయతే=పుట్టును, పంచమే=ఐదవ నెలలో, చిత్తమ్=మనస్సు, ప్రబుద్ధమ్=మేల్కొనును, మాంస=మాంసముచేత, శోణిత=నెత్తుటిచేత, పుష్టతా=పుష్టి కలుగును.



**తాత్పర్యము:–** తల్లికి ఏ వస్తువు విషయంలో బాగా ఆసక్తి ఉంటుందో ఆ విషయంలో లోపంతో సుతుడు జన్మించును. ఐదవ నెలలోమనస్సు వికసించును. మాంసము, నెత్తురు బాగా వృద్ధి చెందును.

**శ్లో॥ షష్ఠేఽస్థిస్నాయునఖరకేశలోమవివిక్తతా।**
**బలవర్ణౌ చోపచితౌ సప్తమే త్వఙ్గపూర్ణతా॥ 22**

**ప్రతిపదార్థము:–** షష్ఠే=ఆఱవమాసమున, అస్థి=ఎముకలయొక్క, స్నాయు=స్నాయువుల యొక్క, నఖర=గోళ్ళయొక్క, కేశ=వెంట్రుకలయొక్క, లోమ=రోమములయొక్క, వివిక్తతా=ప్రత్యేకత ఏర్పడును. బల=బలము, వర్ణౌ చ=రంగున్ను, ఉపచితౌ=పెరుగును, సప్తమే తు=ఏడవనెలయందు, అంగ=శరీరమునందు, పూర్ణతా=సమగ్రత ఏర్పడును.

**తాత్పర్యము:–** ఆఱవనెలలో ఎముకలు, స్నాయువులు, గోళ్ళు, వెంట్రుకలు, రోమములు (ఒంటిమీది వెంట్రుకలు) ఇవి స్పష్టముగా ప్రత్యేకత సంతరించికొనును. బలం రంగు ఏర్పడును. దేహం సంపూర్ణమగును.

**శ్లో॥ పాదాన్తరితహస్తాభ్యాం శ్రోత్రరంధ్రే పిధాయ సః।**
**ఉద్విగ్నో గర్భసంవాసాదస్తి గర్భాలయాన్వితః॥ 23**

**ప్రతిపదార్థము:–** సః=ఆ గర్భశిశువు, పాద=కాళ్ళతో, అంతరిత=పెనవేసికొనిన, హస్తాభ్యామ్=చేతులతో, శ్రోత్రరంధ్రే=చెవి రంధ్రములను, పిధాయ=మూసికొని, గర్భ=గర్భమునందు, సంవాసాత్=నివాసమువలన, ఉద్విగ్నః=బాధపడినవాడై, గర్భాలయ=గర్భగృహముతో, అన్వితః=కూడినవాడై, ఆస్తి=ఉండును.

**తాత్పర్యము:–** గర్భవాసములోనుండి, గర్భవాసమునకు భయపడి కాళ్లతో పెనవేసికొన్న హస్తముల చేత చెవులు కప్పుకొని ఉండును.

**శ్లో॥ ఆవిర్భూతప్రబోధోఽసౌ గర్భదుఃఖాదిసంయుతః।**
**హా ! కష్టమితి నిర్విణ్ణః స్వాత్మానం శోశుచీత్యథ॥ 24**

**ప్రతిపదార్థము:–** అథ=తర్వాత, ఆవిర్భూత=ఏర్పడిన, ప్రబోధః=జ్ఞానము కలవాడై, అసౌ=ఈ గర్భశిశువు, గర్భదుఃఖ=గర్భవాస దుఃఖము మొదలగువానితో, సంయుతః=కూడినవాడై, హా!=అయ్యో!, కష్టమ్=కష్టము, ఇది=అని, నిర్విణ్ణః=విచారము పొందినవాడై, స్వాత్మానమ్=తనను గూర్చి, శోశుచీతి=దుఃఖించును.

**తాత్పర్యము:–** తర్వాత జ్ఞానమేర్పడిన గర్భశిశువు గర్భదుఃఖమును గుర్తించి బాధపడు చుండును. కష్టమునకు విరక్తి చెందుచుండును. తనను గూర్చి తాను శోకించును.

శ్లో॥ అనుభూతా మహాఽసహ్యాః పురా మర్మచ్ఛిదోఽసకృత్।
కరమ్భవాలుకాస్తప్తా దహ్యన్తే చాసుఖాశయాః॥ **25**

**ప్రతిపదార్థము:–** పురా=పూర్వము, మర్మచ్ఛిదః=మర్మఛేదకములైన, మహాసహ్యాః=పెద్ద అసహ్యవేదనలు, అసకృత్=అనేకసార్లు, అనుభూతాః=అనుభవింపబడినవి, అసుఖాశయాః =సుఖస్థానములు కానివి, తప్తాః=కాల్చబడినవియు అగు, కరంభ=పేలాలయొక్క, వాలుకాః =వేపిన ఇసుకలు, దహ్యంతే=దహించుచున్నవి.

**తాత్పర్యము:–** పూర్వం అనేక అసహ్యవేదను చాలసార్లు అనుభవించాను. కాని యీ బాధ విలక్షణముగా నున్నది. పేలాలువేపిన ఇసుకవలె యీ బాధ చాల అసుఖముగా నున్నది.

శ్లో॥ జఠరానలసన్తప్తాః పిత్తాఖ్యరసవిప్రుషః।
గర్భాశయే నిమగ్నన్తు దహన్త్యతిభృశం హి మామ్॥ **26**

**ప్రతిపదార్థము:–** జఠరానల=జఠరంలోని అగ్నిచేత, సంతప్తాః=తపించిన, పిత్తాఖ్యరస= పైత్యరసముయొక్క, విప్రుషః=చుక్కలు, గర్భాశయే=గర్భకోశమునందు, నిమగ్నం తు= మునిగిన, మామ్=నన్ను, అతిభృశమ్=మిసుమిక్కిలి, దహంతి హి=దహించుచున్నవి కదా!

**తాత్పర్యము:–** శరీరములోపలి వేడికి ఉడికిన పిత్తరస బిందువులు గర్భాశయ నిమగ్నుడనైన నన్ను చాలా బాధించుచున్నవి.

శ్లో॥ ఔదర్యక్రిమివక్త్రాణి కూటశాల్మలికణ్టకైః।
తుల్యాని చ తుదన్త్యార్తం పార్శ్వాస్థిక్రకచార్దితమ్॥ **27**

**ప్రతిపదార్థము:–**ఔదర్య=పొట్టలోపుట్టిన,క్రిమి=పురుగులయొక్కవక్త్రాణి=నోళ్ళు,కూటశాల్మలి =కొండబూరుగుయొక్క, కంటకైః=ముండ్లతో, తుల్యాని=సమానమైనవై, పార్శ్వాస్థి=ప్రక్క టెముకలు అనే, క్రకచ=అంపములచేత, అర్దితమ్=బాధింపబడినవాడనై, ఆర్తమ్=ఆర్తితో ఉన్న నన్ను, తుదంతి=బాధించుచున్నవి.

**తాత్పర్యము:–** పొట్టలో పుట్టిన క్రిములు కొండబూరుగు ముళ్ళవంటి నోళ్ళతో నన్ను పీడించుచున్నవి. ఇది చాలదన్నట్లు తల్లి ప్రక్కటెముకలు అనే అంపముల మధ్యపడి నలుగు చుంటిని.

శ్లో॥ గర్భే దుర్గన్ధభూయిష్ఠే జఠరాగ్ని ప్రదీపితే।
దుఃఖం మయాప్తం యత్తస్మాత్ కనీయః కుమ్భపాకజమ్॥ **28**



**ప్రతిపదార్థము:–** దుర్గంధ=దుర్వాసన, భూయిష్ఠే=ప్రచురముగాగలదియు, జఠరాగ్ని= జఠరాగ్నితో, ప్రదీపితే=దీప్తమైనదియు అగు,గర్భే=గర్భకోశమునందు, యత్=ఏ, దుఃఖమ్ =దుఃఖము, మయా=నాచేత, ఆప్తమ్=పొందబడినదో, తస్మాత్=దానికన్న, కుంభపాక= కుంభీపాకమువలన, జమ్=పుట్టిన బాధ, కనీయః=చాల చిన్నది.

**తాత్పర్యము:–** దుర్గంధభూయిష్ఠము, జఠరాగ్నిసంతాపముగల భయంకరగర్భకోశమున నేను పొందిన యీ దుఃఖము ముందర కుంభీపాక నరకము గూడా చాల చిన్నది.

శ్లో॥ పూయాసృక్శ్లేష్మపాయిత్వం వాన్తాశిత్వం చ యద్భవేత్।
అశుచౌ కృమిభావశ్చ తత్ప్రాప్తం గర్భశాయినా॥ **29**

**ప్రతిపదార్థము:–** పూయ=చీము, అసృక్=నెత్తురు, శ్లేష్మ=కళ్ళె – వీటిని, పాయిత్వమ్=త్రాగు లక్షణము, వాంత=కక్కినదానిని, ఆశిత్వమ్=తిను లక్షణము, అశుచౌ=అశుద్ధమునందు, కృమిభావశ్చ=కీటకముగానుండుటయు, యద్భవేత్=ఏది ఉన్నదో, తత్=అది అంతయు, గర్భశాయినా=గర్భబాలునిచేత, ప్రాప్తమ్=పొందబడినది.

**తాత్పర్యము:–** చీము, నెత్తురు, కళ్ళె, కక్కిన కూడు తినే పరిస్థితి, అశుద్ధంతో క్రిమిగా పుట్టడం – ఈ మొత్తం బాధాపంచకం ఒక్క గర్భశయనంతోనే వస్తుంది.

శ్లో॥ గర్భశయ్యాం సమారుహ్య దుఃఖం యాదృఙ్మయాపి తత్।
నాతిశేతే మహాదుఃఖం నిఃశేషం నరకేషు తత్॥ **30**

**ప్రతిపదార్థము:–** గర్భశయ్యామ్=గర్భాశయమంచమును, సమారుహ్య=ఎక్కి, మయా= నాచేత, యాదృక్=ఎటువంటి, దుఃఖమ్=దుఃఖము, ఆపి=పొందబడినదో, తత్=దానిని, నరకేషు=నరకములందున్ను, నిశ్శేషమ్=సమస్తమైన, మహాదుఃఖమ్=గొప్పదుఃఖము, నాతిశేతే=మించదు.

**తాత్పర్యము:–** గర్భశయ్యలో ఉన్న దుఃఖము ముందర మొత్తం నరకాలన్నింటిలో అనుభవించిన సమస్త దుఃఖము దిగదుడుపే.

శ్లో॥ ఏవం స్మరన్ పురా ప్రాప్తా నానాజాతీశ్చ యాతనాః।
మోక్షోపాయమపి ధ్యాయన్ వర్తతేఽభ్యాసతత్పరః॥ **31**

**ప్రతిపదార్థము:–** ఏవమ్=ఇట్లు, పురా=పూర్వము, ప్రాప్తాః=పొందబడిన, నానాజాతీశ్చ= అనేకరకములైన, యాతనాః=పీడలను, స్మరన్=స్మరించుచు, మోక్షోపాయమపి=విముక్తి మార్గమును గూడా, ధ్యాయన్=ఆలోచించుచు, అభ్యాస=(బయటకు వెళ్ళు) అలవాటు నందు, తత్పరః=ఆసక్తుడై, వర్తతే=ఉండును.

**తాత్పర్యము:-** ఇలా గర్భశిశువు పూర్వం తాను అనుబవించిన బాధలను రకరకాల వేదనలను తలచికొంటూ, గర్భవాసదుఃఖముతో పోల్చుకొంటూ, మోక్షోపాయమును ధ్యానించుచు, బయటపడు అభ్యాసమును చేయుచుండును.

**శ్లో॥ అష్టమే త్వక్ సృతీ స్యాతామోజస్తేజశ్చ హృద్భవమ్।**
**శుద్ధమాపీతరక్తం చ నిమిత్తం జీవితే మతమ్॥ 32**

**ప్రతిపదార్థము:-** అష్టమే=8వ నెలయందు, త్వక్=చర్మము, సృతీ=రక్తప్రసరణము, స్యాతామ్ =అగును. ఓజః=ఓజస్సు, తేజశ్చ=తేజస్సును, హృద్భవమ్=హృదయజన్యము అగును. జీవితే=బ్రతుకుటయందు, నిమిత్తమ్=నిమిత్తముగా, మతమ్=చెప్పబడినదియు, శుద్ధమ్= శుభ్రమైనదియు, ఆపీత=కొంచెము పచ్చని, రక్తం చ=రక్తమున్ను పుట్టును.

**తాత్పర్యము:-** 8వ మాసమున చర్మము, అందలి రక్తమార్గములు ఏర్పడును. సర్వేంద్రియ వర్ధకమైన, ఓజస్సు, దేహబలకరమైన తేజస్సు, జీవితాధారమైన కొద్ది పచ్చదనము సంతరించికొన్న శుద్ధరక్తము ఏర్పడును.

**శ్లో॥ మాతరం చ పునర్గర్భం చఞ్చలం తత్ప్రధావతి।**
**తతో జాతోఽష్టమే గర్భో న జీవత్యోజసోజ్ఝితః॥ 33**

**ప్రతిపదార్థము:-** తత్=ఆ ఓజస్సు, చంచలమ్=చంచలమై (తేజస్సు శుద్ధపీతరక్తము గూడా) మాతరం చ=తల్లిని, పునః=మరల, గర్భమ్=గర్భశిశువును గూర్చి, ప్రధావతి=పరుగెత్తును, తతః=అందువలననే, అష్టమే=8వ నెలలో, జాతః=పుట్టిన, గర్భః=గర్భశిశువు, ఓజసా= ఓజస్సుతో, ఉజ్ఝితః=విడువబడినదై, న జీవతి=జీవించదు.

**తాత్పర్యము:-** ఓజస్సు అనేది అష్టమ మాసములో ఇంకా అస్థిరంగానే ఉంటుంది. అందువలన అది గర్భానికి గర్భవతికి మధ్య ఊగిసలాడుతుంది. కనుకనే అష్టమమాసంలో పుట్టిన గర్భము జీవించడం కష్టం. ఎందుకంటే ఓజస్సు జీవనహేతువు.

**శ్లో॥ కిఞ్చిత్కాలమవస్థానం సంస్కారాత్పీడితాఙ్గవత్।**
**సమయః ప్రసవస్య స్యాన్మాసేషు నవమాదిషు॥ 34**

**ప్రతిపదార్థము:-** సంస్కారాత్=భారము మోసిన, సంస్కారమువలన, పీడితాంగవత్=నొచ్చిన వాడు,కాసేపు ఆగినట్లు,కించిత్కాలమ్=కొంచెంసేపు,అవస్థానమ్=నిలుచుట సంభవించును. నవమాదిషు=9 మొదలగు, మాసేషు=నెలలయందు, ప్రసవస్య= ప్రసవమునకు, సమయః =సమయము, స్యాత్=కాగలదు.



**తాత్పర్యము:-** బరువుమోసినవాడు కాసేపు విశ్రాంతి తీసికొన్నట్లు గర్భశిశువు నవమ మాసము వఱకు ఆగును. తరువాత 9 నెలలు దాటిన తరువాతనుండి ఎప్పుడైనా ప్రసవము రావచ్చును.

**శ్లో॥ మాతురస్రవహాం నాడీమాశ్రిత్యాఽన్వవతారితా।**
**నాభిస్థనాడీ గర్భస్య మాత్రాహారరసావహా।**
**తేన జీవతి గర్భోఽపి మాత్రాహారేణ పోషితః॥ 35**

**ప్రతిపదార్థము:-** మాతుః=తల్లియొక్క, అస్రవహామ్=రక్తవాహినియైన, నాడీమ్=నాడిని, ఆశ్రిత్య=ఆశ్రయించి, అన్వవతారితా=దింపబడిన, నాభిస్థ=శిశు నాభియందున్న, నాడీ= మావి, గర్భస్య=గర్భశిశువునకు, మాతృ=తల్లియొక్క, ఆహారరస=అన్నరసమును, ఆవహా= మోసికొనివచ్చునట్టిది, తేన=దానితో, గర్భోపి=గర్భమున్ను, మాత్రాహారేణ=తల్లి ఆహారము చేత, పోషితః=పోషింపబడినదై, జీవతి=బ్రతుకును.

**తాత్పర్యము:-** తల్లినుంచి గర్భానికి రక్తం అందే నాభినాడిని ఆశ్రయించి గర్భమునకు ఆహారము లభించును. మావియే తల్లియొక్క అన్నరసమును బిడ్డకు అందించును. దానితో బిడ్డ తల్లి ఆహారముతోనే తనూ పోషింపబడి బ్రతుకును.

**శ్లో॥ అస్థియన్త్రవినిష్పిష్టః పతితః కుక్షివర్త్మనా।**
**మేదోఽసృగ్దిగ్ధసర్వాఙ్గో జరాయుపుటసంవృతః॥ 36**

**ప్రతిపదార్థము:-** అస్థియంత్ర=ఎముకలయంత్రముచేత, వినిష్పిష్టః=పిండివేయబడినదై, మేదః=కొవ్వు, అసృక్=నెత్తురుచేత, దిగ్ధ=పూయబడిన, సర్వాంగః=సర్వశరీరముగలదై, జరాయుపుట=మావి సంపుటముచే, సంవృతః=ఆవరింపబడినదై, కుక్షివర్త్మనా=పొట్ట దారితో, పతితః=పడినదగును.

**తాత్పర్యము:-** ఎముకయంత్రమునుండి ఒత్తిడితో బయటపడి, క్రొవ్వు, నెత్తుటితో కలిసిన శరీరంతో, మావి సంపుటముతోసహా పొట్టదారిగుండా క్రిందపడును.

**శ్లో॥ నిష్క్రామన్ భృశదుఃఖార్తో రుదన్నుచ్చైరధోముఖః।**
**యన్త్రాదేవం వినిర్ముక్తః పతత్యుత్తానశాయ్యధః॥ 37**

**ప్రతిపదార్థము:-** నిష్క్రామన్=బయలువెడలుచు, భృశ=మిక్కిలి, దుఃఖ=దుఃఖముచేత, ఆర్తః=బాధితుడై, ఉచ్చైః=పెద్దగ, రుదన్=ఏడ్చుచు, అధోముఖః=క్రిందిముఖముగలవాడై, ఏవమ్= ఈ విధంగా, యంత్రాత్=యంత్రమునుండి, వినిర్ముక్తః=విడువబడినవాడై, అధః =క్రింద, ఉత్తానశాయీ=వెల్లకిలపరుండి, పతతి=పడును.

**తాత్పర్యము:–** బయలు వెడలుచు, మిక్కిలి దుఃఖార్తుడై, ఏడ్చుచు, అధోముఖుడై యంత్రము నుండి విడివడి వెల్లకిల క్రిందపడును.

**శ్లో॥ అకిఞ్చిత్క స్తథా బాలో మాంసపేశీసమస్థితః।**
**శ్వమార్జారాదిదంష్ట్రిభ్యో రక్ష్యతే దణ్డపాణిభిః॥ 38**

**ప్రతిపదార్థము:–** అకించిత్కః=ఏమీ లేనివాడును, తథా=అట్లే, మాంసపేశీ=మాంసపు ముద్దతో, సమః=సమంగా, స్థితః=ఉన్నవాడును అగు, బాలః=బాలుడు, దండపాణిభిః= కఱ్ఱచేబట్టినవారిచేత, శ్వ=కుక్క, మార్జారాది=పిల్లి మొదలగు, దంష్ట్రిభ్యః=కోఱల జంతువుల నుండి రక్ష్యతే=రక్షింపబడును.

**తాత్పర్యము:–** ఏమీ తెలియని నిస్సహాయుడైన బాలుడు మాంసపుముద్దవంటివాడు. వానిని రక్షించుటకు బంధువులు కఱ్ఱలు చేతబట్టుకొని కుక్క, పిల్లి మొదలగు గృహంలో తిరిగే జంతువులు దాడిచేయకుండా చూచెదరు.

**శ్లో॥ పితృవద్రాక్షసం వేత్తి మాతృవద్డాకినీమపి।**
**పూయం పయోవదజ్ఞానాద్ దీర్ఘకష్టం తు శైశవమ్॥ 39**

**ప్రతిపదార్థము:–** రాక్షసమ్=రాక్షసుని, పితృవత్=తండ్రినివలె, వేత్తి=భావించును, డాకినీమపి=డాకినీ శక్తినైనను, మాతృవత్=తల్లినివలె భావించును, పూయమ్=చీమును కుళ్ళును, పయోవత్=పాలవలె చూచును, అజ్ఞానాత్=అజ్ఞానమువలన, శైశవమ్=బాల్యము, దీర్ఘ=దీర్ఘమైన, కష్టం తు=కష్టమే.

**తాత్పర్యము:–** బాలుడు అజ్ఞానంతో ఉంటాడు. ఏమీ తెలియదు. తనవద్దకు వచ్చిన రాక్షసునైనా తండ్రిగా భావిస్తాడు. రాక్షసినైనా తల్లిగా అనుకొంటాడు. చీమువంటి కుళ్ళు పదార్థమునైనను పాలుగా భావిస్తాడు. అజ్ఞానంవలన బాల్యము దీర్ఘమైన కష్టముగా ఉంటుంది.

**శ్లో॥ శ్లేష్మణా పిహితా నాడీ సుషుమ్నా యావదేవ హి।**
**వ్యక్తవర్ణం చ వచనం తావద్వక్తుం న శక్యతే।**
**అతఏవ చ గర్భోఽపి రోదితుం నైవ శక్యతే॥ 40**

**ప్రతిపదార్థము:–** సుషుమ్నా=సుషుమ్న అనబడు, నాడీ=నాడి, యావదేవ హి=ఎంతలో, శ్లేష్మణా=శ్లేష్మముతో, పిహితా తావత్=కప్పబడియున్నంతవఱకు, వ్యక్త=స్పష్టమైన, వర్ణమ్= అక్షరములు గల, వచనం చ=మాటను, వక్తుమ్=పలుకుటకు, న శక్యతే=సాధ్యము కాదు, అత ఏవ చ=అందుచేతనే, గర్భోపి=గర్భశిశువుగూడా, రోదితుమ్=ఏడ్చుటకు, నైవ శక్యతే=సమర్థుడు కాదు.



**తాత్పర్యము:–** సుషుమ్నా అనబడు నాడి శ్లేష్మంతో కప్పి ఉన్నంతవఱకు మాటను స్పష్టమైన అక్షరాలతో మాట్లాడుట సాధ్యం కాదు.

**శ్లో॥ దృప్తోఽథ యౌవనం ప్రాప్య మన్మథజ్వరవిహ్వలః।**
**గాయత్యకస్మాదుచ్చైస్తు తథాకస్మాచ్చ వల్గతి॥ 41**

**ప్రతిపదార్థము:–** అథ=తర్వాత, యౌవనమ్=యౌవనమును, ప్రాప్య=పొంది, దృప్తః= మదించినవాడై, మన్మథ=కామసంబంధమైన, జ్వర=సంతాపముతో, విహ్వలః=వివశుడై, అకస్మాత్=హఠాత్తుగా, ఉచ్చైస్తు=బిగ్గరగా, గాయతి=పాడుచుండును,తథా=అట్లే, అకస్మాచ్చ= హఠాత్తుగా, వల్గతి=ఊగుచుండును.

**తాత్పర్యము:–** యౌవనంలోకి అడుగిడిన తర్వాత కామసంతాపముతో వివశుడై పాటలు పాడుతుంటాడు, ఊగుతుంటాడు, నృత్యం చేస్తుంటాడు.

**శ్లో॥ ఆరోహతి తరూన్వేగాచ్ఛాన్తానుద్వేజయత్యపి।**
**కామక్రోధమదాన్ధః సన్ న కాంశ్చిదపి వీక్షతే॥ 42**

**ప్రతిపదార్థము:–** తరూన్=చెట్లను, వేగాత్=వేగంగా, ఆరోహతి=ఎక్కును, శాంతాన్=శాంతులైనవారిని, ఉద్వేజయత్యపి=ఉద్వేగము (టెన్షన్) కలిగించును. కామ=కోరికలచేత, క్రోధ= కోపముచేత, మద=మదముచేత, అంధస్సన్=గ్రుడ్డివాడై, కాంశ్చిదపి=ఎవ్వరినీ, న వీక్షతే= చూడదు.

**తాత్పర్యము:–** వేగంగా చెట్లు ఎక్కుతాడు. లేదా చెట్లవంటి శరీరాలను (స్త్రీ) ఆక్రమిస్తాడు. శాంతులైనవారికి ఆందోళనలు పెంచుతాడు. కామ క్రోధమదమాత్సర్యాదియుక్తుడై ఎవరినీ లెక్కచేయడు.

**శ్లో॥ అస్థిమాంససిరాలాయా వామాయా మన్మథాలయే।**
**ఉత్తానభూతమణ్డూకపాటితోదరసన్నిభే।**
**ఆసక్తః స్మరబాణార్త ఆత్మనా దహ్యతే భృశమ్॥ 43**

**ప్రతిపదార్థము:–**అస్థి=ఎముకలు,మాంస=మాంసము,సిరాలాయాః=సిరలుగల,వామాయాః =స్త్రీయొక్క, ఉత్తానభూత=వెల్లకిలబడిన, మండూక=కప్పయొక్క, పాటిత= చీల్చబడిన, ఉదర=పొట్టతో, సన్నిభే=సమానమైన, మన్మథాలయే=యోనియందు, ఆసక్తః=ఆసక్తిగలవాడై, స్మర=మన్మథునియొక్క, బాణ=బాణములచేత, ఆర్తః=ఆర్తుడై, ఆత్మనా= తనచేత / మనసుచేత, భృశమ్=మిక్కిలి, దహ్యతే=దహింపబడును.

**తాత్పర్యము:–** ఎముకలు, మాంసము, సిరలు మొదలగువానితో తయారైన పదార్థమే స్త్రీ. ఆమె యందు పురుషుడు కోరే ప్రధానభాగం యోని. అది వాస్తవంగా అసహ్యమైనది. వెల్లకిలబడిన కప్పకు పొట్టనిలువునా గాటుపెడితే ఎలా ఉంటుందో అలా ఉంటుంది. అయినా అందు ఆసక్తితో కామపీడితుడై తననుతానే తగులబెట్టుకొంటాడు జీవుడు.

**(గమనిక:–** స్త్రీ ఎలా మాంసపు బొమ్మయో, పురుషుడూ అంతే. యోని ఎలా అసహ్యమో, లింగము ఇంచుమించు అట్టిదే. అయినా శివుడు ఇలా చెప్పటం ఏమిటి? పైగా సృష్టికార్యాన్ని ఇంతగా ఈసడిస్తే ధర్మబద్ధమైన ధర్మపత్నితో మాత్రము కాపురం ఎలా? సంతానం పొంది తీరాలన్న శాస్త్రం ఏమవుతుంది? అని ప్రశ్నలు వస్తాయి. దానికి సమాధానం –

1) ఈ వర్ణనలోని అసహ్యము ధర్మపత్ని విషయం కాదు. వేశ్య మొదలగు పరస్త్రీలదాకా వ్యసనపడే వారికోసం ఈ అసహ్యపు దృష్టాంతాలు. దీనివలన వ్యామోహం చస్తుంది. అంతేగాని సంతానోత్పత్తి కిది నిషేధం కాదు. వ్యసనానికి పాపానికి నిషేధం.

**ప్రశ్న –** అయితే స్త్రీ యోని మీద పుట్టిన ఈ అసహ్యం ధర్మపత్ని విషయంలో మాత్రం ఎలా పోతుంది?

**సమా –** అసలు ఉదాహరణమాత్రంలో ఎవరి విషయంలోను ఈ వ్యామోహం తేలికగా పోదు. శస్త్రచికిత్సలు, శవపంచాయితీలు చేసే వైద్యులు, వైద్యురాండ్రు తమ భార్యలతో, భర్తలతో కాపురాలు మానలేదు. ఈ శరీరం ఎలాంటిదో వారికి మఱొకరు చెప్పవలసిన పనిలేదు. అయినా స్త్రీ పురుష వ్యామోహం తగ్గదు. అది ప్రకృతిచోదితం కనుక అత్యంత బలమైనది. కనుక మనం చెప్పే ఉదాహరణలవలన ఏ కాస్త అసహ్యం కలిగినా, వ్యసనాలు, వ్యామోహాలు తగ్గుతాయి. కనుకనే జీవన్ముక్తి ప్రకాశికలో ఇలాంటి బోధ అవసరం అని చెప్పారు. మగవాడు మాంసపు బొమ్మకాదని, అతని జననేంద్రియము బంగారపుదని అర్థం కాదు.

**ప్రశ్న –** అయితే మగవారిగూర్చి ఎందుకు ఇలా చెప్పలేదు? అన్నది ప్రశ్న.

**సమా –** ఏ శాస్త్రమైనా, ఏ చట్టమైనా ఏదో ఒక లింగాన్ని ప్రధానంగా తీసికొని చెప్తుంది. ప్రతిచోట అతడు/ఆమె అని చెప్పటం కుదరదు. కనుక మగవారికి చెప్పిన ధర్మాలన్నీ సాధ్యమైనంతవఱకు ఆడవారికి వర్తిస్తాయి. నపుంసకులకూ వర్తిస్తాయి. అసలు నపుంసకుల పేరే ఏ చట్టంలోను ఉండదు. కనుక వారు చట్టానికి అతీతులవుతారా? మఱియు –



చెడే అవకాశం ఎక్కువగా ఉన్నవారికి ఉపదేశం కావాలి. పరస్త్రీ, పర పురుష గమనాలు పూర్తిగా నిషేధింపబడినవే. బహుభార్యావిషయము, వేశ్యావిషయము మగవారికి అనుమతి ఉన్నది. ఆడవారికి లేదు. కనుక వ్యామోహం ఉన్న ఆడదానికి సంఘమే జాగ్రత్తలు తీసికొన్నది. మగవారికి కొంత స్వేచ్ఛ ఉన్నది. కనుక బోధ మగవారికే చాల అవసరము. ఎద్దుకు కళ్ళెం కావాలి, ఆవుకు అవసరం లేదు. మఱియు– మగవాడిపెత్తనం ఆడది సహించి మాటవింటుంది. కాని మగవానికి ఎవరు చెప్పాలి. అందువలన శాస్త్రం మగవారినుద్దేశించి ఎక్కువగా చెబుతుంది. అంతేతప్ప–

1. **ఆడవారిని తిట్టటము కాదు.**
2. **నపుంసకులను వదలటమూ కాదు.**
3. **మగవారిని పొగడటమూ కాదు.**
4. **మగవారే తరించాలని కాదు.**
5. **ఆడవారు మగవారిని చెడగొడుతున్నారనీ కాదు** – అని గ్రహించాలి. –వ్యాఖ్యాత

**శ్లో॥ అస్థిమాంసశిరాత్వగ్భ్యః కిమన్యద్వర్తతే వపుః।**
**వామానాం మాయయా మూఢో న కిఞ్చిద్వీక్షతే జగత్॥ 44**

**ప్రతిపదార్థము:–** అస్థి=ఎముకలకన్న, మాంస=మాంసముకన్న, శిరా=శిరలకన్న, త్వగ్భ్యః =చర్మముకన్న, అన్యత్=భిన్నముగా, వపుః=శరీరము, కిమ్=ఏమి, వర్తతే=కలదు, వామానామ్=కుటిల స్త్రీలయొక్క, మాయయా=మాయతో, మూఢః=మొద్దుబాఱినవాడై, జగత్=ప్రపంచమును, కించిత్=కొంచమైనను, న వీక్షతే=చూడడు.

**తాత్పర్యము:–** ఏ శరీరమైనా ఏమున్నది – ఎముకలు, మాంసము, శిరలు, చర్మము మొదలైన క్రుళ్ళు పదార్థమే గదా! కేవలం కుటిల స్త్రీలయొక్క మాయవలన మూఢుడై జీవుడు ప్రపంచవాస్తవమును పరికించుటలేదు.

**శ్లో॥ నిర్గతే ప్రాణపవనే దేహో హన్త! మృగీదృశః।**
**యథా హి జాయతే నైవ వీక్ష్యతే పఞ్చషైర్దినైః॥ 45**

**ప్రతిపదార్థము:–** హంత!=అయ్యో!, ప్రాణపవనే=ప్రాణవాయువు, నిర్గతే=బయటికి పోగా, మృగీదృశః=స్త్రీలయొక్క, దేహః=శరీరము, పంచషైః=ఐదు, ఆఱు, దినైః=రోజులతో, యథా హి జాయతే=ఎలాతయారగునో, నైవ వీక్ష్యతే=చూడబడుటలేదు.

**తాత్పర్యము:–** ఎంతో అందమైన స్త్రీ శరీరము ప్రాణము పోయిన తరువాత 5, 6 రోజులలో ఎలా తయారవుతుందో చూస్తే తత్త్వం బోధపడుతుంది.

**శ్లో॥ మహాపరిభవస్థానం జరాం ప్రాప్యాఽతిదుఃఖితః।**
**శ్లేష్మణా పిహితోరస్కో జగ్ధమన్నం న జీర్యతి॥ 46**

**ప్రతిపదార్థము:–** మహా=గొప్ప, పరిభవ=పరాభవంయొక్క, స్థానమ్=చోటైన, జరామ్=ముసలితనమును, ప్రాప్య=పొంది, అతిదుఃఖితః=మిక్కిలి దుఃఖితుడై, శ్లేష్మణా=కఫముతో, పిహిత=కప్పివేయబడిన, ఉరస్కః=వక్షస్థలము గలవాడై, జగ్ధమ్=తినబడిన, అన్నమ్=అన్నము, న జీర్యతి=అరిగించికొనలేడు.

**తాత్పర్యము:–** అన్నిరకాల అవమానకర పరిస్థితులకు కారణమైన ముసలితనము వలన మిక్కిలి దుఃఖపడుతాడు. ఱొమ్మునిండా కఫము పేరుకొని పోతుంది. తిన్న అన్నము జీర్ణము కాదు.

**శ్లో॥ సన్నదన్తో మన్దదృష్టిః కటుతిక్తకషాయభుక్।**
**వాతభుగ్నకటిగ్రీవః కరోరుచరణాబలః॥ 47**

**ప్రతిపదార్థము:–** సన్న=బలహీనమైన/రాలిన, దంతః=దంతములు గలవాడు, మంద=తగ్గిన, దృష్టిః=చూపు గలవాడై, కటు=కారమును, తిక్త=చేదును, కషాయ=వగరును, లేదా చేదు కారము అయిన కషాయములు త్రాగువాడునూ, వాత=వాతరోగముచేత, భుగ్న=వంగిన,కటి=నడుము,గ్రీవః=మెడగలవాడును, కర=చేతులందు, ఊరు=తొడలందు, చరణ= కాళ్ళయందు, అబలః=నీరసమైనవాడును.

**తాత్పర్యము:–** బలహీన దంతములు, బలహీన దృష్టి, కషాయాలు త్రాగడం లేదా కారం, చేదు, వగరు అయిన పథ్యాలు తినటం మొదలవుతుంది. వాతంతో మెడ, నడుము పట్టికొని పోతాయి. కాళ్ళు, తొడలు, చేతులు నీరసమవుతాయి.

**శ్లో॥ గదాయుతసమావిష్టః పరిత్యక్తః స్వబన్ధుభిః।**
**నిశ్శౌచో మలదిగ్ధాఙ్గ ఆలిఙ్గితమనీషితః॥ 48**

**ప్రతిపదార్థము:–** గదాయుత=వేలరోగములచేత, సమావిష్టః=కూడినవాడును, స్వ=తన, బంధుభిః=బంధువులచేత, పరిత్యక్తః=విడువబడినవాడును, నిశ్శౌచః=శుచి శుభ్రము లేనివాడును, మల=మలమూత్రములచే, దిగ్ధ=పూయబడిన, అంగః=శరీరము గలవాడును, ఆలింగిత=కౌగిలించికొనబడిన, ('పరోషితః' –ఇది అర్థంలేనిది అందువలన 'మనీషితః' అని మార్చబడినది), మనీషితః=కోరికలు గలవాడై. (విరోధికః=విరోధులైన రోగాలు గలవాడై–పాఠాంతరము.)

**తాత్పర్యము:–** రోగసహస్రాలతో బాధపడుతున్న వీనిని బంధువులు వదలుతారు. శుచి



ఉండదు. మలమూత్రాదులు పూయబడిన శరీరము గలవాడై ఒళ్ళంతా దుర్గంధముతో నిండియుండును. మనస్సునిండా కోరికలు.

**శ్లో॥ ధ్యాయన్నసులభాన్భోగాన్ కేవలం వర్తతేఽచలః।**
**సర్వేన్ద్రియక్రియాలోపాద్ధస్యతే బాలకైరపి॥ 49**

**ప్రతిపదార్థము:–** అసులభాన్=దుర్లభములైన, భోగాన్=భోగాలను, కేవలమ్=కేవలము, ధ్యాయన్=తలపోయుచు, అచలః=కదలనివాడై, వర్తతే=ఉండును, సర్వ=అన్ని, ఇంద్రియ=ఇంద్రియసంబంధమైన, క్రియా=కార్యములయొక్క, లోపాత్=లోపమువలన, బాలకైరపి=పిల్లలచేతగూడా, హస్యతే=నవ్వబడును.

**తాత్పర్యము:–** తనకు దుర్లభమైన అనేక భోగాలను కేవలం మనస్సులో ఊహించికొంటూ మంచంలో కదలలేక పడి ఉండును. ఇంద్రియ క్రియలన్ని లోపించటం వలన వచ్చే వికారాలవలన అతను బాలులకు గూడా పరిహాసపాత్రుడు అవుతాడు.

**శ్లో॥ తతో మృతిజదుఃఖస్య దృష్టాన్తో నోపలభ్యతే।**
**యస్మాద్బిభ్యతి భూతాని ప్రాప్తాన్యపి పరాం రుజమ్॥ 50**

**ప్రతిపదార్థము:–** తతః=తర్వాత, పరామ్=గొప్ప, రుజమ్=రోగమును, ప్రాప్తాన్యపి=పొందినవైనను,భూతాని=జీవులు,యస్మాత్=దేనినుండి,బిభ్యతి=భయపడుచుండునో,మృతి=మరణము వలన, జ=పుట్టిన, దుఃఖస్య=అట్టిశోకమునకు, దృష్టాంతః=సమానమైన దుఃఖము, నోపలభ్యతే=దొరకదు.

**తాత్పర్యము:–** ఎంతో రోగవేదనను పొందిన జీవులు గూడా మరణ శోకానికి విపరీతంగా భయపడుతాయి. అంటే మరణ దుఃఖం నిరుపమానమైనది.

**శ్లో॥ నీయతే మృత్యునా జన్తుః పరిష్వక్తోఽపి బన్ధుభిః।**
**సాగరాన్తర్జలగతో గరుడేనేవ పన్నగః॥ 51**

**ప్రతిపదార్థము:–** సాగర=సముద్రముయొక్క, అంతర్జల=నీటియందు, గతః=ఉన్న, పన్నగః=పాము, గరుడేనేవ=గరుత్మంతునిచేతవలె, జంతుః=జీవుడు, బంధుభిః=బంధువులచేత, పరిష్వక్తోపి=కౌగిలించుకొనబడినను, మృత్యునా=మృత్యువుచేత, నీయతే=తీసికొనిపోబడును

**తాత్పర్యము:–** సముద్రపునీటిలో దాగిన పామును గూడా గరుత్మంతుడు తన ముక్కుతో పట్టి తీసికొని వెళ్ళినట్లు, మృత్యువు బంధు సమూహమధ్యమునందున్న జీవుని తప్పక ఎత్తికొనిపోవును.

**శ్లో॥ హా! కాన్తే! హా! ధనం పుత్త్రాః క్రన్దమానః సుదారుణమ్।
మణ్డూక ఇవ సర్పేణ మృత్యునా నీయతే నరః॥ 52**

**ప్రతిపదార్థము:–** హా!=అయ్యో!, కాంతే=భార్యా!, హా!=అయ్యో!, ధనమ్=నా ధనము, పుత్త్రాః=అయ్యో! నా పుత్త్రులు, అని, సుదారుణమ్=మిక్కిలి దారుణముగా, క్రందమానః =అఱచుచు, ఏడ్చుచు, సర్పేణ=పాముచేత, మండూక ఇవ=కప్పవలె, నరః=నరుడు మృత్యునా=మృత్యువు చేత, నీయతే=పొందబడుచున్నది.

**తాత్పర్యము:–** చివఱకు అయ్యో! నా భార్య, నా ధనము, నా బిడ్డలు, నా పుత్త్రులు అని ఆక్రోశించుచున్న అతనిని పాము కప్పను మ్రింగినట్లు మృత్యువు తీసికొనిపోబడును.

**శ్లో॥ మర్మసూన్యథ్యమానేషు ముచ్యమానేషు సన్ధిషు।
యద్దుఃఖం మ్రియమాణస్య స్మర్యతాం తన్ముముక్షుభిః॥ 53**

**ప్రతిపదార్థము:–** మర్మసు=మర్మములు, ఉన్మథ్యమానేషు=చిలుకబడుచుండగా, సంధిషు= సంధులు (కీళ్ళు), ముచ్యమానేషు=పట్టువిడుపుచుండగా, మ్రియమాణస్య=చచ్చుచున్నవాని యొక్క, దుఃఖమ్=దుఃఖము, యత్=ఏది కలదో, తత్=ఆ దుఃఖము, ముముక్షుభిః=మోక్ష గాములచేత, స్మర్యతామ్=స్మరింపబడవలయును.

**తాత్పర్యము:–** మర్మస్థలములు లాగుచుండగా, కీళ్ళు పట్టుసడలుచుండగా, మృత్యు దుఃఖము ఎంతదారుణమో అన్న విషయమును మోక్షార్థులు అర్థం చేసికొనాలి.

**శ్లో॥ దృష్టావాక్షిప్యమాణాయాం సంజ్ఞయా హ్రియమాణయా।
మృత్యుపాశేన బద్ధస్య త్రాతా నైవోపలభ్యతే॥ 54**

**ప్రతిపదార్థము:–** దృష్టౌ=చూపు, ఆక్షిప్యమాణాయామ్=లాగబడుచుండగా, సంజ్ఞయా= తెలివి/స్పృహ, హ్రియమాణయా=హరింపబడుచుండగా, మృత్యుపాశేన=మరణపాశముతో, బద్ధస్య=బద్ధుడైన వానికి, త్రాతా=రక్షకుడు, నోపలభ్యతే=దొరకడు.

**తాత్పర్యము:–** దృష్టిసన్నగిల్లుతుంది. తెలివి/చేతన వెళ్ళిపోబోతోంది. మృత్యుపాశ బంధం బలంగా బిగించింది. అట్టి జీవునకు మృత్యువునుంచి రక్షకుడు లభించడు.

**శ్లో॥ సంరుధ్యమానస్తమసా మహచ్ఛిద్రమివావిశన్।
ఉపాహూతస్తదా జ్ఞాతీనీక్షతే దీనచక్షుషా॥ 55**

**ప్రతిపదార్థము:–** తమసా=అజ్ఞాముచేత (అనగా మైకము,కోమావంటి వానిచేత) సంరుధ్యమానః =ముట్టడింపబడుచున్నవాడై, మహత్=గొప్ప, ఛిద్రమ్=గుహను/ఊబిని (బోరుబావి), ఆవిశన్నివ=ప్రవేశించుచున్నవాడువలె, ఉపాహూతః=బంధువులచే పిలువబడినవాడై, తదా=అప్పుడు, దీన=దైన్యపూరితమైన, చక్షుషా=చూపుతో, జ్ఞాతీన్=బంధువులను, ఈక్షతే= చూచును.



**తాత్పర్యము:–** మైకమువంటి అజ్ఞానంలో పడిపోతాడు. ఎవరినీ గుర్తుపట్టలేడు. ఏదో పాతాళ రంధ్రంలోకి ఊబిలోకి జారిపోతున్నట్లు బంధువులవైపు జాలిగా చూస్తాడు.

**శ్లో॥ అయఃపాశేన కాలేన స్నేహపాశేన బన్ధుభిః।
ఆత్మానం కృష్యమాణం తం వీక్షతే పరితస్తథా॥ 56**

**ప్రతిపదార్థము:–** కాలేన=కాలునిచేత, అయఃపాశేన=ఇనుప పాశముతోను,బంధుభిః= బంధువులచేత, స్నేహపాశేన=స్నేహపాశముతో, కృష్యమాణమ్=లాగబడుచున్న, తమ్=ఆ, ఆత్మానమ్=తన జీవుని, పరితః=చుట్టు, తథా=ఆ విధముగా, వీక్షతే=చూచును.

**తాత్పర్యము:–** యముడు యమపాశముతో బంధువులు స్నేహపాశంతోను రెండువైపుల తనను లాగుతుండటం గమనిస్తుంటాడు.

**శ్లో॥ హిక్కయా బాధ్యమానస్య శ్వాసేన పరిశుష్యతః।
మృత్యునాకృష్యమాణస్య న ఖల్వస్తి పరాయణమ్॥ 57**

**ప్రతిపదార్థము:–** హిక్కయా=ఎక్కిళ్ళతో, బాధ్యమానస్య=బాధింపబడుచున్నవాడును, శ్వాసేన =ఎగశ్వాసతో, పరిశుష్యతః=ఎండిపోవుచున్నవాడును, మృత్యునా=మృత్యువుచేత, కృష్య మాణస్య=లాగబడుచున్నవాడును అగు జీవునకు, పరాయణమ్=గమ్యము, నాస్తి ఖలు=లేదు గదా!

**తాత్పర్యము:–** ఎక్కిళ్ళ బాధ, ఎగశ్వాస పీడ, మృత్యువు పాశంతో లాగటం – వీటిమధ్య నలగటం తప్ప మఱో గమ్యం లేదు.

**శ్లో॥ సంసారయన్త్రమారూఢో యమదూతైరధిష్ఠితః।
క్వ యాస్యామీతి దుఃఖార్తః కాలపాశేన యోజితః॥ 58**

**ప్రతిపదార్థము:–** సంసారయంత్రమ్=సంసారయంత్రమైన దేహమును, ఆరూఢః=ఎక్కిన వాడై, యమదూతైః=యమదూతలచేత, అధిష్ఠితః=ఎక్కబడినవాడై, క్వ=ఎక్కడకు, యాస్యామి =పోగలను, ఇతి=అని, దుఃఖార్తః=దుఃఖముగలవాడై, కాలపాశేన=యమపాశముచేత, యోజితః=అమర్చబడినవాడై –

**తాత్పర్యము:–** సంసార యంత్రమైన శరీరంలో చిక్కాడు. యమదూతలు నెత్తిన ఎక్కారు.

(రోగాలు పట్టుకొన్నాయి). ఎక్కడకు పోవాలో తెలియని దుఃఖంతో బాధ–చివఱకు మెడలోకి కాలపాశము.

**శ్లో॥ కిం కరోమి క్వ గచ్ఛామి కిం గృహ్ణామి త్యజామి కిమ్।**
**ఇతి కర్తవ్యతామూఢః కృచ్ఛ్రాద్ దేహాత్ త్యజత్యసూన్॥ 59**

**ప్రతిపదార్థము:–** కిమ్=ఏమి, కరోమి=చేయగలను, క్వ=ఎచ్చటకు, గచ్ఛామి=పోగలను, కిమ్=దేనిని, గృహ్ణామి=స్వీకరింపగలను, కిమ్=దేనిని త్యజామి=విడిచెదను? ఇతి=అని, కర్తవ్యతా=కర్తవ్యమునకు సంబంధించి, మూఢః=మొద్దుగా అయి, కృచ్ఛ్రాత్=కష్టముగా, దేహాత్=శరీరమునుండి, అసూన్=ప్రాణములను, త్యజతి=విడుచును.

**తాత్పర్యము:–** ఏమి చేయాలో, ఎక్కడకు పోవాలో, ఏమి తీసికొనాలో, ఏది వదలాలో తెలియని స్థితి. ఈ దశలలో 'దేహి' తనదేహాన్ని, ప్రాణాలను వదలిస్తాడు.

**శ్లో॥ యాతనాదేహసమ్బద్ధో యమదూతైరధిష్ఠితః।**
**ఇతో గత్వాఽనుభవతి యా యాస్తా యమయాతనాః॥ 60**
**తాసు యల్లభతే దుఃఖం తద్వక్తుం క్షమతే కుతః।**

**ప్రతిపదార్థము:–** యాతనా=పీడలనుభవించే, దేహ=శరీరముతో, సంబద్ధః=సంబంధించిన వాడై, యమదూతైః=యమదూతలచేత, అధిష్ఠితః=అధిష్ఠింపబడినవాడై (కావలిగా), ఇతః =ఈ లోకమునుండి, గత్వా=వెళ్ళి, యాః యాస్తాః=ఏయే, యమయాతనాః=నరకయాతన లను, అనుభవతి=అనుభవించునో, తాసు=వాటియందు, యత్=ఏ, దుఃఖమ్=దుఃఖమును, లభతే=పొందునో, తత్=దానిని, వక్తుమ్=చెప్పుటకు, కుతః=ఎట్లు, క్షమతే=చాలును.

**తాత్పర్యము:–** చనిపోయిన శరీరికి నరకయాతను అనుభవించటానికి యాతనా శరీరము ఏర్పడుతుంది. యమదూతలు ఇతనికి కావలిగా ఉంటారు. ఆ లోకములో ఏయే బాధలు అనుభవిస్తారో అవి అతను ఎలా ఎవరికి చెప్పగలడు?

**శ్లో॥ కర్పూర చన్దనాద్యైస్తు లిప్యతే సతతం హి యత్॥ 61**

**శ్లో॥ భూషణైర్భూష్యతే చిత్రైః సువస్త్రైః పరిధార్యతే।**
**అస్పృశ్యం జాయతేఽప్రేక్ష్యం జీవత్యక్తం సదా వపుః॥ 62**

**ప్రతిపదార్థము:–** యత్=ఏది, కర్పూర=పచ్చకర్పూరము, చందన=గంధము, ఆద్యైస్తు= మొదలగువానిచే, సతతమ్=ఎల్లప్పుడు, లిప్యతే=పూయబడునో, చిత్రైః=పవిత్రమైన, భూషణైః =సొమ్ములచేత,భూష్యతే=అలంకరింపబడునో, సు=మంచి, వస్త్రైః=వస్త్రములచే, పరిధార్యతే =చుట్టబడునో, తత్=ఆ, వపుః=శరీరము, జీవ=జీవునిచే, త్యక్తమ్=విడువబడినదై,



సదా=ఎల్లప్పుడు, అస్పృశ్యమ్=తాకరానిది, అప్రేక్ష్యమ్=చూడరానిదియు, జాయతే= అగును.

**తాత్పర్యము:–** ఏ శరీరాన్ని కర్పూరచందనాది పరిమళాలతో అందంగా అలంకరిస్తాడో, దేనికి చక్కని రకరకాల సొమ్ములు, మంచి విలువైన వస్త్రాలను కట్టబెడతారో, అదే శరీరము జీవుడు వదలిన క్షణమునుంచి అమంగళము, అస్పృశ్యము అవుతుంది. అదే శవము.

**శ్లో॥ నిష్కాసయన్తి నిలయాత్ క్షణం న స్థాపయన్త్యపి।**
**దహ్యతే చ తతః కాష్ఠైస్తద్భస్మ క్రియతే క్షణాత్॥ 63**

**ప్రతిపదార్థము:–** నిలయాత్=నివాసమునుండి, నిష్కాసయంతి=వెళ్ళగొట్టెదరు, క్షణమ్= క్షణమైనా, నాపి స్థాపయంతి=ఉంచరు, తతః=తర్వాత, కాష్ఠైః=కట్టెలతో, దహ్యతే=దహింప బడును, తత్=ఆ శరీరము, క్షణాత్=క్షణములో, భస్మ=బూడిదగా, క్రియతే=చేయబడును.

**తాత్పర్యము:–** శవమును ఇంట క్షణమైనను ఉంచికొనరు. ఎంత కావాలనుకొన్నా బయటకు పంపవలసినదే. కట్టెలతో తగులబెట్టెదరు. చివఱకు బూడిద అగును.

**శ్లో॥ భక్ష్యతే వా సృగాలైశ్చ గృధ్రకుక్కుటవాయసైః।**
**పునర్న దృశ్యతే సోఽపి జన్మకోటిశతైరపి॥ 64**

**ప్రతిపదార్థము:–** వా=లేదా, (తగలబెట్టటం, పూడ్చటం లేకపోతే), సృగాలైశ్చ=నక్కలచేత, గృధ్ర=గ్రద్దలచే, కుక్కుట=కోళ్ళచే, వాయసైః=కాకులచే, భక్ష్యతే=తినివేయబడును, సోపి= ఆ (దేహం), దేహి, జన్మకోటిశతైరపి=శతకోటిజన్మలకైనా, పునః=మరల, న దృశ్యతే= కనబడదు.

**తాత్పర్యము:–** అలా కాల్చక, పూడ్చక వదలినచో నక్కలో, కుక్కలో, కాకులో, గ్రద్దలో తినివేయును. ఏదైనా ఆ దేహముగాని, దేహిగాని శతకోటి జన్మలకైనా మఱల కనబడదు.

**శ్లో॥ మాతా పితా గురుజనః స్వజనో మమేతి**
**మాయోపమే జగతి కస్య భవేత్ప్రతిజ్ఞా।**
**ఏకో యతో వ్రజతి కర్మ పురఃసరోఽయమ్**
**విశ్రామవృక్షసదృశః ఖలు జీవలోకః॥ 65**

**ప్రతిపదార్థము:–** కర్మ=కర్మ, పురస్సరః=అగ్రగామిగాగలవాడై, అయమ్=ఈ జీవుడు, ఏకః=ఒంటరివాడై, యతః=ఎందువలన, వ్రజతి=సాగుచున్నాడో, అందువలన, మమ=నాకు, మాతా=తల్లి, పితా=తండ్రి, గురుజనః=పెద్దవారు, స్వజనః=నావారు,

ఇతి=అని, కస్య= ఎవనికి, మాయోపమే=గారడీవంటి, జగతి=ప్రపంచమునందు, ప్రతిజ్ఞా=గుర్తు, భవేత్ =ఉండును. జీవ=జీవులయొక్క లోకః=లోకమైన యీ భూలోకము, విశ్రామ=విశ్రాంతి యొక్క, వృక్ష=చెట్టుతో, సదృశః ఖలు=సమానమైనదిగదా!

**తాత్పర్యము:–** మనిషి/జీవుడు ఒంటరి. అతనికన్న ముందు అతని కర్మ నడుస్తుంటుంది. అదే అతనికి మార్గదర్శి. ఇటువంటి దశలో ఎవనికైనా నా తల్లి, నా తండ్రి, నా గురువు, నా బంధువు–అని గుర్తింపు ఎలా ఉంటుంది.ఈ లోకం జీవులకు విశ్రమించే చెట్టు వంటిది. (బాటసారులు,పక్షులు మార్గమధ్యమున ఏదో ఒక చెట్టువద్ద విశ్రాంతి తీసికొంటారు).

**శ్లో॥ సాయం సాయం వాసవృక్షం సమేతాః**
**ప్రాతః ప్రాతస్తేన తేన ప్రయాన్తి।**
**త్యక్త్వాఽన్యోన్యం తం చ వృక్షం విహఙ్గా**
**యద్వత్తద్వజ్ఞాతయోఽజ్ఞాతయశ్చ॥ 66**

**ప్రతిపదార్థము:–** సాయం సాయమ్=ప్రతిసాయం కాలము, వాసవృక్షమ్=గూడున్న చెట్టును, సమేతాః=కలిసినవై, విహంగాః=చెట్లు, ప్రాతః ప్రాతః=ప్రతి ప్రొద్దున, తేన తేన=ఆయా చెట్టుతో, అన్యోన్యమ్=తమలో తమను, తమ్=ఆ, వృక్షం చ=చెట్టును, త్యక్త్వా=విడిచి, యద్వత్=ఏ విధముగా, ప్రయాంతి=పయనించుచున్నవో, తద్వత్=అలా, జ్ఞాతయః= దాయాదులు, అజ్ఞాతయశ్చ=ఇతరులున్ను, ప్రయాంతి=పయనించెదరు.

**తాత్పర్యము:–** ఈ జీవలోకము ఒక వృక్షమువంటిది. బాటసారులు/పక్షులు సాయంకాలము ఆ వృక్షమువద్ద విశ్రమించి ప్రొద్దున ఆ చెట్టును, తమను గూడ విడిచి ఎవరిదారిన వారు పోయెదరు.

**శ్లో॥ మృతిబీజం భవేజ్జన్మ జన్మబీజం భవేన్మృతిః।**
**ఘటయన్త్రవదశ్రాన్తో బమ్భ్రమీత్యనిశం నరః॥ 67**

**ప్రతిపదార్థము:–** జన్మ=పుట్టుక, మృతి=మరణానికి, బీజమ్=విత్తనము, భవేత్=అగును, మృతిః=మరణము, జన్మ=పుట్టుకకు, బీజమ్=విత్తనము, భవేత్=అగును, నరః=మనిషి, ఘటయంత్రవత్=కుమ్మరిసారెవలె, అశ్రాంతః=అలయకుండా, అనిశమ్=ఎల్లపుడు, బంభ్రమీతి=మాటిమాటికి తిరుగుచుండును.

**తాత్పర్యము:–** పుట్టుక మరణానికి బీజం. మరణం మఱో పుట్టుకకు నాంది మాత్రమే. కుమ్మరి సారె వంటి యీ జనన మరణ చక్రంలో మనిషి నిత్యము తిరుగుతుంటాడు.



**శ్లో॥ గర్భే పుంసః శుక్రపాతాద్యదుక్తం మరణావధి।**
**తదేతస్య మహావ్యాధేర్మత్తో నాన్యోఽస్తి భేషజమ్॥ 68**

**ప్రతిపదార్థము:–** గర్భే=స్త్రీ గర్భమునందు, పుంసః=పురుషునియొక్క శుక్ర=వీర్యము యొక్క పాతాత్=పడుటనుంచి, మరణావధి=మరణం వఱకు, యత్=ఏది, ఉక్తమ్=చెప్పబడెనో, తదేతస్య=అయీ, మహావ్యాధేః=సంసారమను గొప్పవ్యాధికి, మత్తః=నాకన్న, అన్యః=ఇతర మైన, భేషజమ్=ఔషధము, నాస్తి=లేదు.

**తాత్పర్యము:–** స్త్రీ గర్భమున పురుష వీర్యము చేరినది మొదలుకొని ఆ జీవి జీవించి మరణించువఱకు నిరంతరముగానున్న యీ సంసారమహావ్యాధికి నేనే ఎదురులేని ఔషధమును. దీనికి వేరే మందు లేదు.

**ఇతి శ్రీ పద్మపురాణే ఉపరిభాగే శివగీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీ శివరాఘవసంవాదే పిణ్డోత్పత్తికథనం నామాష్టమోఽధ్యాయః॥**

* * * * *

## అథ నవమో౽ ధ్యాయః
# దేహస్వరూపవర్ణనయోగః

**శ్రీ శివ ఉవాచ-శ్రీ శివుడు ఇట్లనెను.**

**శ్లో॥ దేహస్వరూపం వక్ష్యామి శృణుష్వావహితో నృప!।**
**మత్తో హి జాయతే విశ్వం మయ్యైవైతత్ప్రధార్యతే।**
**మయ్యేవేదమధిష్ఠానే లీయతే శుక్తిరౌప్యవత్॥ 1**

**ప్రతిపదార్థము:–** నృప=రాజా!, దేహ=శరీరముయొక్క, స్వరూపమ్=స్వరూపమును, వక్ష్యామి =చెప్పబోవుచున్నాను, అవహితః=సావధానుడవై, శృణుష్వ=వినుము, విశ్వమ్=ప్రపంచము, మత్తః=నానుండి, జాయతేహి=పుట్టును గదా!, ఏతత్=ఇది, మయైవ=నాచేతనే, ప్రధార్యతే= నిలుపబడును, అధిష్ఠానే=ఆధారమైన, మయ్యేవ=నాయందే, ఇదమ్=ఈ ప్రపంచము, శుక్తి=ముత్యపుచిప్పయందలి, రౌప్యవత్=వెండివలె, లీయతే=లయించును.

**తాత్పర్యము:–** రాజా! దేహస్వరూపమును వివరించెదను. సావధానంగా వినుము. ఈ ప్రపంచము నా నుండి పుట్టుచున్నది గదా! ఇది నా వలననే నిలిచియున్నది. నా యందు పుట్టిన, నా వలన నిలిచిన ప్రపంచము నాయందే లయమగును. ముత్యపు చిప్పయందు మన భ్రాంతివలన ఉన్నట్లు కనిపించే 'వెండి' చివఱకు దానియందే లయించును. మాయ వలన నాయందు కనిపించే ప్రపంచము నాయందే లయించును.

**శ్లో॥ అహన్తు నిర్మలః పూర్ణః సచ్చిదానన్దవిగ్రహః।**
**అసఙ్గో నిరహఙ్కారః శుద్ధం బ్రహ్మ సనాతనమ్॥ 2**

**ప్రతిపదార్థము:–** అహంతు=నేనయితే, నిర్మలః=మాలిన్యరహితుడను, పూర్ణః=పరిపూర్ణుడను, సచ్చిదానందవిగ్రహః=సత్యజ్ఞానానందరూపుడను,అసంగః=సంగరహితుడను, నిరహంకారః =అహంకారము లేనివాడను, శుద్ధమ్=సర్వదోషరహితమైన, సనాతనమ్=అనాది అయిన బ్రహ్మ=బ్రహ్మమును.



**తాత్పర్యము:–** నేను వస్తుతః నిర్దోషుడను. నిష్కాముడను. సత్యజ్ఞానానందస్వరూపుడను. సంగము అహంకారము లేనివాడను. అనాది అయిన శుద్ధ బ్రహ్మపదార్థమును నేను.

**శ్లో॥ అనాద్యవిద్యాయుక్తః సన్ జగత్కారణతాం వ్రజేత్।**
**అనిర్వాచ్యా మహావిద్యా త్రిగుణా పరిణామినీ॥ 3**

**ప్రతిపదార్థము:–** అనాది=ఆదిరహితమైన, అవిద్యా=అవిద్యతో, యుక్తస్సన్=కూడి, జగత్= ప్రపంచమునకు, కారణతామ్=హేతువగుటను, వ్రజేత్=పొందును, మహావిద్యా=గొప్పదైన అవిద్య, అనిర్వాచ్యా=నిర్వచింపరానిది, త్రిగుణా=గుణత్రయం కలది, పరిణామినీ= పరిణామశీలమైనది.

**తాత్పర్యము:–** నేను అనాదిగా అవిద్యాయుక్తుడనై యీ జగత్తుకు కారణమగుచున్నాను. ఆ అవిద్య అనిర్వచనీయము. దానియందు సత్వం, రజస్సు, తమస్సు అని మూడు గుణములుండును. ఈ జగత్తుగా పరిణమించునది అదే.

**శ్లో॥ రజః సత్వం తమశ్చేతి త్రిగుణాః పరికీర్తితాః।**
**సత్వం శుక్లం సమాదిష్టం సుఖజ్ఞానాస్పదం నృణామ్॥ 4**

**ప్రతిపదార్థము:–** రజః=రజస్సు, సత్వమ్=సత్వము, తమశ్చేతి=తమస్సు అని, త్రి=మూడు, గుణాః=గుణములు, పరికీర్తితాః=చెప్పబడినవి. సత్వమ్=సత్వగుణము, శుక్లమ్=తెల్లనిది గాను, నృణామ్=నరులకు, సుఖ=సుఖముయొక్క, జ్ఞాన=జ్ఞానముయొక్క, ఆస్పదమ్= స్థానముగా, సమాదిష్టమ్=చెప్పబడినది.

**తాత్పర్యము:–** రజస్సని, సత్వమని, తమస్సని గుణములు మూడు. అందు సత్త్వగుణము తెల్లనిది. అది నరులకు సుఖమును, జ్ఞానమును కలిగించును.

**శ్లో॥ దుఃఖాస్పదం రక్తవర్ణం చఞ్చలం చ రజో మతమ్।**
**తమః కృష్ణం జడం ప్రోక్తముదాసీనం సుఖాదిషు॥ 5**

**ప్రతిపదార్థము:–** రజః=రజస్సు, దుఃఖాస్పదమ్=దుఃఖస్థానము, చంచలమ్=చపలము అని, మతమ్=తలచబడినది, తమః=తమస్సు, జడమ్=మొద్దుదని, కృష్ణమ్=నల్లనిదని, సుఖాదిషు =సుఖము మొదలగువానియందు, ఉదాసీనమ్=తటస్థమని, మతమ్=తలచబడినది.

**తాత్పర్యము:–** రజస్సు దుఃఖకరము. చపలము తమస్సు నల్లనిది. జడము, అందుచేత సుఖాదుల విషయంలో అది తటస్థము.

**శ్లో॥ అతో మమ సమాయోగాచ్ఛక్తిః సా త్రిగుణాత్మికా।**
**అధిష్ఠానే చ మయ్యేవ భజతే విశ్వరూపతామ్॥ 6**

**ప్రతిపదార్థము:–** అతః=ఇందువలన, మమ=నాయొక్క, సమాయోగాత్=కలయికవలన, సా=ఆ, శక్తిః=శక్తి, అవిద్య, త్రిగుణాత్మికా=మూడు గుణములదై, అధిష్ఠానే=ఆధారమైన, మయ్యేవ=నాయందే, విశ్వరూపతామ్=ప్రపంచరూపమును, భజతే=పొందును.

**తాత్పర్యము:–** మాయ నాయందే ఉండును. నా సన్నిధానమువలన దానికి ప్రపంచ సృష్టిశక్తి అబ్బును. త్రిగుణములతో అది నాయందే విశ్వరూపమును పొందును.

**శ్లో॥ శుక్తౌ రజతవత్ రజ్జౌ భుజఙ్గో యద్వదేవ తు।**
**ఆకాశాదీని జాయన్తే మత్తో భూతాని మాయయా॥ 7**

**ప్రతిపదార్థము:–** శుక్తౌ=ముత్యపుచిప్పయందు, రజతవత్=వెండివలె, రజ్జౌ=త్రాటియందు, భుజంగః=పాము, యద్వదేవ తు=ఎలాగైతే పుట్టునో, అలాగే, మాయయా=మాయతో, ఆకాశాదీని=ఆకాశము మొదలగు, భూతాని, భూతములు, మత్తః=నానుండి, జాయంతే=పుట్టుచున్నవి.

**తాత్పర్యము:–** ముత్యపు చిప్పయందు వెండివలె త్రాటియందు పామువలె మాయచేత నాయందు ఆకాశాది భూతాలు పుట్టుచున్నవి.

**శ్లో॥ తైరారబ్ధమిదం విశ్వం దేహోఽయం పాఞ్చభౌతికః।**
**పితృభ్యామశితాదన్నాత్ షట్కోశం జాయతే వపుః॥ 8**

**ప్రతిపదార్థము:–** తైః=ఆ భూతములచేత, ఇదమ్=ఈ, విశ్వమ్=ప్రపంచము, ఆరబ్ధః=ప్రారంభింప బడినది. అయమ్=ఈ, దేహః=దేహమున్ను, పాంచభౌతికః=పంచభూతముల నుండి వచ్చినదే. పితృభ్యామ్=తల్లిదండ్రులచేత, అశితాత్=తినబడిన, అన్నాత్=అన్నము నుండి, షట్కోశమ్=ఆఱుకోశములుగల, వపుః=శరీరము, జాయతే=పుట్టును.

**తాత్పర్యము:–** పంచభూతములచేత ఈ విశ్వము ఏర్పడినది. ఈ శరీరములన్నియు అలా ఏర్పడినవి. అందుకే పాంచభౌతికములు. తల్లిదండ్రుల ఆహారమునుండి 'ఆఱు' కోశములు గల యీ శరీరము పుట్టును.

**శ్లో॥ స్నాయవోఽస్థీని మజ్జా చ జాయన్తే పితృతస్తథా।**
**త్వఙ్మాంసశోణితమితి మాతృతశ్చ భవన్తి హి॥ 9**

**ప్రతిపదార్థము:–** స్నాయవః=స్నాయువులు, అస్థీని=ఎముకలు, మజ్జా చ=మూలగయు, పితృతః=తండ్రినుండి, జాయంతే=కలుగును, తథా=అట్లే, త్వక్=చర్మము, మాంస=మాంసము, శోణితమ్=నెత్తురు, ఇతి=అని, మాతృతశ్చ=తల్లినుంచియు, భవంతి హి=కాగలవు.



**తాత్పర్యము:–** తండ్రివలన స్నాయువులు, ఎముకలు,మజ్జ, తల్లినుండి చర్మము,మాంసము, శోణితము వచ్చును.

**శ్లో॥ భావాః స్యుః షడ్విధాస్తస్య మాతృజాః పితృజాస్తథా।**
**రసజా ఆత్మజాః సత్త్వసమ్భూతాః స్వాత్మజాస్తథా॥ 10**

**ప్రతిపదార్థము:–** తస్య=ఆ దేహమునకు, భావాః=భావములు, షడ్విధాః=ఆఱు రకములు, స్యుః=కాగలవు, మాతృజాః=తల్లివలన వచ్చినవి, పితృజాః=తండ్రివలన వచ్చినవి, రసజాః=అన్నరసమువలన వచ్చినవి, ఆత్మజాః=తననుండి వచ్చినవి, సత్త్వసంభూతాః=సత్త్వ గుణమునుండి వచ్చినవి, స్వాత్మజాః=దేహమునుండి వచ్చినవి, ఆఱు విధములు.

**తాత్పర్యము:–** ఆ దేహమునకు భావములు ఆఱురకములు కాగలవు. తల్లివలన వచ్చినవి, తండ్రివలన వచ్చినవి, అన్నరసమువలన వచ్చినవి, తననుండి వచ్చినవి, సత్త్వగుణము నుండి వచ్చినవి, దేహమునుండి వచ్చినవి మొత్తం ఆఱు విధములు.

**శ్లో॥ మృదవః శోణితం మేదో మజ్జా ప్లీహా యకృద్గుదమ్।**
**హృన్నాభీత్యేవమాద్యాస్తు భావా మాతృభవా మతాః॥ 11**

**ప్రతిపదార్థము:–** శోణితమ్=నెత్తురు, మేదః=క్రొవ్వు, మజ్జా=మజ్జ (మూలగ), ప్లీహా=ప్లీహము, యకృత్=కాలేయము, గుదమ్=ఆసనము, హృత్=గుండె, నాభి=బొడ్డు, ఇత్యేవమాద్యాః=ఈ మొదలగు, మృదవః=మెత్తనిభాగములు, మాతృభవాః=తల్లినుండి పుట్టినవిగా, మతాః=తలచబడినవి.

**తాత్పర్యము:–** రక్తము, క్రొవ్వు, మూలగ, ప్లీహము, లివరు, ఆసనము, హృదయము, నాభి మొదలు మృదుధాతుపదార్థములు తల్లివలన వచ్చినవి.

**శ్లో॥ శ్మశ్రులోమకచస్నాయుశిరాధమనయో నఖాః।**
**దశనాః శుక్రమిత్యాది స్థిరాః పితృసముద్భవాః॥ 12**

**ప్రతిపదార్థము:–** శ్మశ్రు=గడ్డమీసములు, లోమ=రోమములు, కచ=కేశములు, స్నాయు=స్నాయువులు, శిరా=శిరలు (నరములు) ధమనయః=రక్తనాళాలు,నఖాః=గోళ్ళు, దశనాః=పళ్ళు, శుక్రమ్=వీర్యము, ఇత్యాది=ఈ మొదలుగాగల, స్థిరాః=గట్టివస్తువులు, పితృ=తండ్రినుండి, సముద్భవాః=పుట్టినవి.

**తాత్పర్యము:–** గడ్డమీసములు, రోమములు, కేశములు, స్నాయువులు, శిరలు (నరములు) రక్తనాళాలు, గోళ్ళు, పళ్ళు, వీర్యము మొదలైన గట్టివస్తువులు, తండ్రినుండి పుట్టినవి.

**శ్లో॥ శరీరోపచితిర్వర్ణో వృద్ధిస్తృప్తిర్బలస్థితిః।**
**అలోలుపత్వముత్సాహ ఇత్యాది రసజం విదుః॥ 13**

**ప్రతిపదార్థము:–** శరీర=దేహముయొక్క, ఉపచితిః=ఎదుగుదల, వర్ణః=రంగు, వృద్ధిః= ఎదుగుదల, తృప్తిః=తృప్తి, బలస్థితిః=బలము, అలోలుపత్వమ్=ఆతురత లేకపోవుట, ఉత్సాహః=ఉత్సాహము మొదలైన లక్షణములు, రసజమ్=అన్నరసమువలన పుట్టినదిగా, విదుః=అనుకొందురు.

**తాత్పర్యము:–** దేహముయొక్క ఎదుగుదల రంగు, తృప్తి, బలము, ఆతురతలేకపోవుట, ఉత్సాహము మొదలైన లక్షణములు అన్నరసమువలన పుట్టినవిగా అనుకొందురు.

**శ్లో॥ ఇచ్ఛాద్వేషః సుఖం దుఃఖం ధర్మాధర్మౌ చ భావనా।**
**ప్రయత్నో జ్ఞానమాయుశ్చేన్ద్రియాణీత్యేవమాత్మజాః॥ 14**

**ప్రతిపదార్థము:–** ఇచ్ఛా=కోరిక, ద్వేషః=ద్వేషము, సుఖమ్=సుఖము, దుఃఖమ్=దుఃఖము, ధర్మాధర్మౌ చ=ధర్మము, అధర్మము, భావనా=భావన, ప్రయత్నః=ప్రయత్నము, జ్ఞానమ్= జ్ఞానము, ఆయుశ్చ=ఆయువు, ఇంద్రియాణి=ఇంద్రియములు, ఇత్యేవమ్=ఈ లాంటివి, ఆత్మజాః=ఆత్మనుండి వచ్చినవి.

**తాత్పర్యము:–** కోరిక, ద్వేషము, సుఖము, దుఃఖము, ధర్మము, అధర్మము, భావన, ప్రయత్నము, జ్ఞానము, ఆయువు, ఇంద్రియములు–ఈలాంటివి ఆత్మనుండి వచ్చినవి.

**శ్లో॥ జ్ఞానేన్ద్రియాణి శ్రవణం స్పర్శనం దర్శనం తథా।**
**రసనం ఘ్రాణమిత్యాహుః పఞ్చ తేషాం తు గోచరాః॥ 15**

**శ్లో॥ శబ్దః స్పర్శస్తథా రూపం రసో గన్ధ ఇతి క్రమాత్।**
**వాక్కరాంఘ్రిగుదోపస్థాన్యాహుః కర్మేన్ద్రియాణి హి॥ 16**

**ప్రతిపదార్థము:–** జ్ఞానేంద్రియాణి=జ్ఞానేంద్రియములైన, చెవి, చర్మము, కన్ను, నాలుక, ముక్కు శ్రవణమ్=వినుట, స్పర్శనమ్=స్పర్శ, దర్శనమ్=చూచుట, తథా=అలాగే, రసనమ్= రుచిచూచుట, ఘ్రాణమ్=వాసనచూచుట, ఇతి=అని ఆహుః=చెప్పెదరు, పంచ=ఐదు క్రియలు, తేషామ్=ఆ ఇంద్రియములకు క్రియలకున్ను, గోచరాః=విషయములయినవి గలవు. అవి, క్రమాత్=వరుసగా, శబ్దః=ధ్వని, స్పర్శః=స్పర్శ, తథా=అట్లే, రూపమ్= రూపము,రసః=రుచి, గంధః=వాసన, ఇతి=అని కలవు, వాక్=మాట, కర=చేయి, అంఘ్రి =కాళ్ళు, గుద=ఆసనము, ఉపస్థాని=జననేంద్రియములు–వీటిని కర్మేంద్రియాణి= కర్మేంద్రియములుగా, ఆహుః=చెప్పుచున్నారు, హి=గదా!



**తాత్పర్యము:–** జ్ఞానేంద్రియములైన, చెవి, చర్మము, కన్ను, నాలుక, ముక్కు; వీటి క్రియలు వినుట, స్పర్శ, చూచుట, అలానే రుచిచూచుట, వాసనచూచుట అని చెప్పెదరు. ఇవి ఐదు క్రియలు– ఆ ఇంద్రియములకు క్రియలకున్ను విషయములయినవి గలవు. అవి, వరుసగా ధ్వని, స్పర్శ, అట్లే రూపము, రుచి, వాసన అని కలవు. మాట, చేయి, కాళ్ళు, ఆసనము, జననేంద్రియములు – వీటిని కర్మేంద్రియములుగా చెప్పుచున్నారు గదా!

**శ్లో॥ వచనాదానగమనవిసర్గరతయః క్రమాత్।**
**క్రియాస్తేషాం మనోబుద్ధిరహఙ్కారస్తతః పరమ్।**
**అన్తఃకరణమిత్యాహుశ్చిత్తం చేతి చతుష్టయమ్॥ 17**

**ప్రతిపదార్థము:–** తేషామ్=ఆ కర్మేంద్రియాలకు, క్రమాత్=వరుసగా, వచన=మాటాడుట, ఆదాన=తీసికొనుట, గమన=నడచుట, విసర్గ=విసర్జించుట, రతయః=సంభోగము అనునవి క్రియాః=పనులు, మనః=మనస్సు, బుద్ధిః=బుద్ధి, అహంకారః=అహంకారము, చిత్తంచేతి= చిత్తము అని, చతుష్టయమ్=నాల్గింటి సముదాయమును, అంతఃకరణమితి=అంతః కరణమని, ఆహుః=చెప్పెదరు.

**తాత్పర్యము:–** ఆ కర్మేంద్రియాలకు వరుసగా మాటాడుట, తీసికొనుట, నడచుట, విసర్జించుట, సంభోగము అనునవి పనులు. మనస్సు, బుద్ధి, అహంకారము, చిత్తము అనే నాల్గింటి సముదాయమును అంతఃకరణమని చెప్పెదరు.

**శ్లో॥ సుఖం దుఃఖం చ విషయౌ విజ్ఞేయౌ మనసః క్రియాః।**
**స్మృతిభీతివికల్పాద్యా బుద్ధిః స్యాన్నిశ్చయాత్మికా॥ 18**

**ప్రతిపదార్థము:–** మనసః=మనస్సునకు, సుఖమ్=సుఖము, దుఃఖం చ=దుఃఖమున్ను, విషయౌ=విషయాలుగా, విజ్ఞేయౌ=తెలిసికొనదగినవి, క్రియాః=మనస్సుయొక్క క్రియలు, స్మృతి=స్మరణము, భీతి=భయము, వికల్పాద్యాః=వికల్పము మొదలైనవి. నిశ్చయాత్మికా= నిశ్చయరూపమైనది, బుద్ధిః=బుద్ధి, స్యాత్=అగును.

**తాత్పర్యము:–** మనస్సునకు సుఖము, దుఃఖమున్ను, విషయాలుగా తెలిసికొనదగినవి, క్రియలు, స్మరణము, భయము, వికల్పము మొదలైనవి, నిశ్చయరూపమైనది, బుద్ధి అగును.

**శ్లో॥ అహం మమేత్యహఙ్కారశ్చిత్తం చేతయతే యతః।**
**సత్త్వాఖ్యమన్తఃకరణం గుణభేదాత్త్రిధా మతమ్॥ 19**

**ప్రతిపదార్థము:–** అహమ్=నేను, మమ=నాది, ఇతి=అనేభావన, అహంకారము, చేతయతే యతః=తలచుకొనును కనుక, "చిత్తమ్" చిత్తము అందురు. సత్త్వాఖ్యమ్=సత్త్వము అనుపేరు

గల, అంతఃకరణమ్=అంతఃకరణము, గుణభేదాత్=గుణములలో భేదము వలన, మూడు విధములుగా తలచబడినది.

**తాత్పర్యము:–** నేను, నాది అనే భావన, అహంకారము, తలచుకొనును కనుక చిత్తము అందురు. సత్త్వము అను పేరుగల అంతఃకరణము గుణములలో భేదమువలన మూడు విధములు.

**శ్లో॥ సత్త్వం రజస్తమ ఇతి గుణాః సత్త్వాత్తు సాత్వికాః।**
**ఆస్తిక్యశుద్ధిధర్మైకరుచిప్రకృతయో మతాః॥ 20**

**ప్రతిపదార్థము:–** సత్త్వమ్=సత్త్వమని, రజః=రజస్సని, తమ ఇతి=తమస్సని, గుణాః =మూడు గుణాలు గలవు. సత్త్వాత్తు=సత్త్వమువలన, సాత్త్వికాః=సాత్త్విక గుణములు వచ్చును. ఆస్తిక్య =ఆస్తికత్వము, శుద్ధి=నిర్మలత్వము, ధర్మైకరుచి=ధర్మప్రీతి, మొదలైనవి, ప్రకృతయః= స్వభావములు, మతాః=సాత్త్వికములుగా చెప్పబడినవి.

**తాత్పర్యము:–** సత్త్వమని, రజస్సని, తమస్సని మూడు గుణములు గలవు. సత్త్వమువలన సాత్త్వికగుణములు వచ్చును. ఆస్తికత్వము, నిర్మలత్వము, ధర్మప్రీతి మొదలైన స్వభావములు సాత్త్వికములుగా చెప్పబడినవి.

**శ్లో॥ రజసో రాజసా భావాః కామక్రోధమదాదయః।**
**నిద్రాలస్య ప్రమాదాది వఞ్చనాద్యాస్తు తామసాః॥ 21**

**ప్రతిపదార్థము:–** రజసః=రజోగుణమునుండి వచ్చిన, భావాః=భావములు, రాజసాః= రాజసములు, కామ=కామము, క్రోధ=కోపము, మద=మదము, ఆదయః=మొదలైనవి, రాజసములు. నిద్రా=నిద్ర, ఆలస్య=సోమరితనము, ప్రమాద=పొరపాట్లు, ఆది=మొదలైనవి, ఇంకను, వంచనా=మోసగించుట, ఆద్యాస్తు=మొదలుగాగలవియు, అగునవి, తామసాస్తు= తమోగుణమువలన బుట్టినవి కనుక తామసములు.

**తాత్పర్యము:–** రజోగుణమునుండి వచ్చిన భావములు, రాజసములు, కామము, కోపము, మదము మొదలైనవి రాజసములు. నిద్ర, సోమరితనము, పొరపాట్లు మొదలైనవి ఇంకనూ మోసగించుట మొదలుగాగలవియు తమోగుణమువలన బుట్టినవి కనుక తామసములు.

**శ్లో॥ ప్రసన్నేన్ద్రియతారోగ్యానాలస్యాద్యాస్తు సత్త్వజాః।**
**దేహో మాత్రాత్మకస్తస్మాదాదత్తే తద్గుణానిమాన్॥ 22**

**ప్రతిపదార్థము:–** ప్రసన్నేంద్రియతా=ఇంద్రియనిర్మలత్వము, ఆరోగ్య=ఆరోగ్యము, అనాలస్య =చుఱుకుదనము, ఆద్యాస్తు=మొదలైన గుణములు, సత్త్వజాః=సాత్త్వికములు, దేహః=



శరీరము, మాత్రాత్మకమ్=పంచతన్మాత్రరూపము, తస్మాత్=అందువలన, ఇమాన్=ఈ చెప్పబోవు, తద్గుణాన్=భూతగుణములను, ఆదత్తే=గ్రహించును.

**తాత్పర్యము:–** ఇంద్రియనైర్మల్యము, ఆరోగ్యం, ఉత్సాహము మొదలైనవి సత్త్వజగుణములు దేహము పంచభూత తన్మాత్రలవలన ఏర్పడును. కనుక దేహం ఈ చెప్పబోవు పంచభూతాల గుణాలను స్వీకరించును.

**శ్లో॥ శబ్దశ్రోత్రముఖరతాం వైచిత్ర్యం సూక్ష్మతాం ధృతిమ్।**
**బలం చ గగనాద్వాయోః స్పర్శం చ స్పర్శనేన్ద్రియమ్॥ 23**

**ప్రతిపదార్థము:–** గగనాత్=ఆకాశమునుండి, శబ్ద=శబ్దమును, శ్రోత్ర=చెవిని, ముఖరతామ్= చప్పుడును, వైచిత్ర్యమ్=విచిత్రత్వమును, సూక్ష్మతామ్=సూక్ష్మత్వమును, ధృతిమ్=ధారణను బలం చ=బలమును, వాయోః=వాయువునుండి, స్పర్శమ్=స్పర్శను, స్పర్శనేంద్రియమ్ చ=స్పర్శేంద్రియమును.

**తాత్పర్యము:–** ధ్వనిని, ధ్వనిగ్రాహకమై చెవిని, శ్రవణాది వ్యవహారమును, స్వరభేదాలను, సూక్ష్మతను, ధైర్యమును, బలమును ఆకాశములనుండి గ్రహించును. వాయువునుండి స్పర్శను స్పర్శేంద్రియమును గ్రహించును.

**శ్లో॥ ఉత్క్షేపణమవక్షేపాకుఞ్చనే గమనం తథా।**
**ప్రసారణమితీమాని పఞ్చ కర్మాణి రూక్షతాః॥ 24**

**ప్రతిపదార్థము:–** ఉత్క్షేపణమ్=ఎత్తివిసరుట, అవక్షేప=క్రిందకు పడవేయుట, ఆకుంచన= ముడవదీయుట, గమనమ్=గమనము, తథా=అట్లే, ప్రసారణమ్=చాచుట, ఇతి=అనే, ఇమాని=ఈ, పంచ=ఐదు, కర్మాణి=కర్మలు, రూక్షతాః=రూక్షతలు.

**తాత్పర్యము:–** ఎత్తి విసరుట, క్రిందకు పడవేయుట, ముడవదీయుట, గమనము, అట్లే – చాచుట అనే ఈ ఐదు కర్మలు రూక్షతలు.

**శ్లో॥ ప్రాణాపానౌ తథా వ్యానసమానోదానసంజ్ఞకాః।**
**నాగః కూర్మశ్చ కృకరో దేవదత్తో ధనఞ్జయః॥ 25**

**ప్రతిపదార్థము:–** ప్రాణాపానౌ=ప్రాణవాయువు, అపానవాయువు, తథా=అట్లే, వ్యాన= వ్యానవాయువున్ను, సమాన=సమానవాయువున్ను, ఉదాన=ఉదానవాయువున్ను, సంజ్ఞకాః =అను పేర్లుగల వాయువున్ను, నాగః=నాగము, కూర్మశ్చ=కూర్మము, కృకరః=కృకరము, దేవదత్తః=దేవదత్తము, ధనంజయః=ధనంజయము.

**తాత్పర్యము:–** ప్రాణవాయువు, అపానవాయువు, అట్లే వ్యానవాయువున్ను, సమాన వాయువున్ను, ఉదానవాయువున్ను అను పేర్లుగల వాయువును, నాగము, కూర్మము, కృకరము, దేవదత్తము ధనంజయము –

**శ్లో॥ దశేతి వాయువికృతీస్తథా గృహ్ణాతి లాఘవమ్।**
**తేషాం ముఖ్యతరః ప్రాణో నాభేః కణ్ఠాదధః స్థితః॥ 26**

**ప్రతిపదార్థము:–** ఇతి=అని, దశ=పది, వాయువికృతీః=వాయుభేదములను, తథా=అట్లే, లాఘవమ్=తేలికదనమును, గృహ్ణాతి=(దేహము వాయువునుంచి) స్వీకరించును, తేషామ్= వాటిలో, ముఖ్యతరః=ముఖ్యతమమైన, ప్రాణః=ప్రాణము, కంఠాత్=కంఠమునుండి, అధః =క్రిందుగా, నాభేః=నాభివరకు, స్థితః=ఉన్నది.

**తాత్పర్యము:–** (ముందరి శ్లోకముతో అన్వయము) అని పది వాయుభేదములను అట్లే తేలికదనమును, స్వీకరించును. ఈ పదిరకముల వాయువులలో ముఖ్యమైనది ప్రాణము. అది కంఠము క్రింద నాభిదాకా వ్యాపించియున్నది.

**శ్లో॥ చరత్యసౌ నాసికయోర్నాభౌ హృదయపఙ్కజే।**
**శబ్దోచ్చారణనిఃశ్వాసోచ్ఛ్వాసాదేరపి కారణమ్॥ 27**

**ప్రతిపదార్థము:–** అసౌ=ఈ ప్రాణవాయువు, నాసికయోః=ముక్కులయందు, నాభి= బొడ్డునందు, హృదయపంకజే=హృదయ పద్మమునందు, చరతి=సంచరించును. శబ్ద= శబ్దముయొక్క ఉచ్చారణ=ఉచ్చరించుట, నిశ్శ్వాస=నిట్టూర్చుట, ఉచ్ఛ్వాస=శ్వాస పీల్చుట, అదేరపి=మొదలగు వానికిన్ని, కారణమ్=ఇదే కారణము.

**తాత్పర్యము:–** ఈ ప్రాణవాయువు, ముక్కులయందు బొడ్డునందు హృదయపద్మమునందు సంచరించును. శబ్దముయొక్క ఉచ్చారణ, నిట్టూర్చుట, శ్వాసపీల్చుట మొదలగువానికి ఇదే కారణము.

**శ్లో॥ అపానస్తు గుదే మేఢ్రే కటిజఙ్ఘోదరేష్వపి।**
**నాభికన్దే వృషణయోరూరుజానుషు తిష్ఠతి॥ 28**

**ప్రతిపదార్థము:–**అపానస్తు=అపానవాయువైతే,గుదే=ఆసనమునందు,మేఢ్రే=జననేంద్రియము నందు, కటి=నడుమునందు, జంఘా=పిక్కలందు, ఉదరేష్వపి=పొట్టయందు, నాభికందే= బొడ్డు నందు, వృషణయోః=వృషణములందు, ఊరు=తొడల యందు, జానుషు=మోకాళ్ళ యందు, తిష్ఠతి=ఉండును.



**తాత్పర్యము:–** అపానవాయువైతే, ఆసనమునందు, జననేంద్రియము నందు, నడుము నందు, పిక్కలందు, పొట్టయందు, బొడ్డు నందు, వృషణములందు, తొడలయందు, మోకాళ్ళ యందు ఉండును.

**శ్లో॥ తస్య మూత్రపురీషాదివిసర్గః కర్మ కీర్తితమ్।**
**వ్యానోఽక్షిశ్రోత్రగుల్ఫేషు జిహ్వాఘ్రాణేషు తిష్ఠతి॥ 29**

**ప్రతిపదార్థము:–** తస్య=అపానవాయువునకు, మూత్ర=మూత్రము, పురీష=మలము, ఆది= మొదలగు పదార్థములయొక్క, విసర్గః=విసర్జన, కర్మ=పనిగా, కీర్తితమ్=చెప్పబడినది, వ్యానః=వ్యానవాయువు, అక్షి=కన్నులయందు, శ్రోత్ర=చెవులయందు, గుల్ఫేషు=సీలమండ లందు, జిహ్వా=నాలుకయందు, ఘ్రాణేషు=ముక్కులందు, తిష్ఠతి=ఉండును.

**తాత్పర్యము:–** అపానవాయు క్రియలు మలమూత్రాది విసర్జనము, వ్యానవాయువు నేత్ర శ్రోత్రగుల్ఫరసనాసికలయందు ఉండును.

**శ్లో॥ ప్రాణాయామధృతిత్యాగగ్రహణాద్యస్య కర్మ చ।**
**సమానో వ్యాప్య నిఖిలం శరీరం వహ్నినా సహ॥ 30**

**శ్లో॥ ద్విసప్తతిసహస్రేషు నాడీరన్ధ్రేషు సఞ్చరన్।**
**భుక్తపీతరసాన్ సమ్యగానయన్ దేహపుష్టికృత్॥ 31**

**ప్రతిపదార్థము:–** అస్య=ఈ వ్యానవాయువుయొక్క, కర్మ చ=పనియున్ను, ప్రాణాయామ= ప్రాణాయామముయొక్క, ధృతి=ధారణము, త్యాగ=వదలుట, గ్రహణాది=పట్టుకొనుట మొదలగునవి, సమానః=సమానవాయువు, నిఖిలమ్=మొత్తము, శరీరమ్=దేహమును, వ్యాప్య=వ్యాపించి, వహ్నినా సహ=అగ్నితోకలిసి, ద్విసప్తతి=డెబ్బదిరెండు, సహస్రేషు=వేలైన, నాడీరంధ్రేషు=నాడీరంధ్రములందు, సంచరన్=సంచరించుచు, భుక్త=తినబడిన, పీత= త్రాగబడిన, రసాన్=అన్నరసాదులను, సమ్యక్=చక్కగా, ఆనయన్=అంతటా వ్యాపింప జేయుచు, దేహ=దేహమునకు, పుష్టికృత్=పోషణ కలిగించును.

**తాత్పర్యము:–** వ్యానవాయువు ప్రాణాయామమును పట్టుట విడుచుట, నిలుపుట అను క్రియలకు గూడా పనికివచ్చును. సమానవాయువు సర్వశరీరము వ్యాపించి అగ్నితో కలిసి 72,000 నాడీరంధ్రములద్వారా సంచరిస్తూ మన ఆహారరసములను పచనము చేయుచు, ఆయా ఇంద్రియములకు పంచుచు దేహపుష్టిని చేయును.

**శ్లో॥ ఉదానః పాదయోరాస్తే హస్తయోరఙ్గసన్ధిషు।**
**కర్మాఽస్య దేహోన్నయనోత్క్రమణాదిప్రకీర్తితమ్॥ 32**

**ప్రతిపదార్థము:–** ఉదానః=ఉదానవాయువు, పాదయోః=కాళ్ళయందు, హస్తయోః=చేతుల యందు, అంగ=అవయవములయొక్క, సంధిషు=సంధులందు, ఆస్తే=ఉండును, అస్య=ఈ సమానవాయువుయొక్క, కర్మ=కార్యము, దేహ=శరీరముయొక్క, ఉన్నయన=పైకి లేపుట, ఉత్క్రమణ=పైకి వెళ్ళుట, ఆది=మొదలగునది అని, ప్రకీర్తితమ్=చెప్పబడినది.

**తాత్పర్యము:–** ఉదానవాయువు, హస్తములందు, పాదములందు, సంధులందు ఉండును. దేహం లేచుట నుంచి జీవుడు దేహము నుండి లేచుట దాకా దీని క్రియలే.

**శ్లో॥ త్వగాదిధాతూనాశ్రిత్య పఞ్చ నాగాదయః స్థితాః।**
**ఉద్గారాది నిమేషాది క్షుత్పిపాసాదికం క్రమాత్।**
**తన్ద్రీప్రభృతి శోకాది తేషాం కర్మ ప్రకీర్తితమ్॥ 33**

**ప్రతిపదార్థము:–** త్వక్=చర్మము, అది=మొదలగు, ధాతూన్=ధాతువులను, ఆశ్రిత్య= ఆశ్రయించి, నాగాదయః=నాగము మొదలగు, పంచ=ఐదు వాయువులు, స్థితాః=ఉన్నవి, ఉద్గారాది=త్రేన్పులు మొదలగునవి, నిమేషాది=కనులుమూయుట మొదలగునవి, క్షుత్పిపాసాదికమ్=ఆకలిదప్పికలు మొదలగునవి, తంద్రీప్రభృతి=అలసట మొదలగునవి, శోకాది=శోకము మొదలగునవి, తేషామ్=నాగము మొదలగు వాయువులకు, క్రమాత్= వరసగా, కర్మ=పనిగా, ప్రకీర్తితమ్=చెప్పబడినది.

**తాత్పర్యము:–** ప్రాణాది ప్రధానవాయువులకు నాగాది ఉపవాయువులు ఐదు కలవు. వరుసగా వాటి పనులు 1) త్రేన్పులు మొదలైనవి, 2) కనులుమూయుట మొదలైనవి, 3) ఆకలిదప్పికలు మొదలైనవి, 4) అలసట / ఆవులింత మొదలైనవి, 5) శోకము మొదలగునవి. ఈ ఐదు వాయువుల పనులు. (ఈ క్రమం తప్పు – అయినా గ్రంథానుసారం వ్రాయబడినది).

**శ్లో॥ అగ్నేఽస్తు రోచకం రూపం దీప్తిం పాకం ప్రకాశతామ్।**
**అమర్షతీక్ష్ణ సూక్ష్మతామోజస్తేజశ్చ శూరతామ్॥ 34**

**శ్లో॥ మేధావితాం తథాదత్తే జలాత్తు రసనం రసమ్।**
**శైత్యం స్నేహం ద్రవం స్వేదం గాత్రాదిమృదుతామపి।**
**భూమేర్ఘ్రాణేన్ద్రియం గన్ధం స్థైర్యం ధైర్యం చ గౌరవమ్॥ 35**

**ప్రతిపదార్థము:–** అగ్నేస్తు=అగ్నినుండయితే, రోచకమ్=కాంతిమంతమైన, రూపమ్= రూపము, దీప్తిమ్=కాంతిని, పాకమ్=పండుటను, ప్రకాశతామ్=వెలుగును, అమర్ష= రోషమును, తీక్ష్ణ=తీవ్రతను,సూక్ష్మతామ్=సూక్ష్మతను, ఓజః=ఓజస్సును, తేజః=తేజస్సును,



శూరతామ్=శౌర్యమును, మేధావితామ్=మేధాశక్తిని, ఆదత్తే=స్వీకరించును. తథా=అదే విధముగా,జలాత్తు=నీటినుండి,రసనమ్=రుచిని,రసమ్=రసమును, శైత్యమ్=చల్లదనమును, స్నేహమ్=జిడ్డును, ద్రవమ్=ద్రవమును, స్వేదమ్=చెమటను, గాత్రాది=శరీరాదులయొక్క మృదుతామపి=మెత్తదనమును గూడా, ఆదత్తే=స్వీకరించును, భూమేః=భూమినుంచి, ఘ్రాణేంద్రియమ్=ముక్కును, గంధమ్=వాసనను, స్థైర్యమ్=స్థిరత్వమును, ధైర్య=ధైర్యమును, గౌరవంచ=గౌరవమును పొందును.

**తాత్పర్యము:–** అగ్నినుండి అందమును, వెలుగును, రూపమును,పాకమును, ప్రకాశమును, రోషము, సూక్ష్మము తీక్ష్ణములు/రూక్షణములను, ఓజస్సును, తేజస్సును, శౌర్యమును, మేధాశక్తిని స్వీకరించును. జలమునుండి రసమును,రుచిని, చల్లదనమును, స్నేహమును, ద్రవమును, స్వేదమును, శరీరమృదుత్వమును స్వీకరించును. భూమినుంచి ముక్కును, వాసనను, స్థిరత్వమును, ధైర్యమును, బరువును పొందును.

**శ్లో॥ త్వగసృగ్మాంసమేదోఽస్థి మజ్జా శుక్రాణి ధాతవః।**
**అన్నం పుంసాశితం త్రేధా జాయతే జఠరాగ్నినా॥ 36**

**ప్రతిపదార్థము:–** త్వక్=చర్మము, అసృక్=నెత్తురు, మాంస=మాంసము, మేదః=క్రొవ్వు, అస్థి=ఎముకలు, మజ్జా=మూలగ, శుక్రాణి=వీర్యములు, ధాతవః=శరీరముఖ్యపదార్థములైన ధాతువులు, పుంసా=జీవునిచేత, అశితమ్=తినబడిన, అన్నమ్=ఆహారము, జఠరాగ్నినా= జఠరాగ్నిచేత, త్రేధా=మూడు విధాలుగా, జాయతే=అగును.

**తాత్పర్యము:–** ధాతువులు అనగా శరీర మూలపదార్థములు, సప్తధాతువులు ఇవి చర్మము, నెత్తురు, మాంసము, క్రొవ్వు, ఎముక, మూలగ, వీర్యము/శోణితము. పురుషుడు తిన్న అన్నము జఠరాగ్ని పాకంవలన మూడు విధాలుగా మారును.

**శ్లో॥ మలః స్థవిష్ఠో భాగః స్యాన్మధ్యమో మాంసతాం వ్రజేత్।**
**మనః కనిష్ఠో భాగః స్యాత్ తస్మాదన్నమయం మనః॥ 37**

**ప్రతిపదార్థము:–** స్థవిష్ఠః=మిక్కిలిస్థూలమైన, భాగః=భాగము, మలః=మలము, స్యాత్= అగును, మధ్యః=మధ్యరకమైన, భాగము, మాంసతామ్=మాంసరూపమును, వ్రజేత్= పొందును, కనిష్ఠః=అత్యంత సూక్ష్మమైన, భాగః=భాగము, మనః=మనస్సు, స్యాత్=అగును, తస్మాత్=కనుక, మనః=మనస్సు, అన్నమయమ్=అన్నమయమైనది.

**తాత్పర్యము:–** ఆహారంలో స్థూలభాగము మలముగాను, మధ్యభాగము మాంసముగాను, సూక్ష్మభాగము మనస్సుగాను తయారగును. కనుకనే మనస్సు అన్నమయము అందురు.

శ్లో॥ అపాం స్థవిష్ఠో మూత్రం స్యాన్మధ్యమో రుధిరమ్భవేత్।
ప్రాణః కనిష్ఠో భాగః స్యాత్తస్మాత్ ప్రాణో జలాత్మకః॥ 38

**ప్రతిపదార్థము:–** అపామ్=నీళ్ళయొక్క, స్థవిష్టమ్=స్థూలభాగము, మూత్రమ్=మూత్రము స్యాత్=అగును, మధ్యమః=మధ్యభాగము, రుధిరమ్=నెత్తురు, భవేత్=అగును, కనిష్ఠః= మిక్కిలి సూక్ష్మమైన, భాగః=భాగము, ప్రాణః=ప్రాణము, స్యాత్=అగును, తస్మాత్=కనుక, ప్రాణః=ప్రాణము, జలాత్మకః=జలరూపమైనది.

**తాత్పర్యము:–** త్రాగిన నీటిలో స్థూలభాగము మూత్రముగాను, మధ్యరకం భాగము నెత్తురుగాను, సూక్ష్మభాగము, ప్రాణముగాను అగును. కనుకనే ప్రాణము జలమయమని చెప్పబడినది.

శ్లో॥ తేజసోఽస్థి స్థవిష్ఠః స్యాన్మజ్జా మధ్యసముద్భవః।
కనిష్ఠా వాఙ్మతా తస్మాత్ తేజోఽబన్నాత్మకం జగత్॥ 39

**ప్రతిపదార్థము:–** తేజసః=తేజస్సుయొక్క, స్థవిష్ఠః=మిక్కిలి స్థూలభాగము, అస్థి=ఎముకగా, స్యాత్=అగును. మధ్యసముద్భవః=మధ్యరకముగా పుట్టిన భాగము, మజ్జా=మూలగ అగును. కనిష్ఠా=అత్యంత సూక్ష్మభాగము, వాక్=వాక్కుగా, మతా=భావింపబడును, తస్మాత్=అందు వలన, జగత్=ప్రపంచము, తేజోబన్న=తేజస్సు, నీరు, అన్నము, ఆత్మకమ్=స్వరూపముగా గలది.

**తాత్పర్యము:–** తేజస్సుయొక్క స్థూలభాగము ఎముకలుగాను, మధ్యభాగము మూలగగాను, సూక్ష్మభాగము వాక్కుగాను అగును. అందువలన ప్రపంచము తేజోబన్నాత్మకమని శ్రుతిమతము.

శ్లో॥ లోహితాజ్జాయతే మాంసం మేదో మాంససముద్భవమ్।
మేదసోఽస్థీని జాయన్తే మజ్జా చాఽస్థిసముద్భవా॥ 40

**ప్రతిపదార్థము:–** లోహితాత్=రక్తమునుండి, మాంసమ్=మాంసము, జాయతే=పుట్టును, మాంస=మాంసమునుండి, సముద్భవమ్=పుట్టినది, మేదః=క్రొవ్వు, మేదసః=క్రొవ్వు నుంచి, అస్థీని=ఎముకలు, జాయంతే=పుట్టును, మజ్జా=మూలగ, అస్థి=ఎముకలనుంచి, సముద్భవా=పుట్టును.

**తాత్పర్యము:–** రక్తమునుండి మాంసము, మాంసమునుండి క్రొవ్వు, క్రొవ్వునుండి ఎముకలు, వాటినుంచి 'మూలగ' ఏర్పడును.

శ్లో॥ నాడ్యోఽపి మాంససంఘాతాచ్ఛుక్రం మజ్జాసముద్భవమ్।
వాతపిత్తకఫాశ్చాత్ర ధాతవః పరికీర్తితాః॥ 41



**ప్రతిపదార్థము:–** మాంస=మాంసముయొక్క, సంఘాతాత్=సమూహమునుండి, నాడ్యోపి= నాడులు పుట్టును, శుక్రమ్=వీర్యము, మజ్జా=మూలగనుండి సముద్భవమ్=పుట్టును, అత్ర=ఇందులో, వాత=వాతము, పిత్త=పిత్తరసము, కఫాశ్చ=కఫములున్ను, ధాతవః= ధాతువులుగా, పరికీర్తితాః=చెప్పబడినవి.

**తాత్పర్యము:–** మాంససమూహమునుండి నాడులు, మజ్జనుండి వీర్యము పుట్టును. వాత పిత్త కఫములు మూడు ధాతువులుగా చెప్పబడినవి.

శ్లో॥ దశాఞ్జలిజలం జ్ఞేయం రసస్యాఞ్జలయో నవ।
రక్తస్యాఽష్టౌ పురీషస్య సప్త స్యుః శ్లేష్మణశ్చ షట్॥ 42

**ప్రతిపదార్థము:–** జలమ్=నీరు, దశాంజలి=పది దోసిళ్ళ ప్రమాణముగానుండును. రసస్య= రసమునకు, అంజలయః=దోసిళ్ళు, నవ=తొమ్మిది ఉండును. రక్తస్య=రక్తమునకు, అష్టౌ= ఎనిమిది అంజలులుండును, పురీషస్య=మలమునకు, సప్త=ఏడు, స్యుః=ఉండును, శ్లేష్మణశ్చ =శ్లేష్మమునకు, షట్=ఆరు దోసిళ్ళుండును.

**తాత్పర్యము:–** ప్రతిమనిషి దేహమునందును, జలము 10 దోసిళ్ళు, రసము 9 దోసిళ్ళు, రక్తము 8 దోసిళ్ళు, మలము 7 దోసిళ్ళు, శ్లేష్మము 6 దోసిళ్ళు ఉండును.

శ్లో॥ పిత్తస్య పఞ్చ చత్వారో మూత్రస్యాఞ్జలయస్త్రయః।
వసాయా మేదసో ద్వౌ తు మజ్జా త్వఞ్జలిసంమితః।
అర్ధాఞ్జలిస్తథా శుక్రం తదేవ బలముచ్యతే॥ 43

**ప్రతిపదార్థము:–**పిత్తస్య=పిత్తరసమునకు, పంచ=ఐదు దోసిళ్ళు, మూత్రస్య=మూత్రమునకు, చత్వారః=నాలుగు దోసిళ్ళు,వసాయాః=వసకు, త్రయః అఞ్జలయః=మూడు దోసిళ్ళు, మేదసః=కొవ్వుకు, ద్వౌ తు=రెండు దోసిళ్ళు, మజ్జా తు=మూలగ అయితే, అంజలి సమ్మితః =ఒక దోసిలితో సమంగా ఉండును. తథా=అట్లే, శుక్రమ్=వీర్యము, అర్ధాంజలిః=1/2 దోసిలి ఉండును, తదేవ=అదే, బలమ్=బలమని, ఉచ్యతే=చెప్పబడును.

**తాత్పర్యము:–** పైత్యరసము 5 దోసిళ్ళు, మూత్రము 4 దోసిళ్ళు, వస 3 దోసిళ్ళు, మూలగ 1 దోసిలి, వీర్యము 1/2 దోసిని ఉండును. అదే "బలం" అని పిలువబడును.

శ్లో॥ అస్థ్నాం శరీరే సంఖ్యా స్యాత్ షష్టి యుక్తం శతత్రయమ్।
జలజాని కపాలాని రుచకాస్తరణాని చ।
నలకానీతి తాన్యాహుః పఞ్చధాస్థీని సూరయః॥ 44

**ప్రతిపదార్థము:–** శరీరే=శరీరమునందు, అస్థ్నామ్=ఎముకలయొక్క, సంఖ్యా=లెక్క, షష్టియుక్తమ్=60తో గూడిన, శతత్రయమ్=300, స్యాత్=అగును, జలజాని=పద్మములు, (వలయాకారాలు), కపాలాని=కపాలములు, రుచకాః=మెరిసే దంతములు, తరుణాని చ=తరుణములు, నలకాని=(మిగిలిన ఎముకలు) నలకములు, ఇతి=అని, తాని=ఆ, అస్థీని=ఎముకలను, సూరయః=పండితులు, పంచధా=ఐదు విధములుగా, ఆహుః=చెప్పుచున్నారు.

**తాత్పర్యము:–** శరీరమునందలి ఎముకల సంఖ్య 360. అవి జలజములు, కపాలములు, రుచకములు, తరుణములు, నలకములు అని ఐదు విధములు. దీని వివరణ **శివగీతా తాత్పర్య ప్రకాశిక** నుంచి ఇచ్చుచున్నాను.

1) **జలజాని** = పాదపార్శ్వపృష్ఠములందున్న వలయములు.
2) **కపాలాని** = తాలు, జాను, నితంబ, అంస, గండ, శంఖ శిరస్సుల ఎముకలు.
3) **రుచకాః** = దంతములు.
4) **తరుణాని** = ముక్కు, చెవి, మెడ, కనులు, కేశాలు.
5) **నలకాని** = శేషములు, మిగిలిన ఎముకలు.

**శ్లో॥ ద్వే శతే స్వస్థిసన్ధీనాం స్యాతాం తత్ర దశోత్తరే।**
**రౌరవాః ప్రసరాః స్కన్ధసేచనాః స్యురులూఖలాః॥ 45**

**ప్రతిపదార్థము:–** తత్ర=ఎముకలలో, అస్థి=ఎముకల, సంధీనామ్=సంధులయొక్క, దశోత్తరే =పది ఎక్కువగాగల, ద్వే=రెండు, శతే=వందలు, స్యాతామ్=ఉండును, రౌరవాః= రౌరవములు, ప్రసరాః=ప్రసరములు, స్కంధసేచనాః=స్కంధసేచనములు, ఉలూఖలాః= ఉలూఖలములు, స్యుః=ఉండును.

**తాత్పర్యము:–** అస్థి సంధాలు 210 ఉండును. అవి 8 రకములు. వాటి పేర్లు రౌరవములు, ప్రసరములు, స్కంధసేచనములు, ఉలూఖలములు – (తదుపరి పద్యంతో అన్వయము)

**శ్లో॥ సముద్గా మణ్డకాః శంఖవర్తా వాయసతుణ్డకాః।**
**ఇత్యష్టధా సముద్దిష్టాః శరీరేష్వస్థిసన్ధయః॥ 46**

**ప్రతిపదార్థము:–** సముద్గాః=సముద్గములు, మండకాః=మండకములు, శంఖావర్తాః= శంఖావర్తములు, వాయసతుండకాః=వాయసతుండములు, ఇతి=అని, శరీరేషు=దేహము లందు, అస్థిసంధయః=ఎముకలసంధులు, అష్టధా=ఎనిమిది విధములుగా, సముద్దిష్టాః =చెప్పబడినవి.



**తాత్పర్యము:–** సముద్గములు, మండకములు, శంఖావర్తములు, వాయసతుండములు, అని దేహములందు, ఎముకలసంధులు, ఎనిమిది విధములుగా చెప్పబడినవి.

1) **గౌరవ/కోరక** = గుంటగల ఎముకలు (జాను, గుల్ఫ, అంగుళి)
2) **ప్రసర/ప్రతర** = గ్రీవ, వెన్ను.
3) **స్కంధసేచన/ సున్నసేవని/ తుందసేచన** = మూర్ధ, కటి, కపాలములోవి.
4) **ఉలూఖల** = గ్రీవా–తోలువంటి, దంత, తిరుగుడు ఎముకలు (బంతి కీలు)
5) **సముద్ర/సముద్గ** = అంస, నితంబములోవి (సంపుటాకారములు)
6) **మండల/మండక** = హృదయ, నేత్ర
7) **శంఖావర్త** = చెవిలోని శృంగాటకం
8) **వాయసతుండక/ కాకతుండ** = దవడలు మొదలైనవి.

**శ్లో॥ సార్ధకోటిత్రయం రోమ్ణాం శ్మశ్రుకేశాస్త్రిలక్షకాః।**
**దేహస్వరూపమేవం తే ప్రోక్తం దశరథాత్మజ!॥ 47**

**ప్రతిపదార్థము:–** దశరథాత్మజ!=దాశరథీ!, రోమ్ణామ్=రోమములయొక్క, సార్ధకోటిత్రయమ్ =3 1/2 కోట్లు, శ్మశ్రుకేశాః=గడ్డమీసాల వెంట్రుకలు, త్రిలక్షకాః=మూడు లక్షలు, ఏవమ్=ఇట్లు, తే=నీకు, దేహస్వరూపమ్=శరీర స్వరూపము, ప్రోక్తమ్ చెప్పబడినది.

**తాత్పర్యము:–** రోమములు, 3 1/2 కోట్లు, శ్మశ్రుకేశములు 3 లక్షలు. దాశరథీ! ఈ విధముగా నీకు దేహస్వరూపమును వివరించితిని.

**శ్లో॥ తస్మాదసారో నాస్త్యేవ పదార్థో భువనత్రయే।**
**దేహేఽస్మిన్నభిమానేనన రకోపాయ బుద్ధయః॥ 48**

**శ్లో॥ అహఙ్కారేణ పాపేన క్రియన్తే హన్త! సాంప్రతమ్।**
**తస్మాదేతత్స్వరూపం తు విబోద్ధవ్యం మనీషిణా॥ 49**

**ప్రతిపదార్థము:–** తస్మాత్=ఆ శరీరం కన్న, అసారః=సారహీనమైన, పదార్థః=పదార్థము, భువనత్రయే=మూడు లోకములందు, నాస్త్యేవ=లేనేలేదు. అస్మిన్=ఈ, దేహే=శరీరము నందు, అభిమానేన=మమకారముతో, నరకోపాయ=నరకానికి ఉపాయమైన,బుద్ధయః

= బుద్ధులు, సాంప్రతమ్=ఇపుడు, అహంకారేణ=అహంకారముచేత, పాపేన=పాపిచేత, క్రియంతే=చేయబడుచున్నవి. హంత=అయ్యో!, తస్మాత్=కనుక, మనీషిణా తు=బుద్ధిమంతుని చేత, ఏతత్=ఈ శరీరముయొక్క స్వరూపం=స్వరూపము, విబోద్ధవ్యమ్=తెలిసికొనదగినది.

**తాత్పర్యము:–** కనుక ఈ శరీరం కన్న తుచ్ఛమైన పదార్థం ముల్లోకములలో మఱొకటి లేదు. ఈ దేహం మీద అభిమానంతో, అహంకారంతో పాపి అయినవాడు నరక కారణమైన బుద్ధులను సంపాదించుచున్నాడు. కనుక విద్వాంసుడు, దీని తత్త్వము నెఱుగవలెను. తద్ద్వారా దీనిపై విరక్తి కలిగి బాగుపడును.

**ఇతి శ్రీ పద్మపురాణే ఉపరిభాగే శివగీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీ శివరాఘవసంవాదే దేహస్వరూపవర్ణనం నామ నవమోఽధ్యాయః॥**

* * * *



# అథ దశమోఽధ్యాయః
# జీవ స్వరూప వర్ణన యోగః

**శ్రీరామ ఉవాచ**

**శ్లో॥ భగవన్! కుత్ర జీవోఽసౌ జన్తోర్దేహేవతిష్ఠతే।**
**జాయతే వా కుతో జీవః స్వరూపం చాఽస్య కిం వద॥ 1**

**ప్రతిపదార్థము:–** భగవన్=ప్రభూ!, అసౌ=ఈ, జీవః=జీవుడు, జంతోః=జంతువుయొక్క, దేహే=శరీరమున, కుత్ర=ఎచ్చట, అవతిష్ఠతే=ఉండును, కుతః=దేనినుంచి, జీవః=జీవుడు, జాయతేవా=పుట్టును? అస్య=ఈ జీవునియొక్క, స్వరూపంచ=తత్త్వమున్ను, కిమ్=ఏమిటో? వద=చెప్పుము.

**తాత్పర్యము:–** ప్రభూ! జీవుడు ప్రాణిశరీరమున ఎక్కడ ఉంటాడు? ఎలా పుట్టాడు? అతని తత్త్వం ఏమిటి?

**శ్లో॥ దేహాన్తే కుత్ర వా యాతి గత్వా వా కుత్ర తిష్ఠతి।**
**కథమాయాతి వా దేహం పునర్నాయాతి వా వద॥ 2**

**ప్రతిపదార్థము:–** దేహాంతే=శరీరాంతమున, కుత్ర వా=ఎచ్చటికి, యాతి=పోవును, గత్వా వా=వెళ్ళి, కుత్ర=ఎచ్చట, తిష్ఠతి=ఉండును, పునః=మఱల, దేహమ్=శరీరమును గూర్చి, కథం వా=ఎట్లు, ఆయాతి=వచ్చును, పునః=మఱల, నాయాతి వా=రాడా? వద=చెప్పుము.

**తాత్పర్యము:–** శరీరాంతమున ఎచ్చటకు పోవును? వెళ్ళి ఎచ్చట ఉండును? దేహమునకు వచ్చునా? మఱల రాదా! ఈ సందేహములను సమాధానపఱచుము.

**శ్రీ శివ ఉవాచ-శ్రీ శివుడు ఇట్లనెను.**

**శ్లో॥ సాధుపృష్టం మహాభాగ! గుహ్యాత్ గుహ్యతరం హి యత్।**
**దేవైరపి సుదుర్జ్ఞేయమిన్ద్రాద్యైర్వా మహర్షిభిః॥ 3**

**ప్రతిపదార్థము:–**మహాభాగ!=మహాత్మా!,యత్=ఏది, గుహ్యాత్=రహస్యముకన్న, గుహ్యతరమ్=రహస్యమైనదియు, ఇంద్రాద్యైః=ఇంద్రుడు మొదలగు, దేవైరపి=దేవతలచేతను, మహర్షిభిః వా=మహర్షులచేత గాని, సుదుర్జ్ఞేయమ్=తెలియరానిదో, తత్=అది, సాధు=చక్కగా, పృష్టమ్=అడుగబడినది.

**తాత్పర్యము:–** మహాత్మా! ఏది అత్యంత రహస్యమో, ఇంద్రాది దేవతలకు గాని, మహర్షులకు గాని అర్థముకానిదో ఆ విషయము నీవు అడిగావు. నీ ప్రశ్న బాగున్నది.

**శ్లో॥ అన్యస్మై నైవ వక్తవ్యం మయాఽపి రఘునన్దన।**
**త్వద్భక్త్యాఽహం పరం ప్రీతో వక్ష్యామ్యవహితః శృణు॥ 4**

**ప్రతిపదార్థము:–** రఘునందన!=రాఘవా!, మయాపి=నాచేతగూడా, అన్యస్మై=ఇతరునికి, నైవవక్తవ్యమ్=చెప్పరానిదే, అహమ్=నేను, త్వత్=నీ, భక్త్యా=భక్తిచేత, పరమ్=మిక్కిలి, ప్రీతః=సంతోషించినవాడనై, వక్ష్యామి=చెప్పబోవుచున్నాను, అవహితః=సావధానుడవై, శృణు=వినుము.

**తాత్పర్యము:–** రఘువీరా! ఇది ఎవరికీ చెప్పరానిది. నేను కూడా ఎవరికీ చెప్పరాదు. కాని నీ భక్తికి సంతోషించి చెప్పబోవుచున్నాను. సావధానుడవై వినుము.

**శ్లో॥ సత్యజ్ఞానాత్మకోఽనన్తః పరమానన్దవిగ్రహః।**
**పరమాత్మా పరఞ్జ్యోతిరవ్యక్తో వ్యక్తకారణమ్॥ 5**

**ప్రతిపదార్థము:–** సత్య=సత్యము, జ్ఞాన=జ్ఞానము, ఆత్మకః=స్వరూపముగా గలవాడను, అనంతః=అంతములేనివాడను, పరమానంద=పరమానందమే, విగ్రహః=స్వరూపముగా గలవాడును, పరమాత్మా=శ్రేష్ఠాత్మయు, పరమ్=అతీతమైన, జ్యోతిః=జ్యోతియు, అవ్యక్తః=అస్పష్టుడును, అవ్యక్త=అస్పష్టమైన, అవ్యక్తమునకు, లేదా వ్యక్త=వ్యక్తమైన జగత్తునకు కారణమ్=కారణమైనవాడను.

**తాత్పర్యము:–** సత్యజ్ఞానానందరూపుడు అనంతుడు, పరమాత్మ, పరంజ్యోతి, అవ్యక్తుడు, అవ్యక్తహేతువు అయినవాడు–

**శ్లో॥ నిత్యో విశుద్ధః సర్వాత్మా నిర్లేపోఽహం నిరఞ్జనః।**
**సర్వధర్మవిహీనశ్చ న గ్రాహ్యో మనసాఽపి చ॥ 6**

**ప్రతిపదార్థము:–** నిత్యః=నిత్యుడు, విశుద్ధః=శుద్ధుడు, సర్వాత్మా=సర్వరూపుడు, నిర్లేపః=అసంగుడు, నిరంజనః=నిరంజనుడు, సర్వ=సకలమైన, ధర్మ=గుణములతో, విహీనశ్చ=రహితుడున్ను, మనసాపిచ=మనస్సుతో గూడా, నగ్రాహ్యః=గ్రహింపరానివాడును, అగు అహమ్=నేను.



**తాత్పర్యము:–** నిత్యుడు, విశుద్ధుడు, సర్వరూపుడు నిరంజనుడు, సర్వగుణ రహితుడు, మనస్సుకు గూడా అందనివాడును అయినది నేనే.

**శ్లో॥ నాఽహం సర్వేన్ద్రియగ్రాహ్యః సర్వేషాం గ్రాహకోహ్యహమ్।**
**జ్ఞాతాఽహం సర్వలోకస్య మమ జ్ఞాతా న విద్యతే।**
**దూరః సర్వవికారాణాం పరమాణ్వాదికస్య చ॥ 7**

**ప్రతిపదార్థము:–** అహమ్=నేను, సర్వేంద్రియ=సకలేంద్రియములచేత, గ్రాహ్యః=గ్రహింపదగినవాడను, న=కాదు, అహమ్=నేను, సర్వేషామ్=అందరికి, గ్రాహకోహి=గ్రహించువాడను, సర్వలోకస్య=సమస్తలోకమునకు, అహమ్=నేను, జ్ఞాతా=ఎఱిగినవాడను, మమ=నాకు, జ్ఞాతా=ఎరిగినవాడు, నవిద్యతే=లేడు, సర్వ=సకల, వికారాణామ్=మార్పులకు, పరమాణ్వాదికస్య చ=పరమాణువు మొదలైన వాటికిన్ని, దూరః=అతీతమైనవాడను.

**తాత్పర్యము:–** నేను ఇంద్రియాలకు అందను. అన్నింటిని నేనే గ్రహింపగలను. సర్వలోకమునకు నేను తెలియును. నాకు అందరు, అన్ని తెలుసు. సకలవికారములకు, పరమాణువునకున్ను నేను అతీతుడను.

**శ్లో॥ యతో వాచో నివర్తన్తే అప్రాప్య మనసా సహ।**
**ఆనన్దం బ్రహ్మ మాం జ్ఞాత్వా న బిభేతి కుతశ్చన॥ 8**

**ప్రతిపదార్థము:–** వాచః=వాక్కులు, మనసాసహ=మనస్సుతో గూడా, అప్రాప్య=చేరలేక, యతః=దేనినుండి, నివర్తంతే=మఱలునో, ఆనందమ్=ఆ ఆనందస్వరూపమైన, బ్రహ్మ=బ్రహ్మము, మామ్=నన్నుగా, జ్ఞాత్వా=ఎఱిగి, కుతశ్చన=దేనినుంచి, న బిభేతి=భయపడదు.

**తాత్పర్యము:–** ఎవరిని వాఙ్మనస్సులు చేరలేక ఆగి వెనుదిరిగి పోతాయో, ఆ ఆనందస్వరూపమైన బ్రహ్మమును నేనే అని ఎఱిగినవాడు ఇక దేనికీ భయపడడు.

**శ్లో॥ యస్తు సర్వాణి భూతాని మయ్యేవేతి ప్రపశ్యతి।**
**మాం చ సర్వేషు భూతేషు తతో న విజుగుప్సతే॥ 9**

**ప్రతిపదార్థము:–** యస్తు=ఎవడయితే, సర్వాణి=సమస్తములైన, భూతాని=భూతములు (జీవులు), మయ్యేవ=నాయందే ఉన్నవని, ప్రపశ్యతి=గమనించునో, సర్వేషు=సమస్తములైన, భూతేషు=జీవులయందు, మాంచ=నన్నును, ప్రపశ్యతి=గమనించునో అట్టివాడు, తతః=వాటినుండి, న విజుగుప్సతే=అసహ్యపడడు.

**తాత్పర్యము:–** ఎవడయితే సర్వభూతాలు నాయందే ఉన్నవని, నేను సర్వభూతములందు ఉన్నానని, గమనించినవాడు ఆ భూతములను అసహ్యించుకొనడు.

శ్లో॥ యత్ర సర్వాణి భూతాని హ్యాత్మైవాభూద్విజానతః।
కో మోహస్తత్ర కః శోక ఏకత్వమనుపశ్యతః॥ 10

**ప్రతిపదార్థము:–** యత్ర=ఎవనియందు / ఎక్కడ, విజానతః=జ్ఞానికి, సర్వాణి=సమస్తములైన, భూతాని=భూతాలు, ఆత్మైవ=ఆత్మయే, అభూత్=అయ్యెనో, తత్ర=అచ్చట, ఏకత్వమ్=సర్వైక్యమును, అనుపశ్యతః=గమనించువానికి, మోహః=అజ్ఞానము, కః=ఏది? శోకః=శోకము, కః=ఏది?

**తాత్పర్యము:–** సమస్తభూతాలు ఎవని దృష్టిలో జ్ఞానియో, అట్టి ఏకాత్మజ్ఞానికి మోహం, శోకం ఎలా ఉంటాయి. అతనికి అంతా బ్రహ్మమే.

శ్లో॥ ఏష సర్వేషు భూతేషు గూఢోత్మా న ప్రకాశతే।
దృశ్యతే త్వగ్ర్యయా బుద్ధ్యా సూక్ష్మయా సూక్ష్మదర్శిభిః॥ 11

**ప్రతిపదార్థము:–** సర్వేషు=సమస్తములైన, భూతేషు=భూతములందు, గూఢోత్మా=గూఢముగానున్న ఆత్మ, న ప్రకాశతే=బయటకు స్పష్టము కాదు, సూక్ష్మదర్శిభిః=సూక్ష్మవీక్షణము గలవారిచేత, సూక్ష్మయా=సూక్ష్మమైన, అగ్ర్యయా='కొన'గల, బుద్ధ్యా తు=బుద్ధిచేతనైతే, దృశ్యతే=చూడబడును.

**తాత్పర్యము:–** సమస్తభూతములయందు గూఢంగా ఉన్న ఆత్మ బయటకు స్పష్టం గాదు. సూక్ష్మదర్శనులైన మహాత్ములు నిశితమైన తమ కుశాగ్రబుద్ధితో ఆ పరమాత్మను కనుగొన గలరు.

శ్లో॥ అనాద్యవిద్యయా యుక్తస్తథాప్యేకోఽహమవ్యయః।
అవ్యాకృతబ్రహ్మరూపో జగత్కర్తాఽహమీశ్వరః॥ 12

**ప్రతిపదార్థము:–** అహమ్=నేను, అనాది=అనాది అయిన, అవిద్యయా=అవిద్యతో, యుక్తః=కూడియున్నవాడను, తథాపి=అయినా, ఏకః=ఒక్కడనే, అవ్యయః=నాశములేనివాడను, అవ్యాకృత=ప్రపంచముగా మారని, బ్రహ్మరూపః=బ్రహ్మస్వరూపుడను. అహమ్=నేను, జగత్కర్తా=ప్రపంచ స్రష్టను, ఈశ్వరః=ఈశ్వరుడను.

**తాత్పర్యము:–** అనాది అయిన అవిద్యతో కూడిన వాడను నేనే. అయినా అఖండ, అనంత పదార్థమును నేను. సృష్టికిముందున్న నిర్వికారబ్రహ్మపదార్థమునునేనే. మాయ ద్వారా జగత్కర్తగా అయినదీ నేనే.

శ్లో॥ జ్ఞానమాత్రే యథా దృశ్యమిదం స్వప్నే జగత్త్రయమ్।
తద్వన్మయి జగత్సర్వం దృశ్యతేఽస్తి విలీయతే।
నానావిద్యాసమాయుక్తో జీవత్వేన వసామ్యహమ్॥ 13



**ప్రతిపదార్థము:–** ఇదమ్=ఈ, జగత్త్రయమ్=ముల్లోకములు, స్వప్నే=స్వప్నమునందు, జ్ఞానమాత్రే=చైతన్యమునందు మాత్రమే, యథా=ఎలా, దృశ్యమ్కనబడునో, తద్వత్=అలానే, సర్వమ్=సమస్తమైన, జగత్=ప్రపంచం, మయి=నాయందు, దృశ్యతే=కనబడును, అస్తి=ఉన్నది, విలీయతే=లయించును. నానా=అనేకమైన, అవిద్యా=అవిద్యలతో, సమాయుక్తః = కలిసినవాడనై, అహమ్=నేను, జీవత్వేన=జీవుడుగా, వసామి=ఉండెదను.

**తాత్పర్యము:–** నిద్రపోవువానిలో ఏ ప్రపంచము ఉండదు. కనబడదు. అయినా కలలో సర్వదృశ్యాలు అనుభవానికి వస్తాయి. మన జ్ఞానంలోనే అన్ని పుడతాయి. కనబడతాయి. అలానే నాయందున్ను సర్వప్రపంచము ఉన్నది. కనబడుతున్నది. లయించుచున్నది. రకరకాల అవిద్యలతో లేదా ప్రత్యేక అవిద్యలతో నానా జీవులుగా నేను ఇందు కనబడు చున్నాను.

శ్లో॥ పఞ్చ కర్మేన్ద్రియాణ్యేవ పఞ్చ జ్ఞానేన్ద్రియాణి చ।
మనోబుద్ధిరహఙ్కారశ్చిత్తం చేతి చతుష్టయమ్।
వాయవః పఞ్చ మిలితా యాన్తి లిఙ్గశరీరతామ్॥ 14

**ప్రతిపదార్థము:–** పంచ=ఐదు, కర్మేంద్రియాణ్యేవ=కర్మేంద్రియాలే, పంచ=5, జ్ఞానేంద్రియాణి చ=జ్ఞానేంద్రియములున్ను, మనః=మనస్సు, బుద్ధిః=బుద్ధి, అహంకారః=అహంకారము, చిత్తంచేతి=చిత్తమని, చతుష్టయమ్=నాలుగు, వాయవః=వాయువులు, పంచ=ఐదు, మిలితాః=కలిసినవై, లింగశరీరతామ్=లింగశరీరరూపమును, యాంతి=పొందును.

**తాత్పర్యము:–** జ్ఞానేంద్రియాలు ఐదు, కర్మేంద్రియాలు ఐదు, మనోబుద్ధి అహంకార చిత్తములు నాలుగు, వాయువులు ఐదు– ఈ మొత్తం కలిసి 19 లింగశరీరముగా అగును.

శ్లో॥ తత్రాఽవిద్యా సమాయుక్తం చైతన్యం ప్రతిబిమ్బితమ్।
వ్యావహారికజీవస్తు క్షేత్రజ్ఞః పురుషోఽపి వా॥ 15

శ్లో॥ స ఏవ జగతాం భోక్తానాద్యయోః పుణ్యపాపయోః।
ఇహాఽముత్ర గతిస్తస్య జాగ్రత్స్వప్నాది భోక్తృతా॥ 16

**ప్రతిపదార్థము:–** తత్ర=ఆ లింగశరీరమునందు, అవిద్యా=అవిద్యతో, సమాయుక్తమ్=కూడినదై, చైతన్యమ్=చైతన్యము, ప్రతిబింబితమ్=ప్రతిబింబించినది, వ్యావహారిక జీవస్తు=వ్యావహారిక జీవుడయితే, క్షేత్రజ్ఞః=క్షేత్రజ్ఞుడు, లేదా పురుషోపి వా=పురుషుడు, స ఏవ=ఆ జీవుడే, జగతామ్=ప్రపంచములయొక్కయు, అనాద్యయోః=అనాదులైన, పుణ్యపాపయోః=పుణ్యపాపములకున్ను, భోక్తా=అనుభవకర్త, తస్య=వానికే, ఇహ=ఈలోకమున, అముత్ర=

పరలోకమున, గతిః=గతికలదు. తస్య=వానికే, జాగ్రత్=జాగరణయొక్క, స్వప్న=స్వప్నము, ఆది=మొదలగువానియొక్క, భోక్తృతా=భోగిత్వం ఉన్నది.

**తాత్పర్యము:–** అవిద్యాయుతమైన చైతన్యము ఆ లింగశరీరమున ప్రతిబింబించును. దానివలన వ్యావహారికజీవుడు ఏర్పడుతాడు. వాడే క్షేత్రజ్ఞుడైన పురుషుడు. వాడే పుణ్యపాపాలకు, లోకవిషయాలకు, అనుభవకర్త. వాడే జాగరణము స్వప్నము, ఇహ లోకము, పరలోకము అని రకరకాల అనుభవాలు పొందుతాడు.

**శ్లో॥ యథా దర్పణకాలిమ్నా మలినం దృశ్యతే ముఖమ్।**
**తద్వదన్తఃకరణగైర్దోషైరాత్మాఽపి దృశ్యతే॥ 17**

**ప్రతిపదార్థము:–** దర్పణ=అద్దముయొక్క, కాలిమ్నా=మురికిదనముతో, ముఖమ్=అద్దంలో ప్రతిబింబించిన ముఖము, మలినమ్=నల్లగా, యథా=ఎలా, దృశ్యతే=కనబడునో, తద్వత్=అలా, అంతఃకరణైః=అంతఃకరణమునందలి, దోషైః=దోషముచేత, ఆత్మాపి=అందు ప్రతిబింబించిన ఆత్మగూడా, దృశ్యతే=దోషయుక్తముగా కనబడుతున్నది.

**తాత్పర్యము:–** ముఖము నిర్మలంగా ఉన్నా అద్దం మలినమైతే అందు ప్రతిబింబించిన ముఖం గూడా మలినంగా కన్పడుతుంది. అలానే లింగశరీరములోని అంతఃకరణంలో ప్రతిబింబించిన నిర్దోషమైన ఆత్మ దోషిగా, పాపిగా కన్పడుతుంది.

**శ్లో॥ పరస్పరాధ్యాసవశాత్ స్యాదన్తఃకరణాత్మనోః।**
**ఏకీభావాభిమానేన పరాత్మా దుఃఖభాగివ॥ 18**

**ప్రతిపదార్థము:–** అంతఃకరణ=అంతఃకరణముయొక్క, ఆత్మనోః=ఆత్మయొక్క, పరస్పర=అన్యోన్యముయొక్క, అధ్యాసవశాత్=ఆరోపణవలన, ఏకీభావ=ఒక్కటే అగుటయందలి, అభిమానేన=పట్టుదలచేత, పరాత్మా=పరమాత్మ, దుఃఖభాగివ=దుఃఖితునివలె ఉన్నాడు.

**తాత్పర్యము:–** అంతఃకరణంలో ఆత్మప్రతిబింబించుటవలన అంతకరణం తానే ఆత్మను అనుకోవడం, ఆత్మ (జీవుడు) తాను అంతఃకరణాన్ని అని అనుకోవడం అధ్యాస. దీనివలన అంతఃకరణం – ఆత్మ. ఈ రెండు ఒక్కటిగానే అనిపిస్తాయి. దాంతో అంతఃకరణ ధర్మాలు ఆత్మమీద ఉన్నట్లు కనబడతాయి. అందువలన 'ఆత్మ దుఃఖశాలి' లాగా కన్పడుతుంది.

**శ్లో॥ మరుభూమౌ జలత్వేన మధ్యాహ్నార్కమరీచికాః।**
**దృశ్యన్తే మూఢచిత్తస్య న హ్యార్ద్రాస్తాపకారకాః॥ 19**

**ప్రతిపదార్థము:–** మూఢచిత్తస్య=మూఢునకు, మరుభూమౌ=ఎడమావియందు, మధ్యాహ్న=మధ్యాహ్నపు, అర్క=సూర్యునియొక్క, మరీచికాః=కిరణాలు, జలత్వేన=నీరుగా, దృశ్యంతే=



కనబడును. కాని, ఆర్ద్రాః=తడివి, నహి=కాదుగదా, పైగా, తాప=సంతాపమునకు, కారకాః హి=చేయునట్టివిగదా!

**తాత్పర్యము:–** మధ్యాహ్న సూర్యుని కిరణాలు ఎండమావిలో బడి 'నీళ్ళు' లాగా కనిపిస్తాయి. మూఢుడు దాన్ని నమ్ముతాడు. కాని అవి చల్లగా తగలకపోగా తాపాన్ని కలిగిస్తాయి.

**శ్లో॥ తద్వదాత్మాఽపి నిర్లేపో దృశ్యతే మూఢచేతసామ్।**
**స్వాఽవిద్యాఖ్యాత్మదోషేణ కర్తృత్వాదికధర్మవాన్॥ 20**

**ప్రతిపదార్థము:–** తద్వత్=అలాగే, నిర్లేపోపి=నిరంజనుడైనను, ఆత్మా=ఆత్మగూడా, స్వా విద్యాఖ్య=తన అవిద్య అను, ఆత్మదోషేణ=మనోదోషముచేత, కర్తృత్వ=కర్తృత్వము, ఆది=మొదలగు, ధర్మవాన్=ధర్మముగలదిగా, మూఢచేతసామ్=మూఢులకు, దృశ్యతే=కనబడును.

**తాత్పర్యము:–** నిరంజనమైన ఆత్మగూడా అంతఃకరణంలో ప్రతిబింబించటంవలన దోషములు, కర్తృత్వాది ధర్మములున్నట్లు కనబడుతున్నాడు. ఎండమావిలో నీళ్ళులేవు. ఉన్నట్లు కనబడతాయి. అలానే ఆత్మలో గుణధర్మాలు లేవు. ఉన్నట్లు కనబడతాయి. కారణం అజ్ఞానం, భ్రాంతి. అదే అవిద్య.

**శ్లో॥ తత్ర చాన్నమయే పిణ్డే హృది జీవోఽవతిష్ఠతే।**
**ఆనఖాగ్రం వ్యాప్యదేహం తద్బ్రువేఽవహితః శృణు॥ 21**

**ప్రతిపదార్థము:–** తత్ర చ=ఆ శరీరమున, అన్నమయే=అన్న జన్యమైన, పిండే=ముద్ద అయిన, హృది=హృదయమునందు, జీవః=జీవుడు, ఆనఖాగ్రమ్=గోళ్ళకొనలదాకా, దేహమ్=శరీరమును, వ్యాప్య=వ్యాపించి, అవతిష్ఠతే=ఉండును. తత్=ఆ విషయమును, బ్రువే=చెప్పెదను, అవహితః=శ్రద్ధగలవాడవై, శృణు=వినుము.

**తాత్పర్యము:–** అన్నమయశరీరంలో హృదయమధ్యంలో జీవుడు సర్వశరీరము, గోళ్లదాకా వ్యాపించియుండును. ఆ విషయం వివరంగా చెప్తాను. శ్రద్ధగా వినుము.

**శ్లో॥ పురీతదభిదానేన మాంసపిణ్డో విరాజతే।**
**నాభేరూర్ధ్వమధః కణ్ఠాద్ వ్యాప్య తిష్ఠతి యః సదా॥ 22**

**ప్రతిపదార్థము:–** నాభేః=బొడ్డుకు, ఊర్ధ్వమ్=పైన, కంఠాత్=కంఠమునుండి, అధః=క్రింద దాకా, వ్యాప్య=వ్యాపించి, యః=ఏది, సదా=ఎల్లపుడు, తిష్ఠతి=ఉండునో, సః=ఆ, మాంస పిండః=మాంస పేశి ఒకటి, పురీతత్=పురీతత్ అను, అభిధానేన=పేరుతో, విరాజతే=ప్రకాశించుచున్నది.

**తాత్పర్యము:–** నాభికి కంఠానికి మధ్యగా వ్యాపించిన మాంసభాగం ఒకటి ఉన్నది. దానిని "పురీతత్" అంటారు.

**శ్లో॥ తస్య మధ్యేఽస్తి హృదయం సనాళం పద్మకోశవత్।
అధోముఖం చ తత్రాస్తి సూక్ష్మం సుషిరముత్తమమ్।
దహరాకాశమిత్యుక్తం తత్ర జీవోఽవతిష్ఠతే॥ 23**

**ప్రతిపదార్థము:–** తస్య=ఆ పురీతత్‌యొక్క, మధ్యే=మధ్యన, సనాళమ్=కాడతో కూడిన, హృదయమ్=గుండె, పద్మకోశవత్=తామరమొగ్గవలె, అస్తి=కలదు, తత్ర=ఆ హృదయము నందు, అధోముఖం చ=దిగువముఖంగలదైన,సూక్ష్మమ్=సూక్ష్మమైనదియు, ఉత్తమమ్= గొప్పదియు అగు, సుషిరమ్=రంధ్రము, అస్తి=కలదు, దహరాకాశమితి=అది హృదయాకాశ మని, ఉక్తమ్= చెప్పబడినది, తత్ర=దానియందు, జీవః=జీవుడు, అవతిష్ఠతే=ఉండును.

**తాత్పర్యము:–** "పురీతత్" మధ్యంలో హృదయం ఉంటుంది. అది పద్మకోశంవలె అనగా తామర మొగ్గవలె ఉండును. దానిలో అధోముఖంగా ఒక 'రంధ్రద్వారం' ఉంటుంది. ఆ రంధ్రమునే 'దహరాకాశము' అందురు. అందులో జీవుడు భద్రముగా ఉండును.

**శ్లో॥ వాలాగ్రశతభాగస్య శతధా కల్పితస్య చ।
భాగో జీవః స విజ్ఞేయః స చానన్త్యాయ కల్పతే॥ 24**

**ప్రతిపదార్థము:–** శతధా=నూరుభాగములుగా, కల్పితస్య చ=తయారుచేయబడిన, వాలాగ్ర= వెంట్రుక కొనయొక్క, శతభాగస్య=నూరవభాగముయొక్క, భాగః=ఒక్క భాగముగా, సః =ఆ, జీవః=జీవుడు, విజ్ఞేయః=తెలియదగినవాడు, స చ=అతడున్ను, ఆనంత్యాయ= అనంతత్వమునకు, కల్పతే=చాలును.

**తాత్పర్యము:–** వెంట్రుక కొనను 1000 భాగాలు చేస్తే అందలి ఒకభాగం వంటివాడు జీవుడు. అయినను ఆ జీవుడు అనంతుడే. వ్యాప్తి గలవాడే.

**శ్లో॥ కదమ్బకుసుమోద్బుద్ధకేసరా ఇవ సర్వతః।
ప్రసృతా హృదయాన్నాడ్యో యాభిర్వ్యాప్తం శరీరకమ్॥ 25**

**ప్రతిపదార్థము:–** కదంబకుసుమ=కడిమపూవునుండి, ఉద్బుద్ధ=నిక్కబొడిచికొన్న, కేసరాః +ఇవ=కింజల్కములవలె, నాడ్యః=నాడులు, హృదయాత్=హృదయమునుండి, సర్వతః =అన్ని వైపుల, ప్రసృతాః=ప్రసరించినవి, యాభిః=వేటితో/వాటితో, శరీరకమ్=శరీరము, వ్యాప్తమ్= వ్యాపింపబడినది.

**తాత్పర్యము:–** కడిమపూవునుండి కేసరములు వ్యాపించినట్లు హృదయమునుండి నాడులు చుట్టూ అన్నివైపుల వ్యాపించినవి. అవి శరీరమంతా వ్యాపించినవి.



**శ్లో॥ హితం ఫలం ప్రయచ్ఛన్తి యస్మాత్తేన హితాః స్మృతాః।
ద్వాసప్తతిసహస్రైస్తాః సంఖ్యాతా యోగవిత్తమైః॥ 26**

**ప్రతిపదార్థము:–** యస్మాత్=ఎందువలన, హితమ్=హితమైన, ఫలమ్=ఫలితమును, ప్రయచ్ఛంతి=ఇచ్చునో, తేన=అందుచేత, హితాః=హితమైనవిగా, స్మృతాః=చెప్పబడినవి, తాః=అవి, యోగవిత్తమైః=యోగులచేత, ద్వాసప్తతిసహస్రైః=72 వేలతో, సంఖ్యాతాః= లెక్కింపబడినవి.

**తాత్పర్యము:–** ఆ నాడులు హితఫలాన్నిస్తాయి గనుక 'హిత నాడులు అందురు' అవి 72 వేలని యోగుల లెక్క.

**శ్లో॥ హృదయాత్తాస్తు నిష్క్రాన్తా యథార్కాద్ రశ్మయస్తథా।
ఏకోత్తరశతం తాసు ముఖ్యా విష్వగ్వినిర్గతాః॥ 27**

**ప్రతిపదార్థము:–** అర్కాత్=సూర్యునినుండి, యథా=ఎలా, రశ్మయః=కిరణములు వెడలునో, తథా=అలా, తాస్తు=ఆ నాడులు, హృదయాత్=హృదయమునుండి, నిష్క్రాంతాః=వెడలినవి, తాసు=వాటిలో, ముఖ్యాః=ముఖ్యమైన, ఏకోత్తరశతమ్=101 నాడులు, విష్వగ్=అన్నివైపుల, వినిర్గతాః=బయలువెడలినవి.

**తాత్పర్యము:–** సూర్యునినుండి కిరణములు వెడలినట్లు ఆ నాడులు హృదయము నుండి చుట్టు వ్యాపించినవి. వానియందు 101 నాడులు ముఖ్యమైనవి. అవి అన్నివైపుల వ్యాపించినవి.

**శ్లో॥ ప్రతీన్ద్రియం దశ దశ నిర్గతా విషయోన్ముఖాః।
నాడ్యః కర్మాదిహేతూత్థాః స్వప్నాదిఫలభుక్తయే॥ 28**

**ప్రతిపదార్థము:–** ప్రతీంద్రియమ్=ప్రతి ఇంద్రియానికి, దశదశ=10–10 చొప్పున, నిర్గతాః =వెడలినవియు, విషయ=విషయములవైపు, ఉన్ముఖాః=అభిముఖమైనవియు, కర్మాది=కర్మ మొదలగు, హేతు=కిరణములతో, ఉత్థాః=లేచినవియు అగు, నాడ్యః=నాడులు, స్వప్నాది= కలమొదలగు, ఫల=ఫలితములయొక్క, భుక్తయే=భోగము కొఱకు, భవంతి=అగును.

**తాత్పర్యము:–** 101 నాడులు ప్రతి ఇంద్రియానికి (కర్మ–జ్ఞాన=10) 10 చొప్పున 10x10గా పంచబడినవి. ఇవి జీవులు విషయాలను అనుభవించటానికి అభిముఖంగా ఉంటాయి. కర్మ మొదలగు రకరకాల హేతువులవలన ఈ నాడులు ప్రవర్తించును. వీనివలన స్వప్నంలోను, జాగరణంలోనూ ఫలితాలు అనుభవానికి వచ్చును.

**శ్లో॥ వహన్త్యమ్భో యథా నద్యో నాడ్యః కర్మఫలం తథా।
అనన్తైకోర్ధ్వగా నాడీ మూర్ధపర్యన్తమఞ్జసా॥ 29**

**శ్లో॥ సుషుమ్నేతి సమాదిష్టా తయా గచ్ఛన్విముచ్యతే।**
**తత్రావస్థితచైతన్యం జీవాత్మానం విదుర్బుధాః॥ 30**

**ప్రతిపదార్థము:–** నద్యః=నదులు, యథా=ఎలా, అంభః=నీటిని, వహంతి=మోయునో, తథా=అలా, నాడ్యః=నాడులు, కర్మఫలమ్=కర్మఫలమును, వహంతి=మోయుచుండునో, అనంతా=అంతములేనిదై, అంజసా=నేరుగా, మూర్ధపర్యంతమ్=మాడుదాకా, ఊర్ధ్వగా=పైకి పోవునదియు, ఏకా=ఒక్కటే అయిన నాడి, సుషుమ్నేతి=సుషుమ్నా అని, సమాదిష్టా=చెప్పబడినది, తయా=ఆనాడిచేత, గచ్ఛన్=పోవు జీవుడు, విముచ్యతే=ముక్తుడగును, తత్ర=ఆనాడియందు, అవస్థిత=ఉన్న, చైతన్యమ్=చైతన్యమును, బుధాః=పండితులు, జీవాత్మానమ్=జీవాత్మనుగా, విదుః=భావింతురు.

**తాత్పర్యము:–** నదులలో నీరు ప్రవహించినట్లు నాడులలో కర్మఫలము ప్రవహించును. అందులో ఒక "నాడి" శరీరమునందు, మిగిలినవాటివలె ఆగకుండా మాడువఱకు ఊర్ధ్వముఖముగా ప్రవహించును. ఆ నాడిని "సుషుమ్న" అందురు. దాని ద్వారా గతించు యోగి ముక్తుడు కాగలడు. అందలి చైతన్యమును "జీవాత్మ" అందురు.

**శ్లో॥ యథా రాహురదృశ్యోఽపి దృశ్యతే చన్ద్రమణ్డలే।**
**తద్వత్సర్వగతోఽప్యాత్మా లిఙ్గదేహే హి దృశ్యతే॥ 31**

**ప్రతిపదార్థము:–**అదృశ్యోఽపి=కనబడనివాడైనను,రాహుః=రాహువు,యథా=ఏ విధముగా, చంద్రమండలే=చంద్రమండలమునందు, దృశ్యతే=గ్రహణ సమయమున (గ్రహణాన్ని బట్టి గ్రాసకర్తగా) కనబడునో, తద్వత్=అట్లే, ఆత్మ=ఆత్మ, సర్వగతోపి=సర్వవ్యాప్తమైనను, లింగదేహే=లింగశరీరమునందు, దృశ్యతే హి=కనబడును గదా!

**తాత్పర్యము:–** రాహుగ్రహం కంటికి కనబడకపోయినా, చంద్రాదిగ్రహణాలలో 'గ్రాస' రూపంగా కనబడినట్లు సర్వవ్యాప్తమైన ఆత్మ లింగదేహము నందున్నట్లు తెలియును.

**శ్లో॥ యథా ఘటే నీయమానే ఘటాకాశోఽపి నీయతే।**
**తద్వత్సర్వగతోఽప్యాత్మా లిఙ్గదేహే వినిర్గతే।**
**నిశ్చలః పరిపూర్ణోఽపి గచ్ఛతీత్యుపచర్యతే॥ 32**

**ప్రతిపదార్థము:–** ఘటే=కుండ, నీయమానే=కొనిపోబడుచుండగా, ఘటాకాశోపి=కుండ లోని ఖాళీ ప్రదేశముగూడా, యథా=ఎలా, నీయతే=తీసికొనిపోబడుచున్నదో, తద్వత్=అట్లే, సర్వగతోపి=సర్వగతమైనను, ఆత్మ=ఆత్మ, లింగదేహే=లింగదేహము, వినిర్గతే=బయటకు పోగా, నిశ్చలః=అచలము, పరిపూర్ణోఽపి=పూర్ణమయినది ఐనప్పటికి, "గచ్ఛతి" పోవుచున్నది, ఇతి=అని, ఉపచర్యతే=ఆరోపింపబడుచున్నది.



**తాత్పర్యము:–** కుండతోబాటు కుండలోని 'ఖాళీ' గూడా మనతో వస్తున్నట్లు అనిపిస్తుంది. కాని అది కుండయందు వ్యాపించిన ఆకాశమేతప్ప వేరుకాదు. అట్లే సర్వవ్యాప్తము, పూర్ణము, అచంచలము అయిన ఆత్మ లింగశరీరమునందున్ను వ్యాపించియున్నది. కాని లింగశరీరముపోగా ఆత్మ పోయినట్లు భ్రాంతిగా భావింపబడుచున్నది. అలా లింగశరీరమునం దాత్మ ఉన్నదంటున్నాము.

**శ్లో॥ జాగ్రత్కాలే యథా జ్ఞేయమభివ్యక్తవిశేషధీః।**
**వ్యాప్నోతి నిష్క్రియః సర్వాన్ భానుర్దశ దిశో యథా॥ 33**

**ప్రతిపదార్థము:–** భానుః=సూర్యుడు, యథా=ఏ విధముగా జాగ్రత్కాలే=మెలకువ కాలమున దశ=పది, దిశః=దిక్కులను, వ్యాపించునో, అలాగున, జాగ్రత్కాలే=మెలకువకాలములో, యథా జ్ఞేయమ్=జ్ఞేయములనుబట్టి, అభివ్యక్త=స్పష్టమైన, విశేష=విశేషమైన, ధీః=బుద్ధిగల వాడై, నిష్క్రియః=క్రియారహితుడై అనగా సాక్షిగా, సర్వాన్=అన్ని విషయములను, వ్యాప్నోతి =వ్యాపించును.

**తాత్పర్యము:–** ప్రాతఃకాలమున సూర్యు డుదయించి తానుగా ఎట్టి పనిచేయకుండగనే పది దిక్కులందు వ్యాపించును. అట్లే జీవుడున్ను తానుగా ఏ పనిచేయడు. అయినా మెలకువ కాలములో జ్ఞేయపదార్థమును బట్టి కావలసిన విశేషబుద్ధిగలవాడై (చెవికి వినే బుద్ధి, కంటికి చూచే బుద్ధి, కాలికి నడిచే బుద్ధి) దశేంద్రియములందు, వాటి విషయము లందు వ్యాపించును. అయినా జీవుడు తటస్థుడే. సక్రియంగా ఉండేవి అంతఃకరణము శరీరము మాత్రమే. అట్లే సూర్యుడుదయించితే చీకటి అదే పోతుంది. మన బుద్ధులు ప్రకృతి స్వయంగా వికసిస్తాయి. అదంతా సూర్యుడు చేయడు. దీపం వెలుగుతుంది. మనం వెలుగులో చదువుకొంటాము. దీపం మన చదువుకు సాక్షి మాత్రమే. కర్త కారయిత మొదలగు లక్షణాలు దానికి లేవు. కాగా జీవుడు తటస్థుడు. సూర్యునివలె, దీపమువలె. అతని సన్నిధానమువలన మనలో 'బుద్ధులు' ఉదయించును.

**శ్లో॥ నాడీభిర్వృత్తయో యాన్తి లిఙ్గదేహసముద్భవాః।**
**తత్తత్కర్మానుసారేణ జాగ్రద్భోగోపలబ్ధయే॥ 34**

**ప్రతిపదార్థము:–** తత్తత్=వారివారి, కర్మానుసారేణ=కర్మలను అనుసరించి, జాగ్రత్=జాగరణ దశలో, భోగ=కర్మఫలభోగముయొక్క, ఉపలబ్ధయే=ప్రాప్తికొఱకు, వృత్తయః=వృత్తులు (ఫంక్షన్స్), లింగదేహ=లింగశరీరమునుండి, సముద్భవాః=ఉద్భవించినవై, నాడీభిః=నాడుల చేత, యాంతి=నడచును.

**తాత్పర్యము:–** జీవులయొక్క కర్మలను అనుసరించి జాగరణకాలములో కర్మఫలానుభవం ఇవ్వటానికి మానసిక ప్రవృత్తులు లింగదేహమున పుట్టి నాడుల ద్వారా ఇంద్రియములకు చేరును.

**శ్లో॥ ఇదం లిఙ్గశరీరాఖ్యమామోక్షాన్న నివర్తతే।**
**ఆత్మజ్ఞానేన నష్టేఽస్మిన్ సావిద్యే సశరీరకే।**
**ఆత్మస్వరూపావస్థానం ముక్తిరిత్యభిధీయతే॥ 35**

**ప్రతిపదార్థము:–** ఇదమ్=ఈ, లింగశరీరాఖ్యమ్=లింగశరీరమనునది, ఆమోక్షాత్=జ్ఞాన పూర్వకముక్తివచ్చుదాక, న నివర్తతే=మరలదు, ఆత్మజ్ఞానేన=ఆత్మస్వరూపజ్ఞానముచేత, అస్మిన్=ఈ లింగశరీరము, సావిద్యే=అవిద్యాసహితముగా, సశరీరకే=ఇంద్రియాది శరీర సహితముగా, నష్టే=నశించగా, ఆత్మ=ఆత్మయొక్క, స్వ=అసలుదైన, రూప=రూపమునందు, అవస్థానమ్=నిలిచియుండుట, ముక్తిరితి=ముక్తి అని, అభిధీయతే=చెప్పబడును.

**తాత్పర్యము:–** ఈ లింగశరీరమనునది ఇంద్రియాలు, ప్రాణాలు, అంతఃకరణములతో ఏర్పడియున్నది. దీనియందు జీవుడుంటాడు. లింగశరీరము స్థూల శరీరం లాగా మాటికి నష్టంకాదు. ఇది నష్టం అయ్యేది ఒక్కసారే. అదీ జ్ఞానం వలన, ఇది నష్టమయితే మోక్షమే. దీనియందు చేరిన అవిద్య, ఈ శరీరమున్ను జ్ఞానంతో నశిస్తే ఇక మిగిలేది అందలి జీవుడు మాత్రమే. అదే స్వరూపజ్ఞానము. అదే మోక్షము.

**శ్లో॥ ఉత్పాదితే ఘటే యద్వద్ఘటాకాశత్వమృచ్ఛతి।**
**ఘటే నష్టే యథాకాశః స్వరూపేణాఽవతిష్ఠతే॥ 36**

**ప్రతిపదార్థము:–** ఉత్పాదితే=పుట్టింపబడిన, ఘటే=కుండయందలి, ఆకాశః=ఆకాశము (ఖాళీ), యద్వత్=ఎలా, ఘటాకాశత్వమ్=ఘటాకాశము అను పేరును, ఋచ్ఛతి=పొందునో, ఘటే=ఘటము,నష్టే=నష్టముకాగా,ఆకాశః=ఆకాశము(ఖాళీ),స్వరూపేణ=సాధారణాకాశము గానే, అవతిష్ఠతే=మిగిలియుండునో, అలా లింగశరీరభంగం తర్వాత ఆత్మ తన స్వరూపంతో నిలిచియుండును.

**తాత్పర్యము:–** లింగశరీరం ఏర్పడినపుడు అది సర్వవ్యాపి అయిన ఆత్మకు ఆవరణగా ఉంటుంది (కనబడుతుంది). లింగశరీరం జ్ఞానంవలన నష్టం అయితే 'ఆత్మ' మామూలుగా సర్వవ్యాపిగా కనబడును. ఎలాగ అంటే కుండ తయారైనచో ఆ కుండ ఆకాశమునకు కొంత ఆవరణ ఏర్పరచును. అందువల కుండలో 'ఆకాశం' చేరియున్నట్లు మనం భావిస్తాం. కాని కుండ పగిలితే అక్కడ మిగిలే ఆకాశం మామూలు ఆకాశంలాగానే అయిపోతుంది. అదే ముక్తిలో జీవునిస్థితి.



**శ్లో॥ జాగ్రత్కర్మక్షయవశాత్ స్వప్నభోగ ఉపస్థితే।**
**బోధావస్థాం తిరోధాయ దేహాద్యాశ్రయలక్షణామ్॥ 37**

**శ్లో॥ కర్మోద్భావితసంస్కారస్తత్ర స్వప్నరిరంసయా।**
**అవస్థాం చ ప్రయాత్యన్యాం మాయావీ వాత్మమాయయా॥ 38**

**ప్రతిపదార్థము:–** జాగ్రత్=జాగరణ సంబంధమైన, కర్మ=కర్మఫలముయొక్క, క్షయవశాత్= తరుగుదలవలన, స్వప్న=స్వప్నసంబంధమైన, భోగే=భోగము, ఉపస్థితే=సమీపింపగా, దేహాది=దేహము మొదలగు, ఆశ్రయ=ఆశ్రయముగా ఉండే, లక్షణామ్=లక్షణముగల, బోధావస్థామ్=జ్ఞానదశను, తిరోధాయ=తిరస్కరించి, కర్మ=పూర్వకర్మలచేత, ఉద్భావిత= పుట్టింపబడిన, సంస్కారః=కర్మఫలముగలవాడై, తత్ర=ఆ దశలో, స్వప్న=నిద్ర/కలయొక్క, రిరంసయా=క్రీడావాంఛతో, మాయావీ=మాయికుడు / గారడీవాడు, ఆత్మ=తనయొక్క, మాయయా=మాయచేత, అన్యామ్=మఱొక, అవస్థామ్=దశను (నిద్రను) ప్రయాతి చ= పొందును.

**తాత్పర్యము:–** ప్రారబ్ధము రెండు విధములు 1) జాగరణలో అనుభవించేది, 2) స్వప్నంలో అనుభవించేది. అందు జాగరణంలో అనుభవించే ప్రారబ్ధం వరస అయిపోగానే స్వప్నంలో అనుభవించే దశవస్తుంది. అందువలన జీవుడు జ్ఞానదశనుంచి స్వప్న క్రీడాదశకు వెళ్తాడు. గారడీవాడు ఒక విషయము (ఐటమ్) పూర్తి అయిన పిదప రెండవ విషయమునకు వెళ్ళినట్లు జీవుడు స్వప్నదశానుభవానికి సిద్ధపడతాడు.

**శ్లో॥ ఘటాదివిషయాన్సర్వాన్ బుద్ధ్యాదికరణాని చ।**
**భూతాని కర్మవశతో వాసనామాత్రసంస్థితాన్।**
**ఏతాన్పశ్యన్స్వయం జ్యోతిః సాక్ష్యాత్మా వ్యవతిష్ఠతే॥ 39**

**ప్రతిపదార్థము:–** కర్మవశతః=ప్రారబ్ధవశమువలన, వాసనామాత్ర=కేవల సంస్కార రూపంగా ఉన్న, ఏతాన్=ఈ, సర్వాన్=సమస్తమైన, ఘటాది=ఘటము మొదలైన, విషయాన్ =విషయములను,బుద్ధ్యాది=బుద్ధి మొదలైన, కరణాని చ=సాధనములను, భూతాని=పంచ తన్మాత్రలను, పశ్యన్=చూచుచు, ఆత్మా=ఆత్మ, స్వయమ్=స్వయముగా, జ్యోతిః=వెలుగుగా అయి, సాక్షీ=సాక్షిగా, వ్యవతిష్ఠతే=విడిగా ఉండును (ప్రత్యగాత్మ).

**తాత్పర్యము:–** ఈ స్వప్నదశలో బుద్ధి మొదలగు సాధనాలు, ఘటాది పదార్థాలు భౌతికంగా ఉండవు. కర్మ వశమున మనస్సులో వాసనారూపంగా ఉంటాయి. కాని మనస్సు పనిచేయదు. వీటిని అన్నింటిని సాక్షిగా చూస్తూ ఆత్మయే స్వయంజ్యోతిగా అతీతంగా మిగిలి ఉంటుంది.

శ్లో॥ అత్రాన్తఃకరణాదీనాం వాసనాద్వాసనాత్మతా।
వాసనామాత్రసాక్షిత్వం తేన తత్ర పరాత్మనః॥ 40

**ప్రతిపదార్థము:–** అత్ర=ఈ స్వప్నదశలో, అంతఃకరణాదీనామ్=అంతఃకరణము మొదలగు వానియొక్క, వాసనాత్=సూక్ష్మనివాసమువలన, వాసనాత్మతా=సంస్కారరూపతవచ్చింది, తేన=అందుచేత, తత్ర=ఆస్వప్నదశలో, పరాత్మనః=పరమాత్మకు, వాసనామాత్ర=విషయ వాసనా మాత్రమునకు, సాక్షిత్వమ్=సాక్షిగా ఉండటం వచ్చింది.

**తాత్పర్యము:–** స్వప్నదశలో అంతఃకరణాదులు సూక్ష్మరూపంగా ఉండును. ఒక 'వాసన' లాగా ఉండును. పదార్థము లేకున్ననూ దానివాసన ఉన్నట్లు అత్యంత సూక్ష్మంగా క్రియారహితమై ఉండును. ఈ వాసనలకే పరమాత్మ సాక్షి. ఆ దృశ్యములకు ఆయనయే దీపము.

శ్లో॥ వాసనాభిః ప్రపఞ్చోऽత్ర దృశ్యతే కర్మచోదితః।
జాగ్రద్భూమౌ యథా తద్వత్ కర్తృకర్మక్రియాత్మకః॥ 41

**ప్రతిపదార్థము:–** అత్ర=ఈ స్వప్నదశయందు, కర్మ=ప్రారబ్ధముచేత, చోదితః=ప్రేరేపింప బడిన, కర్తకర్మక్రియాత్మకః=కర్తృ, కర్మ, క్రియాస్వరూపమైన, ప్రపంచః=ప్రపంచము, జాగ్రద్భూమౌ యథాతద్వత్=జాగరణదశయందు లాగునే, వాసనాభిః=వాసనలచేత, దృశ్యతే =కనబడును.

**తాత్పర్యము:–** ఈ దశలో వాసనారూప ప్రపంచము కనబడును. అది ప్రారబ్ధమూలకము. అపుడనుభవించవలసిన సుఖదుఃఖాలు ప్రాప్తిస్తాయి. జాగరణదశలో లాగానే అందులోనూ కర్త, కర్మ, క్రియ అన్ని కనిపిస్తాయి.

శ్లో॥ నిశ్శేషబుద్ధిసాక్ష్యాత్మా స్వయమేవ ప్రకాశతే।
వాసనామాత్రసాక్షిత్వం సాక్షిణః స్వాప ఉచ్యతే॥ 42

**ప్రతిపదార్థము:–** నిశ్శేష=అన్నిరకాల, బుద్ధి=బుద్ధులకు, సాక్షీ=సాక్షిఅయిన, ఆత్మ=ఆత్మ, స్వయమేవ=స్వయముగానే, ప్రకాశతే=ప్రకాశించును, సాక్షిణః=సాక్షికి, వాసనామాత్ర= వాసనలకు మాత్రమే, సాక్షిత్వమ్=సాక్షియగుదశ, స్వాపః=నిద్ర అని, ఉచ్యతే=చెప్పబడు చున్నది.

**తాత్పర్యము:–** సకల బుద్ధులకు ఆత్మ సాక్షి. అది స్వయం జ్యోతి. దానికి ఇతర ప్రకాశము అవసరం లేదు. కాని ప్రపంచానికి 'ఆత్మ' అవసరం. స్వప్నంలో వాసనా ప్రపంచానికి ఆత్మ సాక్షి. ఆ స్థితినే 'స్వప్నం, స్వాపం, నిద్ర' అంటాము.



శ్లో॥ భూతజన్మని యద్భూతం కర్మతద్వాసనావశాత్।
నేదీయస్త్వాద్వయస్యాద్యే స్వప్నం ప్రాయః ప్రపశ్యతి॥ 43

**ప్రతిపదార్థము:–** భూత=గడచిన, జన్మని=జన్మయందు, యత్=ఏ, కర్మ=ప్రారబ్ధము, భూతమ్=జరిగినదో, తత్=దానిని, వాసనావశాత్=ఆ సంస్కారము వశమున, నేదీయస్త్వాత్ =దగ్గరిదగుటవలన, ఆద్యే=తొలి, వయసి=వయస్సులో, ప్రాయః=బహుశః, స్వప్నమ్= కలగా, ప్రపశ్యతి=చూచును.

**తాత్పర్యము:–** గడచిన జన్మలోని అనుభవం వాసనగా లింగశరీరాన్ని బట్టి ఉంటుంది. అది దగ్గరగా ఉండటంవలన తొలివయసులో 'కల' గా అనుభవంలోకి వస్తుంది.

శ్లో॥ మధ్యే వయసి కార్కశ్యాత్ కరణానామిహార్జితాత్।
వీక్షతే ప్రాయశః స్వప్నం వాసనాకర్మణోర్వశాత్॥ 44

**ప్రతిపదార్థము:–** మధ్యే=మధ్యదైన, వయసి=యౌవనమునందు, కరణానామ్=సాధనము లైన, ఇంద్రియాదులయొక్క, కార్కశ్యాత్=కాఠిన్యమువలన, ఇహ=ఈ జన్మలో, ఆర్జితాత్= సంపాదింపబడిన దానినుండి, వాసనా=వాసనయొక్క, కర్మణోః=కర్మలయొక్క, వశాత్= వశము వలన (వాసనాబలమువలన), ప్రాయశః=బహుశః=, స్వప్నమ్=కలను, వీక్షతే= చూచును.

**తాత్పర్యము:–** మధ్యవయస్సులో ఇంద్రియాలు కఠినం అవుతాయి. పూర్వజన్మవాసనలను గ్రహించే మృదుత్వం ఉండదు. అప్పటి జన్మలో ఆర్జించిన చరిత్రనుండి / అనుభవం నుండి స్వప్నాలు వస్తాయి. దానికైనా కారణం, వాసన, ప్రారబ్ధము అనే చెప్పాలి.

శ్లో॥ యియాసుః పరలోకం తు కర్మవిద్యాదిసంభృతమ్।
భావినో జన్మనో రూపం స్వప్న ఆత్మా ప్రపశ్యతి॥ 45

**ప్రతిపదార్థము:–** ఆత్మా=జీవుడు, కర్మ=కర్మలచేత, విద్య=విద్యల (మంత్రాదుల)చేత, ఆది సంభృతమ్=మొదలగువానిచేత సంపాదింపబడిన,పరలోకమ్=పరలోకమును, యియాసుస్తు =పోదలచినవాడైతే, భావినః=రాబోవు, జన్మనః=జన్మకు సంబంధించిన, రూపమ్= రూపమును, స్వప్నే= స్వప్నమున, ప్రపశ్యతి=చూచును.

**తాత్పర్యము:–** పరలోక గమనందగ్గరపడినపుడు అనగా మలివయసులో ఆ జన్మలో చేసిన కర్మ, ఉపాసనాదులవలన రాబోవు లోకమునకు సంబంధించిన జన్మ, అప్పటి రూపము – వీటిని జీవుడు కలలో చూచును.

శ్లో॥ యద్వత్ప్రపతనాచ్ఛ్యేనః శ్రాన్తో గగనమణ్డలే।
ఆకుంచ్య పక్షౌ యతతే నీడే నిలయనాయనీః॥ 46

**ప్రతిపదార్థము:–** గగనమండలే =ఆకాశమండలమునందు, ప్రపతనాత్=బాగా ఎగురుట వలన, శ్రాంతః=అలసిన, శ్యేనః=డేగ, పక్షౌ=రెక్కలను, ఆకుంచ్య=ముడిచి, నీడ=గూటి యందు, నిలయనాయనీః=ఒదుగుటను కోరినదై, యద్వత్=ఎలా, యతతే=ప్రయత్నించునో అలా (తదుపరి శ్లోకముతో అన్వయము).

**తాత్పర్యము:–** ఆకాశంలో చాలాసేపు ఎగిరిన డేగ శ్రమతో అలసి తన గూటిలోకి చేరటానికి ఎలా రెక్కలను ముడిచి ప్రయత్నిస్తుందో అలా –

**శ్లో॥ ఏవం జాగ్రత్స్వప్నభూమౌ శ్రాన్త ఆత్మాభిసఞ్చరన్।**
**అపీతకరణగ్రామః కారణేనైతి చైకతామ్॥ 47**

**ప్రతిపదార్థము:–** ఏవమ్=ఈ దేగలాగానే, జాగ్రత్=జాగరణ, స్వప్న=నిద్రలయొక్క, భూమౌ= దేశమందు, అభిసంచరన్=సంచరించుచు, శ్రాంతః=అలసిన, ఆత్మా=ఆత్మ, అపీత=లయ మైన, కరణ=సాధనములైన ఇంద్రియాదులయొక్క, గ్రామః=సమూహముగలవాడై, కారణేన చ=కారణశరీరముతో లేదా కారణమైన, పరమాత్మతో, ఏకతామ్=ఐక్యమును, ఏతి= పొందును.

**తాత్పర్యము:–** ఈ విధముగా అనగా దేగలాగానే జాగరణ స్వప్నదశలలో సంచరించి అలసిపోయిన ఆత్మ తన సాధనములను లయం చేసికొని కారణశరీరంతో లేదా పరమాత్మతో ఐక్యము చెందును.

**శ్లో॥ నాడీమార్గైరిన్ద్రియాణామాకృష్యాదాయ వాసనాః।**
**సర్వం గ్రసిత్వా కార్యం చ విజ్ఞానాత్మా ప్రలీయతే॥ 48**

**ప్రతిపదార్థము:–** ఇంద్రియాణామ్=ఇంద్రియములయొక్క, వాసనాః=వాసనలను, నాడీ మార్గైః=నాడీ మార్గములచేత, ఆకృష్య=లాగి, ఆదాయ=గ్రహించి, సర్వమ్=సమస్తమైన, కార్యం చ=కార్యమైన ప్రపంచ వ్యవహారమును, గ్రసిత్వా=మ్రింగి, విజ్ఞానాత్మా=విజ్ఞానకోశవు ఆత్మ, ప్రలీయతే=లీనమగును.

**తాత్పర్యము:–** ఆత్మ క్రమముగా నాడీమార్గముల ద్వారా ఇంద్రియాలను ఆకర్షించి లోపలికి ముడుచుకొని, సమస్త ప్రపంచవ్యవహారములను మ్రింగి లీనమగును. (తర్వాత శ్లోకంతో అన్వయము) –

**శ్లో॥ ఈశ్వరాఖ్యేఽవ్యాకృతేఽథ యథా సుఖమయో భవేత్।**
**కృత్స్నప్రపఞ్చవిలయస్తథా భవతి చాత్మనః॥ 49**

**ప్రతిపదార్థము:–** ఈశ్వరాఖ్యే=ఈశ్వరుడను పేరుగల, అవ్యాకృతే=అవ్యాకృతుడైన, (అనగా



ప్రపంచంగా మారని) బ్రహ్మమునందు చేరి, యథా=ఏ విధముగా, సుఖమయః=సుఖమయ మైనవాడు, భవేత్=అగునో, తథా=అలా, ఆత్మనః=ఆత్మకు, కృత్స్న=సమస్తమైన, ప్రపంచ= ప్రపంచముయొక్క, విలయః=లయము, భవతి చ=అగును.

**తాత్పర్యము:–** విజ్ఞానాత్మ అవ్యాకృతాత్మ అయిన ఈశ్వరునియందు లీనమగును. అపుడు జీవుడు సుఖమయుడగును. అంతటితో ఆత్మకు సర్వప్రపంచవ్యవహారము అస్తమించును. అదే 'సుఖం'. అదే 'ఆనందము'.

**శ్లో॥ యోషితః కామ్యమానాయాః సంభోగాన్తే యథాసుఖమ్।**
**స ఆనన్దమయో బాహ్యో నాన్తరః కేవలస్తథా॥ 50**

**ప్రతిపదార్థము:–** కామ్యమానాయాః=కోరబడుచున్న, యోషితః=స్త్రీయొక్క, సంభోగ= కలయిక యొక్క, అంతే=చివఱ, యథా=ఎలా, సుఖమ్=సుఖం కలుగునో, అలా సుఖం కలుగును. ఆనందమయః=సుఖమయుడైన, సః=ఆ ఆత్మ, బాహ్యః=బయటి జ్ఞానం కలవాడు, న=కాదు, అంతరః=లోపలి జ్ఞానం కలవాడు, న=కాదు, తదా=అప్పుడు, కేవలః=కేవలము సుఖమాత్రుడే అగును.

**తాత్పర్యము:–** తను కోరుకున్న స్త్రీతో సంభోగం తరువాత సుఖపరవశుడైన వ్యక్తి ఎలా బాహ్యపరిజ్ఞానము, అంతరంగ పరిజ్ఞానము లేకుండా – అనగా ఒళ్ళు మఱచి, సుఖమాత్రుడై ఉంటాడో, అదేవిధంగా నిద్రాపరవశుడైన 'ఆత్మ' / జీవుడు, సర్వ ప్రపంచ విలయంతర్వాత ఈశ్వరాభిన్నుడై బాహ్యాంతర పరిజ్ఞాన శూన్యుడగును. కేవలం ఆనంద రూపుడుగా మిగులును. (ఈ ఉపమానం వేదోక్తం కనుక తప్పు కాదు.)

**శ్లో॥ ప్రాజ్ఞాత్మానం సమాసాద్య విజ్ఞానాత్మా తథైవ సః।**
**విజ్ఞానాత్మా కారణాత్మా తథా తిష్ఠన్నథాఽపి సః॥ 51**

**శ్లో॥ అవిద్యాసూక్ష్మవృత్త్యానుభవత్యేవ సుఖం యథా।**
**అజ్ఞానమపి సాక్ష్యాదివృత్తిభిశ్చానుభూయతే॥ 52**

**ప్రతిపదార్థము:–** అవిద్యా=అవిద్యయొక్క, సూక్ష్మవృత్త్యా=సూక్ష్మవృత్తితో, యథా=ఎలా, సుఖమ్=సుఖము, అనుభవత్యేవ=అనుభవించునో, తథా=అట్లే, అజ్ఞానమపి=అజ్ఞానము గూడా, సాక్ష్యాది=సాక్షి మొదలగు, వృత్తిభిశ్చ=వృత్తులచేతను, అనుభూయతే=అనుభవింప బడుచున్నది.

**తాత్పర్యము:–** సుషుప్తిలో మనస్సు పనిచేయదు. కాని 'సుఖం' అనుభవానికి వస్తుంది. ఈ సుఖం మనలోని 'అవిద్య' వలన తెలుస్తుంది. తెలిసికొనటం అనే క్రియ అవిద్యయొక్క

వృత్తి. అట్లే అజ్ఞానము అనగా ఒళ్ళెరగనితనం, ఇతర ప్రపంచవ్యవహారం ఏమీ తెలియక పోవటం గూడా సాక్షివలన అవిద్యావృత్తివలన అనుభవానికి వస్తుంది.

**శ్లో॥ తథాహం సుఖమస్వాప్సం నైవ కిఞ్చిదవేదిషమ్।**
**ఇత్యేవం ప్రత్యభిజ్ఞాపి పశ్చాత్ తస్యోపపద్యతే॥ 53**

**ప్రతిపదార్థము:–** తథా=అలానే, అహమ్=నేను, సుఖమ్=సుఖముగా, అస్వాప్సమ్= పరుంటిని, కించిత్=కొంచెమైనను, నైవ అవేదిషమ్=ఎఱుగకపోతిని, ఇతి=అని, ఏవమ్= ఈ విధముగా, ప్రత్యభిజ్ఞాపి=గుర్తింపున్ను, పశ్చాత్=నిద్రలేచిన తర్వాత, తస్య=అతనికి, ఉపపద్యతే=కుదురును.

**తాత్పర్యము:–** అందువలననే నిద్రలేచిన తర్వాత "నేను సుఖంగా నిద్రించితిని" అని నిద్రాసుఖానుభవము, నాకు ఒళ్ళు తెలియలేదు" అని అజ్ఞానానుభవము సరిపోతాయి. లేకపోతే మనస్సు పనిచేయనపుడు అనుభవాలు రావు గదా! కనుక సాక్షి, అవిద్యావృత్తి – ఉన్నవి. అప్పుడే నిద్రలేచినవాని అనుభవం కుదురుతుంది.

**శ్లో॥ జాగ్రత్స్వప్నసుషుప్త్యాఖ్యమేవేహాముత్ర లోకయోః।**
**పశ్చాత్కర్మవశాదేవ విస్ఫులిఙ్గా యథానలాత్।**
**జాయన్తే కారణాదేవ మనోబుద్ధ్యాదికాని తు॥ 54**

**ప్రతిపదార్థము:–** ఇహ=ఈలోకము, అముత్ర=పరలోకము, లోకయోః=లోకసంధి – వీటికి, జాగ్రత్=జాగరణమని, స్వప్న=స్వప్నమని, సుషుప్తి=సుషుప్తి అని, ఆఖ్యమ్=పేరుగలదు. పశ్చాత్=నిద్రానంతరము,కర్మవశాదేవ=కర్మవలన,అనలాత్=అగ్నినుంచి, విస్ఫులింగాః+ యథా =రవ్వలవలె, కారణాదేవ=కారణ శరీరమునుండియే/ ప్రాజ్ఞునినుండియే, మనః =మనస్సు, బుద్ధి=బుద్ధి, ఆదికాని తు=మొదలైనవి, జాయంతే=పుట్టుచున్నవి.

**తాత్పర్యము:–** జాగరణమును భూలోకంగాను, కలలను లోకసంధిగాను, సుషుప్తిని పరలోకంగాను – సంప్రదాయం చెబుతుంది. నిద్రానంతరము జాగరణ ప్రారబ్ధం తన పని మొదలు పెడుతుంది. ఆ ప్రారబ్ధంవలన నిప్పునుండి రవ్వలు వెలువడినట్లు, కారణ శరీరము నుండియే మనస్సు, బుద్ధి మొదలైనవి వచ్చును.

**శ్లో॥ పయః పూర్ణో ఘటో యద్వన్ నిమగ్నః సలిలాశయే।**
**తైరేవోద్ధృత ఆయాతి విజ్ఞానాత్మా తథైత్యజాత్॥ 55**

**ప్రతిపదార్థము:–** పయః=నీటిచేత, పూర్ణః=నిండిన, ఘటః=కుండ, సలిలాశయే=చెఱువు నందు, నిమగ్నః=మునిగినదై, యద్వత్=ఎలా, తైరేవ=ఆ నీటిచేతనే, ఉద్ధృతః=ఎత్తబడినదై, ఆయాతి=వచ్చునో, తథా=అట్లే, విజ్ఞానాత్మా=విజ్ఞానాత్మ, అజాత్=పరమాత్మనుండి, ఏతి=వచ్చును.



**తాత్పర్యము:–** నీళ్ళతో నిండిన కుండ మఱల ఆ నీటివలననే పైకి తేలినట్లు, కారణములో మునిగిన ఆత్మ కారణమునుండియే / పరమాత్మనుండియే, మఱల జాగరణపొందును. తద్ద్వారా విజ్ఞానాత్మ అతనితోపాటు బుద్ధిమయకోశమున్ను వచ్చును.

**శ్లో॥ విజ్ఞానాత్మా కారణాత్మా తథా తిష్ఠంస్తథాపి సః।**
**దృశ్యతే సత్సు తేష్వేవ నష్టేష్వాయాత్యదృశ్యతామ్॥ 56**

**ప్రతిపదార్థము:–** విజ్ఞానాత్మా=ఈ బుద్ధిమయకోశగతుడైన, ఆత్మయే, కారణాత్మా= కారణాత్మ, తథా=అట్లే, తిష్ఠన్ తథాపి=ఉన్నప్పటికీ, సః=ఆ కారణాత్మ, తేషు=ఆ అంతః కరణాదులు, సత్సు+ఏవ=ఉండగనే, దృశ్యతే=కనబడును, నష్టేషు=అంతఃకరణాదులు లీనమైనపుడు, విజ్ఞానాత్మ, అదృశ్యతామ్=అదర్శనమును, ఆయాతి=పొందును.

**తాత్పర్యము:–** విజ్ఞానాత్మయే కారణాత్మ. ఈ విజ్ఞానాత్మ అంతఃకరణాదులు పనిచేయునపుడు అనుభవానికి వస్తాడు అవి అదృశ్యమైనపుడు (సుషుప్తి) ఈయన అదృశ్యమై కారణాత్మగా నిలిచిపోతాడు.

**శ్లో॥ ఏకాకారోఽర్యమా తత్తత్కార్యేష్వివ పరః పుమాన్।**
**కూటస్థో దృశ్యతే తద్వద్గచ్ఛత్యాగచ్ఛతీవ సః॥ 57**

**ప్రతిపదార్థము:–** ఏకాకారః=ఒక్కడే అయిన, అర్యమా=సూర్యుడు, తత్తత్=ఆయా, కార్యేష్వివ =కార్యములందువలె,పరః పుమాన్=పరమాత్మ,కూటస్థః=అతీతుడుగా, దృశ్యతే=కనబడును, సః=పరమాత్మ, తద్వత్=ఆ కార్యములందున్న సూర్యునివలె, గచ్ఛతీవ=కదలునట్లుండును, ఆగచ్ఛతీవ=వచ్చునట్లుండును.

**తాత్పర్యము:–** సూర్యుడొక్కడే. కాని అనేక జలాశయములందు ప్రతిబింబించి, అనేకంగా కనబడతాడు. నీళ్ళనుబట్టి కదలినట్లు, మలినంగా ఉన్నట్లు కనబడతాడు. అలానే సర్వవ్యాపి అయిన "ఆత్మ" ఒక్కటే. అది అనేక శరీరాలయందు ప్రతిబింబించినట్లు కనబడును. శరీరాలనుబట్టి అది వస్తున్నట్లు, పోతున్నట్లు, పుడుతున్నట్లు, చస్తున్నట్లు కనబడును. అంతా భ్రాంతి.

**శ్లో॥ మోహమాత్రాన్తరాయత్వాత్ సర్వం తస్యోపపద్యతే।**
**దేహాద్యతీత ఆత్మాపి స్వయం జ్యోతిః స్వభావతః।**
**ఏవం జీవస్వరూపం తే ప్రోక్తం దశరథాత్మజ॥ 58**

**ప్రతిపదార్థము:-** మోహమాత్ర=అజ్ఞానము మాత్రమే, అంతరాయత్వాత్=అడ్డం కలవాడగుటవలన, తస్య=ఆత్మకు, సర్వమ్=అంతా, ఉపపద్యతే=కుదురును, దేహాది=దేహం ఇంద్రియాలు మొదలైనవానికన్న, అతీతః=దాటి ఉన్న, ఆత్మాపి=ఆత్మయును, స్వభావతః =స్వభావరీత్యా, స్వయమ్=స్వయముగా వెలుగునట్టి, జ్యోతిః=వెలుగు, దశరథాత్మజ!= దాశరథీ!, తే=నీకు, ఏవమ్=ఈవిధముగా, జీవ=జీవునియొక్క, స్వరూపమ్=స్వరూపము, ప్రోక్తమ్=చెప్పబడినది.

**తాత్పర్యము:-** అజ్ఞానం అడ్డం ఉండటంవలన ఆత్మవిషయంలో అన్నీ చెల్లుతాయి. దేహాదికమునకు అతీతంగా ఉన్న ఆత్మ స్వయంజ్యోతి. పరంజ్యోతి. దాశరథీ! ఈవిధంగా నీకు జీవస్వరూపం వివరించాను.

**ఇతి శ్రీ పద్మపురాణే ఉపరిభాగే శివగీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీ శివరాఘవసంవాదే జీవస్వరూపవర్ణనం నామ దశమోఽధ్యాయః॥**

* * * * *



## అథ ఏకాదశోఽధ్యాయః
# జీవగతి నిరూపణ యోగః

**శ్రీ శివ ఉవాచ**

**శ్లో॥ దేహాన్తరగతిం తస్య పరలోకగతిం తథా।**
**వక్ష్యామి నృపశార్దూల! మత్తః శృణు సమాహితః॥ 1**

**ప్రతిపదార్థము:-** తస్య=ఆ జీవునియొక్క, దేహాంతర=ఇతర దేహముయొక్క, గతిమ్= పొందుటను, తథా=అట్లే, పరలోక=పరలోకముయొక్క, గతిమ్=పొందుటను గూర్చి, వక్ష్యామి=చెప్పగలను, నృపశార్దూల!=రాజశ్రేష్ఠా!, సమాహితః=సావధానుడవై, మత్తః=నా నుంచి, శృణు=వినుము.

**తాత్పర్యము:-** రాజసింహా! రామా! జీవుని పరలోకగతిని, దేహాంతరప్రాప్తిని గూర్చి చెప్పెదను వినుము.

**శ్లో॥ భుక్తం పీతం యదస్త్యత్ర తద్రసాదామబన్ధనమ్।**
**స్థూలదేహస్య లిఙ్గస్య తేనైవ జీవధారణమ్॥ 2**

**ప్రతిపదార్థము:-** అత్ర=ఈలోకమున, భుక్తమ్=తినబడినది, పీతమ్=త్రాగబడినది, యదస్తి= ఏది గలదో, తత్=దానియొక్క, రసాత్=రసమువలన, స్థూలదేహస్య=స్థూలదేహమునకు, లింగస్య=లింగశరీరమునకు మధ్య, ఆమ=జిగురుసంబంధమైన, బంధనమ్=లంకె ఏర్పడును. తేనైవ=ఆ లంకెతోనే, జీవ=జీవునియొక్క, ధారణమ్=నిలిపి ఉంచుట జరుగును.

**తాత్పర్యము:-** మన ఆహారమువలన మనస్సు మొదలైనవి త్రాగటంవలన ప్రాణము, మనః ప్రాణమువలన స్థూలశరీరయాత్ర – ఇలా ఈ రెండింటి మధ్య ఉన్న లంకెవలన దేహంలో జీవుడు నిలిచి ఉన్నాడు.

**శ్లో॥ వ్యాధినా జరయా వాఽపి పీడ్యతే జాఠరోఽనలః।**
**శ్లేష్మణా తేన భుక్తాన్నం పీతం వా న పచత్యలమ్॥ 3**

**ప్రతిపదార్థము:–** వ్యాధినా=వ్యాధిచేతగాని, జరయావాపి=ముసలితనము చేతగాని, జాఠరః =జఠరాగ్నిసంబంధమైన, అనలః=అగ్ని, పీడ్యతే=పీడింపబడును. తేన=అందుచేత బలిసిన, శ్లేష్మణా=కఫము కారణంగా, భుక్తాన్నమ్=తిన్న ఆహారమునుగాని, పీతం వా=త్రాగబడిన దానినిగాని, అలమ్=చాలినంతగా, న పచతి=వండదు.

**తాత్పర్యము:–** జఠరాగ్ని ముసలితనమువలన గాని, వ్యాధివలన గాని సరిగాపనిచేయదు. అందువలన బలిసిన కఫమువలన శరీరంలో ఆహారపానీయాలు సరిగా జీర్ణము కావు.

**శ్లో॥ భుక్తపీతరసాభావాత్ తదా శుష్యన్తి ధాతవః।**
**భుక్తపీతరసేనైవ దేహే లిమ్పన్తి వాయవః॥ 4**

**ప్రతిపదార్థము:–** భుక్త=ఆహారంయొక్క, పీత=పానీయముయొక్క, రస=జీర్ణరసముయొక్క, అభావాత్=లేమివలన, తదా=అపుడు, ధాతవః=ధాతువులు (7), శుష్యంతి=శుష్కించును. భుక్తపీత=ఆహారపానీయముల యొక్క, రసేనైవ=రసముచేతనే, దేహే=శరీరమునందు, వాయవః=ప్రాణాపానాది వాయువులు, లింపంతి=వృద్ధిపొందును.

**తాత్పర్యము:–** ఆహారపానీయాలరసమువలననే శరీరంలో వాయువులు పనిచేయును. లేనిచో వాటి పని అస్తవ్యస్తముగా నుండును. అందువలన ధాతువులకు అన్నపానీయ జీర్ణరసం అందదు. అందుచేత శరీరంలోని సప్త ధాతువులు క్షయించుటం ప్రారంభమగును.

**శ్లో॥ సమీకరోతి యత్తస్మాత్సమానో వాయురుచ్యతే।**
**తదానీం తద్రసాభావాదామబన్ధనహానితః॥ 5**

**శ్లో॥ పరిపక్వరసత్వేన యథా గౌరవతః ఫలమ్।**
**స్వయమేవ పతత్యాశు తథా లిఙ్గం తనోర్వ్రజేత్॥ 6**

**ప్రతిపదార్థము:–** సమీకరోతి=రసవాయువులను సమీకరించును, యత్తస్మాత్=కనుక, వాయుః=సమీకరించు వాయువు,సమానః=సమానము అని, ఉచ్యతే=చెప్పబడును, తదానీమ్ =సమీకరించువేళ, తద్రస=ఆ అన్నపానరసములయొక్క, అభావాత్=లోపమువలన, ఆమబంధన=జిగురుబంధముయొక్క, హానితః=నష్టమువలన, పరిపక్వ=పండిన, రసత్వేన= రసముగల దగుటచే వచ్చిన, గౌరవతః=బలమువలన, ఫలమ్=పండు, యథా=ఎలా, పతతి=పడునో, తథా=అలా, లింగమ్=లింగశరీరము, ఆశు=శీఘ్రముగా, తనోః=శరీరము నుండి, వ్రజేత్=వెళ్ళును.

**తాత్పర్యము:–** అన్నరసములను ధాతువులకు సమీకరించి పంచునది సమానవాయువు. అన్నరసంలేనపుడు ఆ వాయువు ఆ పని సరిగా చేయలేదు. అందువలన "జిగురుబంధం"



బిగి తగ్గుతుంది. పండిన పండు బరువు ఎక్కువై చెట్టునుంచి పట్టువీడి రాలినట్లు లింగ శరీరము స్థూల శరీరమునుండి ఊడి పడును.

**శ్లో॥ తత్తత్స్థానాదపాకృష్య హృషీకాణాం చ వాసనాః।**
**ఆధ్యాత్మికాదిభూతాని హృత్పద్మే చైకతాం గతః॥ 7**

**ప్రతిపదార్థము:–** హృషీకాణామ్=ఇంద్రియములయొక్క, ఆధ్యాత్మిక=ఇంద్రియ సంబంధ మైన, వాసనాశ్చ=సంస్కారముల నున్ను, తత్తత్ స్థానాత్=ఆయా ఇంద్రియస్థానముల నుండి, అపాకృష్య=లాగి, హృత్పద్మే=హృదయకమలమునందు, ఏకతామ్=ఐక్యమును, గతః=పొందినవాడై.

**తాత్పర్యము:–** విజ్ఞానాత్మ ఇంద్రియాలను వాటికి సంబంధించిన శబ్దాది విషయాలను, దృష్ట్యాది జ్ఞానమును నాడుల ద్వారా ఆయాస్థానములనుండి ఉపసంహరించి హృదయ పద్మమునందు వాటిని తనతో కలిపి కొనును.

**శ్లో॥ తత్రోర్ధ్వగః ప్రాణవాయుః సంయుక్తో నవవాయుభిః।**
**ఊర్ధ్వోచ్ఛ్వాసీ భవత్యేష తథా తేనైకతాం గతః॥ 8**

**ప్రతిపదార్థము:–** తత్ర=హృదయమునందు, ఊర్ధ్వగః=ఊర్ధ్వగతిగల, ప్రాణవాయుః=ప్రాణ వాయువు, నవ=తొమ్మిది, వాయుభిః=వాయువులచేత, సంయుక్తః=కూడినదై, ఊర్ధ్వ=పైకి, ఉచ్ఛ్వాసీ=నిట్టూర్పుగలది–ఎగశ్వాసగలది, భవతి=అగును, ఏషః=ఈ ప్రాణవాయువు, తథా=ఆ విధముగా, తేన=ఆ వాయువుతో, ఏకతామ్=ఐక్యమును, గతః=పొందెను.

**తాత్పర్యము:–** ఊర్ధ్వగతి అయిన ప్రాణవాయువు మిగిలిన నవ వాయువులతో కలిసి ఎగశ్వాసగా అగును. దానితో జీవుడు విజ్ఞానాత్మతో కలియును.

**శ్లో॥ చక్షుషో వాఽథ మూర్ధ్నో వా నాడీమార్గం సమాశ్రితః।**
**విద్యాకర్మ సమాయుక్తో వాసనాభిశ్చ సంయుతః।**
**ప్రజ్ఞాత్మానం సమాశ్రిత్య విజ్ఞానాత్మాపసర్పతి॥ 9**

**ప్రతిపదార్థము:–** చక్షుషః=కంటియొక్క, అథవా=లేదా, మూర్ధ్నః=తలయొక్క, నాడీమార్గమ్= నాడీమార్గమును, సమాశ్రితః=ఆశ్రయించినవాడై, విద్యా=విద్యలతోను, కర్మ=కర్మలతోను, సమాయుక్తః=కూడినవాడై, వాసనాభిశ్చ=సంస్కారములతోను, సంయుతః=కూడినవాడై, ప్రజ్ఞాత్మానమ్=ప్రాజ్ఞాత్మను, సమాశ్రిత్య=కలిసి, విజ్ఞానాత్మా=విజ్ఞానాత్మ, అపసర్పతి= తొలగును.

**తాత్పర్యము:–** హృదయమునందు ఇంద్రియాలతో వాసనలతో కలిసిన విజ్ఞానాత్మ నేత్ర నాడి ద్వారా గాని, మూర్ధనాడి ద్వారాగాని ప్రాజ్ఞాత్మను కలిసి దేహమునుండి తొలగిపోవును. ఇది లింగదేహముతో సహా జీవుని నిష్క్రమణం. అనగా నిర్యాణము.

**శ్లో॥ యథా కుంభో నీయమానో దేశాద్దేశాన్తరం ప్రతి॥ 10**

**శ్లో॥ ఖపూర్ణ ఏవ సర్వత్ర స ఆకాశోఽపి తత్ర తు।**
**ఘటాకాశాఖ్యతాం యాతి తద్వల్లిఙ్గం పరాత్మనః॥ 11**

**ప్రతిపదార్థము:–** కుంభః=కుండ, దేశాత్=దేశమునుండి, దేశాంతరం ప్రతి=మఱొక ప్రదేశమును గూర్చి, నీయమానః=తీసికొనిపోబడుచున్నదై, యథా=ఏ విధంగా, సర్వత్ర= అంతట, ఖపూర్ణ ఏవ=ఆకాశంతో నిండినదై మాత్రమే ఉండునో, సః=ఆ ఘటములోని, ఆకాశోపి=ఆకాశము కూడా, తత్రతు=అచ్చటనేయుండి, ఘటాకాశాఖ్యతామ్=ఘటాకాశము అను పేరును, యాతి=పొందునో, తద్వత్=అట్లే, పరాత్మనః=పరమాత్మకు, లింగమ్= లింగము అని పేరు వచ్చును.

**తాత్పర్యము:–** కడవలోని ఖాళీప్రదేశము కడవతోపాటే ఉంటుంది, నడుస్తుంది. కడవ ఆకాశపూర్ణముగాను, ఆకాశం కడవలోని ఆకాశముగాను (ఘటాకాశమును) చెప్పబడును. అట్లే లింగశరీరము పరమాత్మతో నిండినది. పరమాత్మకు లింగము నివాసముగనే అనిపించును. లింగశరీరము చేరినచోటల్లా పరమాత్మగూడా ఘటాకాశమువలె చేరి నట్లుండును.

**శ్లో॥ పునర్దేహాన్తరం యాతి యథా కర్మానుసారతః।**
**ఆమోక్షాత్సఞ్చరత్యేవం మత్స్యః కూలద్వయం యథా॥ 12**

**ప్రతిపదార్థము:–** పునః=మఱల, యథా=ఎప్పటివలెనే, కర్మానుసారతః=కర్మను అనుసరించి, దేహాంతరమ్=మఱోదేహమునుగూర్చి, యాతి=పోవును,మత్స్యః=చేప, యథా=ఏవిధముగా, కూలద్వయమ్=రెండు తీరములను ఒరసికొని సంచరించునో, ఏవమ్=అట్లు, ఆ మోక్షాత్= మోక్షం వచ్చేదాక, సంచరతి=తిరుగును.

**తాత్పర్యము:–** మహామత్స్యము నదిలోని ఉభయతీరములను తాకుచు నడిచినట్లు జీవుడు ఇహపరలోకములమధ్య జననమరణాలమధ్య సంచరించును.

**శ్లో॥ పాపభోగాయ చేద్గచ్ఛేద్యమదూతైరధిష్ఠితః।**
**యాతనాదేహమాశ్రిత్య నరకానేవ కేవలమ్॥ 13**

**ప్రతిపదార్థము:–** పాప=పాపకర్మలయొక్క, భోగాయచేత్=అనుభవం కొఱకయితే, యాతనా దేహమ్=యాతనలనుభవించగల శరీరమును, ఆశ్రిత్య=ఆశ్రయించి, యమదూతైః= యమదూతలచేత, అధిష్ఠితః=అధిష్ఠింపబడినవాడై, కేవలమ్=కేవలముగా, నరకానేవ=నరక లోకములగూర్చియే, గచ్ఛేత్=వెళ్ళును.



**తాత్పర్యము:–** పాపకర్మఫలానుభవమునకు వెళ్ళే జీవునకు యాతనాదేహము ఏర్పడును. యమదూతల రక్షణలో అతడు నరకలోకానికి మాత్రమే వెళ్ళును.

**శ్లో॥ ఇష్టాపూర్తాది కర్మాణి యోఽనుతిష్ఠతి సర్వదా।**
**పితృలోకం వ్రజత్యేష ధూమమాశ్రిత్య బర్హిషః॥ 14**

**ప్రతిపదార్థము:–**యః=ఎవడు,ఇష్ట=యజ్ఞము, పూర్తాది=ఇతర ధర్మకార్యములు మొదలైన, కర్మాణి=కర్మలను, సర్వదా=ఎల్లప్పుడు, అనుతిష్ఠతి=ఆచరించునో, ఏషః=వీడు, బర్హిషః =అగ్నియొక్క, ధూమమ్=పొగను, ఆశ్రిత్య=ఆశ్రయించి, పితృలోకమ్=పితృలోకమును గూర్చి, వ్రజతి=వెళ్ళును.

**తాత్పర్యము:–** యజ్ఞయాగాలు, దానధర్మాలు మొదలైన ధర్మకార్యములను అనుసరించిన వ్యక్తి అగ్నియొక్క ధూమమును ఆశ్రయించి పితృలోకమునకు పోవును.

**శ్లో॥ ధూమాద్రాత్రిం తతః కృష్ణపక్షస్తస్మాచ్చ దక్షిణమ్।**
**ఆయనం చ తతో లోకం పితౄణాం చ తతః పరమ్॥ 15**

**ప్రతిపదార్థము:–** ధూమాత్=ధూమమునుండి, రాత్రిమ్=రాత్రిని, తతః=దానినుండి, కృష్ణ పక్షమ్=కృష్ణపక్షమును, తస్మాత్ చ=దానినుండి, దక్షిణమ్=దక్షిణమైన, అయనం చ= అయనమును, తతః=తర్వాత, పితౄణామ్=పితృదేవతలయొక్క, లోకం చ=లోకమును, తతః పరమ్=ఆ తరువాత –

**తాత్పర్యము:–** ధూమమునుండి కృష్ణపక్షము, దానినుండి దక్షిణాయనము, దానినుంచి పితృలోకమునకు వెళ్ళును.

**శ్లో॥ చన్ద్రలోకే దివ్యదేహం ప్రాప్య భుఙ్క్తే పరాం శ్రియమ్।**
**తత్ర చన్ద్రసమానోఽసౌ యావత్కర్మఫలం వసేత్।**
**తథైవ కర్మశేషేణ యథైవం పునరావ్రజేత్॥ 16**

**ప్రతిపదార్థము:–** చంద్రలోకే=చంద్రలోకమున, దివ్యదేహమ్=దివ్యశరీరమును, ప్రాప్య= పొంది, పరామ్=గొప్ప, శ్రియమ్=లక్ష్మిని, భుంక్తే=అనుభవించును, తత్ర=అచ్చట, అసౌ= ఇతడు, చంద్ర=చంద్రునితో, సమానః=సమానుడై, యావత్కర్మఫలమ్=కర్మఫలం ఉన్నంత వఱకు, వసేత్=ఉండును, తథైవ=అట్లే, కర్మశేషేణ=కర్మఫలశేషముతో, పునః=మఱల, యథా=ఎప్పటివలెనే, ఏతమ్=ఈ లోకమును గూర్చి, ఆవ్రజేత్=తిరిగి వచ్చును.

**తాత్పర్యము:–** పితృలోకమునుంచి చంద్రలోకమునకు వెళ్ళి అచ్చట దివ్యరూపముతో వైభవములనుభవించు చంద్రసమానముగా బ్రతుకును. తర్వాత కర్మశేషమువలన ఎప్పటిలాగానే యీ లోకమునకు తిరిగివచ్చును.

**శ్లో॥ వపుర్విహాయ జీవత్వమాసాద్యాకాశమేతి సః।**
**ఆకాశాద్వాయుమాగత్య వాయోరమ్భో వ్రజత్యథ॥ 17**

**ప్రతిపదార్థము:–** వపుః=దివ్యశరీరమును, విహాయ=విడిచి, జీవత్వమ్=జీవత్వమును, ఆసాద్య=పొంది, సః=ఆ విజ్ఞానాత్మ, ఆకాశమ్=ఆకాశమును, ఏతి=చేరును, ఆకాశాత్=ఆకాశమునుండి, వాయుమ్=వాయువును, ఏత్య=పొంది, వాయోః=వాయువునుండి, అంభః=నీటిని, వ్రజతి=చేరును, అథ=తరువాత.

**తాత్పర్యము:–** దివ్యశరీరమును వదలిన విజ్ఞానాత్మ మఱల జీవుడై ఆకాశమును చేరును. దానినుంచి వాయువును వాయువునుంచి నీటిని చేరును.

**శ్లో॥ అద్భ్యో మేఘం సమాసాద్య తతో వృష్టిర్భవేదసౌ।**
**తతో ధాన్యాని భక్ష్యాణి జాయతే కర్మచోదితః॥ 18**

**ప్రతిపదార్థము:–** అద్భ్యః=నీటినుండి, మేఘమ్=మబ్బును, సమాసాద్య=చేరి, తతః=తరువాత, వృష్టిః=వానగా, భవేత్=అగును, కర్మ=కర్మలచేత, చోదితః=నెట్టబడినవాడై, అసౌ=వాడు, తతః=తరువాత, భక్ష్యాణి=తినదగిన, ధాన్యాని=ధాన్యములుగా, జాయతే=అగును.

**తాత్పర్యము:–** ఆ జీవుడు నీటినుండి మేఘమునకు చేరుకొని, వర్షముగా మారి చివఱకు తినదగిన ధాన్యములలో ప్రవేశించును. ఇదంతా పూర్వజన్మకర్మఫలము.

**శ్లో॥ యోనిమన్యే ప్రపద్యన్తే శరీరత్వాయ దేహినః।**
**స్థాణుమన్యేఽనుసంయన్తి యథా కర్మ యథా శ్రుతమ్॥ 19**

**ప్రతిపదార్థము:–** యథా కర్మ=ప్రారబ్ధమునుబట్టి, యథా శ్రుతమ్=శాస్త్రం చెప్పిన ఫలితాలను బట్టి, అన్యే=కొందఱు, దేహినః=జీవులు, శరీరత్వాయ=శరీరమగుటకు, యోనిమ్=జననేంద్రియమును / జాతిని, ప్రపద్యంతే=పొందెదరు, అన్యే=మఱికొందఱు, స్థాణుమ్=స్థాణువును, అనుసంయంతి=అనుసరించెదరు.

**తాత్పర్యము:–** కొందరు శరీరధారణ కోసం మానవాది జాతులను ఆశ్రయిస్తే మఱికొందరు లతావృక్షాదులుగా స్థావరములను ఆశ్రయిస్తారు. ఇదంతా వారి కర్మను బట్టి, శాస్త్రం చెప్పిన కర్మఫలాలను బట్టి జరుగుతుంది.



**శ్లో॥ తతోఽన్నత్వం సమాసాద్య పితృభ్యాం భుజ్యతే పరమ్।**
**తతః శుక్రం రజశ్చైవ భూత్వా గర్భోఽభిజాయతే॥ 20**

**ప్రతిపదార్థము:–** తతః=ధాన్యంగా మారిన తరువాత, అన్నత్వమ్=అన్నరూపమును, సమాసాద్య=పొంది, పితృభ్యామ్=తల్లిదండ్రులచేత, పరమ్=మిక్కిలి, భుజ్యతే=భుజింపబడును, తతః=తరువాత, శుక్రమ్=తండ్రిలో వీర్యముగను, రజశ్చైవ=తల్లిలో శోణితముగను, భూత్వా=అయి, గర్భః=గర్భముగా, అభిజాయతే=పుట్టును.

**తాత్పర్యము:–** ధాన్యంగా అయినవాడు ఆహారముగా తన, కాబోవు తల్లిదండ్రులలోనికి ప్రవేశించును. అపుడు శుక్రముగాను శోణితముగాను ఏర్పడి కాలకర్మవశాత్ కలిసి ‘గర్భము’ గా అగును.

**శ్లో॥ తతః కర్మానుసారేణ భవేత్ స్త్రీపున్నపుంసకమ్।**
**ఏవం జీవగతిః ప్రోక్తా ముక్తిం తస్య వదామి తే॥ 21**

**ప్రతిపదార్థము:–** తతః=తరువాత, కర్మానుసారేణ=ప్రారబ్ధాన్ని అనుసరించి, స్త్రీ=స్త్రీగానో, పుమ్=పురుషుడుగానో, నపుంసకమ్=నపుంసకముగానో, భవేత్=అగును. ఏవమ్=ఈ విధముగా, జీవగతిః=జీవగమనము, ప్రోక్తా=చెప్పబడెను. తస్య=ఆ జీవుని యొక్క ముక్తిమ్=మోక్షమును గూర్చి, తే=నీకు వదామి=చెప్పగలను.

**తాత్పర్యము:–** తర్వాత ప్రారబ్ధాన్ని బట్టి, ఆగర్భమునందు స్త్రీగానో, పురుషుడుగానో, నపుంసకుడుగానో జన్మించును. ఇది జీవయానము. ఇక మోక్షం గురించి చెప్పెదను.

**శ్లో॥ యస్తు శాన్త్యాదియుక్తః సన్ సదా విద్యారతో భవేత్।**
**స యాతి దేవయానేన బ్రహ్మలోకావధిం నరః॥ 22**

**ప్రతిపదార్థము:–** యస్తు=ఎవడయితే, శాంత్యాది=శాంతిదాంతి, ఉపరతి మొదలగువానితో, యుక్తస్సన్=కూడినవాడై, సదా=ఎల్లప్పుడు, విద్యారతః=విద్యగలవాడు, భవేత్=అగునో, సః=ఆ, నరః=మనిషి, దేవయానేన=దేవయానం ద్వారా, బ్రహ్మలోక=బ్రహ్మలోకమే, అవధిమ్=హద్దుగాగల స్థానమును, యాతి=పొందును.

**తాత్పర్యము:–** శమము, దమము, వైరాగ్యము మొదలైనవి కలవాడై విద్యాభ్యాసము ద్వారా ఉపాసకుడైన వాడు దేవయాన మార్గము ద్వారా బ్రహ్మలోకం దాకా చేరును.

**శ్లో॥ అర్చిర్భూత్వా దినం ప్రాప్య శుక్లపక్షమథో వ్రజేత్।**
**ఉత్తరాయణమాసాద్య సంవత్సరమథో వ్రజేత్॥ 23**

**ప్రతిపదార్థము:–** అర్చిః=జ్వాలగా, భూత్వా=అయి, దినమ్=పగటిని, ప్రాప్య=పొంది,అథో =తర్వాత, శుక్లపక్ష=శుక్లపక్షమును, వ్రజేత్=చేరును, ఉత్తరాయణమ్=ఉత్తరాయణమును, ఆసాద్య=చేరి, అథో=తర్వాత, సంవత్సరమ్=సంవత్సరమును, వ్రజేత్=చేరును.

**తాత్పర్యము:–** ఈ కర్మిష్ఠి అర్చిరాదిమార్గమున అనగా దేవయానమున స్వర్గాదిలోకాలకు చేరును. అతను, ముందు అగ్నిజ్వాలలో కలిసి పగటికి చేరి, శుక్లపక్షమున కలిసి ఉత్తరాయణము ద్వారా సంవత్సరమునందు కలియును.

**శ్లో॥ ఆదిత్యచన్ద్రలోకౌ తు విద్యుల్లోకమతఃపరమ్।**
**అథ దివ్యః పుమాన్ కశ్చిద్బ్రహ్మలోకాదిహైతి సః॥ 24**

**ప్రతిపదార్థము:–**ఆదిత్య=సూర్యలోకమును, చంద్రలోకౌ తు=చంద్రలోకమును, అతః పరమ్ =దీనితర్వాత, విద్యుల్లోకమ్=విద్యుల్లోకమును, వ్రజేత్=చేరును,అథ=తర్వాత, దివ్యః= దివ్యుడైన, పుమాన్=పురుషుడు, కశ్చిత్=ఒకడు, బ్రహ్మలోకాత్=బ్రహ్మలోకమునుండి, ఇహ= విద్యుల్లోకమునకు, ఏతి=వచ్చును, సః=ఆ పురుషుడు – (తర్వాతి శ్లోకంలోకి సమన్వయం).

**తాత్పర్యము:–** సంవత్సరమునుండి సూర్యలోకమునకు, అచ్చటి నుండి చంద్రలోకమునకు, అచ్చటినుండి విద్యుల్లోకమునకు (మహర్లోకం) చేరును. అచ్చట బ్రహ్మలోకమునుండి వచ్చిన ఒక దివ్యపురుషుడు ఈ జీవుని స్వాగతించును.

**శ్లో॥ దివ్యే వపుషి సంధాయ జీవమేవం నయత్యసౌ।**
**బ్రహ్మలోకే దివ్యదేహే భుక్త్వా భోగాన్ యథేప్సితాన్।**
**తత్రోషిత్వా చిరంకాలం బ్రహ్మణా సహముచ్యతే॥ 25**

**ప్రతిపదార్థము:–** దివ్యే=దివ్యమైన, వపుషి=శరీరమునందు, ఏవమ్=ఈ, జీవమ్=జీవుని, సంధాయ=సంధించి, నయతి=బ్రహ్మలోకమునకు, తీసికొనిపోవును, బ్రహ్మలోకే= బ్రహ్మలోకమునందు, దివ్యదేహే=దివ్యశరీరమునందు, యథేప్సితాన్=ఇష్టమైన, భోగాన్= భోగాలను, భుక్త్వా=అనుభవించి, తత్ర=అచ్చట, చిరంకాలమ్=చిరకాలము, ఉషిత్వా= ఉండి, బ్రహ్మణా సహ=బ్రహ్మతో సహా, ముచ్యతే=మోక్షము పొందును.

**తాత్పర్యము:–** దివ్యపురుషుడు ఈ జీవునికి దివ్యశరీరము జోడించి బ్రహ్మలోకమునకు తీసికొని వెళ్ళును. జీవుడు బ్రహ్మలోకమున లభ్యమైన భోగాలను అనుభవించి చివరకు బ్రహ్మతోసహా మోక్షము పొందును.

**శ్లో॥ శుద్ధబ్రహ్మరతో యస్తు న స యాత్యేవ కుత్రచిత్।**
**తస్య ప్రాణా విలీయన్తే జలే సైన్ధవఖిల్యవత్॥ 26**



**ప్రతిపదార్థము:–** యస్తు=ఎవడయితే, శుద్ధబ్రహ్మ=శుద్ధబ్రహ్మమునందు, రతః=ఆసక్తి గలవాడో, సః=అట్టి జ్ఞాని, కుత్ర చిత్=ఎక్కడికిని, న యాత్యేవ=పోనే పోడు, తస్య=అతని యొక్క, ప్రాణాః=ప్రాణములు, ఇహైవ=ఇచ్చటనే, జలే=నీటియందు, సైంధవ=సైంధవ లవణం యొక్క, ఖిల్యవత్=గడ్డవలె, విలీయంతే=కలిసిపోవును.

**తాత్పర్యము:–** శుద్ధ నిర్గుణ సచ్చిదానంద బ్రహ్మమును అనుసంధాము చేయు సాధకుని ప్రాణాలు ఇచ్చటనే పంచభూతములలో కలిసిపోవును. ఆ ఆత్మ ఎచ్చటికి పోదు. నీటిలో ఉప్పువలె సర్వవ్యాపి అయిన ఆత్మయందు ఆత్మ ఒదిగి పోవును. పాంచభౌతిక శరీరము పంచభూతములలో కలిసిపోవును.

**శ్లో॥ స్వప్నదృష్టా యథా సృష్టిః ప్రబుద్ధస్య విలీయతే।**
**బ్రహ్మజ్ఞానవతస్తద్వత్ విలీయన్తే తథైవ తే॥ 27**

**ప్రతిపదార్థము:–** స్వప్న=కలలో, దృష్టా=కనబడిన, సృష్టిః=సృష్టి / ప్రపంచము, ప్రబుద్ధస్య= మేల్కొన్నవాడికి, యథా=ఎట్లు, విలీయతే=అదృశ్యమగునో, తద్వత్=అట్లే, తథైవ=ఆ విధంగానే, బ్రహ్మజ్ఞానవతః=బ్రహ్మజ్ఞానికి, తే=ఆ విశ్వము మొదలైన విషయాలు, విలీయంతే=లయించును.

**తాత్పర్యము:–** కలలో కనబడిన ప్రపంచము కలలోనే లీనమగును. జాగరణంలో ఉండదు. అట్లే అజ్ఞానదశలో ఉన్న ప్రపంచం బ్రహ్మజ్ఞానికి కలలోని ప్రపంచం వలె కఱగిపోతుంది.

**శ్లో॥ విద్యాకర్మవిహీనో యస్తృతీయం స్థానమేతి సః।**
**భుక్త్వాఽత్ర నరకాన్ ఘోరాన్ మహారౌరవరౌరవాన్॥ 28**

**ప్రతిపదార్థము:–** యః=ఎవడు, విద్యాకర్మ=మంత్రతంత్రాది విద్యలతో, విహీనః=రహితుడై ఉండునో, సః=వాడు, తృతీయమ్=మూడవ, స్థానమ్=స్థానమును, ఏతి=పొందును, అత్ర= ఇచ్చట, ఘోరాన్=ఘోరములైన, మహారౌరవ=మహారౌరవము, రౌరవాన్=రౌరవము మొదలగు, నరకాన్=నరకములను, భుక్త్వా=అనుభవించి –

**తాత్పర్యము:–** మంత్ర తంత్రాలు ఉపాసనలు యజ్ఞయాగాలు దానధర్మాలు చేయని వాడు మూడవ స్థానంలోనివాడు. ఇతడు మహారౌరవం వంటి నరకాలు అనుభవించి (తరువాత శ్లోకంలోకి)

**శ్లో॥ పశ్చాత్ ప్రాక్తనశేషేణ క్షుద్రజన్తుర్భవేదసౌ।**
**యూకామశకదంశాదిజన్మాఽసౌ లభతే భువి॥ 29**

**ప్రతిపదార్థము:–** పశ్చాత్=నరకానుభవం తరువాత, ప్రాక్తన=పూర్వకర్మయొక్క, శేషేణ= మిగులుచేత, అసౌ=ఈ జీవుడు, క్షుద్రజంతుః=అల్పజీవిగా, భవేత్=అగును, అసౌ=ఈ

పాపి, భువి=భూమియందు, యూకా=పేను, మశక=దోమ, దంశ=ఈగ, ఆది=మొదలగు, జన్మ=జన్మను, లభతే=పొందును.

**తాత్పర్యము:–** తరువాత కర్మశేషంతో క్షుద్ర జంతువుగా అయ్యేపాపి పేను, దోమ, ఈగ మొదలగు కీటక జన్మలు ఎత్తవచ్చును.

**శ్లో॥ ఏవం జీవగతిః ప్రోక్తా కిమన్యచ్ఛ్రోతుమిచ్ఛసి॥ 30**

**ప్రతిపదార్థము:–** ఏవమ్=ఈ విధముగా, జీవ=జీవుని యొక్క, గతిః=గమన విధానము, ప్రోక్తా=చెప్పబడినది, అన్యత్=వేరొకటి, కిమ్=ఏమి, శ్రోతుమ్=వినుటకు, ఇచ్ఛసి= కోరుచున్నావు.

**తాత్పర్యము:–** ఈ విధంగా జీవ గతిని గూర్చి చెప్పాను. ఇంకా ఏమి వినదలచినావు.

**శ్రీరామ ఉవాచ-శ్రీరాముడు ఇట్లనెను.**

**శ్లో॥ భగవన్! యత్త్వయా ప్రోక్తం ఫలం తు జ్ఞానకర్మణోః।**
**బ్రహ్మలోకే చన్ద్రలోకే భుఙ్క్తే భోగానితి ప్రభో!॥ 31**

**ప్రతిపదార్థము:–** భగవన్=దేవా, ప్రభో!=ప్రభూ!, త్వయా=నీచేత, జ్ఞాన=జ్ఞానమునకు, కర్మణోః=కర్మకు, బ్రహ్మలోకే=బ్రహ్మలోకమున, చంద్రలోకే=చంద్రలోకమున, భోగాన్= భోగములను, భుంక్తే=అనుభవించును, ఇతి=అని, యత్=ఏ, ఫలమ్=ఫలితము, ప్రోక్తమ్= చెప్పబడినదో – (తర్వాత శ్లోకముతో సమన్వయము)

**తాత్పర్యము:–** దేవా! జ్ఞానకర్మలు గలవానికి విడిగ ఫలితాలు చెప్పావు. అందు కర్మ ఫలంగా బ్రహ్మలోకమో చంద్రలోకమో చెప్పావు గదా!

**శ్లో॥ గన్ధర్వాదిషు లోకేషు కథం భోగః సమీరితః।**
**దేవత్వం ప్రాప్నుయాత్కశ్చిత్ కశ్చిదిన్ద్రత్వమేతి చ॥ 32**

**ప్రతిపదార్థము:–** గంధర్వాదిషు=గంధర్వము మొదలైన, లోకేషు=లోకములందు, భోగః =ఫలానుభవము, కథమ్=ఎట్లు, సమీరితః=చెప్పబడెను, కశ్చిత్=ఒకడు, దేవత్వమ్= దేవత్వమును, ప్రాప్నుయాత్=పొందును, కశ్చిత్=ఒకడు, ఇంద్రత్వమ్=ఇంద్రత్వమును, ఏతి చ=పొందును.

**తాత్పర్యము:–** గంధర్వలోకం మొదలగు లోకాలలో ఫలితాలు ఎలా ఉంటాయి. ఒకడు దేవత్వము మఱొకడు ఇంద్రత్వము పొందునా?

**శ్లో॥ ఏతత్కర్మఫలం వాఽస్తు విద్యాఫలమథాపి వా।**
**తద్బ్రూహి గిరిజాకాన్త తత్ర మే సంశయో మహాన్॥ 33**



**ప్రతిపదార్థము:–** ఏతత్=ఇది, కర్మఫలమ్=కర్మఫలముగా, అస్తువా=అగునా? అథాపి=లేదా, విద్యా=మంత్ర తంత్రాది విద్యలయొక్క, ఫలంవా=ఫలము అగునా, గిరిజాకాంత!=పార్వతీ పతీ!, తత్=ఆ విషయమును, బ్రూహి=చెప్పుము, తత్ర=ఆ విషయములో, మే=నాకు, మహాన్=గొప్ప, సంశయః=సందేహము.

**తాత్పర్యము:–** ఈ గంధర్వాదిలోకానుభవము కర్మఫలమా? విద్యాఫలమా? అని నా సంశయము. దానిని తీర్చుము.

**శ్రీ శివ ఉవాచ-శ్రీ శివుడు ఇట్లనెను.**

**శ్లో॥ తద్విద్యాకర్మణోరేవానుసారేణ ఫలం భవేత్।**
**యువా చ సున్దరః శూరో నీరోగో బలవాన్ భవేత్॥ 34**

**ప్రతిపదార్థము:–** తత్=ఆ, ఫలమ్=ఫలితము, విద్యా=విద్యయొక్క, కర్మణోరేవ=కర్మయొక్క అనుసారేణైవ=అనుసరణచేతనే, భవేత్=కలుగును, యువా చ=యువకుడును, సుందరః =సుందరుడును,శూరః=శూరుడును, నీరోగః=రోగరహితుడును, బలవాన్=బలవంతుడును, భవేత్=అగును.

**తాత్పర్యము:–** విద్యాకర్మలను అనుసరించియే ఫలితం కలుగును. యువకుడు, సుందరుడు, శూరుడు, రోగరహితుడు, బలవంతుడగును (తరువాత శ్లోకంలోకి అన్వయము)

**శ్లో॥ సప్తద్వీపాం వసుమతీం భుఙ్క్తే నిష్కణ్టకం యది।**
**స ప్రోక్తో మానుషానన్దస్తస్మాచ్ఛతగుణో మతః॥ 35**

**ప్రతిపదార్థము:–** సప్తద్వీపామ్=ఏడు ద్వీపములుగల, వసుమతీమ్=భూమిని, నిష్కంటకమ్= నిరాటంకముగా, భుంక్తే యది=అనుభవించినట్లయితే, సః=అది, మానుష=మానవ సంబంధమైన, ఆనందః=ఆనందముగా, ప్రోక్తః=చెప్పబడినది, తస్మాత్=ఆ మానవునికన్న, శతగుణః=100 రెట్లుగా, మతః=భావింపబడినది.

**తాత్పర్యము:–** పైన శ్లోకములో మానవానందము ప్రాథమికమైనదని చెప్పాము. అదే మానవుడు సర్వభూమిని తనవశము చేసికొని నిష్కంటకంగా ఏలితే వచ్చినది మానుషానందము. దీనికి 100 రెట్లు అధికము తర్వాత చెప్పబోవు గంధర్వానందము.

**శ్లో॥ మనుష్యస్తపసా యుక్తో గన్ధర్వో జాయతేఽస్య తు।**
**తస్మాచ్ఛతగుణో దేవగన్ధర్వస్య న సంశయః॥ 36**

**ప్రతిపదార్థము:–** తపసా=తపస్సుచేత, యుక్తః=కూడిన, మనుష్యః=మనుష్యుడు, గంధర్వః

=గంధర్వుడు, జాయతే=అగును, అస్యతు=ఇతని ఆనందము మానుషానందముకన్న 100 రెట్లు (అని '35' వ శ్లోకములోకి సమన్వయము) తస్మాత్=ఆ కృత్రిమగంధర్వునికన్న, దేవగంధర్వస్య=దేవగంధర్వునికి (సహజ గంధర్వుడు), శతగుణః=100 రెట్లు ఆనందము గలదు, సంశయః=సందేహము, న=లేదు.

**తాత్పర్యము:–** మనుష్యుని ఆనందము 1 అనుకొంటే సార్వభౌముని ఆనందము 100. అతనిది 1 అనుకొంటే తపస్సుతో గంధర్వుడుగా గంధర్వలోకానికి వెళ్ళినవానిది 100. ఇది 1 అనుకొంటే గంధర్వుడుగానే సృష్టింపబడిన దేవగంధర్వుని ఆనందము 100.

**శ్లో॥ ఏవం శతగుణానన్ద ఉత్తరోత్తరతో భవేత్।**
**పితౄణాం చిరలోకానామాజానసురసమ్పదామ్॥ 37**

**శ్లో॥ దేవతానామథేన్ద్రస్య గురోస్తద్వత్ప్రజాపతేః।**
**బ్రహ్మణశ్చైవమానన్దః పురస్తాదుత్తరోత్తరః॥ 38**

**ప్రతిపదార్థము:–** ఏవమ్=ఈ విధముగా, ఉత్తరోత్తరతః=ముందు ముందుగా, శతగుణ= 100 రెట్లు, ఆనందః=ఆనందము, భవేత్=అగును, చిరలోకానామ్=అనాదిలోకము వారైన, పితౄణామ్=పితృదేవతలయొక్క ఆ జాన=జననమునుండి, సురసంపదామ్=దేవసంపదగల వారికి, దేవతానామ్= దేవతలయొక్క, అథ=తరువాత, ఇంద్రస్య=ఇంద్రునియొక్క, గురోః =బృహస్పతియొక్క ఆనందము, తద్వత్=అలానే, ప్రజాపతేః చ=ప్రజాపతియొక్కయు, బ్రహ్మణః=బ్రహ్మకు, ఆనందః=ఆనందము, ఏవమ్=ఈ విధముగా, పురస్తాత్=ముందు ముందు, ఉత్తరోత్తరః=శ్రేష్ఠతరమైనది.

**తాత్పర్యము:–** ఇదేవిధముగా ముందు చెప్పబోవు వారికి ఒకరిని మించి ఒకరికి 100 రెట్లు ఆనందముండును. అందున సహజలోకవాసులకు, తపస్సులు మొదలగు వాటివలన, ఆయాలోకాలకు చేరిన కృత్రిమ లోకవాసులకు ఈ ఆనందములో మఱల 100 రెట్లు తేడా ఉండును. కాగా, పితృలోకవాసులు వారికన్న దేవతలకు, వారికన్న ఇంద్రునికి అట్లే బృహస్పతికి, ప్రజాపతికి బ్రహ్మకు ఇలా ఆనందము 100 రెట్లు పెరుగును.

**శ్లో॥ జ్ఞానాధిక్యాత్సుఖాధిక్యం నాన్యదస్తి సురాలయే।**
**శ్రోత్రియోఽవృజినోఽకామహతో యశ్చ ద్విజో భవేత్॥ 39**

**శ్లో॥ తస్యాప్యేవం సమాఖ్యాతా ఆనన్దాశ్చోత్తరోత్తరమ్।**

**ప్రతిపదార్థము:–** సురాలయే=స్వర్లోకమునందు, సుఖాధిక్యమ్=సుఖతారతమ్యము, జ్ఞానాధిక్యాత్ =జ్ఞానతారతమ్యమువలననే కలుగును, అన్యత్=మఱొక కారణము, నాస్తి=లేదు, యః



=ఏ, ద్విజః= ద్విజుడు, శ్రోత్రియః=వైదికుడు, అకామహతః=కోరికలకు దెబ్బతిననివాడును, అవృజినః=పాపరహితుడును అగునో, తస్యాపి=అతనికిన్ని, ఆనందాః=ఆనందములు, ఉత్తరోత్తరమ్= అధికముగా, ఏవమ్=ఈ విధముగనే, సమాఖ్యాతాః=చెప్పబడినవి.

**తాత్పర్యము:–** జ్ఞానము సుఖము, సమాననిష్పత్తిలో నుండును. జ్ఞానము ఎక్కువ కనుకనే యీ సుఖములోని ఎక్కువలు. అదే విధముగా వైదికశ్రద్ధ, పాపరాహిత్యము, నిష్కామత ఉన్న ద్విజుని ఆనందములోనూ ఈ తారతమ్యములు వచ్చును.

**ఆత్మజ్ఞానాత్పరం నాస్తి తస్మాద్ దశరథాత్మజ!॥ 40**

**ప్రతిపదార్థము:–** తస్మాత్=కనుక, దశరథాత్మజ!=దాశరథీ!, ఆత్మజ్ఞానాత్=ఆత్మజ్ఞానముకన్న, పరమ్=శ్రేష్ఠమైనది, నాస్తి=లేదు.

**తాత్పర్యము:–** దాశరథీ! కనుక ఆత్మజ్ఞానానికి మించినది లేదు.

**శ్లో॥ బ్రాహ్మణః కర్మభిర్నైవ వర్ధతే నైవ హీయతే।**
**న లిప్యతే పాతకేన కర్మణా జ్ఞానవాన్ యది॥ 41**

**ప్రతిపదార్థము:–** బ్రాహ్మణః=బ్రాహ్మణుడు, జ్ఞానవాన్యది=జ్ఞాని అయినచో, కర్మభిః=కర్మల చేత, నైవ వర్ధతే=పెరుగడు, నైవ హీయతే=తఱగడు, పాతకేన=పాపమైన, కర్మణా=కర్మతో, న లిప్యతే=అంటుకొనబడడు.

**తాత్పర్యము:–** జ్ఞాని అయిన బ్రాహ్మణునకు కర్మలు అంటవు. వానివలన వానికి వృద్ధిక్షయములు లేవు.

**శ్లో॥ తస్మాత్సర్వాధికో విప్రో జ్ఞానవానేవ జాయతే।**
**జ్ఞాత్వా యః కురుతే కర్మ తస్యాక్షయ్యఫలం భవేత్॥ 42**

**ప్రతిపదార్థము:–** తస్మాత్=కనుక, జ్ఞానవాన్=జ్ఞాని అయిన, విప్రః ఏవ=బ్రాహ్మణుడే, సర్వాధికః=అందరికన్న గొప్పవాడు, జాయతే=అగును, యః=ఎవడు, జ్ఞాత్వా=జ్ఞాన పూర్వంగా, కర్మ=కర్మము, కురుతే=చేయునో, తస్య=అతనికి, అక్షయ్య=తరగని, ఫలమ్= మోక్షఫలము, భవేత్=కలుగును.

**తాత్పర్యము:–** కనుక సర్వోత్తమవిప్రుడెవరంటే జ్ఞానియే. కర్మజ్ఞానపూర్వకముగా కర్మలు చేస్తే అతనికి అక్షయమైన ఫలము లభించును. ప్రపంచములో అక్షయ్య ఫలము మోక్షమే. అదే లభిస్తుంది.

**శ్లో॥ యత్ఫలం లభతే మర్త్యః కోటిబ్రాహ్మణభోజనైః।**
**తత్ఫలం సమవాప్నోతి జ్ఞానినం యస్తు భోజయేత్॥ 43**

**ప్రతిపదార్థము:–** కోటిబ్రాహ్మణ=కోటి విప్రులయొక్క, భోజనైః=భోజనములచేత, మర్త్యః =మనిషి, యత్=ఏ, ఫలమ్=ఫలమును, లభతే=పొందునో, తత్ఫలమ్=ఆ ఫలమును, యస్తు=ఎవడు, జ్ఞానినమ్=జ్ఞానిని, భోజయేత్=తినిపించునో వాడు, సమవాప్నోతి= పొందును.

**తాత్పర్యము:–** కోట్లమంది బ్రాహ్మణులకు భోజనము పెట్టితే వచ్చిన ఫలము ఒక జ్ఞానికి భోజనము పెట్టినచో కలుగుతుంది.

**శ్లో॥ జ్ఞానవన్తం ద్విజం యస్తు ద్విషతే చ నరాధమః।**
**స శుష్యమాణో మ్రియతే యస్మాదీశ్వర ఏవ సః॥ 44**

**ప్రతిపదార్థము:–** యస్తు=ఏ, న రాధమః=మానవాధముడు, జ్ఞానవంతమ్=జ్ఞాని అయిన, ద్విజమ్=విప్రుని, ద్విషతే చ=ద్వేషించునో, సః=ఆ నరాధముడు, శుష్యమాణః=శుష్కించుచు, మ్రియతే=మరణించును, యస్మాత్=ఎందుకంటే, సః=ఆ జ్ఞాని, ఈశ్వర ఏవ=ఈశ్వరుడే.

**తాత్పర్యము:–** జ్ఞాని అయిన యోగి ఈశ్వరుడే. అతనిని ద్వేషించిన వాడు శుష్కించి మరణించును.

**శ్లో॥ ఉపాసకో న యాత్యేవ యస్మాత్పునరధోగతిమ్।**
**ఉపాసనరతో భూత్వా తస్మాదాస్స్వ సుఖీ నృప!॥ 45**

**ప్రతిపదార్థము:–** ఉపాసకః=ఉపాసకుడు (విద్యలతో) పునః=మఱల, అధోగతిమ్= అధోగతిని, న యాత్యేవ=పొందనే పొందదు. యస్మాత్ తస్మాత్=అందువలన, నృప!=రామ రాజా!, ఉపాసన=ఉపాసనయందు, రతః=ఆసక్తికలవాడవై, భూత్వా=ఉండి, సుఖీ= సుఖవంతుడవై, ఆస్స్వ=ఉండుము.

**తాత్పర్యము:–** ఉపాసనలోకి దిగినవాడు ఎన్నటికీ అధోగతి పాలుకాదు. కనుక రామా! ఉపాసకుడవు కమ్ము. అలా సుఖంగా ఉండుము.

**ఇతి శ్రీ పద్మపురాణే ఉపరిభాగే శివగీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే**
**శ్రీ శివరాఘవసంవాదే జీవగతినిరూపణయోగో నామ ఏకాదశోఽధ్యాయః॥**

* * * * *



## అథ ద్వాదశోఽధ్యాయః
# ఉపాసనా వర్ణనయోగః

**శ్రీరామ ఉవాచ**

**శ్లో॥ భగవన్! దేవదేవేశ! నమస్తేఽస్తు మహేశ్వర ! ।**
**ఉపాసనావిధిం బ్రూహి దేశం కాలం చ తస్య తు।**
**అఙ్గాని నియమాంశ్చైవ మయి తేఽనుగ్రహో యది॥ 1**

**ప్రతిపదార్థము:–** భగవన్=భగవంతుడా!, దేవదేవేశ=మహాదేవా!, మహేశ్వర!=ఈశ్వర!, తే=నీకు, నమః=నమస్కారము, అస్తు=అగుగాక! మయి=నాయందు, అనుగ్రహః= అనుగ్రహము, యది=ఉన్నట్లయితే, ఉపాసనావిధిమ్=ఉపాసనావిధానమును, తస్య తు= దానియొక్క, దేశమ్=దేశమును, కాలమ్=కాలమును, అంగాని=అంగకార్యములను, నియమాంశ్చైవ=నియమములను, బ్రూహి=చెప్పుము.

**తాత్పర్యము:–** పరమేశ్వరా! మహాదేవా! ఉపాసనావిధిని దానికి తగిన దేశకాలములను, అంగకార్యములను నియమములను నాపై అనుగ్రహించి చెప్పవలసినది.

**శ్రీ శివ ఉవాచ- శ్రీ శివుడిట్లనెను.**

**శ్లో॥ శృణు రామ! ప్రవక్ష్యామి దేశం కాలముపాసనే॥ 2**

**శ్లో॥ సర్వాకారోఽహమేవైకః సచ్చిదానన్దవిగ్రహః।**
**మదంశేన పరిచ్ఛిన్నా దేహాః సర్వదివౌకసామ్॥ 3**

**ప్రతిపదార్థము:–** రామ=రామచంద్రా!, శృణు=వినుము, ఉపాసనే=ఉపాసనయందు అవసరమైన, దేశమ్=చోటును, కాలమ్=కాలమును, ప్రవక్ష్యామి=చెప్పగలను, అహమ్= నేను,ఏక ఏవ=ఒక్కడనే,సర్వాకారః=సర్వరూపుడను,సచ్చిదానంద=సత్తాజ్ఞాన, ఆనందములే, విగ్రహః=శరీరముగా గలవాడును. మదంశేన=నా అంశచేత, పరిచ్ఛిన్నాః సర్వ= సమస్తమైన, దివౌకసామ్ =దేవతలయొక్క, దేహాః=శరీరములు ఏర్పడినవి.

**తాత్పర్యము:–** రామచంద్రా! విను, ఉపాసనావిధానము దానికి కావలసిన దేశకాలాదులను చెప్పుచున్నాను. నేను అఖండ సచ్చిదానందస్వరూపుడను. సర్వవ్యాపిని. సమస్తదేవతా శరీరములు నా అంశలే.

**శ్లో॥ యే త్వన్యదేవతాభక్తా యజన్తే శ్రద్ధయాన్వితాః।**
**తేఽపి మామేవ రాజేన్ద్ర! యజన్త్యవిధిపూర్వకమ్॥ 4**

**ప్రతిపదార్థము:–** రాజేంద్ర=రాజపుంగవా!, అన్య=ఇతరులైన, దేవతా=దేవతలయొక్క భక్తాః=భక్తులయిన, యే=ఎవరు, శ్రద్ధయా=శ్రద్ధతో, అన్వితాః=కూడినవారై, యజన్తే= పూజించెదరో, తేపి=వారున్ను, మామేవ=నన్నే, అవిధిపూర్వకమ్=విధి ప్రకారము కాకుండా, యజంతి=పూజించుచున్నారు.

**తాత్పర్యము:–** రామచంద్రా! సర్వదేవతలు నా అంశలే అని తెలియక ఇతర దేవతలను వేర్వేరుగా కొలిచే వారు గూడా శ్రద్ధగా నన్నే కొలుస్తున్నట్లు, అయితే వారు అద్వైతంతో గాక భేదంతో కొలుస్తున్నారు.

**శ్లో॥ యస్మాత్సర్వమిదం విశ్వం మత్తో న వ్యతిరిచ్యతే।**
**సర్వక్రియాణాం భోక్తాహం సర్వస్యాహం ఫలప్రదః॥ 5**

**ప్రతిపదార్థము:–** యస్మాత్=ఎందువలన, ఇదమ్=ఈ, సర్వమ్=సమస్తమైన, విశ్వమ్= ప్రపంచము, మత్తః=నాకన్న, న వ్యతిరిచ్యతే=భిన్నముకాదో, అందువలన, సర్వ=సమస్తమైన, క్రియాణామ్=కర్మలకు, అహమ్=నేను, భోక్తా=భోక్తను, సర్వస్య=ప్రతిదానికి, అహమ్=నేను, ఫలప్రదః=ఫలదాతను.

**తాత్పర్యము:–** ఈ విశ్వమంతయు నేనే. నాకన్న భిన్నముగా ఏదియు లేదు. కనుక సమస్త క్రియలకు కర్తను నేనే. భోక్తను నేనే. ఫలదాతనూ నేనే.

**శ్లో॥ యేనాకారేణ యే మర్త్యాః – మామేవైకముపాసతే।**
**తేనాకారేణ తేభ్యోఽహం ప్రసన్నో వాఞ్ఛితం దదే॥ 6**

**ప్రతిపదార్థము:–** యే=ఏ, మర్త్యాః=మానవులు, యేన=ఏ, ఆకారేణ=ఆకారముతో, ఏకం ఏవ=ఒక్కడనే అయిన, మామ్=నన్ను, ఉపాసతే=ఉపాసించెదరో, తేన=ఆ, ఆకారేణ= ఆకారముతో, తేభ్యః=వారికి, అహమ్=నేను, ప్రసన్నః=ప్రసన్నుడనై, వాంఛితమ్=కోరికను, దదే=ఇచ్చెదను.

**తాత్పర్యము:–** నేను ఒక్కడనే. ఎవరు నన్ను ఏ రూపముతో సేవిస్తారో, వారికి ఆ రూపముతో నేను కనబడి అనుగ్రహించెదను. కోరికలు ఇచ్చెదను.



**శ్లో॥ విధినావిధినా వాపి భక్త్యా యే మాముపాసతే।**
**తేభ్యః ఫలం ప్రయచ్ఛామి ప్రసన్నోఽహం న సంశయః॥ 7**

**ప్రతిపదార్థము:–** విధినా=విహిత పద్ధతిలోగా, అవిధినావాపి=అవిహితమార్గముతో గాని, యే=ఎవరు, భక్త్యా=భక్తితో, మామ్=నన్ను, ఉపాసతే, ఉపాసన చేస్తారో, తేభ్యః=వారికి, అహమ్=నేను, ప్రసన్నః=ప్రసన్నుడనై, ఫలమ్=ఫలితమును, ప్రయచ్ఛామి=ఇచ్చెదను.

**తాత్పర్యము:–** శాస్త్రోక్త విధానం చేతగాని, మఱోరకంగాగాని ఎవరు భక్తితో పూజించునో వారికి ప్రసన్నుడనై తప్పక వరములు అనుగ్రహించెదను.

**శ్లో॥ అపి చేత్సుదురాచారో భజతే మామనన్యభాక్।**
**సాధురేవ స మన్తవ్యః సమ్యగ్వ్యవసితో హి సః॥ 8**

**ప్రతిపదార్థము:–** సుదురాచారోపి=మిక్కిలి దురాచారుడయినను, అనన్యభాక్=ఇతర విషయాలను పొందినవాడై, మామ్=నన్ను, భజతే చేత్=సేవించినచో, సః=వాడు, సాధురేవ =మంచివాడుగనే, మంతవ్యః=తలచదగినవాడు, సః=వాడు, సమ్యక్=మంచిగా, వ్యవసితః =ప్రయత్నించినవాడు, హి=కదా!

**తాత్పర్యము:–** ఎంతటి దురాచారుడైనా ఇతర విషయాలను వదలి నన్ను సేవించినచో, అతడు సమ్యక్ప్రయత్నంలోనికి వచ్చాడు కనుక సాధువే.

**శ్లో॥ స్వజీవత్వేన యో వేత్తి మామేవైకమనన్యధీః।**
**తం న స్పృశన్తి పాపాని బ్రహ్మహత్యాదికాన్యపి॥ 9**

**ప్రతిపదార్థము:–** ఏకమ్=అఖండుడైన, మామేవ=నన్నే, స్వ=తన, జీవత్వేన=జీవుడుగా, అనన్యధీః=ఏకాగ్రచిత్తుడై, యః=ఎవడు, వేత్తి=ఎఱుగునో, తమ్=వానిని, బ్రహ్మహత్యాదికాని =బ్రహ్మహత్య మొదలగు, పాపాన్యపి=పాపములు గూడా, న స్పృశంతి=తాకవు.

**తాత్పర్యము:–** తన జీవుడుగా ఉన్నది నేనేనని, నేను అఖండుడనని, సర్వవ్యాపినని, ఏకాగ్రచిత్తంతో ఎవడు ధ్యానిస్తాడో, వానిని బ్రహ్మహత్యాది పాపాలు గూడా స్పృశింపవు.

**శ్లో॥ ఉపాసావిధయస్తత్ర చత్వారః పరికీర్తితాః।**
**సమ్పదారోపసంవర్గాఽధ్యాసా ఇతి మనీషిభిః॥ 10**

**ప్రతిపదార్థము:–** మనీషిభిః=విద్వాంసులచేత, తత్ర=ఆ విషయములో, సంపత్=సంపత్, ఆరోప=ఆరోపము, సంవర్గ=సంవర్గము, అధ్యాసాః=అధ్యాసము, ఇతి=అని, చత్వారః= నాలుగు, ఉపాసా=ఉపాసనయొక్క, విధయః=విధులు, పరికీర్తితాః=చెప్పబడినవి.

**తాత్పర్యము:-** ఉపాసనా విధులు నాల్గు - 1) సంపత్, 2) ఆరోపము, 3) సంవర్గము, 4) అధ్యాస - అని పెద్దలు చెప్పిరి.

**శ్లో॥ అల్పస్య చాధికత్వేన గుణయోగాద్విచిన్తనమ్।**
**అనన్తం వై మన ఇతి సమ్పద్విధిరుదీరితః॥ 11**

**ప్రతిపదార్థము:-** అల్పస్య చ=అల్పమైన దానికి, గుణయోగాత్=గుణసంబంధమువలన, అధికత్వేన=అధికముగా, విచింతనమ్=చింతించుట - అనగా, మనః=మనస్సు, అనంతం వై=అనంతమే, ఇతి=అని, సంపత్=సంపత్ అను పేరుగల, విధిః=విధిగా, ఉదీరితః= చెప్పబడినది.

**తాత్పర్యము:-** అల్పాన్ని అధికంగా భావించటం సంపత్ ఉపాసన. ఉదాహరణకు మనస్సు అనంతం అని భావించి ఉపాసించుట. ఇది సంపత్. అలా సంపన్నం చేయటం సంపత్. మనస్సు అనంతము. విశ్వదేవతలు అనంతులు. మనస్సుతో అనంత లోకాన్ని జయించ వచ్చును - అని వేదం. ***"అనంతం వై మనః, అనంతా వై విశ్వేదేవాః, అనంతమేవ సతేన లోకమ్ జయతి"*** - *శ్రుతి.*

**శ్లో॥ విధావారోప్య యోపాసా సారోపః పరికీర్తితః।**
**యద్వదోఙ్కారముద్గీథముపాసీతేత్యుదాహృతః॥ 12**

**ప్రతిపదార్థము:-** విధౌ=శాస్త్రవిధియందు, ఆరోప్య=ఆరోపించి, యా=ఏ, ఉపాసా=ఉపాసన గలదో, సా=అది, ఆరోపః=ఆరోపముగా, పరికీర్తితః=చెప్పబడినది, యద్వత్=ఎలా అంటే, ఓంకారమ్=ప్రణవమును, ఉద్గీథమ్=ఉద్గీథమునుగా, ఉపాసీత=ఉపాసింపవలయును, ఇతి=అని, ఉదాహృతః=ఉదాహరణ మగును.

**తాత్పర్యము:-** ''య ఏవాసౌ తపతి తముద్గీథముపాసీత'' అను మంత్రములో ఉద్గీథావయవమైన ఓంకారమును ఆదిత్యునిగా ఉపాసించమని శాస్త్రవిధి. ఇది 'విధి' వలన వచ్చిన ఆరోపోపాసన.

**శ్లో॥ ఆరోపో బుద్ధిపూర్వేణ య ఉపాసావిధిశ్చ సః।**
**యోషిత్యగ్నిమతిర్యత్తదధ్యాసః స ఉదాహృతః॥ 13**

**ప్రతిపదార్థము:-** బుద్ధిపూర్వేణ=బుద్ధిపూర్వకముగా, ఆరోపః=ఆరోపము, యః=ఏది కలదో, సః=ఆ, ఉపాసావిధిః=ఉపాసనా విధి, అధ్యాసః=అధ్యాసోపాసన, సః=అది, యోషితి= స్త్రీయందు, అగ్ని=అగ్ని అను, మతిః=బుద్ధి, యత్=ఏదిగలదో, తత్=అది, ఉదాహృతః= అధ్యాసగా ఉదాహరింపబడినది.



**తాత్పర్యము:-** శాస్త్రవిధితో పనిలేకుండగా, తమ బుద్ధిని బట్టి స్త్రీని అగ్నిగా భావించటం వంటివి అధ్యాసోపాసనలు.

**శ్లో॥ క్రియాయోగేన చోపాసావిధిః సంవర్గ ఉచ్యతే।**
**సంహృత్య వాయుః ప్రళయే భూతాన్యేకోఽవసీదతి॥ 14**

**ప్రతిపదార్థము:-** క్రియాయోగేన=క్రియనుబట్టి చెప్పిన, ఉపాసావిధిః=ఉపాసన, సంవర్గః =సంవర్గమని, ఉచ్యతే=చెప్పబడును, వాయుః=వాయువు, ప్రళయే=ప్రళయ కాలమున, భూతాని=భూతములను, సంహృత్య=సంహరించి, ఏకః=ఒక్కడే, అవసీదతి=ఉండును.

**తాత్పర్యము:-** సంవర్గం అంటే సంహరించి తనలో పెట్టుకొనేది అని అర్థము. వాయువు సుషుప్తి మరణ కాలాల్లో శరీరంలో ఇంద్రియాదులను ఆకర్షించి తనలో ఇమిడ్చుకొని ఉత్క్రమించును. ***"వాయుర్వైతాన్ సర్వాన్ సంవృంక్తే"*** *అని శ్రుతి.* ***"ప్రాణోవావసంవర్గః సయదాస్వపితి ప్రాణం తర్హివాగప్యేతి ప్రాణశ్చక్షుః ప్రాణః శ్రోత్రం, ప్రాణమ్మనః ప్రాణోహ్యేవైతాన్ సంవృంక్తే"*** అని *శ్రుతి.* కనుక వాయూపాసన సంవర్గోపాసన. ఇది వాయు క్రియను బట్టి చెప్పినది.

**శ్లో॥ ఉపసఙ్గమ్య బుద్ధ్యా యోపాసనా దేవతాత్మనా।**
**తదుపాసనమన్తః స్యాత్ తద్బహిః సమ్పదాదయః॥ 15**

**ప్రతిపదార్థము:-** బుద్ధ్యా=బుద్ధితో, ఉపసంగమ్య=ప్రత్యగాత్మను సమీపించి, దేవతాత్మనా= దేవతాస్వరూపముతో, ఉపాసనా=ఉపాసించుట, యా=ఏది గలదో, తత్=ఆ, ఉపాసనమ్= సేవ, అంతః=అంతరుపాసన, స్యాత్=అగును, సంపదాదయః=సంపత్, ఆరోప, అధ్యాస, సంవర్గాలు, తత్=ఆ ప్రత్యగాత్మ కన్న, బహిః=బాహ్యమైనవి.

**తాత్పర్యము:-** బుద్ధితో అత్యంత సమీపంగా ఉన్న తనలోని ప్రత్యగాత్మనే దేవతగా సేవించుట అంతరుపాసన. సంపదారోపాధ్యాస సంవర్గాలు బాహ్యోపాసనలు. ఇందులో ఉపాసన అంటే "స్వరూప సంధానమే". *(ఉపసంగమ్య అనగా ప్రత్యగాత్మను సమీపించి అని చెప్పాలి. అంతకన్న దగ్గర అయిన దేవత లేదు కనుక. 'ఉప' అనగా సమీపము కనుక - ఈ అర్థము శివగీతాతాత్పర్య ప్రకాశికలో ఉన్నది. చూ॥ "ఉపసంగమ్య- ఉపసమీపే, అత్ర విశేషణాంతరాభావాత్ ఉపశబ్దేన అత్యంత సామీప్యంగమ్యతే తచ్చ ప్రత్యగాత్మన ఏవ-". "ప్రపంచానుసంధానం వినా - యోపాసనా బ్రహ్మస్వరూపేణావస్థానమ్".)*

**శ్లో॥ జ్ఞానాన్తరానన్తరితసజాతిజ్ఞానసన్తతేః।**
**సమ్పన్నదేవతాత్మత్వముపాసనముదీరితమ్॥ 16**

**ప్రతిపదార్థము:–** జ్ఞానాంతర=ఇతర విషయజ్ఞానములచేత, అనంతరిత=అడ్డగింపబడని, సజాతి=ఒకేజాతిదయిన, జ్ఞాన=జ్ఞానముయొక్క, సంతతేః=సమూహమువలన, సంపన్న=కూడిన, దేవతాత్మత్వమ్=దేవతాస్వరూపమగు, ఉపాసనమ్=ఉపాసనమని, ఉదీరితమ్=చెప్పబడినది.

**తాత్పర్యము:–** ఇతర జ్ఞానములు అడ్డుపడకుండా ఒకేరకమైన దేవతాభావనాపరంపరలతో సంపన్న దేవతతో అభేదాన్ని పొందటం ఒక ఉపాసన. ఇది బాహ్యోపాసన.

**శ్లో॥ సమ్పదాదిషు బాహ్యేషు దృఢబుద్ధిరుపాసనమ్।**
**కర్మకాలే తదఙ్గేషు దృష్టిమాత్రముపాసనమ్॥ 17**

**ప్రతిపదార్థము:–** బాహ్యేషు=బాహ్యమైన, సంపదాదిషు=సంపత్ మొదలైన ఉపాసనల యందు, దృఢబుద్ధిః=శ్రద్ధగూడా, ఉపాసనమ్=ఉపాసన అనబడును. కర్మకాలే=క్రియా కాలమున, తదంగేషు=కర్మాంగములయిన ఉద్గీథాదులందు, దృష్టిమాత్రమ్=కేవల దృష్టి (అనగా ఇతరము పట్టించికొనకుండా ఏకాగ్ర దృష్టి నిలుపుట), ఉపాసనమ్=ఉపాసన అనబడును.

**తాత్పర్యము:–** బాహ్యమైన సంపదారోపాది ఉపాసనలందున్న శ్రద్ధ గూడా ఉపాసనయే. కర్మకాలమున ఆయా ఉపాసనాంగాలయిన ఉద్గీథాదులమీద మాత్రమే దృష్టి ఉంచటం ఉపాసన.

**శ్లో॥ ఉపాసనమితిప్రోక్తం తదఙ్గాని బ్రువే శృణు।**
**తీర్థక్షేత్రాదిగమనం శ్రద్ధాం తత్ర పరిత్యజేత్।**
**స్వచిత్తైకాగ్రతా యత్ర తత్రాసీత సుఖం ద్విజః॥ 18**

**ప్రతిపదార్థము:–** ఇతి=ఈ విధముగా, ఉపాసనమ్=ఉపాసనాపద్ధతి, ప్రోక్తమ్=చెప్పబడినది, శృణు=వినుము, తదంగాని=ఉపాసనాంగములైన కృత్యముల, బ్రువే=చెప్పెదను, శృణు=వినుము, తత్ర=ఆ నియమములలో / అంగములలో, తీర్థ=తీర్థములు, క్షేత్ర=క్షేత్రములు, ఆది=మొదలుగాగల వాటిని గూర్చి, గమన=పోవుటయందలి, శ్రద్ధామ్=శ్రద్ధను, పరిత్యజేత్=విడువవలయును, ద్విజః=ఉపాసక విప్రుడు, స్వ=తనయొక్క, చిత్త=మనస్సుయొక్క, ఏకాగ్రతా=ఏకాగ్రత, యత్ర=ఎచ్చట కలుగునో, తత్ర=అచ్చట, ఆసీత=ఉండవలయును.

**తాత్పర్యము:–** ఉపాసనా పద్ధతులను, వాటి అంగములైన నియమములను చెప్తాను. అందులో ముందు తన మనస్సుకు ఏకాగ్రత ఎక్కడ లభిస్తే అక్కడ సాధకుడు స్థిరపడ వలయును. అందుకొఱకు రకరకాల తీర్థక్షేత్రాలు తిరుగాలనే శ్రద్ధను ముందు వదలవలెను.



**శ్లో॥ కమ్బలే మృదుతల్పే వా వ్యాఘ్రచర్మణి వా స్థితః।**
**వివిక్తదేశే నియతః సమగ్రీవశిరస్తనుః॥ 19**

**ప్రతిపదార్థము:–** వివిక్త దేశే=ఒంటరి ప్రదేశమున, కంబలే=కంబలియందు, మృదుతల్పే వా=మెత్తని తల్పమునందుగాని, వ్యాఘ్రచర్మణి వా=పెద్దపులి చర్మమునందుగాని, స్థితః=కూర్చొనినవాడై, నియతః=నిశ్చలుడై, సమ=సమానరేఖలోనున్న, గ్రీవ=మెడ, శిరః=శిరస్సు, తనుః=శరీరము గలవాడై.

**తాత్పర్యము:–** ఏకాంత ప్రదేశములో, నియమ బద్ధుడై కంబళియందు గాని, మృదువైన తల్పమునందుగాని నిటారుగా ఆసీనుడు కావలయును.

**శ్లో॥ అత్యాశ్రమస్థః సకలానీన్ద్రియాణి నిరుధ్య చ।**
**భక్త్యాఽథ స్వగురుం నత్వా యోగం విద్వాన్ ప్రయోజయేత్॥ 20**

**ప్రతిపదార్థము:–** అత్యాశ్రమస్థః=వానప్రస్థ / సన్యాసాశ్రమమునందున్నవాడై, సకలాని=సమస్తములైన, ఇంద్రియాణి=ఇంద్రియములను, నిరుధ్య చ=నిరోధించి, అథ=తరువాత, భక్త్యా=భక్తితో, స్వ=తన, గురుమ్=గురువును, నత్వా=నమస్కరించి, విద్వాన్=తెలిసినవాడై, యోగమ్=యోగమును, ప్రయోజయేత్=ప్రయోగింపవలెను / ఆచరింపవలయును.

**తాత్పర్యము:–** అత్యాశ్రమియై సకలేంద్రియాలను నిరోధించి, గురునమస్కారము చేసికొని, విధానమును తెలిసికొని సాధకుడు యోగాచరణ ప్రారంభము చేయవలయును.

**శ్లో॥ యస్త్వవిజ్ఞానవాన్భవత్యయుక్తేన మనసా సదా।**
**తస్యేన్ద్రియాణ్యవశ్యాని దుష్టాశ్వా ఇవ సారథేః॥ 21**

**ప్రతిపదార్థము:–** అయుక్తేన=యోగసిద్ధముగాని, మనసా సహ=మనస్సుతో కూడి, యస్తు=ఎవడు, అవిజ్ఞానవాన్=విజ్ఞానరహితుడు, భవతి=అగునో, తస్య=వానికి, ఇంద్రియాణి=ఇంద్రియాలు, సారథేః=సారథికి, దుష్టాశ్వా ఇవ=చెడు గుఱ్ఱములవలె, అవశ్యాని=ఎదురు తిరిగినవి, భవంతి=అగును.

**తాత్పర్యము:–** అశుచి, అయుక్తుడు, స్వేచ్ఛా మనస్సుగల అజ్ఞానికి ఇంద్రియాలు లొంగవు. చేతగాని సారథికి పొగరెక్కిన గుఱ్ఱాలు లొంగవు గదా!

**శ్లో॥ విజ్ఞానీ యస్తు భవతి యుక్తేన మనసా సదా।**
**తస్యేన్ద్రియాణి వశ్యాని సదశ్వా ఇవ సారథేః॥ 22**

**ప్రతిపదార్థము:–** సదా=ఎల్లప్పుడు, యుక్తేన=యోగ సిద్ధమైన, మనసా=మనస్సుతో, యస్తు=ఎవడు, విజ్ఞానీ=విజ్ఞానముగలవాడు, భవతి=అగునో, తస్య=వానికి, ఇంద్రియాణి=

ఇంద్రియాలు, సారథేః=సారథికి, సదశ్వాః+ఇవ=మంచి గుఱ్ఱాలవలె, వశ్యాని=లొంగిన వగును.

**తాత్పర్యము:–** ఎల్లప్పుడు యోగసిద్ధమైన మనస్సుతో ఎవడు విజ్ఞానముగలవాడు అగునో వానికి ఇంద్రియములు, సారథికి మంచి గుఱ్ఱములవలె లొంగినవగును.

**శ్లో॥ యస్త్వవిజ్ఞానవాన్భవత్యమనస్కః సదాఽ శుచిః।**
**న స తత్పదమాప్నోతి సంసారమధిగచ్ఛతి॥ 23**

**ప్రతిపదార్థము:–** యస్తు=ఎవడు, అమనస్కః=స్థిరమైన మనస్సులేనివాడు, సదా=నిత్యము, అశుచిః=శౌచములేనివాడును, అవిజ్ఞానవాన్=అజ్ఞాని అగునో, సః=వాడు, తత్=ఆ, పదమ్=బ్రహ్మస్థానమును, న+ఆప్నోతి=పొందలేడు, సంసారమ్=సంసారమునే, అధిగచ్ఛతి =పొందును.

**తాత్పర్యము:–** మనసులో ఏకాగ్రతలేనివాడు,అశుచి అనగా క్రోధాదిదోషవంతుడు అయిన అజ్ఞాని బ్రహ్మపదమును పొందలేడు. సంసారమునే పొందును.

**శ్లో॥ విజ్ఞానీ యస్తు భవతి సమనస్కః సదా శుచిః।**
**స తత్పదమవాప్నోతి యస్మాద్భూయో న జాయతే॥ 24**

**ప్రతిపదార్థము:–** యస్తు=ఎవడైతే, సమనస్కః=యోగ్యమనస్సుగలవాడును, సదా=నిత్యము, శుచిః=నిర్మలత్వము గలవాడై, విజ్ఞానీ=జ్ఞాని అగునో, సః=వాడు, యస్మాత్=దేనినుండి, భూయః=మఱల,న జాయతే=పుట్టడో,తత్=ఆ, పదమ్=స్థానమును, అవాప్నోతి=పొందును.

**తాత్పర్యము:–** ఏకాగ్రమైన యోగ్యచిత్తము, చిత్తశుద్ధిగలజ్ఞాని పునరావృత్తిరహితమైన బ్రహ్మపదమును పొందగలడు.

**శ్లో॥ విజ్ఞానసారథిర్యస్తు మనః ప్రగ్రహ ఏవ చ।**
**సోఽ ధ్వనః పారమాప్నోతి మమైవ పరమం పదమ్॥ 25**

**ప్రతిపదార్థము:–** యస్తు=ఎవడు, విజ్ఞాన=బుద్ధియే, సారథిః=సారథిగా గలవాడో, మనః =మనస్సే, ప్రగ్రహ ఏవ చ=పగ్గాలు కలవాడును అగునో, సః=వాడు, అధ్వనః=సంసార మార్గమునకు/అధ్యాత్మ మార్గమునకు, పారమ్=అవతలితీరమైన, మమ=నాయొక్క పరమమ్=చివరిదైన, పదమ్=స్థానమును, ఆప్నోతి=పొందును.

**తాత్పర్యము:–** బుద్ధి సారథిగా, మనస్సే పగ్గాలుగా తన ఇంద్రియాశ్వాలను నడిపే యోగి తన మార్గంలో అంతిమ గమ్యమైన నా స్థానాన్ని తప్పక పొందగలడు.



**శ్లో॥ హృత్పుణ్డరీకం విరజం విశుద్ధం విశదం తథా।**
**విశోకం చ విచిన్త్యాఽత్ర ధ్యాయేన్మాం పరమేశ్వరమ్॥ 26**

**ప్రతిపదార్థము:–** =హృత్పుండరీకమ్=హృదయమను తెల్ల కమలమును, విరజమ్=దోష రహితముగా, విశదమ్=స్వచ్ఛముగా, తథా=అట్లే, విశోకమ్ చ=సంసార శోక శూన్యముగా, విచింత్య=భావించి, అత్ర=ఇట్టి హృదయకమలమునందు, మామ్=నన్ను, పరమేశ్వరమ్= దేవదేవునిగా, ధ్యాయేత్=ధ్యానింపవలయును.

**తాత్పర్యము:–** హృదయకమలాన్ని శుద్ధంగా నిర్మలంగా స్వచ్ఛంగా శోకశూన్యంగా భావించి, అనగా చేసి ఆ స్వచ్ఛ హృదయ పుండరీకములో నేను వెలుగుచున్నట్లు నేనే సర్వోత్తమగమ్య మైన పరమాత్మనని భావింపవలయును.

**శ్లో॥ అచిన్త్యరూపమవ్యక్తమనన్తమమృతం శివమ్।**
**ఆదిమధ్యాన్తరహితం ప్రశాన్తం బ్రహ్మకారణమ్॥ 27**

**ప్రతిపదార్థము:–** అచింత్య=ఊహింపశక్యముగాని, రూపమ్=రూపము గలవాడును, అవ్యక్తమ్=అస్పష్టమైనవాడును, అనంతమ్=అంతరహితుడును, అమృతమ్=అమృత స్వరూపుడును, శివమ్=మంగళరూపుడును, ఆదిమధ్యాంత=ఆది, మధ్య,అంతములు, రహితమ్=లేనివాడును, ప్రశాంతమ్=శాంతమైనదియు, బ్రహ్మ=బ్రహ్మదేవునికైనను, కారణమ్=కారణమైనదియు –

**తాత్పర్యము:–** ఊహింప శక్యముగాని వాడును, అనంతుడు, అమృతరూపుడును, సర్వ మంగళుడును, ఆదిమధ్యాంతశూన్యుడును, ప్రశాంతుడును, బ్రహ్మకారణుడును (బ్రహ్మమైన వాడును, కారణుడైనవాడును) –

**శ్లో॥ ఏకం విభుం చిదానన్దమరూపమజమద్భుతమ్।**
**శుద్ధస్ఫటికసఙ్కాశముమాదేహార్ధధారిణమ్॥ 28**

**ప్రతిపదార్థము:–**ఏకమ్=అఖండుడును, విభుమ్=సర్వవ్యాపియు, చిదానందమ్=జ్ఞానానంద స్వరూపుడును, అరూపమ్=రూపశూన్యుడును, అజమ్=జననరహితుడును, అద్భుతమ్= ఆశ్చర్యకరుడును/ఆశ్చర్యమైనవాడును, శుద్ధ=స్వచ్ఛమైన, స్ఫటిక=స్ఫటికముతో, సంకాశమ్= సమానమైనవాడును, ఉమా=పార్వతియొక్క, దేహార్ధ=సగము శరీరమును, ధారిణమ్= ధరించినవాడును –

**తాత్పర్యము:–** అఖండుడు, వ్యాపి, సచ్చిదానందమూర్తి, మూర్తిరహితుడు, అజుడు, ఆశ్చర్యుడు శుద్ధస్ఫటిక నిర్మలుడు, అర్ధనారీశ్వరుడు అగు నన్ను ధ్యానింపవలెను.

శ్లో॥ వ్యాఘ్రచర్మామ్బరధరం నీలకణ్ఠం త్రిలోచనమ్।
జటాధరం చన్ద్రమౌళిం నాగయజ్ఞోపవీతినమ్॥ 29

**ప్రతిపదార్థము:–** వ్యాఘ్రచర్మ=పులిచర్మమే, అంబర=వస్త్రమునుగా, ధరమ్=ధరించినదియు, నీల=నీలమైన, కంఠమ్=కంఠముగలవాడును, త్రి=మూడు, లోచనమ్=కన్నులుగలవాడును, జటాధరమ్=జటలు ధరించినవాడును, చంద్రమౌళిమ్=చంద్రశేఖరుడును, నాగ=సర్పమే, యజ్ఞోపవీతినమ్=జందెముగా గలవాడును –

**తాత్పర్యము:–** అర్ధనారీశ్వరుడును, పెద్దపులి చర్మము ధరించినవాడును, నీలకంఠుడును, త్రినేత్రుడును, జటాధరుడును, చంద్రశేఖరుడును, సర్పయజ్ఞోపవీతము గలవాడును–

శ్లో॥ వ్యాఘ్రచర్మోత్తరీయం చ వరేణ్యమభయప్రదమ్।
పరాభ్యామూర్ధ్వహస్తాభ్యాం బిభ్రాణం పరశుం మృగమ్॥ 30

**ప్రతిపదార్థము:–** వ్యాఘ్రచర్మ=పెద్దపులిచర్మమే, ఉత్తరీయం చ=ఉత్తరీయముగా గలవాడును, వరేణ్యమ్=వరణీయుడును, అభయప్రదమ్=అభయమిచ్చువాడును, పరాభ్యామ్=వేరైన, ఊర్ధ్వ=పై పైవున్న, హస్తాభ్యామ్=చేతులచేత, పరశుమ్=పరశువును, మృగమ్=జింకను, బిభ్రాణమ్=ధరించువాడును.

**తాత్పర్యము:–** పులిచర్మమునే ఉత్తరీయముగా ధరించినవాడును, వరింపదగినవాడును, అభయ ప్రదాతయు, ఊర్ధ్వహస్తములతో మృగ, పరశువులను పట్టినవాడును–

శ్లో॥ కోటిమధ్యాహ్నసూర్యాభం చన్ద్రకోటిసుశీతలమ్।
చన్ద్రసూర్యాగ్నినయనం స్మేరవక్త్రసరోరుహమ్।
భూతిభూషితసర్వాఙ్గం సర్వాభరణభూషితమ్॥ 31

**ప్రతిపదార్థము:–** కోటి=కోటిమంది, మధ్యాహ్నసూర్య=మధ్యాహ్న సూర్యులతో, అభమ్=సమాన కాంతిగలవాడును, చంద్రకోటి=కోటిచంద్రులతో సమానంగా, సుశీతలమ్=చల్లనివాడును, చంద్రసూర్యాగ్ని=చంద్రుడు, సూర్యుడు, అగ్నియే, నయనమ్=కన్నులుగా గలవాడును, స్మేర=చిరునవ్వుగల, వక్త్ర=ముఖమనే, సరోరుహమ్=కమలముగలవాడును, భూతి=భస్మముచేత, భూషిత=అలంకరింపబడిన, సర్వాంగమ్=సమస్త శరీరముగలవాడును, సర్వ=సమస్తమైన, ఆభరణ=సొమ్ములచేత, భూషితమ్=అలంకరింపబడినవాడును–

**తాత్పర్యము:–** కోటిమంది మధ్యాహ్న సూర్యుల వెలుగుగలవాడయినను, కోటి చంద్రులవలె చల్లనివాడును, సూర్యచంద్రాగ్నులు '3' నేత్రాలుగా గలవాడును, చిరునవ్వులు చిందించు మొగముగలవాడును, భస్మభూషిత సర్వాంగుడును, సర్వాభరణ భూషితుడును అగు మహేశ్వరుడనైన నన్ను హృదయ కమలమున సగుణముగా ధ్యానింపవలెను.



శ్లో॥ ఏవమాత్మారణిం కృత్వా ప్రణవం చోత్తరారణిమ్।
ధ్యాననిర్మథనాభ్యాసాత్సాక్షాత్పశ్యతి మాం జనః॥ 32

**ప్రతిపదార్థము:–** ఏవమ్=ఈ విధముగా,జనః=వ్యక్తి,ఆత్మ=మనస్సును,అరణిమ్=అరణినిగా, కృత్వా=చేసి, ప్రణవమ్=ఓంకారమును, ఉత్తరారణిమ్=పైని అరణిని (చిలుకకొయ్య) గా చేసి, ధ్యాన=ధ్యానించుట అను, నిర్మథన=చిలుకుటను, అభ్యాసాత్=అభ్యసించుటవలన, మామ్=నన్ను, సాక్షాత్=ప్రత్యక్షముగా, పశ్యతి=చూచును.

**తాత్పర్యము:–** మనస్సును అరణి (నిప్పు పుట్టించుటకు చిలికే కొయ్య) గా చేసి, ఓంకారమును కవ్వముగా చేసి, "ధ్యానించటం" అనే చిలకటం బాగా అభ్యసించినవాడు, నన్ను ప్రత్యక్షముగా చూడగలడు.

శ్లో॥ వేదవాక్యైరలభ్యోఽహం న శాస్త్రైర్నాపి చేతసా।
ధ్యానేన వృణుతే యో మాం సర్వదాహం వృణోమి తమ్॥ 33

**ప్రతిపదార్థము:–** అహమ్=నేను, వేదవాక్యైః=వేదవచనములచేత, అలభ్యః=పొందబడను, శాస్త్రైః=శాస్త్రములచేత,న=లభ్యుడను కాదు, చేతసాపి=మనస్సుచేతగూడా, న=అలభ్యుడను, యః=ఎవడు, సర్వదా=నిత్యము, ధ్యానేన=ధ్యానముచేత,మామ్=నన్ను,వృణుతే=వరించునో, తమ్=వానిని, అహమ్=నేను, వృణోమి=వరించెదను.

**తాత్పర్యము:–** నేను వేదశాస్త్రములు చదివినంత మాత్రమున లభింపను. మనస్సుకు అందను. నిత్యధ్యానంతో నన్ను కోరిన వానినే నేను తప్పక అనుగ్రహించెదను.

శ్లో॥ నావిరతో దుశ్చరితాన్నాశాన్తో నాసమాహితః।
నాశాన్తమానసో వాపి ప్రజ్ఞానేన లభేత మామ్॥ 34

**ప్రతిపదార్థము:–** దుశ్చరితాత్=పాపచరిత్రమునుండి, అవిరతః=దూరంకానివాడు, మామ్=నన్ను, న లభేత=పొందదు, అశాంతః=శాంతిలేనివాడు, న=పొందలేడు, అసమాహితః=సమాధి లేనివాడు, న=పొందలేడు, అశాంత=తృప్తి చెందని, మానసోవాపి=మనస్సుగల వాడైనను, న=పొందలేడు, ప్రజ్ఞానేన=విశేషజ్ఞానముతోనే, మామ్=నన్ను, లభేత=పొందును.

**తాత్పర్యము:–** పాపములు మాననివాడు, శమదమాలు లేనివాడు, సమాధి లేనివాడు / సమాధానపడనివాడు, మనస్సులో కామక్రోధాదులున్నవాడు నన్ను పొందలేడు. జ్ఞానంతో మాత్రమే నన్ను పొందగలడు.

శ్లో॥ జాగ్రత్స్వప్నసుషుప్త్యాదిప్రపఞ్చో యః ప్రకాశతే।
తద్బ్రహ్మాహమితి జ్ఞాత్వా సర్వబన్ధైః ప్రముచ్యతే॥ 35

**ప్రతిపదార్థము:-** జాగ్రత్=జాగరణము, స్వప్న=స్వప్నము, సుషుప్తి=గాఢనిద్ర, ఆది= మొదలుగాగల, ప్రపంచః=ప్రపంచము, యః=ఏది, ప్రకాశతే=ప్రకాశించుచున్నదో, తత్= అది అంతయు, బ్రహ్మ=బ్రహ్మ స్వరూపమైన, అహమ్=నేను, ఇతి=అని, జ్ఞాత్వా=ఎఱిగి, సర్వబంధైః=సమస్త బంధములచేత, ప్రముచ్యతే=విముక్తుడగును.

**తాత్పర్యము:-** జాగరణము, స్వప్నము, సుషుప్తి అనే యీ ప్రపంచం అంతా నేను అనగా బ్రహ్మ స్వరూపమే అని ఎఱిగినవాడు సర్వబంధవిమోచన పొందును.

**శ్లో॥ త్రిషు ధామసు యద్భోగ్యం భోక్తా భోగశ్చ యద్భవేత్।**
**తేభ్యో విలక్షణః సాక్షీ చిన్మాత్రోऽహం సదాశివః॥ 36**

**ప్రతిపదార్థము:-** త్రిషు=మూడు అయిన, ధామసు=లోకములందు/దశలందు, భోగ్యమ్= భోగపదార్థము, యత్=ఏది ఉన్నదో, భోక్తా=భోగం పొందువాడు ఎవడో, భోగశ్చ= భోగమును, యద్భవేత్=ఏది అగునో, తేభ్యః=వాటన్నింటికన్న, విలక్షణః=భిన్నమైన, సాక్షీ= సాక్షిని, చిన్మాత్రః=జ్ఞానమాత్రస్వరూపుడను అయిన, అహమ్=నేను, సదాశివః=సదాశివ స్వరూపుడను.

**తాత్పర్యము:-** మూడుదశలలో, మూడు లోకాలలో, భోక్త, భోగ్యము, భోగము అన్న త్రిపుటికి అతీతంగా సాక్షిగా ఉండేవాడు జ్ఞానరూపుడు అయిన నేను సదా శివుడను. సర్వమంగళుడను.

**శ్లో॥ ఏకో దేవః సర్వభూతేషు గూఢః**
**సర్వవ్యాపీ సర్వభూతాన్తరాత్మా।**
**సర్వాధ్యక్షః సర్వభూతాధివాసః**
**సాక్షీ చేతా కేవలో నిర్గుణో హి॥ 37**

**ప్రతిపదార్థము:-** దేవః=దేవుడు, ఏకః=ఒకడే, సర్వభూతేషు=సమస్త పదార్థములందు, గూఢః=దాగియున్నవాడు, సర్వ=సర్వ పదార్థములందు, వ్యాపీ=వ్యాపించినవాడు, సర్వభూత =సమస్త జీవులకు, అంతరాత్మా=అంతరాత్మగా ఉన్నవాడు, కర్మ=కర్మలకు, అధ్యక్షః=అధికారి /సాక్షి, సర్వభూత=సమస్త భూతములకు, అధివాసః=అధిష్ఠానమైనవాడును, సాక్షీ=సాక్షి, చేతా=చిద్రూపుడు, కేవలః=ఏకరూపుడు, నిర్గుణః=గుణరహితుడును అయినవాడను, అహమ్=నేనే.

**తాత్పర్యము:-** నేను ఏకరూపుడను. సర్వభూతములయందు అవిద్యవలన గూఢముగా నున్నాను. సర్వవ్యాపిని, సర్వజీవులందు అంతరాత్మగా ఉన్నాను. సర్వసాక్షిని. సర్వభూతాలకు అధిష్ఠానమును, సాక్షిని, జ్ఞానరూపుడను. కేవలుడను, నిర్గుణుడను.



**శ్లో॥ ఏకో వశీ సర్వభూతాన్తరాత్మా-**
**ప్యేకో బీజం బహుధా యః కరోతి।**
**తం మాం నిత్యం యేऽనుపశ్యన్తి ధీరా-**
**స్తేషాం శాన్తిః శాశ్వతీ నేతరేషామ్॥ 38**

**ప్రతిపదార్థము:-** ఏకః=ఒక్కడే అయినవాడును, వశీ=స్వాధీనుడును, సర్వభూత=సమస్త భూతములకు, అంతరాత్మాపి=అంతరాత్మగా గూడా అయినవాడును, ఏకః=ఒక్కడే, బీజమ్= విత్తనమై, యః=ఎవడు, బహుధా=బహువిధాలుగా, కరోతి=చేయునో, తమ్= అటువంటి, మామ్=నన్ను, యే=ఏ, ధీరాః=ఇంద్రియజయశీలులు, అనుపశ్యంతి= దర్శించగలరో, తేషామ్=వారికి, శాశ్వతీ=శాశ్వతమైన, శాంతిః=శాంతి, ఇతరేషామ్= ఇతరులకు, న=శాంతి లేదు.

**తాత్పర్యము:-** సర్వభూతాంతరాత్మను, అఖండుడను, సర్వాధ్యక్షుడను, సమస్త వైవిధ్యమునకు బీజమును అయిన నన్ను ఎవరు నిత్యం దర్శించగలరో ఆ ధీరులు శాశ్వత శాంతిని పొందగలరు. ఇతరులకు లేదు.

**శ్లో॥ అగ్నిర్యథైకో భువనం ప్రవిష్టో**
**రూపం రూపం ప్రతిరూపో బభూవ।**
**ఏకస్తథా సర్వభూతాన్తరాత్మా**
**రూపం రూపం ప్రతిరూపోऽహమేకః॥ 39**

**ప్రతిపదార్థము:-** అగ్నిః=అగ్ని, ఏకః=ఒక్కడే, భువనమ్=లోకమును, ప్రవిష్టః=ప్రవేశించిన వాడై, యథా=ఎలాగున, రూపం రూపమ్=రూపరూపాలకల్లా, ప్రతిరూపః=ప్రత్యేకరూపం గలవాడుగా, బభూవ=అయ్యెనో, తథా=అట్లే, ఏకః=అఖండుడనైన, అహమ్=నేను, ఏకః =ఒక్కడనే, రూపం రూపమ్=రూపరూపములందు, ప్రతిరూపః=ప్రత్యేక రూపముగల వాడను అయితిని.

**తాత్పర్యము:-** అగ్ని ఒక్కడే లోకమును ప్రవేశించినవాడై ఎలాగున రూపరూపాలలో చేరి ప్రత్యేక రూపము గలవాడుగా అయ్యెనో, అట్లే అఖండుడనైన నేను ఒక్కడనే రూపరూపము లందు, ప్రత్యేక రూపము గలవాడను అయితిని.

**శ్లో॥ వాయుర్యథైకో భువనం ప్రవిష్టోః**
**రూపం రూపం ప్రతిరూపో బభూవ**
**ఏకస్తథా సర్వభూతాన్తరాత్మా**
**రూపం రూపం ప్రతిరూపోऽహమేకః॥ 40**

**ప్రతిపదార్థము:-** వాయుః=వాయువు, ఏకః=ఒక్కడే, భువనమ్=లోకమును, ప్రవిష్టః =ప్రవేశించిన వాడై, యథా=ఎలాగున, రూపం రూపమ్=రూపరూపాలకల్లా, ప్రతిరూపః =ప్రత్యేకరూపం గలవాడుగా, బభూవ=అయ్యెనో, తథా=అట్లే, ఏకః=అఖండుడనైన, అహమ్=నేను, ఏకః=ఒక్కడనే, రూపం రూపమ్=రూపరూపములందు, ప్రతిరూపః=ప్రత్యేక రూపముగల వాడును అయితిని.

**తాత్పర్యము:-** వాయువు ఒక్కడే లోకమున ప్రవేశించినవాడై ఎలాగున రూపరూపాలలో చేరి ప్రత్యేక రూపము గలవాడుగా అయ్యెనో, అట్లే అఖండుడనైన నేను ఒక్కడనే రూపరూపము లందు, ప్రత్యేక రూపము గలవాడను అయితిని.

**శ్లో॥ సూర్యో యథా సర్వలోకస్య చక్షుః**
**న లిప్యతే చాక్షుషైర్బాహ్యదోషైః।**
**ఏకస్తథా సర్వభూతాంతరాత్మా**
**న లిప్యతే లోకదుఃఖేన బాహ్యః॥ 41**

**ప్రతిపదార్థము:-** సర్వలోకస్య=సర్వప్రపంచానికి, చక్షుః=కన్ను అయిన, సూర్యః=సూర్యుడు, యథా=ఎలా, చాక్షుషైః=నేత్ర సంబంధమైన, బాహ్యదోషైః=బయటి దోషములచేత, న లిప్యతే=అంటబడడో, తథా=అట్లే, సర్వభూత=సమస్త భూతములకు, అంతరాత్మా= అంతర్యామి అయిన, ఏకః=అఖండవస్తువు, బాహ్యః=అతీతమైనది కనుక, లోక=లోకముల యొక్క, దుఃఖేన=అజ్ఞానము మొదలగువానిచేత, న లిప్యతే=తాకబడదు.

**తాత్పర్యము:-** సర్వలోక నేత్రమైన సూర్యునకు మన నేత్రాది దోషములంటవు. అట్లే సర్వభూతాంతరాత్మ అయిన పరమాత్మ లోక దుఃఖములకు బాహ్యుడు అనగా అతీతుడు. కనుక ఈ లోకదోషములు పరమాత్మకు అంటవు.

**శ్లో॥ వేదేహ యో మాం పురుషం మహాన్త-**
**మాదిత్యవర్ణం తమసః పరస్తాత్।**
**స ఏవ విద్వానమృతోఽత్ర భూయా-**
**న్నాన్యస్తు పన్థా అయనాయ విద్యతే॥ 42**

**ప్రతిపదార్థము:-** ఇహ=ఈ లోకంలో, తమసః=అజ్ఞానమునకు, పరస్తాత్=అవతలగా, ఆదిత్యవర్ణమ్=సూర్యవర్ణమైనవాడును, పురాణమ్=ప్రాచీనుడైన, పురుషమ్=పురుషుడనైన, మామ్=నన్ను, యః=ఎవడు, వేద=ఎఱుగునో, సః=ఆ, విద్వానేవ=విద్వాంసుడే, అత్ర= ఇచ్చట, అమృతః=అమృతస్వరూపుడు, భూయాత్=అగును, అయనాయ=మోక్షమార్గము నకు, అన్యః=మఱొక, పంథాః తు=మార్గమైతే, న విద్యతే=లేదు.



**తాత్పర్యము:-** అజ్ఞానాంధకారమునకు అవతల వెలుగుచున్న ఆదిత్యవర్ణుడు పురాణ పురుషుడున్ను అయిన నన్ను గుర్తించినవాడు అమృతస్వరూపుడు. మోక్షమునకు ఇంతకు మించి మార్గము లేదు.

**శ్లో॥ హిరణ్యగర్భం విదధామి పూర్వం**
**వేదాంశ్చ తస్మై ప్రహిణోమి యోఽహమ్।**
**తం దేవమీడ్యం పురుషం పురాణం**
**నిశ్చిత్య మాం మృత్యుముఖాత్ప్రముచ్యతే॥ 43**

**ప్రతిపదార్థము:-** యః అహమ్=ఏ నేను, పూర్వమ్=పూర్వకాలమున, హిరణ్యగర్భమ్= బ్రహ్మను, విదధామి=సృష్టించెదనో, తస్మై=ఆయన కొఱకు, వేదాంశ్చ=వేదములనున్ను, ప్రహిణోమి=పంపుదునో, తమ్=ఆ దేవుడను, ఈడ్యమ్=స్తుతింపదగిన, పురాణం పురుషమ్= ఆదిపురుషుడను అయిన, మామ్=నన్ను, నిశ్చిత్య=నిర్ధారణచేసికొని, మృత్యుముఖాత్= చావు నోటినుండి, ప్రముచ్యతే=విడిపింపబడును.

**తాత్పర్యము:-** సృష్టికి ఆదికాలములో బ్రహ్మను సృజించినది, ఆయనకు వేదములను సమకూర్చినది నేనే. అట్టి పురాణ పురుషుడనైన నన్ను గుర్తెరిగినవాడు చావునుండి తప్పించికొనును (అంటే అర్థము వాడు జనన మరణ బంధమునుండి తప్పించికొనును. ఆత్మకు చావులేదని, శరీరమునకే చావని, తాను ఆత్మనని గ్రహించటంవలన జీవుడు అమరుడవుతాడని భావము).

**శ్లో॥ ఏవం శాన్త్యాదియుక్తఃసన్వేత్తి మాం తత్త్వతస్తు యః।**
**నిర్ముక్తదుఃఖసన్తానః సోఽన్తే మయ్యేవ లీయతే॥ 44**

**ప్రతిపదార్థము:-** ఏవమ్=ఈ విధముగా, శాంత్యాది=శాంతి మొదలగువానితో, యుక్తస్సన్= కూడినవాడై, యః=ఎవడు, మామ్=నన్ను, తత్త్వతః=అసలు రూపంలో, వేత్తి=గ్రహించునో, సః=వాడు, నిర్ముక్త=వదలబడిన, దుఃఖసంతానః=దుఃఖసమూహముగలవాడై, అంతే= చివఱకు, మయ్యేవ=నాయందే, లీయతే=లయము పొందును.

**తాత్పర్యము:-** ఇట్లే శమదమయుక్తుడైన ఉపాసకుడు నన్ను తత్త్వరీత్యా గ్రహించినట్లయితే, సర్వదుఃఖపరిహారమై చివఱకు నాలో లయించిపోవును.

**ఇతి శ్రీపద్మపురాణే ఉపరిభాగే శివగీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీశివరాఘవసంవాదే ఉపాసనాప్రపఞ్చనం నామ ద్వాదశోఽధ్యాయః॥**

* * * * *

# అథ త్రయోదశోఽ ధ్యాయః
# కైవల్య ముక్తి నిరూపణ యోగః

**సూత ఉవాచ - సూతుడిట్లనెను.**

**శ్లో॥ ఏవం శ్రుత్వా కౌసలేయస్తుష్టో మతిమతాం వరః।**
**పప్రచ్ఛ గిరిజాకాన్తం సుభగం ముక్తిలక్షణమ్॥ 1**

**ప్రతిపదార్థము:–** ఏవమ్=ఈ విధముగా, శ్రుత్వా=విని, తుష్టః=సంతోషించినవాడై, మతిమతామ్=బుద్ధిమంతులలో, వరః=శ్రేష్ఠుడైన, కౌసలేయః=కౌసల్య పుత్రుడు రాముడు, సుభగమ్=సౌభాగ్యవంతుడైన, గిరిజాకాంతమ్=పార్వతీపతి అయిన శివుని, ముక్తి=మోక్షము యొక్క, లక్షణమ్=లక్షణమును, ప్రపచ్ఛ=అడిగెను.

**తాత్పర్యము:–** బుద్ధిమంతుడైన కౌసల్యాపుత్రుడు రాముడు శివుడు చెప్పినంతా విని మోక్ష స్వరూపము చెప్పుమని అడిగెను.

**శ్రీరామ ఉవాచ-శ్రీరాముడిట్లనెను.**

**శ్లో॥ భగవన్! కరుణావిష్టహృదయ! త్వం ప్రసీద మే।**
**స్వరూపం లక్షణం ముక్తేః ప్రబ్రూహి పరమేశ్వర॥ 2**

**ప్రతిపదార్థము:–** భగవన్=స్వామీ!, కరుణావిష్ట=దయగల, హృదయ=హృదయం గలవాడా!, మే=నాకు, ప్రసీద=అనుగ్రహింపుము, పరమేశ్వర!=ఈశ్వరా!, ముక్తేః=మోక్షముయొక్క, స్వరూపమ్=స్వరూపమును, లక్షణమ్=లక్షణమును, ప్రబ్రూహి=చెప్పుము.

**తాత్పర్యము:–** పరమేశ్వరా! పరమ దయామయా! నాకు దయతో, మోక్ష తత్త్వమును దాని లక్షణమును చెప్పుము.

**శ్రీ శివ ఉవాచ-శ్రీ శివుడిట్లనెను.**

**శ్లో॥ సాలోక్యమపి సారూప్యం సార్ష్ట్యం సాయుజ్యమేవ చ।**
**కైవల్యం చేతి తాం విద్ధి ముక్తిం రాఘవ! పఞ్చధా॥ 3**



**ప్రతిపదార్థము:–** రాఘవ=రామా!, సాలోక్యమ్=సాలోక్యమని, సారూప్యమపి=సారూప్య మని, సార్ష్ట్యమ్=సార్ష్టి అని, సాయుజ్యమేవ చ=సాయుజ్యమని, కైవల్యం చేతి=కైవల్య మనియు, తామ్=ఆ, ముక్తిమ్=మోక్షమును, పంచధా=ఐదు విధములని, విద్ధి=తెలిసి కొనుము.

**తాత్పర్యము:–** రామా! సాలోక్యమని, సారూప్యమని, సార్ష్టి అని, సాయుజ్యమని, కైవల్య మనియు ఆ మోక్షము ఐదువిధములని తెలిసికొనుము.

**శ్లో॥ మాం పూజయతి నిష్కామః సర్వదా జ్ఞానవర్జితః।**
**స మే లోకం సమాసాద్య భుఙ్క్తే భోగాన్ యథేప్సితాన్॥ 4**

**ప్రతిపదార్థము:–** నిష్కామః=మోక్షము తప్ప ఇతర వాంఛలు లేనివాడై, అజ్ఞాన=జ్ఞానము చేత, వర్జితః=విడువబడినవాడై, సర్వదా=నిత్యము, యః=ఎవడు, మామ్=నన్ను, పూజయతి =పూజించునో, సః=వాడు, మే=నా, లోకమ్=లోకమును, సమాసాద్య=చేరి, యథేప్సితాన్= ఇష్టమైన, భోగాన్=భోగమును, భుంక్తే=పొందును.

**తాత్పర్యము:–**సాలోక్యముక్తి అనగా భక్తుడు నా లోకమునందు నాతో వసించుట, అజ్ఞానియై అనగా తత్త్వజ్ఞానములేక నిష్కాముడై నన్ను నిత్యము సేవించినవాడు నా లోకమునకు వచ్చి భోగములను అనుభవించును.

**శ్లో॥ జ్ఞాత్వా మాం పూజయేద్యస్తు సర్వకామవివర్జితః।**
**మయా సమానరూపఃసన్ మమ లోకే మహీయతే॥ 5**

**ప్రతిపదార్థము:–** యస్తు=ఎవడయితే, సర్వకామ=సకల వాంఛలతో, వివర్జితః=రహితుడై, మామ్=నన్ను, జ్ఞాత్వా=ఎఱిగి, పూజయేత్=పూజించునో, సః=వాడు, మయా=నాతో, సమాన=సమానమైన, రూపస్సన్=రూపముగలవాడై, మమ=నా, లోకే=లోకమునందు, మహీయతే=ఆనందపడును.

**తాత్పర్యము:–** ఇది సారూప్యముక్తి. నిష్కాముడై నా అసలు తత్త్వమెరిగి నన్ను పూజించువాడు నాతో సమానరూపుడై నా లోకమున వసించును.

**శ్లో॥ ఇష్టాపూర్తాదికర్మాణి మత్ప్రీత్యై కురుతే తు యః।**
**సోఽపి తత్ఫలమాప్నోతి నాత్ర కార్యా విచారణా॥ 6**

**ప్రతిపదార్థము:–** ఇష్ట=యజ్ఞయాగములు, పూర్త=ఆలయ నిర్మాణము, ఆది=మొదలగు, కర్మాణి=కర్మలను, మత్ప్రీత్యై=పరమేశ్వర ప్రీతి కొఱకు, యస్తు=ఎవడైతే, కురుతే=చేయునో, సోపి=అట్టివాడున్ను, తత్ఫలమ్=అట్టి ఫలమునే అనగా సాలోక్యమువంటి సార్ష్టి ఫలమునే, ఆప్నోతి=పొందును, అత్ర=ఈ విషయమై, విచారణా=విచారణ, న కార్యా=చేయనక్కఱలేదు.

**తాత్పర్యము:–** ఇష్టాపూర్తములు అనగా యజ్ఞయాగములు, సత్రాలు, ఆలయాలు, వాపీ కూపతటాకాది నిర్మాణములు కేవలము పరమేశ్వర ప్రీతిగా చేయువాడున్ను సాలోక్యము వంటి సార్ష్టి ఫలమునే పొందును. సందేహము వలదు. (ఋష్టి అనగా ఐశ్వర్యము).

**శ్లో॥ యత్కరోతి యదశ్నాతి యజ్జుహోతి దదాతి యత్।**
**యత్తపస్యతి తత్సర్వం యః కరోతి మదర్పణమ్।**
**మల్లోకే సశ్రియం భుఙ్క్తే మత్తుల్యం ప్రాభవం భజన్॥ 7**

**ప్రతిపదార్థము:–** యః=ఎవడు, యత్=దేనిని, కరోతి=చేయునో, యత్=దేనిని, అశ్నాతి= తినునో, యత్=దేనిని, జుహోతి=హోమము చేయునో, యత్=దేనిని, దదాతి=ఇచ్చునో, యత్=దేనిని, తపస్యతి=తపస్సుగా చేయునో, తత్=అది, సర్వమ్=అంతయు, మదర్పణమ్= నాకు అర్పణగా, కరోతి=చేస్తాడో, సః=వాడు, మత్తుల్యమ్=నాతో సమానమైన, ప్రాభవమ్= వైభవమును,భజన=పొందుచూ, మల్లోకే=నా లోకమున,శ్రియమ్=ఐశ్వర్యమును, భుంక్తే= అనుభవించును.

**తాత్పర్యము:–** తన పనులు, తన ఆహారము, తన హోమము, తన దానము, తన తపస్సు, ఇది అది అని ఏమిటి?–తన సర్వ కర్మలను నా కర్పణచేయువాడు నా లోకములో నాతో సమాన వైభవముతో ఐశ్వర్యము పొందును. ఇది సాయుజ్యముక్తి. ఈ ముక్తులు చాలరకాలు భేదాలతో ఉన్నాయి. సాలోక్య,సామీప్య,సారూప్య,సార్ష్టి,సాయుజ్య కైవల్యములు. ఇందు సాలోక్య సామీప్యముల మధ్య తేడా తక్కువ. సార్ష్టి – సారూప్యమని శ్రుతి. సాయుజ్యమని కొందరు. ఇవన్ని సగుణముక్తులు.

**శ్లో॥ యస్తు శాన్త్యాదియుక్తః సన్ మామాత్మత్వేన పశ్యతి।**
**స జాయతే వరం జ్యోతిరద్వైతం బ్రహ్మ కేవలమ్॥ 8**

**శ్లో॥ ఆత్మస్వరూపావస్థానం ముక్తిరిత్యభిధీయతే॥ 9**

**ప్రతిపదార్థము:–** యస్తు=ఎవడయితే, శాంత్యాది=శాంతి మొదలగు వానితో, యుక్తస్సన్= కూడినవాడై, మామ్=నన్ను, ఆత్మత్వేన=ఆత్మగా, పశ్యతి=చూచునో, సః=వాడు, పరంజ్యోతిః =పరమజ్యోతియు, అద్వైతమ్=ద్వైతరహితము, కేవలమ్=కేవలమైన, బ్రహ్మ=బ్రహ్మముగా, జాయతే=అగును, ఆత్మస్వరూప=స్వస్వరూపముతో, అవస్థానమ్=ఉండుట, ముక్తిరితి= మోక్షమని, అభిధీయతే=చెప్పబడును.

**తాత్పర్యము:–** శాంతి, దాంతి మొదలగు దైవ సంపదగలవాడై నన్ను ఆత్మగా గ్రహించిన జ్ఞాని కేవలరూపుడైన అద్వితీయ పరంజ్యోతియైన బ్రహ్మమే అగును ఇట్లు స్వస్వరూపముతో నుండుటయే "కైవల్యమోక్షము" అందురు. ఇది నిర్గుణముక్తి.



**శ్లో॥ సత్యం జ్ఞానమనన్తం సదానన్దం బ్రహ్మ కేవలమ్।**
**సర్వధర్మవిహీనం చ మనోవాచామగోచరమ్॥ 10**

**ప్రతిపదార్థము:–** సత్యమ్=సత్యమైనది లేదా సత్, జ్ఞానమ్=జ్ఞానస్వరూపమైనదియు, అనంతమ్=అంతరహితమున్ను, సదానందమ్=నిత్యానందరూపుడును, కేవలమ్= ఏకరూపమైనదియు, సర్వ=సమస్తమైన, ధర్మ=గుణములచే, విహీనం చ=రహితమైనదియు, మనః=మనస్సుకు, వాచామ్=వాక్కులకు, అగోచరమ్=అందనిదియు అయినది, బ్రహ్మ= బ్రహ్మము.

**తాత్పర్యము:–** సత్యజ్ఞానానంద స్వరూపమైనది బ్రహ్మము. అది ఏకాకారము. నిర్గుణము. మనస్సుకు వాక్కులకు అందనిది.

**శ్లో॥ సజాతీయవిజాతీయపదార్థానామసమ్భవాత్।**
**అతస్తద్వ్యతిరిక్తానామద్వైతమితి సంజ్ఞితమ్॥ 11**

**ప్రతిపదార్థము:–** అతః=కనుక, తత్=ఆ బ్రహ్మముకన్న, వ్యతిరిక్తానామ్=భిన్నమైన, సజాతీయ=అదేజాతిగల, విజాతీయ=వేరేజాతిగల, పదార్థానామ్=పదార్థములయొక్క, అసంభవాత్=లేకపోవుటవలన, "అద్వైతమ్"=అద్వితీయము, ఇతి=అని, సంజ్ఞితమ్= పేరుపెట్టబడినది.

**తాత్పర్యము:–** బ్రహ్మవంటి మఱొక పదార్థము లేదు. కనుక సజాతీయభేదము లేదు. బ్రహ్మకు భిన్నమైన పదార్థమూ లేదు. కనుక విజాతీయభేదము లేదు. కనుక బ్రహ్మభిన్న పదార్థములన్నియు మిథ్య కనుక బ్రహ్మమును "అద్వైతం" అందురు.

**శ్లో॥ మత్వా రూపమిదం రామ! శుద్ధం యదభిధీయతే।**
**మయ్యేవ దృశ్యతే సర్వం జగత్ స్థావరజఙ్గమమ్॥ 12**

**ప్రతిపదార్థము:–** రామ!=రామా!, యత్=ఏది, శుద్ధమ్=నిర్గుణమని, అభిధీయతే=చెప్పబడు చున్నదో, ఇదమ్=ఈ, రూపమ్=రూపమును, మత్వా=తెలిసికొని, ముక్తుడగును. స్థావర జంగమమ్=చరాచరమైన, సర్వమ్=సమస్తమైన, జగత్=ప్రపంచమును, మయ్యేవ= నాయందే, దృశ్యతే=కనబడును.

**తాత్పర్యము:–** రామా! నా యీ శుద్ధ రూపమును తెలిసికొని ముక్తుడగును. ఈ చరాచర ప్రపంచమంతయు నాయందే ఉన్నట్లు కనబడును.

**శ్లో॥ వ్యోమ్ని గన్ధర్వనగరం యథా దృష్టం న దృశ్యతే।**
**అనాద్యవిద్యయా విశ్వం సర్వం మయ్యేవ కల్ప్యతే॥ 13**

**ప్రతిపదార్థము:–** వ్యోమ్ని=ఆకాశమునందు, దృష్టమ్=కనబడిన, గంధర్వనగరమ్=మబ్బు వలన ఏర్పడిన ఆకారము, యథా=ఎట్లు, న దృశ్యతే=ముందు, తరువాతను, కనబడదో, తథా=అలా, సర్వమ్=మొత్తము, విశ్వమ్=ప్రపంచము, అనాది=అనాదిగా, అవిద్యయా= అవిద్యచేత, మయ్యేవ=నాయందే, కల్ప్యతే=కల్పింపబడుచున్నది.

**తాత్పర్యము:–** ఆకాశం స్వచ్ఛమైనది. శూన్యంగా కనబడుచున్నది. దానియందు మబ్బుల వలన రకరకాల ఆకారాలు ఏర్పడుతాయి. కాని కొంతసేపటిలో అవి కనబడవు. అలా ప్రపంచం నాయందు అనాదిగా అవిద్యవలన సృష్టిలయాలు పొందుతున్నది.

**శ్లో॥ మమ స్వరూపజ్ఞానేన యదాఽవిద్యా ప్రణశ్యతి।**
**తదైక ఏవ వర్తేఽహం మనోవాచామగోచరః॥**
**సదైవ పరమానన్దః స్వప్రకాశశ్చిదాత్మకః॥ 14**

**ప్రతిపదార్థము:–** మమ=నాయొక్క, స్వరూప=నిజరూపముయొక్క, జ్ఞానేన=తెలియుటచేత, యదా=ఎప్పుడు, అవిద్యా=అజ్ఞానము, ప్రణశ్యతి=నశించునో, తదా=అప్పుడు, అహమ్= నేను, ఏక ఏవ=ఒక్కడనే, వర్తే=ఉండెదను. అహమ్=నేను, మనోవాచామ్=మనస్సుకు వాక్కులకు,అగోచరః=అందనివాడను,సదైవ=నిత్యము,పరమానందః=ఆనందస్వరూపుడను, స్వప్రకాశః=స్వయంజ్యోతిని, చిదాత్మకః=జ్ఞానరూపుడను.

**తాత్పర్యము:–** అవిద్యానాశం అయిన తర్వాత ఉపాసకునకు నా స్వరూపజ్ఞానము కలుగు తుంది. అనగా అది అతని స్వస్వరూప జ్ఞానమే. ఆ స్థితిలో నేనే మిగిలియుందును. వాక్కుకు మనస్సుకు గూడా అందని నా పరమానంద స్వయం ప్రకాశజ్ఞాన స్వరూపము వెలుగుచుందును.

**శ్లో॥ న కాలః పఞ్చభూతాని న దిశో విదిశశ్చ న।**
**మదన్యన్నాస్తి యత్కిఞ్చిత్తదా వర్తేఽహమేకలః॥ 15**

**ప్రతిపదార్థము:–** కాలః=కాలము, న=ఉండదు, పంచ=ఐదు, భూతాని=భూతములు, న=ఉండవు, దిశః=దిక్కులు, న=ఉండవు, విదిశశ్చ=మూలలుగూడా, న=ఉండవు, మత్= నాకన్న, అన్యత్=భిన్నమైనది, యత్కించిత్=ఏదైనను, న=లేదు, తదా=అట్టి జ్ఞానదశలో, అహమ్=నేను, ఏకలః=ఒక్కడిగానే, వర్తే=ఉందును.

**తాత్పర్యము:–** అట్టి సమాధి/జ్ఞానదశలో నేను తప్ప ఇంకేదియు గోచరించదు. కాలము గాని, దిక్కుగాని, విదిక్కులుగాని, పంచభూతములుగాని కనబడవు. సర్వవ్యాపి అయిన అఖండ పదార్థముగా నేనే ఉండెదను.



**శ్లో॥ న సన్దృశే తిష్ఠతి మే స్వరూపం**
**న చక్షుషా పశ్యతి మాం తు కశ్చిత్।**
**హృదా మనీషా మనసాభి క్లృప్తం**
**యే మాం విదుస్తే హ్యమృతా భవన్తి॥ 16**

**ప్రతిపదార్థము:–** మే=నాయొక్క, స్వరూపమ్=స్వరూపము, సందృశే=సందర్శన కొఱకు, న తిష్ఠతి=ఉండదు, కశ్చిత్=ఎవడును,మాం తు=నన్నయితే, చక్షుషా=నేత్రాదీంద్రియముచేత, నపశ్యతి=గ్రహించలేడు, అభిక్లప్తమ్=అన్నివైపుల సమర్థింపబడిన, మామ్=నన్ను, మనీషా= (మనీట్=మనస్సుకు ప్రభువు) మనస్సును నియమించు, హృదా=బుద్ధితోను, మనసా= మనన రూపమైన చిత్తముతోనూ, యే=ఎవరు, విదుః=ఎఱుగుదురో, తేహి=వారే, అమృతాః =అమృత స్వరూపులు, భవంతి=అగుదురు.

**తాత్పర్యము:–** నా స్వరూపం నేత్రాలతో, ఇంద్రియాలతోను అందుకొనేది కాదు. సర్వత్ర ఉన్న నన్ను బుద్ధితోను, చిత్తంతోను ఎఱిగినవారు అమృతస్వరూపులగుదురు.

**శ్రీరామ ఉవాచ-శ్రీరాముడిట్లనెను.**

**శ్లో॥ కథం భగవతో జ్ఞానం శుద్ధం మర్త్యస్య జాయతే।**
**తత్రోపాయం హర! బ్రూహి మయి తేఽనుగ్రహో యది॥ 17**

**ప్రతిపదార్థము:–** భగవతః=భగవంతుడవైన, తే=నీయొక్క, శుద్ధమ్=నిర్దోషమైన, జ్ఞానమ్= జ్ఞానము, మర్త్యస్య=మనిషికి, కథమ్=ఎట్లు, జాయతే=కలుగును, హర=శివా!, మయి= నాయందు, తే=నీకు, యది అనుగ్రహః=అనుగ్రహం ఉంటే, తత్ర=ఆ జ్ఞానం పొందే విషయంలో, ఉపాయమ్=ఉపాయమును, బ్రూహి=చెప్పుము.

**తాత్పర్యము:–** దేవా!, నీకు సంబంధించిన శుద్ధ జ్ఞానము మనిషికి ఎలా వస్తుంది? నాయందనుగ్రహించి ఆ విషయము వివరింపుము.

**శ్రీ శివ ఉవాచ-శ్రీ శివుడిట్లనెను.**

**శ్లో॥ విరజ్య సర్వభూతేభ్య ఆవిరిఞ్చపదాదపి।**
**ఘృణాం వితత్య సర్వత్ర పుత్రమిత్రాదికేష్వపి॥ 18**

**ప్రతిపదార్థము:–** సర్వభూతేభ్యః=సమస్తభూతములనుండి, ఆవిరించిపదాదపి=బ్రహ్మ పదవి వఱకు, విరజ్య=విరక్తిచెంది, సర్వత్ర=అన్నింటియందు, పుత్ర=కొడుకులు, మిత్ర=మిత్రులు, ఆదికేష్వపి=మొదలగువాటియందును, ఘృణామ్=జుగుప్సను, వితత్య=విస్తరించి,

**తాత్పర్యము:–** సర్వభూతములందు వైరాగ్యము పెంచికొని, బ్రహ్మపదవి వఱకు లాలస తగ్గించికొని, పుత్రమిత్రులయందు గూడా విరక్తిని పెంచికొని – (తదుపరి శ్లోకం లోనికి)

**శ్లో॥ శ్రద్ధాళుర్మోక్షశాస్త్రేషు వేదాన్తజ్ఞానలిప్సయా।**
**ఉపాయనకరో భూత్వా గురుం బ్రహ్మవిదం వ్రజేత్॥ 19**

**ప్రతిపదార్థము:–** మోక్షశాస్త్రేషు=ఉపనిషత్తులు మొదలగు ముక్తి శాస్త్రములందు, శ్రద్ధాళుః =శ్రద్ధగలవాడై, వేదాంతజ్ఞానలిప్సయా=వేదాంతజ్ఞానముమీద జిజ్ఞాసతో, ఉపాయన= కానుకలు, కరః=చేతియందుగలవాడై, బ్రహ్మవిదమ్=బ్రహ్మ వేత్త అయిన, గురుమ్= గురువును గూర్చి, వ్రజేత్=వెళ్ళవలెను.

**తాత్పర్యము:–** ఉపనిషత్తులు మొదలగు మోక్ష దర్శనములందు శ్రద్ధగలవాడై, **వేదాంత జ్ఞానం మీద జిజ్ఞాసతో** దర్భలు, సమిధలు మొదలగు కానుకలు తీసికొని, బ్రహ్మవేత్త అయిన గురువు వద్దకు వెళ్ళవలయును.

**శ్లో॥ తమర్ఘం పురతః కృత్వా దణ్డవత్ప్రణమేద్గురుమ్।**
**ఉత్థాయ చాఞ్జలిం కృత్వా వాంఛితార్థాన్నివేదయేత్॥ 20**

**ప్రతిపదార్థము:–** తమ్=ఆ, అర్ఘమ్=కానుకను, పురతః=ముందర, కృత్వా=ఉంచి, గురుమ్= గురువును, దండవత్=సాష్టాంగముగా కఱ్ఱవలెపడి, ప్రణమేత్=నమస్కరింపవలెను. ఉత్థాయ చ=లేచి, అంజలిమ్=దోసిలిని, కృత్వా=కట్టికొని, వాంఛితార్థాన్=తన ఇష్ట విషయములను, నివేదయేత్=తెలుపవలెను.

**తాత్పర్యము:–** తాను తెచ్చిన దర్భలు, సమిధలు మొదలైన కానుకలను గురువువద్ద సమర్పించి, సాష్టాంగ నమస్కారము చేసి తన జిజ్ఞాసను విన్నవింపవలెను.

**శ్లో॥ సేవాభిః పరితోష్యైనం చిరకాలం సమాహితః।**
**సర్వవేదాన్తవాక్యార్థం శృణుయాత్సుసమాహితః॥ 21**

**ప్రతిపదార్థము:–** చిరకాలమ్=చాలకాలము, సమాహితః=ఓర్పుగలవాడై, ఏనమ్=ఈ గురువును, సేవాభిః=సేవలతో, పరితోష్య=సంతోషపఱచి, సుసమాహితః=మిక్కిలి సావధానుడై, సర్వవేదాంత=సమస్త ఉపనిషత్తులయొక్క, వాక్యార్థమ్=వాక్యార్థమును, శృణుయాత్=వినవలెను.

**తాత్పర్యము:–** గురువును సేవలతో సంతోషపఱచి, సర్వవేదాంత వాక్యార్థమును సావధానముగా వినవలెను.



**శ్లో॥ సర్వవేదాన్తవాక్యానాం మయి తాత్పర్యనిశ్చయమ్।**
**శ్రవణం నామ తత్ప్రాహుః సర్వే తే బ్రహ్మవాదినః॥ 22**

**ప్రతిపదార్థము:–** సర్వ=సమస్తమైన, వేదాంత=ఉపనిషత్తులయొక్క, వాక్యానామ్=మహా వాక్యములు మొదలగు వాక్యములకు, మయి=నాయందు, తాత్పర్య=భావముయొక్క నిశ్చయమ్=నిర్ణయమును, ఎఱుగవలయును, బ్రహ్మవాదినః=జ్ఞానులైన,తే సర్వే=అందఱూ, తత్=దానిని, శ్రవణంనామ=శ్రవణమని, ప్రాహుః=చెప్పెదరు.

**తాత్పర్యము:–** సమస్త వేదాంత వాక్యముల వక్తవ్యసారాంశము 'నేనే' నన్న సంగతి గ్రహింప వలెను. దీనిని శ్రవణమని బ్రహ్మవేత్తలు పల్కెదరు.

**శ్లో॥ లోహమణ్యాదిదృష్టాన్తైర్యుక్తిభిర్యద్విచిన్తనమ్।**
**తదేవ మననం ప్రాహుర్వాక్యార్థస్యోపబృంహణమ్॥ 23**

**ప్రతిపదార్థము:–** లోహమణి=సువర్ణము, ఆది=మొదలుగాగల, దృష్టాంతైః=ఉదాహరణల చేత, యుక్తిభిః=రకరకాల హేతువులచేత, విచింతనమ్=విన్నదానిని విచారణ చేయుట, యత్=ఏది గలదో, తత్=ఆ, వాక్యార్థస్య=విన్న వాక్యార్థముయొక్క ఉపబృంహణమ్ ఏవ= బలపఱచు పనే, మననమ్=మననమని, ప్రాహుః=చెప్పెదరు.

**తాత్పర్యము:–** సువర్ణ పిండము, మృత్పిండము, రజ్జుసర్పము, శుక్తిరజతము వంటి ఉదాహరణములతో సుషుప్తి, స్వప్నము మొదలగు యుక్తులతో 'శ్రవణం' చేసిన ఉపనిష– –ద్వాక్యార్థమును బాగా దృఢము చేసికొనుటను, 'మననం' అందురు.

**శ్లో॥ నిర్మమో నిరహఙ్కారః సమస్సఙ్గవివర్జితః।**
**సదా శాన్త్యాదియుక్తస్సన్నాత్మన్యాత్మానమీక్షతే।**
**యత్సదా ధ్యానయోగేన తన్నిదిధ్యాసనం స్మృతమ్॥ 24**

**ప్రతిపదార్థము:–** నిర్మమః=మమకారములేనివాడై, నిరహంకారః=అహంకారము లేనివాడై, సమః=సమభావనగలవాడై, సంగ=సంగముతో (ఎటాచ్‌మెంట్), వివర్జితః=రహితుడై, సదా=నిత్యము, శాంత్యాది=శాంతి మొదలగువానితో, యుక్తస్సన్=కూడినవాడై, సదా= నిత్యమైన, ధ్యానయోగేన=ధ్యానయోగముతో, ఆత్మని=తనయందున్న, ఆత్మానమ్= ప్రత్యగాత్మను, ఈక్షతే=చూచును, యత్=అనుట ఏది గలదో, తత్=అది, నిదిధ్యాసనమ్= నిదిధ్యాసనము అని, స్మృతమ్=చెప్పబడినది.

**తాత్పర్యము:–** అహంకార మమకారములు వదలి, సర్వసమభావన, రాయి రప్ప బంగారము లందు, సమభావన, దేనియందును సంగము అనగా హృదయబంధము లేకుండుట,

సదా శమదమములు మొదలైనవి దైవ సంపదతోను, ఆర్ష సంపదతోను ఉండి, నిత్యము ధ్యానయోగంలో నన్ను ప్రత్యగాత్మగా దర్శించుట "నిదిధ్యాసనము".

**శ్లో॥ సర్వకర్మక్షయవశాత్సాక్షాత్కారోఽపి చాత్మనః।**
**కస్యచిజ్జాయతే శీఘ్రం చిరకాలేన కస్యచిత్॥ 25**

**ప్రతిపదార్థము:–** సర్వకర్మ=సమస్త ప్రారబ్ధములయొక్క, క్షయవశాత్=క్షీణించుటకు లోబడి, ఆత్మనః=స్వస్వరూపముయొక్క, సాక్షాత్కారోపి చ=అపరోక్షానుభూతియును, కస్యచిత్=ఒకనికి,శీఘ్రమ్=త్వరగా,కస్యచిత్=మఱొకనికి,చిరకాలేన=చాలకాలమునకు,జాయతే=అగును.

**తాత్పర్యము:–** సర్వ పురాతన పాపపుణ్యకర్మ ఫలములు క్రమంగా తఱిగి పోవుటను బట్టి కొందరికి శీఘ్రముగను, కొందరికి త్వరగను ఆత్మసాక్షాత్కారము లభించును.

**శ్లో॥ కూటస్థానీహ కర్మాణి కోటిజన్మార్జితాన్యపి।**
**జ్ఞానేనైవ వినశ్యన్తి న తు కర్మాయుతైరపి॥ 26**

**ప్రతిపదార్థము:–** కూటస్థాని=కూటమువలె ఉన్న, ఇహ=ఈ లోకమునందలి, కర్మాణి=కర్మలు/కర్మఫలములు, కోటిజన్మ=కోటి జన్మలచేత, ఆర్జితాన్యపి=సంపాదింపబడినవైనను, జ్ఞానేనైవ=జ్ఞానముచేతనే, వినశ్యంతి=నశించును, తు=కాని, కర్మయుతైరపి=కొన్ని వేల కర్మల చేతనైనను, న=నశించవు.

**తాత్పర్యము:–** కూటస్థములనగా, ఇనుపగూటమువలె గట్టిగా ఫలమిచ్చి తీరుదాకా నశించనివి. అట్టి కర్మలన్ని అపరోక్షమైన ఆత్మజ్ఞానముతో నశించును. అంతకుమించి మఱో మార్గము లేదు. ఎన్ని వేల కర్మలు చేసినా పాపకర్మలు సమసిపోవు.

**శ్లో॥ జ్ఞానాదూర్ధ్వం తు యత్కిఞ్చిత్ పుణ్యం వా పాపమేవ వా।**
**క్రియతే బహువాల్పం వా న తేనాయం విలిప్యతే॥ 27**

**ప్రతిపదార్థము:–** జ్ఞానాత్=జ్ఞానము ఏర్పడిన పిదప, పుణ్యం వా=పుణ్యము గాని, పాపమేవ వా=పాపముగాని, యత్కించిత్=ఏదయినాకాని, బహువా=అధికముగాని, అల్పం వా=అల్పముగాని, క్రియతే=చేయబడునో, తేన=ఆ పాపపుణ్యములచేత, అయమ్=ఈ జ్ఞాని, న విలిప్యతే=తాకబడదు.

**తాత్పర్యము:–** ఆత్మజ్ఞానము లభించినవానికి ఆ తర్వాత చేసే కర్మఫలములు అంటవు. అది అల్పమైనా, అధికమైనా, పుణ్యమైనా, పాపమైనా అంతే. (అనగా జ్ఞాని కామక్రోధాది పూర్వకంగా ఏ పనిచేయడు. కాగా తన విధిలో భాగంగానో, ప్రకృతిసిద్ధంగా జరిగే క్రియలతోనో, లేక ఫలాకాంక్షరహితంగాచేసే సాత్త్విక క్రియగానో ఏదయినా చేయవచ్చును. అదంతా ఈశ్వర ప్రీతిగానే తప్ప జ్ఞానికి చెందదు అని భావము.)



**శ్లో॥ శరీరారమ్భకం యత్తు ప్రారబ్ధం కర్మ తన్మతమ్।**
**తద్భోగేనైవ నష్టం స్యాన్న తు జ్ఞానేన నశ్యతి॥ 28**

**ప్రతిపదార్థము:–** శరీర=ప్రస్తుత దేహమునకు, ఆరంభకమ్=ప్రారంభ కారణమైన, యత్తు=ఏ, కర్మ=కర్మగలదో, తత్=అది, ప్రారబ్ధమ్=ప్రారబ్ధముగా, మతమ్=చెప్పబడినది, తత్=ఆ ప్రారబ్ధము, భోగేనైవ=అనుభవించుటచేతనే, నష్టమ్=నశించినది, స్యాత్=అగును, జ్ఞానేన తు=జ్ఞానంతో, న నశ్యతి=నశింపదు.

**తాత్పర్యము:–** శరీరము ఏదైన అప్పటి ప్రారబ్ధంవలన ప్రారంభమవుతుంది. ఆ ప్రారబ్ధమే దాని స్థితిగతులను నిర్దేశిస్తుంది. అమలులోనికి వచ్చిన కర్మప్రారబ్ధం. కనుక అది జ్ఞానంతో నశించదు. అది పుట్టిననాటి నిర్దేశాన్ని బట్టి ఆయువున్నంతవఱకు, అనుభవాలతో సాగవలసిందే. **లేనిచో జ్ఞానప్రాదుర్భావక్షణముననే ప్రారబ్ధం నశిస్తే సాధకుడు వెంటనే మరణించవలసి ఉంటుంది.** జీవన్ముక్తుడు అనేవాడే ఉండడు. అంతా విదేహముక్తులే.

**శ్లో॥ నిర్మోహో నిరహఙ్కారో నిర్లేపః సఙ్గవర్జితః।**
**సర్వభూతేషు చాత్మానం సర్వభూతాని చాత్మని।**
**యః పశ్యన్ సఞ్చరత్యేష జీవన్ముక్తోఽభిధీయతే॥ 29**

**ప్రతిపదార్థము:–** నిర్మోహః=మోహరహితుడును, నిరహంకారః=అహంకారరహితుడును, నిర్లేపః=కర్మసంబంధములేనివాడును, సంగవర్జితః=సంగశూన్యుడును, సర్వభూతేషు చ=సమస్త భూతములయందు, ఆత్మానమ్=తనను, ఆత్మని=తనయందు, సర్వభూతాని చ=సర్వభూతాలను, పశ్యన్=చూచుచు, యః=ఎవడు, సంచరతి=సంచరించునో, ఏషః=ఇట్టివాడు, జీవన్ముక్తః=జీవన్ముక్తుడుగా, అభిధీయతే=చెప్పబడును.

**తాత్పర్యము:–** మమకారము, అహంకారము, సంగము, కర్మసంబంధము లేకుండగా జ్ఞానియై, తనయందు సర్వభూతములయందు సమానముగా తననే ఆత్మ రూపముగా చూచుచు, సంచరించువాడే "జీవన్ముక్తుడు" అనగా సర్వబంధ నిర్ముక్తుడై ఆత్మజ్ఞానంతో జీవించువాడు అందురు.

**శ్లో॥ అహినిర్ల్వయినీ యద్వద్ద్రష్టుః పూర్వం భయప్రదా।**
**తతోఽస్య న భయం కిఞ్చిత్ తద్వద్ద్రష్టురయం జనః॥ 30**

**ప్రతిపదార్థము:–**అహి=పాముయొక్క,నిర్ల్వయినీ=కుబుసము,ద్రష్టుః=చూచువానికి, యద్వత్=ఏవిధముగా, పూర్వమ్=ముందు, భయప్రదా=భయంకరమై, తతః=కుబుసమే ఇది పాముకాదని తెలిసిన తర్వాత, అస్య=ద్రష్టకు, కించిత్=కొంచెమైనను, భయమ్=భయము, న=లేదో, తద్వత్=అట్లే, ద్రష్టుః=చూచువానికి, అయమ్=ఈ, జనః=జీవన్ముక్తుడు కనబడును.

**తాత్పర్యము:–** పాము కుబుసమును చూచి ముందు పామని భయపడి తర్వాత, కుబుసమని తెలిసి స్తిమితపడెదము. అట్లే ద్రష్టలు జీవమ్ముక్తుని చూచి ముందు సాధారణ వ్యక్తిగా భావించెదరు. తరువాత విషయము తెలిసి సేవించెదరు. కామక్రోదాధి విషమును వదలిన పాము కుబుసము వంటిది జ్ఞాని శరీరము. దగ్ధపటం వంటిది. దానియందు కామక్రోధాది విషయదూషితమైన పాము లేదు. దేహాభిమానముగల జీవుడు లేదు. సర్వసాక్షి అయిన సచ్చిదానందాత్మయే ఉన్నది. (నిర్ల్వయినీ – నిర్+ల్వీ ధాతువు).

**శ్లో॥ యదా సర్వే ప్రముచ్యన్తే కామా యేఽస్య వశం గతాః।**
**అథ మర్త్యోఽమృతో భవత్యత్ర బ్రహ్మ సమశ్నుతే॥ 31**

**ప్రతిపదార్థము:–** అస్య=ఈ సాధకునకు, వశంగతాః=స్వాధీనమైన, కామాః=కామములు, యే=ఏవి గలవో అవి, సర్వే=అన్నియును, యదా=ఎప్పుడు, ప్రముచ్యంతే=విడువబడునో, అథ=ఆ తరువాత, మర్త్యః=మనిషి, అమృతః=అమృతుడు, భవతి=అగును, అత్ర=ఈ లోకముననే, బ్రహ్మ=ఆత్మను, సమశ్నుతే=పొందగలడు.

**తాత్పర్యము:–** హృదయములోనున్న సర్వకామములు నివర్తించిన తర్వాత మర్త్యుడు (అనగా మనిషి అనగా మరణశీలుడు అయిన దేహాభిమాని) అమృత (జ్ఞాన, బ్రహ్మ) స్వరూపుడగును. దేహానికి తప్ప అతనికి చావులేదు.

**శ్లో॥ యదా సర్వే ప్రభిద్యన్తే హృదయస్యేహ గ్రన్థయః।**
**అథ మర్త్యోఽమృతో భవత్యేతావదనుశాసనమ్॥ 32**

**ప్రతిపదార్థము:–** ఇహ=ఈ లోకమున, హృదయస్య=మనస్సుయొక్క గ్రంథయః=ముడులు / బంధాలు, సర్వే=అన్నియును, యదా=ఎప్పుడు, ప్రభిద్యంతే=తెగిపోవునో, అథ=ఆ తర్వాత=, మర్త్యః=మనిషి, అమృతః=అమృతరూపుడు, భవతి=అగును, ఏతావత్=ఇంతే, అనుశాసనమ్=ఉపదేశము.

**తాత్పర్యము:–** హృదయంలో ఉన్న శరీరాభిమాన గ్రంథులన్ని విడివడిన తర్వాత మరణశీలుడైన, మనిషి దేహాభిమాన శూన్యుడగును. అంతటితో వాడు జ్ఞానియై అమృత రూపుడగును. ఇది ఉపదేశము.

**శ్లో॥ మోక్షస్య నహి వాసోఽస్తి న గ్రామాన్తరమేవ వా।**
**అజ్ఞానహృదయగ్రన్థి నాశో మోక్ష ఇతి స్మృతః॥ 33**

**ప్రతిపదార్థము:–** మోక్షస్య=మోక్షమునకు, వాసః=ప్రత్యేకంగా ఒక నివాసస్థానము, నాస్తి= లేదు, గ్రామాంతరమేవ వా నహి=వేఱొక గ్రామంగాని లేదు, అజ్ఞాన=అజ్ఞానంవలన



ఏర్పడిన, హృదయగ్రంథి=అభిమానరూపమైన బంధముల (ముడులు) యొక్క, నాశః =నాశము, మోక్ష ఇతి=మోక్షమని, స్మృతః=చెప్పబడినది.

**తాత్పర్యము:–** మోక్షమునకు వేరేలోకంగాని నగరగ్రామాలు గాని లేవు. అది మనలోనిదే. అజ్ఞానంతో ఈ శరీరం నేనేనని, ఇదంతా నాదని వేసికొన్న నమ్మకాలు, అహంకార మమకారాలే, మనం విప్పదీయలేని పీటముడులు అనగా గ్రంథులు. వాటిని విడగొట్టడమే లేదా అవి విడిపోవడమే మోక్షము. దానికి కావలసినది తత్త్వజ్ఞానము.

**శ్లో॥ తీర్థే చణ్డాలగేహే వా యది వా నష్టచేతనః।**
**పరిత్యజన్ దేహమిమం జ్ఞానాదేవ విముచ్యతే॥ 34**

**ప్రతిపదార్థము:–** తీర్థే=క్షేత్రమునందుగాని, యది వా=లేదా, చండాల=చండాలునియొక్క గేహే వా=ఇంటియందయినను, నష్టచేతనః=ప్రాణరహితుడై, ఇమమ్=ఈ, దేహమ్= దేహమును, పరిత్యజన్=విడుచుచు, జ్ఞానాదేవ=తత్త్వజ్ఞానము వలననే, విముచ్యతే=ముక్తు డగును.

**తాత్పర్యము:–** జ్ఞాని అయినవాడు తన జ్ఞానమువలననే ముక్తిపొందును. జ్ఞాని మరణించిన చోట తీర్థమైనా, క్షేత్రమైనా, చండాలగృహమైనా ఏ విధమైన తేడా రాదు.

**శ్లో॥ సంవీతో యేన కేనాశ్నన్ భక్ష్యం వాభక్ష్యమేవ వా।**
**శయానో యత్ర కుత్రాపి సర్వాత్మా ముచ్యతేఽత్ర సః॥ 35**

**ప్రతిపదార్థము:–** యేన కేన=దేనితో ఒకదానితో, సంవీతః=చుట్టుకొనబడినవాడై, భక్ష్యం వా=తినదగినదానినిగాని, అభక్ష్యమేవ వా=తినదగనిదానినైనను, అశ్నన్=తినుచు, యత్ర కుత్రాపి=ఎక్కడో ఒకచోట, శయానః=పడుకొన్నవాడయినను, సర్వాత్మా=సర్వస్వరూపు డైన, సః=ఆ ముక్తుడు, అత్ర=ఈ లోకమున, ముచ్యతే=విడువబడును.

**తాత్పర్యము:–** జ్ఞాని అయినవాడు ఏదో ఒక వస్త్రము ధరించి ఏదో ఒకటి మంచిదో, చెడుదో తిని, ఎక్కడపడితే అక్కడ శయనించి చివఱకు ఇచ్చటనే విముక్తుడగును.

**శ్లో॥ క్షీరాదుద్ధృతమాజ్యం యత్ క్షిప్తం పయసి తత్పునః।**
**న తేనైవైకతాం యాతి సంసారే జ్ఞానవాంస్తథా॥ 36**

**ప్రతిపదార్థము:–**క్షీరాత్=పాలనుండి,యత్=ఏ, ఆజ్యమ్=నెయ్యి, ఉద్ధృతమ్=చిలుకబడినదో, తత్=అది, పునః=మరల, పయసి=పాలయందు, క్షిప్తమ్=వేయబడినదై, తేన=ఆ పాలతో, ఏకతామ్=ఐక్యమును, న యాతి=పొందదో, తథా=అట్లే, జ్ఞానవాన్=జ్ఞాని, సంసారే= సంసారమునందు కలియదు.

**తాత్పర్యము:–** పాలనుండి తీసిన వెన్నను మఱల అదేపాలలో వేసినా అది అందులో కలవదు. పైకి తేలి ఉంటుంది. ఆ పాలు దానిని తడిపి ముద్దచేయలేవు. అట్లే సంసారము నుండి ధ్యానమథనంతో వచ్చిన జ్ఞాని మఱల సంసారములో పడినా తామరాకు మీద నీటివలె ఆ సంసారంలో కలవదు. అసంగంగా జీవన్ముక్తుడుగా ఉంటాడు.

**శ్లో॥ నిత్యం పఠతి యోఽధ్యాయమిమం రామ! శృణోతి వా।**
**స ముచ్యతే దేహబన్ధాదనాయాసేన రాఘవ!॥ 37**

**ప్రతిపదార్థము:–** రామ!=రామా!, రాఘవ=రఘువీరా!, ఇమమ్=ఈ, అధ్యాయమ్=అధ్యాయమును, యః=ఎవడు, నిత్యమ్=నిత్యముగా, పఠతి=పఠించునో, శృణోతి వా=వినునో, సః=ఆ సాధకుడు, దేహబంధాత్=శరీరసంగమునుండి, అనాయాసేన=సులభంగా, ముచ్యతే=విడువబడును.

**తాత్పర్యము:–** రాఘవా! రామా! ఈ అధ్యాయమును నిత్యము పఠించినా, విన్నా – అట్టి సాధకుడు అనాయాసముగా ఈ దేహబంధమునుండి బయటపడును.

**శ్లో॥ అతః సంయతచిత్తస్త్వం నిత్యం పఠ మహీపతే।**
**అనాయాసేన తేనైవ సర్వథా మోక్షమాప్స్యసి॥ 38**

**ప్రతిపదార్థము:–** అతః=కనుక, మహీపతే=రాజా!, త్వమ్=నీవు, సంయత=ఏకాగ్రముగా నియమింపబడిన, చిత్తః=మనసు గలవాడవై, నిత్యమ్=నిత్యము, పఠ=చదువుము, తేనైవ=దానితోనే, సర్వథా=అన్నివిధముల, అనాయాసేన=తేలికగా, మోక్షమ్=ముక్తిని, ఆప్స్యసి=పొందగలవు.

**తాత్పర్యము:–** రామచంద్రా! కనుక ఈ అధ్యాయమును నిత్యము ఏకాగ్రతతో పఠింపుము. దానివలన నీవు సర్వదుఃఖములనుండి అనగా భార్యావిరహమునుండి, అపహరణ కష్టము నుండి, రాబోవు యుద్ధమునుండి, చివఱకు సంసారమునుండి మోక్షమును పొందెదవు.

**ఇతి శ్రీపద్మపురాణే ఉపరిభాగే శివగీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీశివరాఘవసంవాదే మోక్షనిరూపణం నామ త్రయోదశోఽధ్యాయః॥**

* * * * *



## అథ చతుర్దశోఽధ్యాయః
# పఞ్చకోశ వివరణయోగః

**శ్రీరామ ఉవాచ-శ్రీరాముడిట్లనెను.**

**శ్లో॥ భగవన్! యది తే రూపం సచ్చిదానన్దవిగ్రహమ్।**
**నిశ్చలం నిష్క్రియం శాన్తం నిరవద్యం నిరఞ్జనమ్॥ 1**

**ప్రతిపదార్థము:–** భగవన్=ప్రభూ!, తే=నీయొక్క, రూపమ్=స్వరూపము, సచ్చిదానంద విగ్రహమ్=సచ్చిదానంద స్వరూపము, యది=అయినచో, నిశ్చలంయది=అచలమైనచో, నిష్క్రియంయది=క్రియారహితమైనచో, శాంతం యది=శాంతమైనదైనచో, నిరవద్యమ్ యది =నిర్దోష మైనచో, నిరంజనమ్ యది=నిస్సంగమయినచో–

**తాత్పర్యము:–** దేవా! నీ రూపము అందరి రూపములవలె నేత్రగ్రాహ్యముకాదంటివి. ఇంద్రియగ్రాహ్యమూ కాదంటివి. అది సచ్చిదానందస్వరూపము, నిశ్చలము, క్రియా రహితము, శాంతము, నిర్వికారము, నిర్లేపము, అసంగము – అంటివి.

**శ్లో॥ సర్వధర్మవిహీనం చ మనోవాచామగోచరమ్।**
**సర్వవ్యాపినమాత్మానం క్షీరే సర్పిరివ స్థితమ్॥ 2**

**ప్రతిపదార్థము:–** సర్వధర్మ=సమస్తగుణములతో, విహీనం చ=రహితమైనదియు, మనోవాచామ్=మనస్సుకు, వాక్కులకు, అగోచరమ్=అందనిదియు, సర్వవ్యాపినమ్=సర్వ వ్యాపి అయినదియు, క్షీరే=పాలయందు, సర్పిరివ=నేయివలె, స్థితమ్=ఉన్నదియు–

**తాత్పర్యము:–** నీ రూపము సర్వగుణరహితము. మనస్సుకు అందదు. వాక్కులతో చెప్పలేము. సర్వవ్యాపి. పాలయందునేయివలె ప్రపంచమున ఆత్మరూపముగా గూఢముగా నున్నదంటివి.

**శ్లో॥ ఆత్మవిద్యా తపో మూలం తద్బ్రహ్మోపనిషత్పరమ్।**
**అమూర్తం సర్వభూతాత్మాకారం కారణకారణమ్॥ 3**

ప్రతిపదార్థము:- ఆత్మవిద్యా=ఆత్మవిద్యలకు, తపః=తపస్సులకు, మూలమ్=మూలమైనదియు, తత్='తత్' అను శబ్దముచేత చెప్పబడునదియు, బ్రహ్మ=విస్తారమైనదియు, ఉపనిషత్పరమ్= ఉపనిషత్తులకు అందనిదియు, అమూర్తమ్=మూర్తిలేనిదియు, సర్వభూత=సమస్త భూతము లందు, ఆత్మాకారమ్=ఆత్మరూపముగానున్నదియు, కారణ=కారణములయిన మాయాదులకు, కారణమ్=కారణమైనదియు -

**తాత్పర్యము:-** ఆత్మ విద్యలకు, తపస్సులకు మూలమైన ఉపనిషత్తులకే అతీతమైనది, దృఢమైన మూర్తిలేనిది, సర్వభూతములందు గూఢముగా ఆత్మరూపముగా నుండునది, కారణ పదార్థములకే కారణమైనది అంటివి.

**శ్లో॥ యత్తదదృశ్యమగ్రాహ్యం తద్గ్రాహ్యం వా కథం భవేత్।**
**అత్రోపాయమజానానస్తేన ఖిన్నోఽస్మి శఙ్కర!॥ 4**

**ప్రతిపదార్థము:-** తత్=అటువంటి, అదృశ్యమ్=కనబడని, అగ్రాహ్యమ్=గ్రహింపరాని, యత్=ఏ నీ రూపము గలదో, తత్=అది, కథం వా=ఎట్లు, గ్రాహ్యమ్=గ్రహింపదగినది, భవేత్=అగును, శంకర!=శివా! అత్ర=ఈ విషయంలో, ఉపాయమ్=ఉపాయమును, అజానానః=తెలియనివాడనై, తేన=ఆ అజ్ఞానముచేత, ఖిన్నః=దిగులుపడిన వాడను, అస్మి= అగుచున్నాను.

**తాత్పర్యము:-** దేవా! అట్టి నీ రూపము అదృశ్యము. కనుక అగ్రాహ్యము. దానిని పట్టుకొనుట ఎట్లు? పట్టుకొననిచో తరించుట ఎట్లు? అని ఖిన్నుడనైనాను. కనుక నీ రూపమును గ్రహించు ఉపాయము చెప్పుము.

**ఈశ్వర ఉవాచ-ఈశ్వరుడిట్లనెను.**

**శ్లో॥ శృణు రాజన్! ప్రవక్ష్యామి తత్రోపాయం మహాభుజ!।**
**సగుణోపాసనాభిస్తు చిత్తైకాగ్ర్యం విధాయ చ।**
**స్థూలారున్ధతికా న్యాయాత్ తత్ర చిత్తం ప్రవర్తయేత్॥ 5**

**ప్రతిపదార్థము:-** మహాభుజ=భుజశాలీ, రాజన్=మహారాజా!, శృణు=వినుము, తత్ర= అందులో, ఉపాయమ్=ఉపాయమును, ప్రవక్ష్యామి=చెప్పగలను, సగుణ=సగుణబ్రహ్మము లయిన నారాయణుడు మొదలగు వారియొక్క, ఉపాసనాభిస్తు=ఉపాసనలచేత, చిత్త= మనస్సుయొక్క, ఐకాగ్ర్యమ్=ఏకాగ్రతను, విధాయ=చేసి, స్థూలారుంధతికా న్యాయాత్= స్థూలారుంధతీ న్యాయమువలన, తత్ర=ఆ పరమాత్మయందు, చిత్తమ్=మనస్సును, ప్రవర్తయేత్=ప్రవర్తింప జేయవలయును.



**తాత్పర్యము:-** రాజా! రామచంద్రా! ఉపాయము చెప్పెదను. వినుము. ముందు సగుణ మూర్తులైన శివ విష్ణు అగ్ని వాయు ప్రాణ మొదలైనవారిని ఉపాసింపవలయును. ఇది స్థూలారుంధతీన్యాయము. అనగా అరుంధతీ నక్షత్రము చాల సూక్ష్మముగా కనబడు చుండును. నేరుగా దానిని గుర్తించటం కష్టం. అందువలన దానికి దగ్గరగానున్న పెద్ద నక్షత్రమును లేదా వశిష్ఠ నక్షత్రమును లేదా సప్తర్షులతోకను చూపి, అందలి వశిష్ఠ నక్షత్రం వద్ద కొంతసేపు దృష్టి నిలిపితే ఆ దగ్గరలో మకమకలాడుచున్న 'అరుంధతి' దర్శనము కాగలదు. అట్లే నిర్గుణ పరబ్రహ్మను, మన ఆత్మను కనుగొనుట కష్టము. కనుక ముందు సగుణ బ్రహ్మలయిన అగ్ని, మిత్ర, వరుణ, ఇంద్ర, విష్ణు, శివాదులను ధ్యానించుట లేదా దేహగత ప్రాణ, మనస్సులు మొదలగువానిని బ్రహ్మముగా ఉపాసన చేయించుతారు. ఆ తర్వాత అచ్చటనే లభ్యమగు పరమాత్మను దర్శింపగలము. ముందు స్థూలమును చూపి తర్వాత అరుంధతిని చూపినట్లు సూక్ష్మమును చూపుట, కనుక ఇది 'స్థూలారుంధతీ న్యాయము'.

**శ్లో॥ తస్మిన్నన్నమయే పిణ్డే స్థూలదేహే తనూభృతామ్।**
**జన్మవ్యాధిజరామృత్యునిలయే వర్తతే దృఢా।**
**ఆత్మబుద్ధిరహం మానాత్ కదాచిన్నైవ హీయతే॥ 6**

**ప్రతిపదార్థము:-** తస్మిన్=ఆ, అన్నమయే=అన్నమువలన వచ్చిన, పిండే=ముద్ద అయినదియు, జన్మ=జననము, వ్యాధి=రోగములు, జరా=ముదుసలితనము, మృత్యు= మరణములకు, నిలయే=స్థానమున్ను అయిన, స్థూలదేహే=స్థూలశరీరమునందు, అహం మానాత్=నేను అను భావనవలన, ఆత్మబుద్ధిః=ఆత్మ అను బుద్ధి, దృఢా=దృఢముగా, వర్తతే=ఉండును, కదాచిత్=ఒకప్పుడైనా, నైవ హీయతే=తగ్గనే తగ్గదు.

**తాత్పర్యము:-** ఈ శరీరము అన్నమయమైన ముద్ద. దీనికి జననం, మరణం, జర, వ్యాధులు అన్ని ఉన్నాయి. అయినా జీవుడు 'శరీరముతాను' అని భావించుటవలన శరీరమే 'ఆత్మ' అంటాడు. ఈ శరీరాత్మభావన ఎన్నటికి పోదు.

**శ్లో॥ ఆత్మా న జాయతే నిత్యో మ్రియతే వా కథం చ న॥ 7**

**శ్లో॥ సంజాయతేఽస్తి విపరిణమతే వర్ధతే తథా।**
**క్షీయతే నశ్యతీత్యేతే షడ్భావా వపుషః స్మృతాః॥ 8**

**ప్రతిపదార్థము:-** ఆత్మా=ఆత్మ, నిత్యః=నిత్యమైనది, నజాయతే=పుట్టదు, కథంచన=ఎట్లు, మ్రియతే=చచ్చును?, సంజాయతే=పుట్టును, అస్తి=ఉండును, విపరిణమతే=పరిణమించును,

వర్ధతే=పెరుగును, తథా=అట్లే, క్షయతే=తరుగును, నశ్యతి=నశించును, ఇతి=అని, ఏతే =ఈ, షట్=ఆఱు, భావాః=భావాలు, వపుషః=శరీరమునకు, స్మృతాః=స్మరింపబడినవి.

**తాత్పర్యము:–** ఆత్మ నిత్యము. దానికి జననం లేదు. ఇక మరణం ఎలా వస్తుంది? పుట్టుక, ఉనికి, మార్పు, పెరుగుదల, తఱుగుదల, మరణము – అను ఈ ఆఱుదశలు శరీరానికి మాత్రమే చెందినవి.

**శ్లో॥ ఆత్మనో న వికారిత్వం ఘటస్థనభసో యథా।**
**ఏవమాత్మాఽవపుస్తస్మాదితి సఞ్చిన్తయేద్బుధః॥ 9**

**ప్రతిపదార్థము:–** ఘటస్థ=కుండలో ఉన్న, నభసః=ఆకాశమునకు (ఖాళీకి), యథా=ఎట్లు, వికారిత్వమ్=మార్పులక్షణము, న=లేదో, తథా=అలా, ఆత్మనః=ఆత్మకు, న=లేదు, ఏవమ్ =ఇందువలన, ఆత్మా=ఆత్మ, అవపుః=శరీరము కాదు. తస్మాత్=అందువలన, బుధః= పండితుడు, ఇతి=ఇలా, సంచింతయేత్=విచారింపవలయును.

**తాత్పర్యము:–** కుండలో ఉన్న 'ఖాళీ' కి కుండకు సంబంధించిన ఏ వికారమూ అంటదు. శరీరములో ఉన్న ఆత్మకు శరీర వికారాలు ఏవీ అంటవు అని పండితుడు విచారణ చేయవలెను.

**శ్లో॥ మూషానిక్షిప్తహేమాభః కోశః ప్రాణమయోఽత్ర తు।**
**వర్తతేఽన్తరతో దేహే బద్ధః ప్రాణాదివాయుభిః॥ 10**

**ప్రతిపదార్థము:–** అత్ర తు=ఈ, దేహే=దేహమునందు, అంతరతః=లోపలగా, ప్రాణాది= ప్రాణము మొదలైన, వాయుభిః=వాయువులచేత, బద్ధః=కట్టబడినదై, ప్రాణమయః= ప్రాణమయమైన, కోశః=కోశము, మూషా=మూసయందు, నిక్షిప్త=ఉంచబడిన, హేమ= బంగారముతో, ఆభః=సమానమైనదిగా, వర్తతే=ఉండును.

**తాత్పర్యము:–** ఈ శరీరములో ప్రాణాది వాయువులతో బంధింపబడిన ప్రాణమయ కోశము మూసలో ఉంచిన బంగారము వలె దిగబడియున్నది.

**శ్లో॥ కర్మేన్ద్రియైః సమాయుక్తశ్చలనాదిక్రియాత్మకః।**
**క్షుత్పిపాసా పరాభూతో నాయమాత్మా జడో యతః॥ 11**

**ప్రతిపదార్థము:–** కర్మేంద్రియైః=కర్మేంద్రియములైన పాణిపాదాదులచేత, సమాయుక్తః= కూడినదై, చలనాది=కదలించుట మొదలగు, క్రియాత్మకః=క్రియలు కలదయి, క్షుత్=ఆకలి, పిపాసా=దప్పికలచేత, పరాభూతః=ఇబ్బందిపెట్టబడిన, అయమ్=ఈ ప్రాణ కోశము, జడో యతః=జడమైనది కనుక, ఆత్మా=ఆత్మ, న=కాదు.



**తాత్పర్యము:–** పాణిపాదాది కర్మేంద్రియములతో కలిసి చలనాది క్రియలు చేయునట్టి ప్రాణకోశము ఆత్మకాదు. ఇది చైతన్య స్పర్శవలన కదలుతుంటుంది. ఆకలి దప్పికలకు ఇది బాధపడుతుంటుంది. ఆహారపానీయాలు లేకపోతే ఇది ఎగిరిపోతుంది. స్వతహాగా ఇది జడం. కనుక ఆత్మకాదు.

**శ్లో॥ చిద్రూప ఆత్మా యేనైవ స్వదేహమనుపశ్యతి।**
**ఆత్మైవ హి పరంబ్రహ్మ నిర్లేపః సుఖనీరధిః॥ 12**

**శ్లో॥ న తదశ్నాతి కిఞ్చైతత్ తదశ్నాతి న కిఞ్చన॥ 13**

**ప్రతిపదార్థము:–** యేనైవ=దేనితోనే, స్వదేహమ్=తన దేహమును,అనుపశ్యతి=గమనించునో అది, చిద్రూపః=జ్ఞానరూపమైన, ఆత్మా= ఆత్మయే, నిర్లేపః=నిరంజనమైనదియు, సుఖ=ఆనందమునకు, నీరధిః=సముద్రమున్ను అయినది అగు, ఆత్మైవ=మనలోని, ఆత్మయే, పరంబ్రహ్మ=పరబ్రహ్మము,తత్=ఆ బ్రహ్మం, ఏతత్=ఈ విశ్వమును, కించ=దేనినీ, న అశ్నాతి=తినదు, కించన=ఏదియును, తత్=ఆ బ్రహ్మమును, న అశ్నాతి=తినదు.

**తాత్పర్యము:–** జ్ఞానరూపమైన ఆత్మ అదే యీ శరీరాన్ని గమనించే తెలివి. దానివలన అహంకార మమకారాది జ్ఞానాంశలు కలుగుతున్నాయి. ఆత్మ మాత్రము ఇవేమీ అంటనిది. అది కేవలం ఆనందసముద్రము. బ్రహ్మము దేనినీ తినదు. ఏదీ బ్రహ్మమును తినదు.

**శ్లో॥ తతః ప్రాణమయే కోశే కోశోఽస్త్యేవ మనోమయః।**
**స సఙ్కల్పవికల్పాత్మా బుద్ధీన్ద్రియసమాహితః॥ 14**

**ప్రతిపదార్థము:–** తతః=తర్వాత, ప్రాణమయే=ప్రాణమయమైన, కోశే=కోశమునందు, మనోమయః=మనోమయమను, కోశః=కోశము, అస్త్యేవ=ఉన్నది, సః=అది, సంకల్ప-వికల్పాత్మా=సంకల్ప వికల్పస్వరూపమైనది, బుద్ధి=బుద్ధి, ఇంద్రియ=ఇంద్రియములతో, సమాహితః=కూడినదైయుండును.

**తాత్పర్యము:–** ప్రాణమయకోశమున మనోమయకోశముండును. మనస్సు సంకల్ప వికల్పములు చేయుచుండును. అది సహజ క్రియ. దానికి బుద్ధి, ఇంద్రియములు సహాయ పడును. (ఇంతవఱకు చెప్పినవి జీవుని వశములేక సహజముగా తమ పని తాము చేయునవి – వ్యాఖ్యాత).

**శ్లో॥ కామః క్రోధః తథా లోభో మోహో మాత్సర్యమేవ చ।**
**మదశ్చేత్యరిషడ్వర్గో మమతేచ్ఛాదయోఽపి వా।**
**మనోమయస్య కోశస్య ధర్మా ఏతస్య తత్ర తు॥ 15**

**ప్రతిపదార్థము:–** కామః=కామము, క్రోధః=కోపము, తథా=అట్లే, లోభః=లోభము, మోహః =మోహము, మాత్సర్యమేవ చ=మాత్సర్యము, మదశ్చ=మదము, ఇతి=అని, అయమ్=ఈ, అరిషడ్వర్గః=ఆరు శత్రువుల సమూహము, మమతా=మమకారము, ఇచ్ఛాదయఃఅపి వా=కోరికలు అసహ్యములు మొదలైనవిగాని, ఏతస్య=ఈ, మనోమయస్య=మనోమయమను, కోశస్య=కోశమునకు, ధర్మాః=ధర్మములు, తత్ర తు=అందులో.

**తాత్పర్యము:–**మనోమయకోశంలో కామము, క్రోధము, లోభము, మోహము, మాత్సర్యము, మదము అను అరిషడ్వర్గము (అనగా ఆఱుగురు శత్రువులు) దానితోబాటు కోరికలు మమకారములు, అసహ్యములు – ఇవి గుణములుగా ఉండును.

**శ్లో॥ యా కర్మవిషయా బుద్ధిర్వేదశాస్త్రార్థనిశ్చితా।**
**సా తు జ్ఞానేన్ద్రియైః సార్ధం విజ్ఞానమయకోశతః॥ 16**

**ప్రతిపదార్థము:–** కర్మవిషయా=కర్తవ్యవిషయమైనది, వేదశాస్త్రార్థ=వేదశాస్త్రార్థములచేత, నిశ్చితా=నిశ్చయింపబడినదగు, యా=ఏ, బుద్ధిః=బుద్ధికలదో, సా తు=అది, జ్ఞానేంద్రియైః =కన్ను,ముక్కు మొదలగు జ్ఞానేంద్రియాలతో,సార్ధమ్=కలిసి, విజ్ఞానమయ=విజ్ఞానమయము అను, కోశతః=కోశపక్షమున కలదు.

**తాత్పర్యము:–** మనోమయకోశంలో బుద్ధి ఇంద్రియాలు ఉంటాయి. ఈ ఇంద్రియాలతో కలిసిన బుద్ధియే విజ్ఞానము. (బుధ్=జ్ఞానమనే అర్థము) వేదశాస్త్ర పరిజ్ఞానము, దానివలన కార్యాకార్య విచక్షణ, ఇది చేయాలనే నిశ్చయము – ఇదంతా బుద్ధి లక్షణము. దీనిని విజ్ఞానమయకోశము అందురు.

**శ్లో॥ ఇహ కర్తృత్వాభిమానీ స ఏవ తు న సంశయః।**
**ఇహాఽముత్రగతిస్తస్య స జీవో వ్యావహారికః॥ 17**

**ప్రతిపదార్థము:–** ఇహ=ఈ లోకంలో, ఈ శరీరంలో, స ఏవ తు=వాడే, కర్తృత్వ=నేను కర్తను అనే, అభిమానీ=విశ్వాసముగలవాడు, సంశయః=సందేహము, న=లేదు, తస్య= వానికే, ఇహ=ఇచ్చటకు, అముత్ర=పరలోకమునకు, గతిః=రాకపోకలుగలవు, సః=అతడే, వ్యావహారికః=వ్యావహారికుడైన, జీవః=జీవుడు.

**తాత్పర్యము:–** దేహంలో 'కర్తను నేను' అన్న అభిమానం గల వాడు వీడే. ఇందులో సందేహము లేదు. వీడే వ్యావహారికంగా 'జీవుడు' అని పిలువబడేది. వీనికే ఇహలోక పరలోకయాత్రలు. పాపపుణ్యఫలములు వీడివే.



*(స్థూలశరీరము జడము. ప్రాణములు జడములు. ఇవి యంత్రము వంటివి. వీటికి చైతన్య సన్నిధానములో కదలిక ఉంటుంది. స్థూలశరీరము కంప్యూటర్ యొక్క హార్డ్‌వేర్ వంటిది. అందలి ప్రాణము దానికి కావలసిన 'విద్యుత్తు' వంటిది. ఇవి జ్ఞానములు కావు. జడములు. ఇందులో మనస్సు ఉంటుంది. దానికి సంకల్పాలు, వాటికి ఎదురుగా వికల్పాలు చేసే శక్తి ఉంటుంది. అనగా కంప్యూటర్‌లోని సాఫ్ట్‌వేర్ వంటిది. ఇది గూడా యాంత్రికమే. దీనిలోని సంకల్పశక్తి మన అధీనంలోది కాదు. మనం ఆపినా మనస్సు పనిచేయటం ఆగదు. యోగాలు ప్రాణాయామం ద్వారా దానిని అపుతారని యోగశాస్త్రము చెబుతుంది. దానిని మనం బుద్ధితో గమనించటం మొదలు పెట్టినా దాని చలనం కొంత ఆగుతుంది అంటారు సాంఖ్యులు. ఏదైనా ఇదొక యంత్రము. దీనిలోను జ్ఞానము ఉండదు. దీనిలోనే ఇంద్రియాలు, బుద్ధి ఉంటాయి. ఈ 'బుద్ధి' నే జ్ఞానము అంటారు. 'బుధ–జ్ఞానే' అని ధాతువు. 'జ్ఞా– అవబోధనే' అని ధాతువు. కాగా జ్ఞానము అన్నా బుద్ధి ఉన్నా ఒక్కటే. దీనినే జీవుడంటారు. అయితే అసలు జీవుడు ప్రత్యగాత్మయే. కాని ఇది వ్యావహారిక జీవుడు. ఈ 'బుద్ధి' కంప్యూటర్‌లోని "ప్రోగ్రామ్" వంటిది. మన 'తెలివి' దీనిలోనికి ప్రసరించినపుడు కంప్యూటర్ తనలోని "ప్రోగ్రామ్" అంతా తనే చేస్తున్నట్లు చేసికొని పోతుంటుంది. అలానే ప్రత్యగాత్మ చైతన్యము సోకటం వలన 'బుద్ధి' తానే జీవుడిలాగా వ్యవహరిస్తుంది. ఇచ్చటనుంచి 'జీవుడు' అని చెప్పటానికి కారణము ఏమి? అంటే ఇక్కడ నుంచి నేను, నాది అని భావము, దానితో తన మనస్సును, ఇంద్రియాలను, శరీరాన్ని తన కోసం వినియోగించటం మొదలవుతుంది. కనుక ఇది నిశ్చయాత్మకము. కర్త, భోక్త అన్ని అవుతుంది. అందువలననే వీనిని 'సారథి' అంటారు. ప్రత్యగాత్మ అసలు రథయజమాని. ఆయనను వదలి సారథి తన యిష్టము వచ్చినట్లు రథం నడిపితే పరాజయం తప్పదు. కనుక యీ బుద్ధికి తన స్థానము తెలియజెప్పి దీని పనులన్నియు ప్రత్యగాత్మకు అంకితం చేయటం నేర్పితే కామక్రోధాది శత్రు విజయం లభిస్తుంది. అందువలన విజ్ఞానకోశం వద్ద 'జీవుడు' అనగా వ్యావహారిక జీవుడు పుట్టాడు. వీడు జాగరణంలో ఆనందించినా, సుషుప్తిలో ఆనందించినా (సమాధిలో ఆనందించినా) ఆనందమయ జీవు డవుతాడు.)*

**శ్లో॥ వ్యోమాదిసాత్త్వికాంశేభ్యో జాయన్తే ధీన్ద్రియాణి తు।**
**వ్యోమ్నః శ్రోత్రం భువో ఘ్రాణం జలాజ్జిహ్వాఽథ తేజసః।**
**చక్షుర్వాయోస్త్వగుత్పన్నా తేషాం భౌతికతా తతః॥ 18**

**ప్రతిపదార్థము:–** వ్యోమాది=ఆకాశం మొదలగుభూతములయొక్క, సాత్త్వికాంశేభ్యః=సాత్త్విక భాగములనుండి, ధీ=బుద్ధి, ఇంద్రియాదయః=ఇంద్రియాదులు, జాయంతే=పుట్టును,

వ్యోమ్నః=ఆకాశమునుండి, శ్రోత్రమ్=చెవి, భువః=భూమినుండి, ఘ్రాణమ్=ముక్కు, జలాత్=నీటినుండి, జిహ్వా=నాలుక, అథ=తరువాత, తేజసః=అగ్నినుండి, చక్షుః=కన్ను, వాయోః=వాయువునుండి, త్వక్=చర్మము, ఉత్పన్నా=పుట్టెను, తతః=అందువలన, తేషామ్=వాటికి, భౌతికతా=భౌతికములను పేరు వచ్చెను.

**తాత్పర్యము:–** పంచభూతములోని సాత్త్వికాంశలనుండి (అత్యంత సారగుణము సత్త్వము) ఇంద్రియాలు, బుద్ధి పుట్టినవి. అందులో ఆకాశము నుండి చెవి, భూమి నుండి ముక్కు, నీటినుండి నాలుక, అగ్నినుండి కన్ను, వాయువునుండి చర్మము పుట్టినవి. అందువలననే వీటిని భౌతికములు (అనగా భూతమునుండి పుట్టినవి) అందురు.

**శ్లో॥ వ్యోమాదీనాం సమస్తానాం సాత్వికాంశేభ్య ఏవ తు।**
**జాయేతే బుద్ధిమనసీ బుద్ధిస్స్యాన్నిశ్చయాత్మికా॥ 19**

**ప్రతిపదార్థము:–** వ్యోమాదీనామ్=ఆకాశము మొదలైన, సమస్తానామ్=పంచభూతము లన్నింటియొక్క, సాత్త్వికాంశేభ్య ఏవ తు=సాత్త్వికాంశలనుండియే, బుద్ధిమనసీ=బుద్ధి మనస్సులు, జాయేతే=పుట్టును, బుద్ధిః=బుద్ధి, నిశ్చయాత్మికా=నిశ్చయరూపమైనది, స్యాత్=అగును.

**తాత్పర్యము:–** ఆకాశాది పంచభూతములయొక్క సాత్త్వికాంశలనుండి 'బుద్ధి' మనస్సు జన్మించినవి. అందులో బుద్ధి నిశ్చయస్వరూపము.

**శ్లో॥ వాక్పాణిపాదపాయూపస్థాని కర్మేన్ద్రియాణి తు।**
**వ్యోమాదీనాం రజోఽంశేభ్యో వ్యస్తేభ్యస్తాన్యనుక్రమాత్॥ 20**

**ప్రతిపదార్థము:–** వ్యస్తేభ్యః=విడివైన, వ్యోమాదీనామ్=ఆకాశాదులయొక్క, రజోంశేభ్యః=రాజస భాగములనుండి, తాని=ఆ, వాక్=వాక్కు, పాణి=చేతులు, పాద=కాళ్ళు, పాయు=ముడ్డి, ఉపస్థాని=జననేంద్రియము అను, కర్మేంద్రియాణి=కర్మేంద్రియములు, అనుక్రమాత్=క్రమముగా పుట్టినవి.

**తాత్పర్యము:–** ఆకాశరాజసాంశమునుండి వాక్కు, ఇలా పంచభూత రాజసాంశముల నుండి పంచకర్మేంద్రియములు ఏర్పడినవి.

**శ్లో॥ సమస్తేభ్యో రజోఽంశేభ్యః పఞ్చ ప్రాణాదివాయవః।**
**జాయన్తే సప్తదశకమేవం లిఙ్గశరీరకమ్॥ 21**

**ప్రతిపదార్థము:–** సమస్తేభ్యః=సమష్టిగా ఉన్న, పంచభూతములయొక్క, రజోంశేభ్యః=రాజసాంశలనుండి, ప్రాణాది=ప్రాణము మొదలగు, వాయవః=వాయువులు, పంచ=



ఐదున్ను, జాయంతే=పుట్టినవి, ఏవమ్=ఇలా, సప్తదశకమ్=పదిహేడు, లింగశరీరకమ్=లింగ శరీరము అగును.

**తాత్పర్యము:–** పంచభూతములయొక్క సమష్టి రజోంశలనుండి ప్రాణాదివాయు పంచకము పుట్టినది. ఇవి అన్ని అనగా ఐదు జ్ఞానేంద్రియాలు, ఐదు కర్మేంద్రియాలు, ఐదు ప్రాణాది వాయువులు, మనస్సు ఒకటి, బుద్ధి ఒకటి – మొత్తం పదిహేడు కలిసి లింగశరీరము అందురు.

**శ్లో॥ ఏతల్లిఙ్గశరీరం తు తప్తాయఃపిణ్డవద్యతః।**
**పరస్పరాధ్యాసయోగాత్సాక్షీ చైతన్యసంయుతః॥ 22**

**శ్లో॥ తదానన్దమయః కోశో భోక్తృత్వం ప్రతిపద్యతే।**
**విద్యా కర్మఫలాదీనాం భోక్తేహాముత్ర స స్మృతః॥ 23**

**ప్రతిపదార్థము:–** ఏతత్=ఈ, లింగశరీరంతు=లింగశరీరమయితే, సాక్షిచైతన్య=కూటస్థమైన, ఆత్మచైతన్యముతో, సంయుతః=కూడినదై, పరస్పర=అన్యోన్యముయొక్క, అధ్యాస=ఆరోపణయొక్క, యోగాత్=సంబంధమువలన, (లింగశరీరమును ఆత్మ అనుకొనుట, ఆత్మను లింగశరీరము అనుకొనుట అన్యోన్యాధ్యాస), తప్తాయః పిండవత్=కాలిన ఇనుప గుండువలె (కొలిమిలో కాల్చిన ఇనుపగుండు అగ్నిలాగా అయినట్లు), యతః=ఎందువలన అగునో, తత్=అందువలన, ఆనందమయః=ఆనందమయము అను, కోశః=కోశమై, భోక్తృత్వమ్=భోక్త అగుటను, ప్రతిపద్యతే=పొందును, విద్యా=విద్య, కర్మఫల=కర్మఫలము, ఆదీనామ్=మొదలగువాటికి, సః=వాడు, భోక్తా=భోక్తగా, ఇహ=ఈ లోకమున, అముత్ర=పరలోకమున, స్మృతః=చెప్పబడెను.

**తాత్పర్యము:–** లింగశరీరము సాక్షి చైతన్యంతో సంబంధించి చైతన్యవంతమవుతుంది. అగ్నిలో బాగా కాలిన ఇనుపగుండు అగ్నిలాగా ఎర్రగా అయిపోతుంది. అలా లింగశరీరము సాక్షి సంబంధముచేత చైతన్యంగా అవుతుంది. కర్మఫలములను అనుభవించును. దుఃఖమైనా ఆనందమైనా అక్కడే అనుభవిస్తుంది. (విజ్ఞానమయకోశంలోని విజ్ఞానాత్మ విజ్ఞాన (బుద్ధి) సహాయంతో కర్త అవుతుంది. అదే ఆత్మ ఆనందమయకోశంలో సుఖదుఃఖాదులను అనుభవిస్తుంది. కనుక 'భోక్త' అవుతుంది. అంటే ఒకే వ్యక్తి వంట చేస్తూ పాకానికి "కర్త" అవుతాడు. వంటను తింటూ "భోక్త" అవుతాడు. సర్వలోకఫలభోక్త అతడే.

**శ్లో॥ యదాఽధ్యాసం విహాయైష స్వస్వరూపేణ తిష్ఠతి।**
**అవిద్యామాత్రసంయుక్తః సాక్ష్యాత్మా జాయతే తదా॥ 24**

**శ్లో॥ ద్రష్టాన్తఃకరణాదీనామనుభూతస్మృతేరపి॥ 25**

**ప్రతిపదార్థము:-** యదా=ఎప్పుడు, ఏషః=ఈ ఆత్మ, అధ్యాసం=పైనచెప్పిన అధ్యాసను, విహాయ=విడిచి, స్వస్వరూపేణ=స్వస్వరూపముతో, తిష్ఠతి=ఉండునో, తదా=అప్పుడు, అవిద్యామాత్ర=కేవలము అవిద్యతోనే, సంయుక్తః=కూడినవాడై, సాక్షి=సాక్షి అయిన, ఆత్మా= ఆత్మగా, జాయతే=అగును, అంతఃకరణాదేరపి=అంతఃకరణము మొదలగువాటికి, అనుభూత=అనుభవింపబడిన అనుభవానికి, స్మృతేరపి=స్మరణకు గూడా, ద్రష్టా=సాక్షి అగును.

**తాత్పర్యము:-** (పై శ్లోకములో చెప్పిన) అధ్యాసను జ్ఞానంతో పోగొట్టికొని తన స్వరూపంతో ఉన్న సాక్షి, అవిద్యామాత్రయుతుడై 'ఆత్మ' గా ఉండును. అంతఃకరణానికి అనుభవాలకు, స్మరణానికి అతడే సాక్షిగా ఉండును. (అంటే సుషుప్తిలో పొందిన ఆనందానుభవానికి ఆత్మయే సాక్షి. కనుకనే నిద్రలేచినవాడు తాను చాల సుఖంగా నిద్రపోయినాను అని చెప్పగలడు. నిద్రలో అంతఃకరణం పనిచేయదుగనుక సుఖానుభవానికి ఆత్మ తప్ప మఱొక సాక్షి లేదు. అందువలన అనుభూత స్మృతికి సాక్షి కావలెను. అది ఆత్మయే.)

**శ్లో॥ అతోఽన్తఃకరణాధ్యాసాద్ అధ్యస్తత్వేన చాత్మని।**
**భోక్తృత్వం సాక్షితా చేతి ద్వైవిధం తస్యోపపద్యతే॥ 26**

**ప్రతిపదార్థము:-** అతః=కనుక, అంతఃకరణ=అంతఃకరణముయొక్క, అధ్యాసాత్=ఆరోపణ వలన, ఆత్మనః=ఆత్మ, అధ్యస్తత్వేన=అధ్యాసచేయబడినదగుటవలన, తస్య=ఆ ఆత్మకు, భోక్తృత్వమ్=భోక్త అను దశ, సాక్షితా చేతి=సాక్షి అను స్థితి, ద్వైవిధమ్=రెండు స్థితులు, ఉపపద్యతే=కుదురును.

**తాత్పర్యము:-** అంతఃకరణాన్ని ఆరోపణ చేయటం వలన అధ్యాస పొందిన ఆత్మకు 'భోక్త', 'సాక్షి' అనే రెండు దశలుంటాయి. ఆనందమయకోశంలో 'కర్త' అయిన ఆత్మ అతీతంగా సుషుప్తి సమాధులలో 'సాక్షి' అవుతాడు.

**శ్లో॥ ఆతపశ్చాపి తచ్ఛాయా తత్రప్రకాశే విరాజతే।**
**ఏకో భోజయితా తత్ర భుఙ్క్తేఽన్యః కర్మణః ఫలమ్॥ 27**

**ప్రతిపదార్థము:-** ఆతపశ్చాపి=ఎండయు, తచ్ఛాయా=దాని నీడయు, తత్రప్రకాశే=ఆ ఎండ యొక్క వెలుగులో, విరాజతే=ప్రకాశించును, తత్ర=అందులో, ఏకః=ఒకడు, భోజయితా= ఫలానుభవమిచ్చువాడు, అన్యః=మఱొకడు, కర్మణః=కర్మయొక్క, ఫలమ్=ఫలితమును, భుంక్తే=తినును.



**తాత్పర్యము:-** ఎండ-నీడ రెండు ఆ ఎండలోనే ఉంటాయి. అట్లే ఆత్మయొక్క వెలుగు అనగా సాక్షిదశ, నీడ అనగా భోక్తదశ ఈ రెండు సాక్షి వెలుగులోనే ఏర్పడును. అందులో సాక్షి భోగదాత. జీవుడు (విజ్ఞానాత్మ) భోగి అవుతాడు.

**శ్లో॥ క్షేత్రజ్ఞం రథినం విద్ధి శరీరం రథమేవ తు।**
**బుద్ధిం తు సారథిం విద్ధి ప్రగ్రహం తు మనస్తథా॥ 28**

**ప్రతిపదార్థము:-** క్షేత్రజ్ఞమ్=క్షేత్రజ్ఞుడైన జీవుని, రథినమ్=రథికునిగా, విద్ధి=తెలిసికొనుము, శరీరం=శరీరమును, రథమేవతు=రథముగా తెలిసికొనుము, బుద్ధింతు=బుద్ధిని, సారథిమ్= సారథినిగా, విద్ధి=తెలిసికొనుము, తథా=అట్లే, మనస్సు=మనస్సునే, ప్రగ్రహమ్=పగ్గముగా తెలిసికొనుము.

**తాత్పర్యము:-** శరీరము రథము. జీవుడు రథికుడు. బుద్ధి సారథి. మనస్సు పగ్గము - అని భావించవలయును.

**శ్లో॥ ఇన్ద్రియాణి హయాన్విద్ధి విషయాంస్తేషు గోచరాన్।**
**ఇన్ద్రియైర్మనసాయుక్తం భోక్తారం విద్ధి పూరుషమ్॥ 29**

**ప్రతిపదార్థము:-** ఇంద్రియాణి=ఇంద్రియాలను,హయాన్=గుఱ్ఱములుగా, విద్ధి=ఎరుగుము, విషయాన్=విషయములను, తేషు=ఆ ఇంద్రియాశ్వములకు, గోచరాన్=తిరుగుప్రదేశము- -లుగా తెలిసికొనుము, ఇంద్రియైః=ఇంద్రియములతోను, మనసా=మనస్సుతో, యుక్తమ్= కూడిన, పురుషమ్=పురుషుని (విజానాత్మను), భోక్తారమ్=భోక్తగా, విద్ధి=తెలిసికొనుము.

**తాత్పర్యము:-** ఇంద్రియాలు గుఱ్ఱాలవంటివి. విషయాలు ఆ గుఱ్ఱాలు తిరిగే భూములు. మనస్సుతోను, ఇంద్రియాలతోను కలిసిన పురుషుడే (జీవుడు) భోక్త.

**శ్లో॥ ఏవం శాన్త్యాదియుక్తఃసన్నుపాస్తే యః సదా ద్విజః।**
**ఉద్ఘాట్యోద్ఘాట్యైకమేకం యథైవ కదలీతరోః॥ 30**

**శ్లో॥ వల్కలాని తతః పశ్చాల్లభతే సారముత్తమమ్।**
**తథైవ పఞ్చకోశేషు మనః సంక్రామయన్ క్రమాత్।**
**తేషాం మధ్యే తతః సారమాత్మానమపి విన్దతి॥ 31**

**ప్రతిపదార్థము:-** ఏవమ్=ఈ విధముగా, శాంత్యాది=శాంతి మొదలగువానితో, యుక్తస్సన్= కూడినవాడై, యః=ఏ, ద్విజః=విప్రుడు, ఉపాస్తే=సేవించునో అతడు, యథైవ=ఎట్లు, కదలీతరోః=అరటి చెట్టుయొక్క, వల్కలాని=పట్టలను, ఏకమేకమ్=ఒక్కటొక్కటే, ఉద్ఘాట్య+ ఉద్ఘాట్య=ఒలిచి ఒలిచి, తతః పశ్చాత్=ఆ తరువాత, ఉత్తమమ్=శ్రేష్ఠమైన, సారమ్=సారమైన

'ఊచను', లభతే=పొందునో, తథైవ=అట్లే, పంచకోశేషు=అన్నమయకోశము మొదలగు పంచకోశములందు, మనః=మనస్సును, సంక్రామయన్=ధారణచేయుచు, క్రమాత్=క్రమముగా, తేషామ్=ఆ కోశములయొక్క, మధ్యే=మధ్యన, తతః=అచ్చటినుండి, సారమ్=సారమైన, ఆత్మానమపి=ప్రత్యగాత్మనుగూడా, విందతి=పొందును.

**తాత్పర్యము:–** అట్లే శాంతుడు,దాంతుడు అయిన సాధకుడు, అరటి చెట్టు దొప్పలు ఒక్కొక్కటి ఒలిచి, లోపలి తెల్లని 'ఊచను' గ్రహించినట్లు పంచకోశములను మనోధారణతో ఒలిచి, సారమైన 'ఆత్మ'ను పొందవచ్చును.

**శ్లో॥ ఏవం మనః సమాధాయ సంయతో మనసి ద్విజః।**
**అథ ప్రవర్తయేచ్చిత్తం నిరాకారే పరాత్మని॥ 32**

**ప్రతిపదార్థము:–** ద్విజః=ద్విజుడు, ఏవమ్=ఇట్లు, మనః=మనస్సును, సమాధాయ=సమాధానపఱచి, మనసి =మనస్సునందు, సంయతః=నిగ్రహం కలవాడై, అథ=తర్వాత, నిరాకారే=ఆకారరహితమైన, పరాత్మని=పరమాత్మయందు, చిత్తం=మనస్సును, ప్రవర్తయేత్=ప్రవర్తింపజేయవలెను.

**తాత్పర్యము:–** ద్విజుడు మనస్సును ఏకాగ్రంచేసి, నిగ్రహించి సాధకుడు నిరాకార పరబ్రహ్మమునందు నిలుపవలయును.

**శ్లో॥ తతో మనః ప్రగృహ్ణాతి పరమాత్మానమవ్యయమ్।**
**యత్తదదృశ్యమగ్రాహ్యమస్థూలాద్యుక్తిగోచరమ్॥ 33**

**ప్రతిపదార్థము:–**తతః=తర్వాత, మనః=మనస్సు, అదృశ్యమ్=ఇంద్రియాలకు అందనిదియు, అగ్రాహ్యమ్=వాక్కుకు మనస్సుకు అందనిదియు, అస్థూలాద్యుక్తి=అస్థూలం, అనణుహ్రస్వం మొదలైన వేదవాక్యములకు, గోచరమ్=అర్థమైనదియు అగు, యత్=ఏదిగలదో, తత్=ఆ, అవ్యయమ్=నాశరహితమైన, పరమాత్మానమ్=పరమాత్మను, ప్రగృహ్ణాతి=గ్రహించును.

**తాత్పర్యము:–** మనస్సును నిలిపిన తర్వాత అది ఆ అదృశ్యము, అగ్రాహ్యము, అవ్యయము, అస్థూలము, అనణువు, అహ్రస్వమున్ను అని వేదములచే చెప్పబడిన పరమాత్మను గ్రహించగలుగును.

**శ్రీరామ ఉవాచ-శ్రీరాముడిట్లనెను.**

**శ్లో॥ భగవన్! శ్రవణేనైవ ప్రవర్తన్తే జనాః కథమ్।**
**వేదశాస్త్రార్థసంపన్నా యజ్వానః సత్యవాదినః॥ 34**

**శ్లో॥ శృణ్వన్తోఽపి తథాఽఽత్మానం జానతే నైవ కేచన।**
**జ్ఞాత్వాఽపి మన్యతే మిథ్యా కిమేతత్తవ మాయయా॥ 35**



**ప్రతిపదార్థము:–** భగవన్=దేవా!, తవ=నీయొక్క, మాయయా=మాయచేత, జనాః=జనులు, శ్రవణే=వినుటయందు, కథమ్=ఎందుకు, తథా=అట్లు, నైవ ప్రవర్తంతే=ప్రవర్తించరు? తథా=అట్లు, వేదశాస్త్రార్థ=వేదశాస్త్రార్థములచే, సంపన్నాః=కూడినవారును, సత్యవాదినః =సత్యవాదులును, యజ్వానః=యజ్ఞకర్తలును, శృణ్వంతోపి=వినుచున్నను, ఆత్మానమ్=ఆత్మను, నైవ జానతే=ఎఱుగరు, కేచన=కొందరు, జ్ఞాత్వాపి=తెలిసియు, మిథ్యా=మిథ్యగా, మన్వతే=తలచుచున్నారు, కిమేతత్=ఏమిటిది?

**తాత్పర్యము:–** దేవా! నీ మాయ విచిత్రము. అసలు జనులు వేదాంత శ్రవణానికే యిష్ట పడరు. వేదశాస్త్రాలు చదివినవారైన, సత్యవాదులు, సోమయాజులు అయినను కొంచెం విన్నా ఆత్మజ్ఞాము పొందుటలేదు. కొందరు తెలిసికొనియు మిథ్యగా తలచుచున్నారు. ఏమిటది?

**శ్రీ శివ ఉవాచ**

**శ్లో॥ ఏవమేవ మహాబాహో! నాఽత్ర కార్యా విచారణా॥ 36**

**శ్లో॥ దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా।**
**మామేవ యే ప్రపద్యన్తే మాయామేతాం తరన్తి తే॥ 37**

**ప్రతిపదార్థము:–** మహాబాహో!=మహావీరా!, ఏవమేవ=అంతే, అత్ర=ఈ విషయములో, విచారణా=విచారణ, నకార్యా=చేయదగినదికాదు, ఏషా=ఇది, గుణమయీ=గుణమయమైనది, దైవీ=దైవ (అదృష్ట) సంబంధమైనది అగు, మమ=నాయొక్క, మాయా=మాయ, దురత్యయా=దాటరానిది, యే=ఎవరు, మామేవ=నన్నే, ప్రపద్యంతే=శరణు వేడెదరో, తే=వారు, ఏతామ్=ఈ, మాయామ్=మాయను, తరన్తి=దాటెదరు.

**తాత్పర్యము:–** రామా! ఇదింతే. అదంతా సత్త్వరజస్తమో గుణాత్మకమైన నా మాయయే. ఇది దైవానుసారిణి, అనగా కర్మఫలానుసారిణి. దానిని జయించుట కష్టము. కాని నన్ను శరణువేడినవారు తప్పక దీనిని జయించి దాటగలరు.

**శ్లో॥ అభక్తా యే మహాబాహో! మమ శ్రద్ధా వివర్జితాః।**
**ఫలం కామయమానాస్తే చైహికాముష్మికాదికమ్। 38**

**ప్రతిపదార్థము:–** మహాబాహో!=మహావీరా! రామా!, మమ=నాకు, అభక్తాః=భక్తులు కానివారై, శ్రద్ధా=నా యందలి శ్రద్ధతో, వివర్జితాః=శూన్యులయిన, తే=వారు, ఐహిక=ఇహలోకసంబంధమైనది,ఆముష్మిక=పరలోక సంబంధమైనది, ఆదికమ్=మొదలుగాగల, ఫలమ్ =ఫలమును, కామయమానాః=కోరుచుందురు.

**తాత్పర్యము:–** నా యందు శ్రద్ధలేని భక్తిహీనులు కర్మఫలము మీద ఆశపడి ఇహలోక పరలోక ఫలితాలను కోరుకొందురు.

**శ్లో॥ క్షయిష్ణ్వల్పం సాతిశయం యతః కర్మఫలం మతమ్।**
**తదవిజ్ఞాయ కర్మాణి కుర్వన్తి హి నరాధమాః।**
**మాతుః పతన్తి తే గర్భే మృత్యోర్వక్త్రే పునః పునః॥ 39**

**ప్రతిపదార్థము:–** యతః=ఎందువలన, కర్మఫలమ్=కర్మలవలన వచ్చు ఫలము, క్షయిష్ణు=తరిగిపోవునది, అల్పమ్=స్వల్పమైనది, సాతిశయమ్=భేదములతో కూడినది అని, మతమ్=తలచబడెనో, తత్=ఆ విషయమును, అవిజ్ఞాయ=ఎరుగక, నరాధమాః=మానవాధములు, కర్మాణి=కర్మలను, కుర్వంతి హి=చేయుదురు, తే=వారు, పునః పునః=మాటి మాటికి, మాతుః=తల్లియొక్క, గర్భే=గర్భమునందు, మృత్యోః=మృత్యువుయొక్క, వక్త్రే=నోటియందు, పతంతి= పడుచున్నారు.

**తాత్పర్యము:–** కర్మఫలము శాశ్వతము కాదు. క్షయశీలమైనది. తేడాలతో గూడినది. స్వల్పకాలికమైనది. ఈ సంగతి తెలియక నరాధములు కర్మలను చేసి కర్మ ఫలములు పొంది మాటిమాటికి జనన మరణములను పొందుచున్నారు.

**శ్లో॥ నానాయోనిషు జాతస్య దేహినో యస్య కస్యచిత్।**
**కోటిజన్మార్జితైః పుణ్యైర్మయి భక్తిః ప్రజాయతే॥ 40**

**ప్రతిపదార్థము:–** నానాయోనిషు=నానా జన్మలయందు, జాతస్య=పుట్టిన, యస్య కస్యచిత్=ఎవడో ఒక, దేహినః=దేహికి, కోటిజన్మ=కోటిజన్మలచేత, ఆర్జితైః=సంపాదింపబడిన, పుణ్యైః=పుణ్యములచేత, మయి=నాయందు, భక్తిః=భక్తి, ప్రజాయతే=కలుగును.

**తాత్పర్యము:–** అనేక జన్మలెత్తిన తర్వాత అనేక జన్మలందు ఆర్జించిన పుణ్యఫలముగా ఒకని కెవనికో నాయందు భక్తి కలుగును.

**శ్లో॥ స ఏవ లభతే జ్ఞానం మద్భక్తః శ్రద్ధయాన్వితః।**
**నాన్యకర్మాణి కుర్వాణో జన్మకోటిశతైరపి॥ 41**

**శ్లో॥ తతః సర్వం పరిత్యజ్య మద్భక్తిం సముదాహర॥ 42**

**ప్రతిపదార్థము:–** సః=అటువంటి, మద్భక్త ఏవ=నా భక్తుడే, శ్రద్ధయా=శ్రద్ధతో, అన్వితః=కూడినవాడై, జ్ఞానమ్=జ్ఞానమును, లభతే=పొందును, అన్యకర్మాణి=ఇతర కార్యములను, కుర్వాణః=చేయువాడు, జన్మకోటిశతైరపి=వందకోట్ల జన్మలకైనా, నలభతే=జ్ఞానము



పొందదు, తతః=అందువలన, సర్వమ్=సమస్తమును, పరిత్యజ్య=విడిచి, మద్భక్తిమ్=నా భక్తిని, సముదాహర!=సంపాదింపుము.

**తాత్పర్యము:–** నా యందు భక్తిశ్రద్ధలుగలవానికే జ్ఞానము కలుగును. ఇతర కార్యాసక్తుడైన వానికి కోట్ల జన్మలెత్తినా నా భక్తిరాదు. కనుక నీవు ఇతర విషయాలను వదలి నా భక్తిని స్వీకరింపుము.

**శ్లో॥ సర్వధర్మాన్పరిత్యజ్య మామేకం శరణం వ్రజ।**
**అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః॥ 43**

**ప్రతిపదార్థము:–** సర్వధర్మాన్=సమస్త కర్తవ్యములను, పరిత్యజ్య=వదలి,మామ్=నన్ను ఏకమ్=ఒక్కనినే, శరణమ్=శరణును, వ్రజ=పొందుము, అహమ్=నేను, త్వా=నిన్ను, సర్వ=సమస్తమైన, పాపేభ్యః=పాపములనుండి, మోక్షయిష్యామి=విడిపింపగలను, మా శుచః=విచారింపకుము.

**తాత్పర్యము:–** సర్వకర్తవ్యములను వదలి నన్నే శరణుపొందుము. నేను నిన్ను సమస్త పాపములనుండి విడిపించి మోక్షమివ్వగలను. శోకింపకుము.

**శ్లో॥ యత్కరోషి యదశ్నాసి యజ్జుహోషి దదాసి యత్।**
**యత్తపస్యసి రామ! త్వం తత్కురుష్వ మదర్పణమ్॥ 44**

**శ్లో॥ తతః పరతరా నాస్తి భక్తిర్మయి రఘూత్తమ!॥ 45**

**ప్రతిపదార్థము:–** రామ!=రామా!, యత్=దేనిని, కరోషి=చేయుదువో, యత్=ఏది, అశ్నాసి=తినెదవో, యత్=దేనిని, జుహోషి=హోమము చేసెదవో, యత్=దేనిని, దదాసి=దానము చేసెదవో, యత్=ఏమి, తపస్యసి=తపస్సు చేసెదవో, తత్=అదియంతయు, మదర్పణమ్=నాకు అర్పణముగా, కురుష్వ=చేయుము, రఘూత్తమ=రామా!, తతః=సర్వార్పణకన్న, పరతరా=శ్రేష్ఠమైన, మయి=నా యందలి, భక్తిః=భక్తి, నాస్తి=లేదు.

**తాత్పర్యము:–** రాఘవా! నీవు ఏమి చేసినా, తినినా, హోమము చేసినా, దానము చేసినా, తపస్సు చేసినా అంతా నాకే సమర్పించుము. ఇంతకు మించి 'శివభక్తి' లేదు.

**ఇతి శ్రీ పద్మపురాణే ఉపరిభాగే శివగీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీ శివరాఘవసంవాదే పఞ్చకోశవివరణయోగో నామ చతుర్దశోఽధ్యాయః॥**

* * * * *

# అథ పఞ్చదశోఽధ్యాయః
# భక్తియోగః

**శ్రీరామ ఉవాచ**

శ్లో॥ భక్తిస్తే కీదృశీ దేవ! జాయతే వా కథం చ సా।
యయా నిర్వాణరూపం తు లభ్యతే మోక్షముత్తమమ్।
తద్బ్రూహి గిరిజాకాన్త! మయి తేఽనుగ్రహో యది॥ 1

**ప్రతిపదార్థము:–** దేవ!=ప్రభూ!, తే=నీ, భక్తిః=భక్తి, కీదృశీ=ఎట్టిది?, యయా=దేనిచేత, నిర్వాణరూపం తు=నిర్వాణరూపమైన, ఉత్తమమ్=ఉత్తమమైన, మోక్షమ్=మోక్షము, లభ్యతే =మాచేత పొందబడునో, సా=ఆ భక్తి, కథం చ=ఎట్లు, జాయతే వా=పొందబడును, గిరిజాకాంత!=పార్వతీపతీ!, మయి=నాయందు, తే=నీకు, అనుగ్రహః=దయ, యది= ఉన్నచో, తత్=ఆ విషయమును, బ్రూహి=చెప్పుము.

**తాత్పర్యము:–** దేవా! పరమేశ్వరా! నీ భక్తి ఎటువంటిది. అందు నిర్వాణరూపమైన అనగా లయరూప ముక్తిని ఇచ్చే ఆ భక్తిని గూర్చి నా పై అనుగ్రహముతో వివరింపుము.

**శ్రీ శివ ఉవాచ - శ్రీ శివుడు ఇట్లనెను.**

శ్లో॥ యో వేదాధ్యయనం యజ్ఞం దానాని వివిధాని చ।
మదర్పణధియా కుర్యాత్ స మే భక్తః స మే ప్రియః॥ 2

**ప్రతిపదార్థము:–** యః=ఎవడు,వేదాధ్యయనమ్=వేదాధ్యయనమును, యజ్ఞమ్=యాగమును, వివిధాని=అనేకములైన, దానాని చ=దానములను, మదర్పణ=నాకు అర్పించునట్టి, ధియా= బుద్ధితో, కుర్యాత్=చేయునో, సః=వాడు, మే=నాకు, భక్తః=భక్తుడు, సః=అతడు, మే=నాకు, ప్రియః=ఇష్టుడు.

**తాత్పర్యము:–** ఎవడు తన వేదాధ్యయనమును యజ్ఞయాగములను, దానాలను పరమేశ్వర ప్రీతిగా సమర్పణ భావముతో చేయునో వాడే నా భక్తుడు. వాడే నాకు ఇష్టుడు.



శ్లో॥ నర్మభస్మసమాదాయ విశుద్ధం శ్రోత్రియాలయాత్।
అగ్నిరిత్యాదిభిర్మన్త్రైరభిమన్త్ర్య యథా విధి॥ 3

**ప్రతిపదార్థము:–** శ్రోత్రియాలయాత్=వైదికగృహమునుండి, విశుద్ధమ్=శుద్ధమైన, నర్మ= వేడుకదయిన / గార్హపత్యాగ్ని సంబంధమైన, భస్మ=విభూతిని, సమాదాయ=తెచ్చి, అగ్నిరిత్యాదిభిః=అగ్ని మొదలగు, మంత్రైః=మంత్రములతో, యథా విధి=విధి ప్రకారము, అభిమంత్ర్య=మంత్రించి –

**తాత్పర్యము:–** శ్రోత్రియుని గృహమునుండి భస్మమును తెచ్చికొని దానిని 'అగ్ని' మొదలగు మంత్రములతో యథావిధిగా మంత్రించవలయును.

శ్లో॥ ఉద్ధూలయతి గాత్రాణి తేన చార్చతి మామపి।
తస్మాత్పరతరా భక్తిర్మమ రామ! న విద్యతే॥ 4

**ప్రతిపదార్థము:–** గాత్రాణి=అవయవములను, తేన=ఆ భస్మముతో, ఉద్ధూలయతి=పూసి కొనును లేదా ఊదికొనును, తేన=ఆ భస్మముతో, మా మపి=నన్ను గూడా, అర్చతి= పూజించును, రామ!=రామా!, తస్మాత్=ఆ భస్మపూజ కన్న, పరతరా=శ్రేష్ఠమైన, మమ= నా, భక్తిః=భక్తి, న విద్యతే=లేదు.

**తాత్పర్యము:–** ఆ భస్మము ఒంటినిండా పూసికొని, దానితో నన్ను పూజింపవలయును. రామా! ఇంతకుమించిన 'శివభక్తి' మఱొకటి లేదు.

శ్లో॥ సర్వదా శిరసా కణ్ఠే రుద్రాక్షాన్ధారయేత్తు యః।
పఞ్చాక్షరీ జపరతః స మే భక్తః స మే ప్రియః॥ 5

**ప్రతిపదార్థము:–** యః=ఎవడు, సర్వదా=నిత్యము, శిరసా=తలచేత, కంఠే=కంఠమునందు, రుద్రాక్షాన్=రుద్రాక్షలను, ధారయేత్తు=ధరించునో, పంచాక్షరీ=పంచాక్షరీమంత్రముయొక్క జప=జపించుటయందు, రతః=ఆసక్తుడైన, సః=ఆ సాధకుడు, మే=నాకు, భక్తః=భక్తుడు, సః=అతడు, మే=నాకు, ప్రియః=ప్రియమైనవాడు.

**తాత్పర్యము:–** నిత్యము రుద్రాక్షలు కంఠ శిరస్సులందు ధరించి పంచాక్షరీ జపము చేయువాడు నా ప్రియభక్తుడు.

శ్లో॥ భస్మచ్ఛన్నో భస్మశాయీ సర్వదా విజితేన్ద్రియః।
యస్తు రుద్రం జపేన్నిత్యం చిన్తయేన్మామనన్యధీః।
స తేనైవ చ దేహేన శివః సంజాయతే స్వయమ్॥ 6

**ప్రతిపదార్థము:–** భస్మ=భస్మముచేత, ఛన్నః=కప్పివేయబడినవాడై, భస్మశాయీ=భస్మశయ్య యందు పరుండినవాడును, సర్వదా=సదా, విజితేంద్రియః=ఇంద్రియ జయము పొందిన వాడును అగు, యస్తు=ఎవడు, అనన్యధీః=వేరేదీ బుద్ధియందు లేనివాడై, రుద్రమ్=రుద్రుడ నయిన, మామ్=నన్ను, నిత్యమ్=నిత్యము, జపేత్=జపించునో, సః=వాడు, తేన=ఆ, దేహేనైవ=శరీరముతోనే, స్వయమ్=స్వయముగా, శివః=శివుడుగా, సంజాయతే=అగును.

**తాత్పర్యము:–** భస్మలిప్తుడై, భస్మశయనుడై జితేంద్రియుడై ఏకాగ్రతతో రుద్రజపము చేసినవాడు ఆ శరీరముతోనే శివసారూప్యము పొందును.

**శ్లో॥ జపేద్యో రుద్రసూక్తాని తథాథర్వశిరః పరమ్।**
**కైవల్యోపనిషత్సూక్తం శ్వేతాశ్వతరమేవ చ।**
**తతః పరతరో భక్తో మమ లోకే న విద్యతే॥ 7**

**ప్రతిపదార్థము:–** యః=ఎవడు, రుద్రసూక్తాని=రుద్రసూక్తములను, తథా=అట్లే, అథర్వశిరః =అథర్వశిరోపనిషత్తును, పరమ్=మఱియు, కైవల్యోపనిషత్సూక్తమ్=కైవల్యోపనిషత్తును, శ్వేతాశ్వతరమేవ చ=శ్వేతాశ్వతరోపనిషత్తునూ, జపేత్=జపించునో, తతః=అతనికన్న, పరతరః=శ్రేష్ఠుడైన, భక్తః=భక్తుడు, మమ=నాకు, లోకే=ప్రపంచమున, న విద్యతే=లేడు.

**తాత్పర్యము:–** రుద్రసూక్తమును, అథర్వ శిరోపనిషత్తును, కైవల్యోపనిషత్తును, శ్వేతాశ్వతరోపనిషత్తును, నిత్యజపము చేయువాడు నాకు అత్యంత శ్రేష్ఠ భక్తుడు.

**శ్లో॥ అన్యత్ర ధర్మాదన్యస్మాదన్యత్రాస్మాత్కృతాకృతాత్।**
**అన్యత్ర భూతాద్భవ్యాచ్చ యత్ప్రవక్ష్యామి తచ్ఛృణు॥ 8**

**ప్రతిపదార్థము:–** ధర్మాత్=ధర్మముకన్న, అన్యత్ర=భిన్నంగా, అన్యస్మాత్=ధర్మవ్యతిరిక్తమైన అధర్మముకన్న, అన్యత్ర=భిన్నంగా, అస్మాత్=ఈ, కృతాకృతాత్=కృత–అకృతములకన్న, భవ్యాచ్చ=జరుగబోవుదానికన్న, అన్యత్ర=భిన్నంగా, యత్=ఏది కలదో, తత్=దానిని ప్రవక్ష్యామి=చెప్పగలను, శృణు=చెప్పుము.

**తాత్పర్యము:–**ధర్మాధర్మములకు, పాపపుణ్యములకు, కృతాకృతములకు, భూతభవిష్యత్తులకు భిన్నమైన ఒక విషయము చెప్పెదను వినుము. ఇట్టి సర్వవ్యవహారములకు అతీతమైన ప్రణవము గూర్చి చెప్పెదను వినుమని భావము.

**శ్లో॥ వదన్తి యత్పదం వేదాః శాస్త్రాణి వివిధాని చ।**
**సర్వోపనిషదాం సారం దధ్నో ఘృతమివోద్ధృతమ్॥ 9**



**ప్రతిపదార్థము:–** యత్=ఏ, పదమ్=పదమునుగూర్చి, వేదాః=వేదములు, వివిధాని చ= అనేకములైన, శాస్త్రాణి చ=శాస్త్రములున్ను, దధ్నః=పెరుగునుండి, ఉద్ధృతమ్=చిలికి బయటకు తీయబడిన, ఘృతమివ=వెన్నవలె, సర్వ=సమస్తమైన, ఉపనిషదామ్=ఉపనిషత్తుల యొక్క, సారమ్=సారమునుగా, వదంతి=చెప్పుచున్నవో.

**తాత్పర్యము:–** పెరుగునుంచి చిలికి సారముగా వెన్నతీసినట్లు, సర్వోపనిషత్తుల సారమే అని ఆ పదమును గూర్చి వేదశాస్త్రములన్నియు చెప్పుచున్నవి.

**శ్లో॥ యదిచ్ఛన్తో బ్రహ్మచర్యం చరన్తి మునయస్సదా।**
**తత్తే పదం సంగ్రహేణ బ్రవీమ్యోమితి యత్పదమ్॥ 10**

**ప్రతిపదార్థము:–** యత్=దేనిని, ఇచ్ఛంతః=కోరుచు, మునయః=మునులు, సదా=నిత్యము, బ్రహ్మచర్యమ్=బ్రహ్మచర్యమును, చరంతి=ఆచరించుచున్నారో, యత్=ఏది, పదమ్=నాకు స్థానమో, తత్=ఆ, పదమ్=పదమును గూర్చి, తే=నీకు సంగ్రహేణ=సంక్షిప్తముగా, ఓమితి= ఓం అని, బ్రవీమి=చెప్పుచున్నాను.

**తాత్పర్యము:–** ఏ పదమును వశము చేసికొనుటకు మహర్షులు బ్రహ్మచర్యమును ఆచరిస్తున్నారో, ఏది నాకు స్థానమో ఆ పదమును గూర్చి సంగ్రహముగా ఒక్క అక్షరములో చెప్పెదను. అదే 'ఓం'.

**శ్లో॥ ఏతదేవాక్షరం బ్రహ్మ చైతదేవాక్షరం పరమ్।**
**ఏతదేవాక్షరం జ్ఞాత్వా యో యదిచ్ఛతి తస్య తత్॥ 11**

**ప్రతిపదార్థము:–** ఏతత్=ఈ, అక్షరం ఏవ=అక్షరమే, బ్రహ్మ=బ్రహ్మము, ఏతదేవచ=ఇదే, పరమ్=శ్రేష్టమైన, అక్షరమ్=అక్షరము, ఏతదేవ=ఇదే, అక్షరమ్=అక్షరమును, జ్ఞాత్వా= ఎఱిగి, యః=ఎవడు, యత్=దేనిని, ఇచ్ఛతి=కోరునో, తస్య=అతనికి, తత్=అది లభించును.

**తాత్పర్యము:–** ఈ ఓంకారమే పరబ్రహ్మ. ఈ అక్షరమే అక్షరములలో శ్రేష్ఠము. ఈ అక్షరమును తెలిసికొన్నవానికి కోరినదెల్ల లభించును.

**శ్లో॥ ఏతదాలమ్బనం శ్రేష్ఠమేతదాలమ్బనం పరమ్।**
**ఏతదాలమ్బనం జ్ఞాత్వా బ్రహ్మలోకే మహీయతే॥ 12**

**ప్రతిపదార్థము:–** ఏతత్=ఈ అక్షరము, శ్రేష్ఠమ్=ఉత్తమమైన, ఆలంబనమ్=ఆధారము, ఏతత్=ఇదే, పరమ్=గొప్ప/పరమైన, ఆలంబనమ్=ఆధారము, ఏతత్=దేనిని, ఆలంబనమ్= ఆధారముగా, జ్ఞాత్వా=ఎఱిగి, బ్రహ్మలోకే=బ్రహ్మలోకమునందు, మహీయతే=ఆనంద పడును.

**తాత్పర్యము:–** ఈ ఓంకారము ఆధారములలోకెల్ల శ్రేష్ఠమైనది. ఇది పరమైన ఆధారము. దీనిని ఆధారముగా తెలిసి పొందినవాడు బ్రహ్మలోకమున ఆనందపడును.

**శ్లో॥ ఛన్దసాం యస్తు ధేనూనామృషభత్వేన చోదితః।**
**ఇదమేవావధిః సేతురమృతస్య చ ధారణాత్।**
**మేధయా పిహితం కోశం బ్రహ్మణో యత్పరం మతమ్॥ 13**

**ప్రతిపదార్థము:–** యస్తు=ఏది, ఛందసామ్=వేదములకు,ధేనూనామ్=గోవులకు, వృషభత్వేన చ=ఆంబోతుగా, ఉదితః=చెప్పబడినదో/ఉదయించినదో, యత్=ఏది, మేధయా=ఇహలోక బుద్ధిచేత, పిహితమ్=కప్పివేయబడిన/మూసివేయబడిన, బ్రహ్మణః=జ్ఞానముయొక్క/బ్రహ్మము యొక్క, పరమ్=శ్రేష్ఠమైన, కోశమ్=నిధిగా, మతమ్=చెప్పబడెనో, ఇదమేవ=ఈ అక్షరమే, అవధిః=అంతిమలక్ష్యము, అమృతస్య=అమృతస్వరూపముయొక్క, ధారణాత్= ధరించుటవలన, సేతుః=ఆనకట్ట.

**తాత్పర్యము:–** వేదములనే ఆవులకు యిది ఆంబోతువంటిది. దీనిని ఋషభం అందురు. అజ్ఞానముచే కప్పివేయబడిన బ్రహ్మకోశమిది. ఇది అమృతస్వరూపమును పట్టియుంచిన 'సేతువు' ఇదే అంతిమ గమ్యము.

**శ్లో॥ చతస్రస్తస్య మాత్రాః స్యురకారోకారకౌ తథా।**
**మకారశ్చావసానేఽర్ధమాత్రేతి పరికీర్తితాః॥ 14**

**ప్రతిపదార్థము:–** తస్య=ఆ ఓంకారాక్షరమునకు, మాత్రాః=మాత్రలు (రెప్పపాటుకాలంలో చదువదగిన అక్షర ఖండములు=అచ్చులు, పొల్లులుగా ఉన్న హల్లులు) చతస్రః=నాల్గు, స్యుః=ఉండును, అకార=అకారము, ఉకారకౌ=ఉకారము, తథా=అట్లే, మకారశ్చ= మకారము,అవసానే=చివఱలో, అర్ధమాత్రేతి=అర్ధమాత్రము, ఇతి పరికీర్తితాః=చెప్పబడినవి.

**తాత్పర్యము:–** ఈ ఓంకారమునకు నాలుగు మాత్రలు. 'అ+ఉ+మ్+ం' అని నాలుగు. అనగా 'ఓం' మీద ఉన్న అనురణన ధ్వని అర్ధమాత్ర అని యోగసంప్రదాయము. (అది తుమ్మెదల ఝుంకారము వంటిది. అదే 'నాదము' నాదాంతమువద్దకు మనలను చేర్చునది. అదే శక్తిరూపమని శక్తి సంప్రదాయము.)

**శ్లో॥ పూర్వత్ర భూశ్చ ఋగ్వేదో బ్రహ్మాష్టవసవస్తథా।**
**గార్హపత్యశ్చ గాయత్రీ గఙ్గా ప్రాతస్సవస్తథా॥ 15**

**ప్రతిపదార్థము:–** పూర్వత్ర=మొదటిదయిన 'అకారము' నందు, భూశ్చ=భూలోకము, ఋగ్వేదః=ఋగ్వేదము, బ్రహ్మా=బ్రహ్మ, అష్టవసవః=8 మంది వసువులు, తథా=అట్లే, గార్హపత్యశ్చ=గార్హపత్యాగ్నియు, గాయత్రీ=గాయత్రియు, గంగా=గంగయు, తథా=అట్లే, ప్రాతః=ప్రాతఃకాలముచేయు, సవః=సవనము అనగా యజ్ఞ భాగమున్ను ఉండును.



**తాత్పర్యము:–** మొదటిదయిన 'అకారము' నందు, భూలోకము, ఋగ్వేదము, బ్రహ్మ, 8 మంది వసువులు, అట్లే గార్హపత్యాగ్నియు, గాయత్రియు, గంగయు, అట్లే ప్రాతఃకాలము చేయు సవనము అనగా యజ్ఞ భాగమున్ను ఉండును.

**శ్లో॥ ద్వితీయే చ భువో విష్ణు రుద్రోఽనుష్టుబ్యజుస్తథా।**
**యమునా దక్షిణాగ్నిశ్చ మాధ్యన్దినసవస్తథా॥ 16**

**ప్రతిపదార్థము:–** ద్వితీయే=రెండవ మాత్ర (యందు), భువః=భువర్లోకము, విష్ణుః=విష్ణువు, రుద్రః=రుద్రుడు, అనుష్టుప్=అనుష్టుప్ఛందస్సు, తథా=అట్లే, యమునా=యమునానది, దక్షిణాగ్నిశ్చ=దక్షిణాగ్నియును, తథా=అట్లే, మాధ్యందినసవః=మధ్యాహ్నసవనము ఉండును.

**తాత్పర్యము:–** రెండవ మాత్ర యందు భువర్లోకము, విష్ణువు, రుద్రుడు, అనుష్టుప్ఛందస్సు, అట్లే యమునానది, దక్షిణాగ్నియును, అట్లే మధ్యాహ్నసవనము ఉండును.

**శ్లో॥ తృతీయే చ సువః సామాన్యాదిత్యశ్చ మహేశ్వరః।**
**అగ్నిరాహవనీయశ్చ జగతీ చ సరస్వతీ।**
**తృతీయం సవనం ప్రోక్తమథర్వత్వేన యన్మతమ్॥ 17**

**ప్రతిపదార్థము:–** తృతీయే చ=తృతీయమాత్ర అయిన మకారము నందు, సువః= సువర్లోకము, సామాని=సామవేదములు, ఆదిత్యశ్చ=ఆదిత్యుడున్ను, మహేశ్వరః= మహేశ్వరుడు, ఆహవనీయశ్చ=ఆహవనీయమనబడు అగ్ని, జగతీ చ=జగతీ అను ఛందస్సు, సరస్వతీ=సరస్వతీనది, అథర్వత్వేన=అథర్వవేదముగా, యత్=ఏది, మతమ్= చెప్పబడెనో, తత్=ఆ, తృతీయసవనమ్=సాయంకాలసవనమున్ను ఉన్నట్లు, ప్రోక్తమ్=చెప్ప బడెను.

**తాత్పర్యము:–** తృతీయమాత్ర అయిన మకారము నందు సువర్లోకము, సామవేదములు, ఆదిత్యుడున్ను, మహేశ్వరుడు, ఆహవనీయమనబడు అగ్ని, జగతీ అను ఛందస్సు, సరస్వతీ నది, అథర్వవేదముగా చెప్పబడిన ఆ సాయంకాలసవనమున్ను ఉన్నట్లు, చెప్పబడెను.

**విశేషము:–** ప్రసిద్ధ త్రయము లన్నింటిలో మొదటివాటికి అకారము, రెండవ వాటికి ఉకారము, మూడవ వాటికి మకారము ప్రతినిధి. ఉదాహరణకు బ్రహ్మ–విష్ణు–మహేశ్వర. వసు (8), రుద్ర (11), ఆదిత్య (12). గంగా–యమునా–సరస్వతీ, గార్హపత్యాగ్ని, దక్షిణాగ్ని,

ఆహవనీయాగ్ని, యజ్ఞ దినాలలో మొదటిపూట చేసే తంతు ప్రాతస్సవనం – అది అకారము. అలా మిగిలినవి అర్థం చేసికొనాలి. లోకాలున్ను అంతే. అలానే జాగర స్వప్న సుషుప్తులు, సృష్టిస్థితిలయాలు మొదలైనవి. అనగా ఓంకారంలోని పొరలు వీటన్నింటికి ప్రతీకలు. దాని చివఱినాదం వీటన్నింటియందు వ్యాపించినట్లు చివఱకు వీటికతీతమై నాదమై నాదాంతమైన నిర్గుణ మౌనానంద బ్రహ్మమునందు కలిసిపోవును. శరీరమందును ఇంతే. నాదము భ్రూమధ్యమునుండి మాడునందు ఇంకిపోవును.

**శ్లో॥ చతుర్థీ యాఽవసానేఽర్ధమాత్రా సా సోమలోకగా। 18**

**శ్లో॥ అథర్వాఙ్గిరసః సంవర్తకోఽగ్నిర్మరుతస్తథా।**
**విరాట్సభ్యావసథ్యౌ చ శతద్రుర్యజ్ఞపుచ్ఛకః॥ 19**

**ప్రతిపదార్థము:–** అవసానే=ఓంకారావసానముననున్న, అర్ధమాత్ర (c), యా=ఏది కలదో, సా=అది, చతుర్థీ=నాల్గవది, సోమలోక=చంద్రలోకమును/శివలోకమును, గా=చేరునట్టిది అది, అథర్వాంగిరసః=అథర్వవేదము, సంవర్తకః=ప్రళయమైన, అగ్నిః=అగ్ని, తథా=అట్లే, మరుతః=మరుత్తులు/వాయువులు, విరాట్=విరాట్టు, సభ్య=సభాగ్ని, ఆవసథ్యౌచ= ఆవసథ్యాగ్నియు, శతద్రుః=శతద్రునది, యజ్ఞ=యాగముయొక్క, పుచ్ఛకః=అవశేషకర్మము అగును.

**తాత్పర్యము:–** ఓంకారావసానముననున్న అర్ధమాత్ర (c) ఏది కలదో, అది నాల్గవది. చంద్రలోకమును/శివలోకమును చేరునట్టిది అది అథర్వవేదము, ప్రళయమైన అగ్ని అట్లే మరుత్తులు/వాయువులు విరాట్టు సభాగ్ని, ఆవసథ్యాగ్నియు, శతద్రునది, యాగముయొక్క అవశేష కర్మము అగును.

**విశేషము:–** 1) అథర్వాంగిరసః అనగా అథర్వ, అంగీరసుడు – ఈ ఇద్దఱు కనిపెట్టిన మంత్రభాగములు కనుక అథర్వవేదమునకు 'అథర్వాంగిరసమని' పేరు – తాత్పర్య ప్రకాశికా వ్యాఖ్య. 2) సంవర్తకాగ్ని – ప్రలయ కాలవహ్ని కాలాగ్ని. 3) వాయువులు – ఐదు వాయువులు.

**శ్లో॥ ప్రథమా రక్తవర్ణా స్యాద్ద్వితీయా భాస్వరా మతా।**
**తృతీయా విద్యుదాభా స్యాచ్చతుర్థీ శుక్లవర్ణినీ॥ 20**

**ప్రతిపదార్థము:–** ప్రథమా=మొదటి మాత్ర అయిన 'అ' కారము, రక్తవర్ణా=ఎఱ్ఱనిది, స్యాత్=అగును, ద్వితీయా=రెండవ మాత్ర అయిన ఉకారము, భాస్వరా=వెలుగు గలదిగా, మతా=చెప్పబడినది, తృతీయా=మూడవది అయిన 'మ' కారము, విద్యుదాభా=మెఱుపు తీగ వంటిది, చతుర్థీ=నాల్గవది అయిన 'మ్'/'ం', శుక్లవర్ణినీ=తెల్లని వర్ణము కలది.



**తాత్పర్యము:–** ఓం / ఓమ్ ఇందులో 'ఓ' ఇది అకార ఉకార స్వరూపము. సంయుక్త వర్ణము. ఇందు మొదటిది అరుణము. అది సృష్టికామరూపము. కనుక ఎఱుపు. తర్వాతది వెలుగురూపము. తర్వాతది మెఱుపు తీగవలె క్షణము మెఱయు దృశ్యము. నాల్గవది సత్త్వప్రధానమైన శుక్ల/స్వచ్ఛరూపము. అది 'c' అని చెప్పబడును. ఇది నాదరూపము. అర్ధచంద్రము అంటారు. ఇది భ్రూమధ్యమునుండి సూక్ష్మ షట్చక్రరూపముగా రకరకాల విద్యుద్రూపములు చెందుచూపోయి సహస్రారమున బిందువునందు లయమగుట యోగ సంప్రదాయము.

**శ్లో॥ సర్వం జాతం జాయమానం తదోఙ్కారే ప్రతిష్ఠితమ్।**
**విశ్వం భూతం చ భువనం విచిత్రం బహుధా తథా॥ 21**

**శ్లో॥ జాతం చ జాయమానం యత్ తత్సర్వం రుద్ర ఉచ్యతే।**
**తస్మిన్నేవ పునః ప్రాణాః సర్వమోఙ్కార ఉచ్యతే॥ 22**

**ప్రతిపదార్థము:–** జాతమ్=పుట్టినది, జాయమానమ్=పుట్టుచున్నదియు అగు, తత్=ఆ, సర్వమ్=సమస్తము, ఓంకారే=ఓంకారమునందు, ప్రతిష్ఠితమ్=ప్రతిష్ఠింపబడెను, విశ్వమ్= సమస్తమైన, భూతమ్=సిద్ధమైన, బహుధా=అనేక విధములుగా, విచిత్రమ్=భిన్నమైనదియు అగు, భువనం చ=లోకమున్ను, తథా=అట్లే, యత్=ఏది, జాతం చ=పుట్టినదో, జాయమానం చ=పుట్టుచున్నదో, తత్సర్వమ్=అదంతయు, రుద్రః=రుద్రుడుగా, ఉచ్యతే= చెప్పబడును, తస్మిన్నేవ=ఆ రుద్రునియందే, పునః=మఱల, ప్రాణాః=ప్రాణములున్నవి, సర్వమ్=సమస్తము, ఓంకారమ్=ఓంకారముగా, ఉచ్యతే=చెప్పబడును.

**తాత్పర్యము:–** పుట్టినది, పుట్టుచున్నది, పుట్టబోవునది అయిన అత్యంత భిన్నస్వరూపమైన ఈ లోకమంతయు రుద్ర స్వరూపము. అదే ఓంకారమునందు ప్రతీకగా ప్రతిష్ఠింపబడి యున్నది. ఈ రుద్రునియందే మఱల ప్రాణములున్నవి. (అనగా దశప్రాణములు అనగా దశ వాయువులు రుద్రరూపములు. తరువాతి వాడు శివుడు. అందువలన ఏకాదశరుద్రులు ప్రాణములే లయమును కలిగించును. కనుక ప్రాణములు రుద్రరూపము. ఆహారపచనము ప్రాణము మొదలగువానివలన జరుగును. ప్రాణాగ్ని అందురు.)

**శ్లో॥ ప్రవిలీనం తదోఙ్కారే పరంబ్రహ్మ సనాతనమ్।**
**తస్మాదోఙ్కారజాపీ యః స ముక్తో నాఽత్ర సంశయః॥ 23**

**ప్రతిపదార్థము:–** తత్=అందువలన, సనాతనమ్=ప్రాచీనమైన/అనాది అయిన, పరంబ్రహ్మ =పరబ్రహ్మము, ఓంకారే=ఓంకారమునందు, ప్రవిలీనమ్=లీనమై ఉన్నది, తస్మాత్=కనుక,

యః=ఎవడు, ఓంకారజాపీ=ఓంకార జపము చేయునో, సః=అతడు, ముక్తః=మోక్షము పొందినవాడే, అత్ర=ఇందులో, సంశయః=సందేహము, న=లేదు.

**తాత్పర్యము:–** ఆ పరబ్రహ్మము ప్రతీకరీత్యా ఈ ఓంకారములో ఉన్నది. కనుక ఈ భావనతో లోకత్రయవ్యాప్తమైన పరబ్రహ్మమునుగా ఓంకారమును మననముచేయువాడు తప్పక ముక్తి పొందును.

**శ్లో॥ శ్రౌతాగ్నేః స్మార్తవహ్నేర్వా శైవాగ్నేర్వా సమాహృతమ్।**
**భస్మాభిమన్త్ర్య యో మాం తు ప్రణవేన ప్రపూజయేత్।**
**తస్మాత్పరతరో భక్తో మమ లోకే న విద్యతే॥ 24**

**ప్రతిపదార్థము:–** శ్రౌతాగ్నేః=యజ్ఞవహ్నినుండిగాని, స్మార్తవహ్నేఃవా=ధార్యాగ్ని నుండి గాని, శైవాగ్నేర్వా=శివహోమసంబంధమైన అగ్నినుండిగాని, సమాహృతమ్=తేబడిన, భస్మ= భూతిని, అభిమంత్ర్య=మంత్రించి, యః=ఎవడు, మామ్=నన్ను, ప్రణవేన=ఓంకారముతో, ప్రపూజయేత్=పూజించునో, తస్మాత్=అతనికన్న, పరతరః=శ్రేష్ఠుడైన, భక్తః=భక్తుడు, మమ= నాకు, లోకే=లోకమునందు, న విద్యతే=లేదు.

**తాత్పర్యము:–** యజ్ఞకర్త అయిన సోమయాజి ఇంటిలోని శ్రౌతాగ్నినుంచి గాని, సాధారణ గృహస్థు ఉపాసించిన ధార్యాగ్నినుంచిగాని, శైవాగ్నినుంచిగాని తెచ్చిన పవిత్రభస్మమును పాశుపతాది మంత్రాలతోగాని భస్మమంత్రాలతో ఇంతకుముందు చెప్పినట్లే 'అగ్నిః...' మొదలైన మంత్రములతో గాని మంత్రించి ఓంకారముతో నాకు భస్మాభిషేకము చేయ వలయును. అంతకన్న గొప్ప భక్తుడు నాకు లోకములో లేదు.

**శ్లో॥ శాలాగ్నేర్దావవహ్నేర్వా భస్మాదాయాభిమన్త్రితమ్।**
**యో విలిమ్పతి గాత్రాణి స శూద్రోఽపి విముచ్యతే॥ 25**

**ప్రతిపదార్థము:–** శాలాగ్నేః=ఇంటిలోని లౌకికాగ్నినుంచిగాని, దావవహ్నేర్వా=కార్చిచ్చు నుండిగాని, భస్మ=బూడిదను, ఆదాయ=తెచ్చి, అభిమంత్రితమ్=మంత్రింపబడిన దానిని తీసికొని, యః=ఎవడు, గాత్రాణి=అవయవములను, విలింపతి=పూసికొనునో, సః= అతడు, శూద్రోపి=శూద్రుడయినను, విముచ్యతే=ముక్తుడగును.

**తాత్పర్యము:–** పాకశాలాగ్నినుంచిగాని, దావాగ్నినుంచి గాని తెచ్చిన భస్మమును మంత్రించి దానిని శరీమునందు పూసికొన్నవాడు శూద్రుడైనను తప్పక మోక్షము పొందును. (శూద్రుడైనను అనటంలో భావం ఇతర వైదిక కర్మానుష్ఠానం లేకపోయినా సరే దీనివలన ఎవరైనా బ్రాహ్మణుడైనా, మూఢ బ్రాహ్మణుడైనా ముక్తి పొందుతాడని చెప్పటమే.



మంత్రించటం అంటే బ్రాహ్మణులకు 'అర్చిః–' మొదలగు మంత్రములతో శూద్రులకు పంచాక్షరితోను మంత్రించవలెనని – తాత్పర్య ప్రకాశిక.)

**శ్లో॥ కుశపుష్పైర్బిల్వదలైః పుష్పైర్వా గిరిసమ్భవైః।**
**యో మామర్చయతే నిత్యం ప్రణవేన ప్రియో హి సః॥ 26**

**ప్రతిపదార్థము:–** కుశపుష్పైః=దర్భపూలతోను, బిల్వదలైః=మారేడు దళములతోను, గిరి సంభవైః=కొండలయందు అడవులయందు పుట్టిన, పుష్పైర్వా=పుష్పములచేతగాని, యః =ఎవడు, ప్రణవేన=ఓంకారముతో, మామ్=నన్ను, నిత్యమ్=నిత్యము, అర్చయతే= పూజించునో, సః=వాడే, ప్రియో హి=నాకు ఇష్టమైనవాడు గదా!

**తాత్పర్యము:–** దర్భలు పూలు / దర్భపూలు, మారేడుదళాలు, కొండపూలు, అడవిపూలు – వీనితో ఓంకార సహితంగా పూజించువాడు నాకు ప్రియభక్తుడు.

**శ్లో॥ పుష్పం ఫలం సమూలం వా పత్రం సలిలమేవ వా।**
**యో దద్యాత్ప్రణవే మహ్యం తత్కోటిగుణితం భవేత్॥ 27**

**ప్రతిపదార్థము:–** పుష్పమ్=పువ్వును, సమూలమ్=తినదగిన దుంపలతోగూడిన, ఫలంవా= పండునుగాని, పత్రమ్=ఆకునుగాని, సలిలమేవ వా=నీటినిగాని, యః=ఎవడు, ప్రణవే= ఓంకారనాదము మధ్యలో, మహ్యమ్=నా కొఱకు, దద్యాత్=ఇచ్చునో, తత్=అది, కోటి గుణితమ్=కోటిరెట్లు ఫలముగలది, భవేత్=అగును.

**తాత్పర్యము:–** పూలను, దుంపలను (తినదగినవి), పండ్లను, ఆకులను ఆఖరుకు నీళ్ళనైనా ఓంకారోచ్చారణలమధ్య నాకు సమర్పించువాడు కోటిరెట్లు ఫలము పొందును.

**శ్లో॥ అహింసా సత్యమస్తేయం శౌచమిన్ద్రియనిగ్రహః।**
**యస్యాస్త్యధ్యయనం నిత్యం స మే భక్తః స మే ప్రియః॥ 28**

**ప్రతిపదార్థము:–**అహింసా=అహింస, సత్యమ్=సత్యభాషణము, అస్తేయమ్=దొంగతనము చేయకుండుట, శౌచమ్=శుచిత్వము, ఇంద్రియనిగ్రహః=ఇంద్రియనిగ్రహము, నిత్యమ్= నిత్యము, అధ్యయనమ్=వేదాధ్యయనము, యస్య=ఎవనికి, అస్తి=కలదో, సః=అతడు, మే=నాకు, భక్తః=భక్తుడు, సః=వాడు, మే=నాకు, ప్రియః=ప్రియుడు.

**తాత్పర్యము:–** అహింస, సత్యభాషణము, దొంగతనము చేయకుండుట, శుచిత్వము, ఇంద్రియనిగ్రహము, నిత్యము వేదాధ్యయనము ఎవనికి కలదో, అతడు నాకు భక్తుడు. వాడు నాకు ప్రియుడు.

**శ్లో॥ ప్రదోషే యో మమ స్థానం గత్వా పూజయతే తు మామ్।
స పరాం శ్రియమాప్నోతి పశ్చాన్మయి విలీయతే॥ 29**

**ప్రతిపదార్థము:–** యః=ఎవడు, ప్రదోషే=సాయంకాలము, మమ=నాయొక్క, స్థానమ్=ఆలయమును, గత్వా=చేరి, మామ్=నన్ను, పూజయతే తు=పూజించునో, సః=వాడు, పరామ్=శ్రేష్ఠమైన, శ్రియమ్=ఐశ్వర్యమును, ఆప్నోతి=పొందును, పశ్చాత్=దేహానంతరము, మయి=నాయందు, విలీయతే=లయించును.

**తాత్పర్యము:–** రోజూ శివాలయమునకు వచ్చి నాకు ప్రదోష పూజ చేయువాడు జీవిత కాలములో ఐశ్వర్యమును / జీవన్ముక్తిని పొందును. దేహానంతరము నాయందు లయము చెందును.

**శ్లో॥ అష్టమ్యాం చ చతుర్దశ్యాం పర్వణోరుభయోరపి।
భూతిభూషితసర్వాఙ్గో యః పూజయతి మాం నిశి।
కృష్ణపక్షే విశేషేణ స మే భక్తః స మే ప్రియః॥ 30**

**ప్రతిపదార్థము:–** భూతిభూషిత=భస్మాలంకృతమైన, సర్వాంగః=సమస్త శరీరముగలవాడై, యః=ఎవడు, మామ్=నన్ను, నిశి=రాత్రియందు, విశేషేణ=విశేషంగా, కృష్ణపక్షే=కృష్ణ పక్ష రాత్రియందు, అష్టమ్యామ్=అష్టమినాడు, చతుర్దశ్యాంచ=చతుర్దశినాడున్ను, ఉభయోః=రెండు అయిన, పర్వణోరపి=పర్వదినములందున్ను అనగా పూర్ణిమ, అమావాస్యల యందున్ను, మామ్=నన్ను, పూజయేత్=పూజించునో, సః=వాడు, మే=నాకు, భక్తః=భక్తుడు, సః=వాడు, మే=నాకు, ప్రియః=ఇష్టుడు.

**తాత్పర్యము:–** అష్టమినాడు, చతుర్దశినాడు, పూర్ణిమామావాస్యలయందు, అందునా రాత్రిపూట, కృష్ణపక్షంలో భస్మలిప్తాంగుడై పూజించువాడు నా ప్రియ భక్తుడు.

**శ్లో॥ ఏకాదశ్యాముపోష్యైవ యః పూజయతి మాం నిశి।
సోమవారే విశేషేణ స మే భక్తో న నశ్యతి॥ 31**

**ప్రతిపదార్థము:–** ఏకాదశ్యామ్=ఏకాదశియందు, ఉపోష్యైవ=ఉపవాసం చేసియే, యః=ఎవడు, మామ్=నన్ను, నిశి=రాత్రియందు, విశేషేణ=ప్రత్యేకంగా, సోమవారే=సోమ వారమున, పూజయతి=పూజించునో, సః=ఆ, మే=నాయొక్క, భక్తః=భక్తుడు, న నశ్యతి=నశింపడు.

**తాత్పర్యము:–** ఏకాదశినాడుపవాసముండి రాత్రిపూట – అది సోమవారం గూడా అయితే మరీ విశేషం – పూజచేసినవాడు నా ప్రియభక్తుడు.



**శ్లో॥ పఞ్చామృతైః స్నపయేద్యః పఞ్చగవ్యేన వా పునః।
పుష్పోదకైః కుశజలైస్తస్మాన్నాన్యః ప్రియో మమ॥ 32**

**ప్రతిపదార్థము:–** యః=ఎవడు, పంచామృతైః=పంచామృతములచేతగాని (తేనె, బెల్లం మొదలైనవి), పంచగవ్యేన వా=పంచగవ్యముచేతగాని, పుష్పోదకైః=పూలనీటిచేతగాని, కుశజలైః=దర్భనీటిచేతగాని, స్నపయేత్=అభిషేకించునో, తస్మాత్=వానికన్న, అన్యః=వేరయినవాడు, మమ=నాకు, ప్రియః=ఇష్టుడు, న=కాదు.

**తాత్పర్యము:–**పంచామృతములతో (పాలు,తేనె,నీరు,పెఱుగు,నెయ్యి) గాని పంచగవ్యముతో గాని పూలనీటితోగాని, దర్భలనీళ్ళతోగాని, నన్ను అభిషేకించినవాడు నాకు సర్వ ప్రియ భక్తుడు.

**శ్లో॥ పయసా సర్పిషా వాఽపి మధునేక్షురసేన వా।
పక్వామ్రఫలజేనాపి నారికేలజలేన వా॥ 33**

**శ్లో॥ గన్ధోదకేన వా మాం యో రుద్రమన్త్రం సముచ్చరన్।
అభిషిఞ్చేత్తతో నాన్యః కశ్చిత్ప్రియతరో మమ॥ 34**

**ప్రతిపదార్థము:–** పయసా=నీటితోను, సర్పిషా వాపి=నేతితోగాని, మధునా=తేనెతోగాని, ఇక్షురసేనవా=చెఱకురసముతోగాని, పక్వ=పండిన, ఆమ్రఫల=మామిడి పండుయొక్క, జేనాపి=(పుట్టిన) రసముచేతగాని, నారికేలజలేన వా=కొబ్బరినీటితోగాని, గంధోదకేన వా=మంచి గంధపు నీటితోగాని, యః=ఎవడు, రుద్రమంత్రమ్=రుద్రమంత్రమును/ నమకమును, సముచ్చరన్=ఉచ్చరించుచు, అభిషించేత్=అభిషేకించునో, తతః=వానికన్న, అన్యః=మఱొకడు, కశ్చిత్=ఒక్కడున్ను, మమ=నాకు, ప్రియతరః=మిక్కిలి ప్రియుడు, న=లేడు.

**తాత్పర్యము:–** పాలతోగాని, నేతితోగాని, తేనెతోగాని, చెఱకురసముతోగాని, పండుమామిడి రసముతోగాని, కొబ్బరినీటితోగాని, చందనజలముతోగాని, రుద్రమంత్రములను ఉచ్చరించుచూ అభిషేకముచేయువాడు నాకు అత్యంత ప్రియ భక్తుడు.

**శ్లో॥ ఆదిత్యాభిముఖో భూత్వా ఊర్ధ్వబాహుర్జలే స్థితః।
మాం ధ్యాయన్ రవిబిమ్బస్థమథర్వాఙ్గిరసం జపేత్।
ప్రవిశేన్మే శరీరేఽసౌ గృహం గృహపతిర్యథా॥ 35**

**ప్రతిపదార్థము:–** ఆదిత్య=సూర్యునకు, అభిముఖమ్=ఎదురుగా, భూత్వా=ఉండి, ఊర్ధ్వ=పైకిఎత్తిన, బాహుః=చేతులుగలవాడై, స్థితః=ఉండినవాడై, రవిబింబస్థమ్=సూర్యబింబము నందున్న, మామ్=నన్ను,ధ్యాయన్=ధ్యానించుచు, అథర్వశిరసమ్=అథర్వణశిరోపనిషత్తును,

జపేత్=జపింపవలయును, అసౌ=ఇట్టి సాధకుడు, గృహపతిః=గృహయజమాని, గృహం యథా=ఇంటిలోకి ప్రవేశించునట్లు, మే=నా, శరీరే=దేహమునందు, ప్రవిశేత్=ప్రవేశించును.

**తాత్పర్యము:–** సూర్యాభిముఖంగా నిలబడి చేతులెత్తి అంజలి ఘటించి నీటిలో నిలబడి, సూర్యబింబగతుడైన నన్ను ధ్యానించుచు అథర్వణ మంత్రములతో నన్ను జపింపవలెను. అట్టి సాధకుడు గృహయజమాని తన సొంతయింటిలో ప్రవేశించినంత తేలికగా నా తేజస్సులో లీనమగును.

**శ్లో॥ బృహద్రథన్తరం వామదేవ్యం దేవవ్రతాని చ॥ 36**

**శ్లో॥ తద్యోగానాజ్యదోహాంశ్చ యో గాయతి మమాగ్రతః।**
**ఇహ శ్రియం పరాం భుక్త్వా మమ సాయుజ్యమాప్నుయాత్॥ 37**

**ప్రతిపదార్థము:–** బృహత్=బృహత్సామమును, రథంతరమ్=రథంతరసామమును, వామదేవ్యమ్=వామదేవ్యమంత్రమును, దేవవ్రతాని చ=దేవవ్రతమును, తద్యోగాన్=వానితో సంబంధముగల, ఆజ్యదోహాంశ్చ=ఆజ్యదోహములను, యః=ఎవడు, మమ=నాయొక్క అగ్రతః=ఎదురుగా, గాయతి=గానము చేయునో – వాడు, ఇహ=ఈ లోకమున, పరామ్=అధికమైన, శ్రియమ్=సంపదను, భుక్త్వా=భోగించి, మమ=నాయొక్క, సాయుజ్యమ్=సాయుజ్య మోక్షమును, ఆప్నుయాత్=పొందును.

**తాత్పర్యము:–** బృహద్రథంతర సామములను, వామదేవ్యమును, దేవవ్రతములను, తత్సంబంధమైన ఆజ్యదోహములను నాముందర గానము చేసేవాడు ఇహలోకమున ఐశ్వర్యమనుభవించి చివఱకు నా సాయుజ్యమును పొందును.

1) బృహద్రథంతరములు – పృష్ట స్తోత్రసాధన విశేషములు.
2) వామదేవస్య – కథానశ్చిత్ర మొదలగు సామ, ఋచ్యభ్యుథ – అను సామ.
3) దేవవ్రతాని చ సామ విశేష ఏవ.
4) తద్యోగాయ సుతేసచేతి ఋచ్యచ్యుడం, సామ చతుష్టయం వివక్షితమ్.
5) ఆజ్యదోహశబ్దేన సామత్రయం, 'ఊర్ధ్వానందిన –' ఇతి ఋచ్యభ్యాడం వివక్షితం – తాత్పర్య ప్రకాశిక.

**శ్లో॥ ఈశావాస్యాదిమన్త్రాన్యో జపేన్నిత్యం మమాఽగ్రతః।**
**మత్సాయుజ్యమవాప్నోతి మమ లోకే మహీయతే॥ 38**

**ప్రతిపదార్థము:–** ఈశావాస్యాది=ఈశావాస్యము మొదలగు, మంత్రాన్=మంత్రములను, యః=ఎవడు, నిత్యమ్=నిత్యము, మమ=నా, అగ్రతః=ఎదుట, జపేత్=జపించునో, సః



=వాడు, మత్=నాయొక్క, సాయుజ్యమ్=సాయుజ్య (మోక్ష) మును, అవాప్నోతి=పొందును. మమ=నాయొక్క, లోకే=లోకమునందు, మహీయతే=ఆనందపడును.

**తాత్పర్యము:–** ఈశావాస్యమిదం సర్వం మొదలగు ఈశావాస్యోపనిషత్ మంత్రములను నా ఎదుట నిత్యము చదువువాడు నా సాయుజ్యమును పొందును. నా లోకమున ఆనంద పడును.

**శ్లో॥ భక్తియోగో మయా ప్రోక్త ఏవం రఘుకులోద్భవ!।**
**సర్వకామప్రదో మత్తః కిమన్యచ్ఛ్రోతుమిచ్ఛసి॥ 39**

**ప్రతిపదార్థము:–** రఘుకులోద్భవ!=రఘువంశ సంభవా!, ఏవమ్=ఇట్లు, మయా=నాచేత, సర్వకామ=అన్ని కోరికలను, ప్రదః=ఇచ్చు, భక్తియోగః=భక్తియోగము, ప్రోక్తః=చెప్పబడినది, మత్తః=నా నుండి, అన్యత్=వేరయినది, కిమ్=ఏమి, శ్రోతుమ్=వినుటకు, ఇచ్ఛసి=కోరుచున్నావు.

**తాత్పర్యము:–** రామా! సర్వకామఫలదాయకమైన భక్తియోగమును వివరించాను. ఇంకా నీవు నా నుండి ఏమి వినగోరుచున్నావు?

**ఇతి శ్రీ పద్మపురాణే ఉపరిభాగే శివగీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీ శివరాఘవసంవాదే భక్తియోగో నామ పఞ్చదశోఽధ్యాయః॥**

* * * * *

# అథ షోడశోఽధ్యాయః
# అధికారి నిరూపణయోగః

**శ్రీరామ ఉవాచ-శ్రీరాముడిట్లనెను.**

**శ్లో॥ భగవన్! మోక్షమార్గో యస్త్వయా సమ్యగుదాహృతః।**
**తత్రాధికారిణం బ్రూహి తత్ర మే సంశయో మహాన్॥ 1**

**ప్రతిపదార్థము:-** భగవన్=మహాదేవా!, త్వయా=నీచేత, యః=ఏ, మోక్షమార్గః=మోక్షమార్గము, సమ్యక్=చక్కగా, ఉదాహృతః=చెప్పబడినదో, తత్ర=దానియందు, అధికారిణమ్=అర్హతగలవానిని, బ్రూహి=చెప్పుము, తత్ర=అందులో, మే=నాకు, మహాన్=గొప్ప/పెద్ద, సంశయః=సందేహము, అభూత్=ఉండెను.

**తాత్పర్యము:-** దేవా! నీవు చక్కగా వివరించిన మోక్షమార్గమునకు సరియైన అధికారి లేదా అర్హుడు ఎవరు? ఈ సంశయము తీర్చుము.

**శ్రీ శివ ఉవాచ-శివుడిట్లనెను.**

**శ్లో॥ బ్రహ్మక్షత్రవిశః శూద్రాః స్త్రియశ్చాత్రాధికారిణః।**
**బ్రహ్మచారీ గృహస్థో వానుపనీతోఽథవా ద్విజః॥ 2**

**ప్రతిపదార్థము:-** అత్ర=ఈ మోక్షమునందు, బ్రహ్మ=బ్రాహ్మణులు, క్షత్ర=క్షత్రియులు, విశః=వైశ్యులు, శూద్రాః=శూద్రులు, స్త్రియశ్చ=స్త్రీలు, బ్రహ్మచారీ=బ్రహ్మచారి, గృహస్థో వా=గృహస్థుడుగాని, అథవా=లేదా, అనుపనీతః=ఉపనయనము కాని, ద్విజః=ద్విజుడు కాని, అధికారిణః=అధికారులు.

**తాత్పర్యము:-** ఈ మోక్షమునందు బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు, శూద్రులు, స్త్రీలు, బ్రహ్మచారి, గృహస్థుడు గాని, లేదాఉపనయనము కాని ద్విజుడుకాని అధికారులు.



**శ్లో॥ వనస్థో వాఽవనస్థో వా యతిః పాశుపతవ్రతీ।**
**బహునాఽత్ర కిముక్తేన యస్య భక్తిః శివార్చనే।**
**స ఏవాత్రాఽధికారీ స్యాత్ నాన్యచిత్తః కథఞ్చన॥ 3**

**ప్రతిపదార్థము:-** వనస్థో వా=వానప్రస్థుడుగాని, అవనస్థో వా=వానప్రస్థేతరుడుగాని, యతిః=సన్యాసికాని, పాశుపతవ్రతీ=పాశుపతవ్రతయోగికాని, ఇందులో అధికారులు. అత్ర=ఈ విషయములో, బహునా=అనేకము అయిన, ఉక్తేన=కథనముచేత, కిమ్=ఏమి ప్రయోజనము?, యస్య=ఎవనికి, శివార్చనే=శివపూజయందు, భక్తిః=భక్తిగలదో, స ఏవ=అతడే, అత్ర=ఇచ్చట, అధికారీ=అధికారి, స్యాత్=అగును, అన్య=ఇతర విషయములందు, చిత్తః=చిత్తము గలవాడు, కథంచన=ఎట్లయినను, న=అర్హుడుకాడు.

**తాత్పర్యము:-** వానప్రస్థాశ్రమమువారుగాని, ఇతరాశ్రమములుగాని, యతిగాని, పాశుపత వ్రతయోగిగాని, ఎవరైనా ఇందుకు అర్హులే. కాని వారికి ఉండవలసినది శివభక్తి మాత్రమే. అదిలేక ఇతర విషయాలు చిత్తమందుగలవాడు అధికారి కాడు.

**శ్లో॥ జడోఽన్ధో బధిరో మూకో నిశ్శౌచః కర్మవర్జితః॥ 4**

**శ్లో॥ అజ్ఞోపహాసకాభక్తా భూతిరుద్రాక్షధారిణః।**
**లిఙ్గినో యశ్చ వా ద్వేష్టి తే నైవాఽత్రాధికారిణః॥ 5**

**ప్రతిపదార్థము:-** జడః=జడుడు, అంధః=గ్రుడ్డివాడు, బధిరః=చెవిటివాడు, మూకః=మూగవాడు, నిశ్శౌచః=శౌచము లేనివాడు, కర్మ=సత్కర్మలకు, వర్జితః=వెలివేయబడినవాడు, అజ్ఞ=తెలియనివాడు, ఉపహాసక=వెక్కిరించువాడు, అభక్తాః=భక్తిలేనివారు, భూతిరుద్రాక్ష=భస్మ రుద్రాక్షలను, ధారిణః=ధరించువారిని, లింగినః చ=లింగధారులను, యః=ఎవడు, ద్వేష్టి=ద్వేషించునో, తే=వారు, అత్ర=ఇందులో, అధికారిణః=అధికారులు, నైవ=కారు.

**తాత్పర్యము:-** మొద్దు, అజ్ఞాని, మూగ, చెవిటి, అశుచి, కర్మబహిష్కృతుడు, పరిహాసకుడు, భక్తిహీనుడు అనర్హులు. అట్లే భస్మ రుద్రాక్షధారులను, లింగధారులను ద్వేషించువాడు గూడా ఇందుకు అర్హులు కారు.

**శ్లో॥ యో మాం గురుం పాశుపతం వ్రతం ద్వేష్టి ధరాధిప!।**
**విష్ణుం వా న స ముచ్యేత జన్మకోటి శతైరపి॥ 6**

**ప్రతిపదార్థము:-** ధరాధిప!=రాజా!, యః=ఎవడు, మామ్=నన్ను, గురుమ్=గురువును, పాశుపతమ్=పాశుపతమనబడు, వ్రతమ్=వ్రతమును, విష్ణుం వా=విష్ణువునుగాని, ద్వేష్టి=ద్వేషించునో, సః=వాడు, జన్మకోటిశతైరపి=శతకోటి జన్మలకయినను, న ముచ్యేత=ముక్తుడు కాబోడు.

**తాత్పర్యము:–** నన్ను, తన గురువును, పాశుపతవ్రతమును, విష్ణువునుగాని ద్వేషించువాడు శతకోటిజన్మలకైనను మోక్షమునకు అనర్హుడు.

**శ్లో॥ అనేకకర్మసక్తోఽపి శివజ్ఞానవివర్జితః।**
**శివభక్తివిహీనశ్చ సంసారీ నైవ ముచ్యతే॥ 7**

**ప్రతిపదార్థము:–** అనేక=అనేకములైన, కర్మ=సత్కర్మలయందు, సక్తోపి=ఆసక్తుడైనను, శివజ్ఞాన=శివతత్త్వజ్ఞానముచేత, వివర్జితః=రహితుడు, శివభక్తి=శివభక్తితో, విహీనశ్చ= రహితుడును అగు, సంసారీ=సంసారి/గృహస్థు, నైవ ముచ్యతే=ముక్తినొందడు.

**తాత్పర్యము:–** బహుసత్కర్మలు చేసినా శివజ్ఞానము, శివభక్తియు లేని గృహస్థుడు ముక్తిని పొందలేడు.

**శ్లో॥ ఆసక్తాః ఫలరాగేణ యే త్వవైదికకర్మణి।**
**దృష్టమాత్రఫలాస్తే తు న ముక్తావధికారిణః॥ 8**

**ప్రతిపదార్థము:–** ఫలరాగేణ=ఫలవాంఛచేత, అవైదిక=వేదసమ్మతముగాని, కర్మణి=కార్యము నందు, ఆసక్తాః=ఆసక్తికలవారై, యే తు=ఎవరు, దృష్టమాత్ర=కనబడినది మాత్రమే, ఫలాః=ఫలముగలవారో, తే తు=వారయితే, ముక్తౌ=ముక్తియందు, అధికారిణః=అర్హత కలవారు, న=కారు.

**తాత్పర్యము:–** ఫలవాంఛతో వ్యామోహపడి వేదసమ్మతముకాని కామ్యకర్మలయందు, తత్క్షణ దృష్ట ఫలితాన్ని కోరుకొనేవారు మోక్ష విద్య అయిన ముక్తికి అర్హులు కారు.

**శ్లో॥ అవిముక్తే దణ్డకాయాం శ్రీశైలే పుణ్డరీకకే।**
**దేహాన్తే తారకం బ్రహ్మ లభతే మదనుగ్రహాత్॥ 9**

**ప్రతిపదార్థము:–** అవిముక్తే=కాశియందు, దండకాయామ్=దండకయందు (రామేశ్వరం), శ్రీశైలే=శ్రీశైలమునందు,పుండరీకకే=పుండరీకమునందు,దేహాంతే=మరణ సమయమున, మదనుగ్రహాత్=నా అనుగ్రహమువలన, తారకమ్=తారకము అయిన, బ్రహ్మ=బ్రహ్మమును అనగా ఓంకారరూపబ్రహ్మమును, లభతే=పొందును.

**తాత్పర్యము:–** కాశియందును దండకావనమునందు (అనగా రామేశ్వరము) శ్రీశైలము నందును, పుండరీకమునందును మరణించినవానికి నా అనుగ్రహమువలన తారక బ్రహ్మ శ్రవణం జరిగి ముక్తి లభించును.

**విశేషము:–** ద్వారకాయామ్=ద్వారకలో కొన్ని పాఠములుగలవు. దండకాయాం అని తాత్పర్య ప్రకాశికా పాఠము.



**శ్లో॥ యస్య హస్తౌ చ పాదౌ చ మనశ్చైవ సుసంయుతమ్।**
**విద్యా తపశ్చ కీర్తిశ్చ స తీర్థఫలమశ్నుతే॥ 10**

**ప్రతిపదార్థము:–** యస్య=ఎవనికి, హస్తౌ చ=చేతులు, పాదౌ చ=కాళ్ళు, మనశ్చైవ= మనస్సున్ను, సుసంయుతమ్=నిగ్రహంగా ఉన్నదో, విద్యా=విద్య కలదో, తపశ్చైవ= తపస్సున్నదో, కీర్తిశ్చ=కీర్తియున్నదో, సః=అట్టివాడు, తీర్థఫలమ్=తీర్థఫలమును, అశ్నుతే= పొందును.

**తాత్పర్యము:–** ఎవని హస్తములు, పాదములు, మనస్సు నియమబద్ధములుగా ఉన్నాయో, విద్య, తపస్సు, మంచి కీర్తి (మంచికీర్తి రావాలంటే మంచి చేసే లక్షణం ఉంటుంది కనుక) కలవో వాడే స్వయంగా ఒక తీర్థమువంటి వాడు. వానికి తీర్థఫలము స్వయంగానే వస్తుంది.

**శ్లో॥ విప్రస్యానుపనీతస్య విధిరేవముదాహృతః।**
**నాభివ్యాహారయేద్ బ్రహ్మపదాని నయనాదృతే॥ 11**

**ప్రతిపదార్థము:–** అనుపనీతస్య=ఉపనయనము కాని, విప్రస్య=బ్రాహ్మణునకు, విధిః=విధి, ఏవమ్=ఈ విధముగా, ఉదాహృతః=చెప్పబడెను. నయనాదృతే=ఉపనయనం కాకుండా, బ్రహ్మపదాని=వేదపదములను, నాభివ్యాహారయేత్=పలికింపరాదు.

**తాత్పర్యము:–** ఉపనయనము కాని ద్విజబాలునిచేత ఉపనయన మగునంతవఱకు వేదపదాలను పలికింపరాదు.

**శ్లో॥ స శూద్రేణ సమస్తావద్యావద్వేదాన్న జాయతే।**
**నామసఙ్కీర్తనే ధ్యానే సర్వ ఏవాధికారిణః॥ 12**

**ప్రతిపదార్థము:–** సః=అతడు, యావత్=ఎంతవఱకు, వేదాత్=వేదమునుండి, న జాయతే= పుట్టడో, తావత్=అంతవఱకు, శూద్రేణ=శూద్రునితో, సమః=సమానుడు, సర్వే= అందఱును, నామసంకీర్తనే=శివనామభజన యందు, ధ్యానే=ధ్యానమునందు, అధికారిణ ఏవ=అర్హులే.

**తాత్పర్యము:–** ఉపనయనముకానంతవఱకు ద్విజబాలుడు శూద్ర సమానుడు. అతను వేద సంస్కారములద్వారా మఱల పుట్టేదాకా ద్విజుడు కానేరడు. అయితే ఎవరైనా నామ స్మరణ, భజన, ధ్యానములయందు అధికారమున్నవారే.

**విశేషము:–** ఇందులో **'వేదాన్నజాయతే'** అన్న పాఠం బాగాలేదు. బహుశః ఇది **ద్వేధా న జాయతే** అయి ఉండాలి. రెండుసార్లు పుట్టుట అంటే సంస్కారమువలన రెండవసారి

పుట్టుట అని అర్థము సరిపోవును. లేదా వేదాత్=అనగా వేదములను తినువాడు లేదా వేదములను పొందువాడు అని అర్థము తీయవచ్చును. కాని యీ అర్థం బాగుండదు.

**శ్లో॥ సంసారాన్ముచ్యతే జన్తుః శివతాదాత్మ్యభావనాత్।**
**తథా దానం తపో వేదాధ్యయనం చాఽన్యకర్మ వా।**
**సహస్రాంశం తు నాఽర్హన్తి సర్వదా ధ్యానకర్మణః॥ 13**

**ప్రతిపదార్థము:–** శివ=శివునితో, తాదాత్మ్య=ఐక్యముయొక్క, భావనాత్=భావనవలన, జంతుః=జీవుడు, సంసారాత్=సంసారమునుండి, ముచ్యతే=మోక్షము పొందును, తథా=అట్లే, దానమ్=దానము, తపః=తపస్సు, వేదాధ్యయనం చ=వేదపఠనమున్ను, అన్య కర్మ వా=ఇతరకర్మగాని, సర్వదా=నిత్యము, ధ్యానకర్మణః=ధ్యానక్రియయొక్క, సహస్రాంశం తు=1000వ వంతుకు, నార్హంతి=తగవు.

**తాత్పర్యము:–** శివునితో ఐక్యభావనవలన జీవులు ముక్తి పొందెదరు. తపస్సు, దానము, వేదాధ్యయనము, ఇతర సత్కార్యములు ఏవైనను ధ్యానయోగసహస్రతమ భాగానికి సరిరావు.

**శ్లో॥ జాతిమాశ్రమమఙ్గాని దేశం కాలమథాపి వా।**
**ఆసనాదీని కర్మాణి ధ్యానం నాపేక్షతే క్వచిత్॥ 14**

**ప్రతిపదార్థము:–** ధ్యానం=ధ్యానము, జాతిమ్=జాతిని, ఆశ్రమమ్=బ్రహ్మచర్యము మొదలగు ఆశ్రమమును, అంగాని=అవసరమైన వస్తువులను, దేశమ్=ప్రదేశమును, కాలమ్=కాలమును, అథాపి=తర్వాత, ఆసనాదీని=ఆసనము మొదలగు, కర్మాణి వా=కర్మలనుగాని, క్వచిత్=ఎక్కడైనా, నాపేక్షతే=కోరదు.

**తాత్పర్యము:–** ధ్యానానికి జాతి, ఆశ్రమ, అంగ విధి, దేశ నియమ, కాలనియమాలను గాని ఆసనాది కార్యములుగాని ఎక్కడైనా అవసరం లేదు.

**శ్లో॥ గచ్ఛంస్తిష్ఠన్ జపన్వాపి శయానో వాన్యకర్మణి।**
**పాతకేనాపి వా యుక్తో ధ్యానాదేవ విముచ్యతే॥ 15**

**ప్రతిపదార్థము:–** గచ్ఛన్=పోవుచు, తిష్ఠన్=పోవుచు, జపన్వాపి=జపించుచు, శయానోవాపి=శయనించుచు, అన్యకర్మణి=ఇతరకార్యమునందుంటూ, పాతకేనాపి=పాపము చేతనైనా, యుక్తః వా=కూడినవాడైనా, ధ్యానాదేవ=ధ్యానమువలననే, విముచ్యతే=విముక్తుడగును.

**తాత్పర్యము:–** ఎటువంటి వాడయినా ఎట్టి పనిలో నున్నా నిరంతరం ధ్యానంలో ఉన్నచో, మోక్షము కలుగును. నడుస్తూ నిలిచియుంటూ, జపించుచూ, నిద్రించుచూ, ఇతర పనులు చేస్తూ, పాపి అయినా సరే – ధ్యానంలో ఉండగలిగితే దానితోనే ముక్తి పొందును.



**శ్లో॥ నేహాభిక్రమనాశోఽస్తి ప్రత్యవాయో న విద్యతే।**
**స్వల్పమప్యస్య ధర్మస్య త్రాయతే మహతో భయాత్॥ 16**

**ప్రతిపదార్థము:–** ఇహ=ఈ ధ్యానయోగంలో, అభిక్రమ=అతిక్రమంవలన, నాశః=క్రియ చెడటం, నాస్తి=లేదు, ప్రత్యవాయః=ఎగగొట్టటంవలన వచ్చే దోషము, న విద్యతే=లేదు, అస్య=ఈ, ధర్మస్య=ధ్యాన ధర్మముయొక్క, స్వల్పమపి=లేశమయినను, మహతోభయాత్=గొప్ప సంసారభయమునుండి, త్రాయతే=రక్షించును.

**తాత్పర్యము:–** ఈ ధ్యానయోగమునందు క్రమోల్లంఘన భయంలేదు. దానివలన చెడిపోవునది లేదు. ఎప్పుడైనా ఎగగొట్టడం వలన దోషం రాదు. ఈ ధ్యాన ధర్మలేశమైనా గొప్ప సంసార భయమునుండి జీవులను రక్షించును.

**శ్లో॥ ఆశ్చర్యే వా భయే శోకే క్షుతే వా మమ నామ యః।**
**వ్యాజేన వా స్మరేద్యస్తు స యాతి పరమాం గతిమ్॥ 17**

**ప్రతిపదార్థము:–** యః=ఎవడు, ఆశ్చర్యే=ఆశ్చర్యమునందుగాని, భయేవా=భయమునందు గాని, శోక=శోకమునందు కాని, క్షుతేవా=తుమ్మునందుగాని, స్మరేత్=స్మరించునో, యః =ఎవడు, వ్యాజేన వా=ఏదో ఒక వంకతోనో, స్మరేత్=స్మరించునో, సః=వాడు పరమామ్=శ్రేష్ఠమైన, గతిమ్=గతిని, యాతి=పొందును.

**తాత్పర్యము:–** ఆశ్చర్యభయప్రకటనల్లో "శివ శివ" ఏమిటిరా ఇది? అన్నట్లు – తుమ్మినపుడు లేదా ఏదైనా వంకతో "శివా" అంటే వాడికి గూడా పరమగతి తప్పదు.

**శ్లో॥ మహాపాపైరపి స్పృష్టో దేహాన్తే యస్తు మాం స్మరేత్।**
**పఞ్చాక్షరీం వోచ్చరతి స ముక్తో నాఽత్ర సంశయః॥ 18**

**ప్రతిపదార్థము:–**మహాపాపైః=మహాపాతకములచేత, స్పృష్టోఽపి=స్పృశింపబడినవాడైనను, యస్తు=ఎవడు, దేహాంతే=శరీరావసానమున, మామ్=నన్ను, యః=ఎవడు, స్మరేత్=స్మరించునో, పంచాక్షరీం వా=పంచాక్షరినిగాని, ఉచ్చరతి=ఉచ్చరించునో, సః=అతడు, ముక్తః=విముక్తుడే, అత్ర=ఇందులో, సంశయః=సందేహము, న=లేదు.

**తాత్పర్యము:–** ఎంతటి మహాపాతకుడైనా దేహావసాన కాలమున నన్ను స్మరించినచో లేక, పంచాక్షరిని ఉచ్చరించినా అతనికి ముక్తి అవశ్యము లభించును. ఇందులో సందేహము లేదు.

**శ్లో॥ విశ్వం శివమయం యస్తు పశ్యత్యాత్మానమాత్మనా।**
**తస్య క్షేత్రేషు తీర్థేషు కిం కార్యం వాన్యకర్మసు॥ 19**

**ప్రతిపదార్థము:–** యస్తు=ఎవడైతే, విశ్వమ్=ప్రపంచమును, శివమయమ్=శివస్వరూపముగా, పశ్యతి=చూచునో, ఆత్మనా=ఆత్మతో, ఆత్మానమ్=పరమాత్మను, పశ్యతి=చూచునో, తస్య= అట్టి జీవన్ముక్తునికి / జీవచ్ఛివునికి, క్షేత్రేషు=పుణ్యక్షేత్రములందు, తీర్థేషు=పుణ్యనదీనదము లందు, అన్యకర్మసు=ఇతర యజ్ఞయాగాది కర్మలయందు, కార్యమ్=పని, కిమ్=ఏమి ఉన్నది?

**తాత్పర్యము:–** సర్వప్రపంచాన్ని శివమయంగాను, తనను పరమాత్మగాను దర్శించు జంగమ శివునకు తీర్థక్షేత్రసేవ, యజ్ఞయాగాదులతోను, చేయదగినదేమున్నది?

**శ్లో॥ సర్వేణ సర్వదా కార్యం భూతిరుద్రాక్షధారణమ్।**
**యుక్తేనాఽథాఽప్యయుక్తేన శివభక్తిమభీప్సతా॥ 20**

**ప్రతిపదార్థము:–** యుక్తేన=యోగములు గలవానిచేత, అథ=తరువాత, అయుక్తేనాపి=యోగ హీనునిచేతనైనా, శివభక్తిమ్=శివభక్తిని, అభీప్సతా=కోరిన, సర్వేణ=ప్రతివానిచేత, సర్వదా= ఎల్లపుడు, భూతిరుద్రాక్ష=భస్మ రుద్రాక్షలయొక్క, ధారణమ్=ధరించుట, కార్యమ్=చేయ దగును.

**తాత్పర్యము:–** యోగి అయినా కాకపోయినా / యోగ్యుడైనా కాకపోయినా, శివభక్తి కావలయునని భావించే ప్రతివాడు భస్మరుద్రాక్షలు ధరింపక తప్పదు.

**శ్లో॥ నర్మభస్మసమాయుక్తో రుద్రాక్షాన్ యస్తు ధారయేత్।**
**మహాపాపైరపి స్పృష్టో ముచ్యతే నాత్ర సంశయః॥ 21**

**ప్రతిపదార్థము:–** నర్మభస్మ=గార్హపత్యాగ్ని భస్మముతో, సమాయుక్తః=కూడినవాడై, రుద్రాక్షాన్ =రుద్రాక్షలను, యస్తు=ఎవడు, ధారయేత్=ధరించునో, సః=వాడు, మహాపాపైః= మహాపాతకములచేత, స్పృష్టోపి=తాకబడినను, ముచ్యతే=విముక్తుడగును, అత్ర=ఇందులో, సంశయః=సందేహము, న=లేదు.

**తాత్పర్యము:–** భస్మరుద్రాక్షలు ధరించినవాడు అంతకుముందు ఎన్ని మహాపాపాలు చేసినా తప్పక విముక్తుడగును. సంశయములేదు. (నర్మబదులు "ఘర్మ" ఉండదగును).

**శ్లో॥ అన్యాని శైవకర్మాణి కరోతు న కరోతు వా।**
**శివనామజపేద్యస్తు సర్వదా ముచ్యతే తు సః॥ 22**

**ప్రతిపదార్థము:–** అన్యాని=ఇతరములయిన, శైవకర్మాణి=శివపూజా సంప్రదాయ కార్యములును, కరోతు=చేయుగాక, నకరోతువా=చేయకుండుగాక, యస్తు=ఎవడయితే,



సర్వదా=ఎల్లప్పుడు, శివనామ=శివనామమును, జపేత్=జపించునో, సః=వాడు, ముచ్యతేహి =విముక్తుడగును కదా!

**తాత్పర్యము:–** సంప్రదాయములో చెప్పిన / తంత్రములలో చెప్పిన అనేక శివపూజా విధానాలను ఆచరించినా ఆచరించకపోయినా నిత్యము శివనామము జపించువాడు తప్పక మోక్షమును పొందును.

**శ్లో॥ అన్తకాలే తు రుద్రాక్షాన్ విభూతిం ధారయేత్తు యః।**
**మహాపాపోపపాపౌఘైరపి స్పృష్టో నరాధమః।**
**సర్వదా నోపసర్పన్తి తం జనం యమకిఙ్కరాః॥ 23**

**ప్రతిపదార్థము:–** యః=ఎవడు, అంతకాలే=మరణకాలమున, రుద్రాక్షాన్=రుద్రాక్షలను, విభూతిమ్=భస్మమును, ధారయేత్తు=ధరించునో, సః=అ, నరాధమః=మానవాధముడు, మహాపాప=మహాపాతకములచే, ఉపపాప=ఉపపాతకములయొక్క, ఓఘైః=సమూహముల చేత, స్పృష్టోపి=తాకబడినవాడైనను, తమ్=ఆ, జనమ్=వ్యక్తిని, యమకింకరాః= యమభటులు, సర్వదా=ఎల్లపుడు, నోపసర్పంతి=సమీపించరు.

**తాత్పర్యము:–** ఎంతటి మహాపాప కుంభమైనా, అంతకాలమున భస్మరుద్రాక్షలు ధరించినచో ఆ నరాధముని గూడా యమ కంకరులు సమీపించరు. అనగా వాడు నరకానికి పోడు. కైలాసవాసి అగును.

**శ్లో॥ బిల్వమూలమృదా యస్తు శరీరముపలిమ్పతి।**
**అన్తకాలేఽన్తక జనైః స దూరీక్రియతే నరః॥ 24**

**ప్రతిపదార్థము:–** యస్తు=ఎవడు, బిల్వ=మారేడుచెట్టుయొక్క, మూల=మూలమునందలి, మృదా=మట్టితో, శరీరమ్=శరీరమును, ఉపలింపతి=పూసికొనునో, సః=ఆ, నరః=మనిషి, అంతకాలే=మరణకాలమున, అంతకజనైః=యమభటులచేత, దూరీక్రియతే=దూరముగా ఉంచబడును.

**తాత్పర్యము:–** మరణకాలమున మారేడు చెట్టు క్రింద మట్టిని ఒంటికి పూసికొన్నవాడు యమభటులకు అందడు అనగా శివదూతలద్వారా కైలాసము చేరుతాడని యర్థము.

**గమనిక:– ఇచ్చటనుండి వావిళ్ళవారి ప్రతిలో 17వ అధ్యాయము ప్రారంభము.**

**శ్రీరామ ఉవాచ-శ్రీరాముడిట్లనెను.**

**శ్లో॥ భగవన్! పూజితః కుత్ర కుత్ర వా త్వం ప్రసీదసి।**
**తద్బ్రూహి మమ జిజ్ఞాసా వర్తతే మహతీ విభో॥ 25**

**ప్రతిపదార్థము:–** భగవన్=భగవంతుడా! త్వమ్=నీవు, కుత్ర=ఏ స్థలమున, కుత్రవా=ఏ విగ్రహమునందు, పూజితః=పూజింపబడినవాడవై, ప్రసీదసి=అనుగ్రహించెదవు, విభో!=ప్రభూ!, తత్=ఆ విషయమును, బ్రూహి=చెప్పుము, మమ=నాకు, మహతీ= గొప్ప, జిజ్ఞాసా=జ్ఞానవాంఛ, వర్తతే=ఉన్నది.

**తాత్పర్యము:–** దేవా! నిన్ను ఏ స్థలంలో ఏ ఆకారములో పూజించినచో అనుగ్రహించెదవు. ఈ విషయము వివరించి నా జిజ్ఞాసను తీర్చుము.

**శ్రీ శివ ఉవాచ**

**శ్లో॥ మృదా వా గోమయేనాపి భస్మనా చన్దనేన వా।**
**సికతాభిర్దారుణా వా పాషాణేనాపి నిర్మితా॥ 26**

**ప్రతిపదార్థము:–** మృదా వా=మట్టిచేతగాని, గోమయేనాపి=పేడచేతగాని, భస్మనా=భస్మము చేతగాని, చందనేన వా=చందనముచేతగాని, సికతాభిః=ఇసుకచేతగాని, దారుణా వా= కొయ్య చేతగాని, నిర్మితా=నిర్మింపబడిన ప్రతిమతో పూజింపవలయును.

**తాత్పర్యము:–** మట్టిచేతగాని, పేడచేతగాని, భస్మము చేతగాని, చందనముచేతగాని, ఇసుకచేతగాని, కొయ్య చేతగాని నిర్మింపబడిన ప్రతిమతో పూజింపవలయును.

**శ్లో॥ లోహేన వాథ రఙ్గేన కాంస్యకర్పరపిత్తలైః।**
**తామ్రరౌప్యసువర్ణైర్వా రత్నైర్నానావిధైరపి॥ 27**

**ప్రతిపదార్థము:–** లోహేన=లోహముచేత, అథ=తర్వాత, రంగేన=సత్తు/తగరంచేత, కాంస్య= కంచుచేత, కర్పర=పంచలోహమిశ్రమముచేత, పిత్తలైః=ఇత్తడిచేత, తామ్ర=రాగిచేత, రౌప్య= వెండిచేత, సువర్ణైర్వా=బంగారముచేతగాని, నానావిధైః=అనేక విధములైన, రత్నైరపి= మణుల చేతను, ప్రతిమను నిర్మించవచ్చును.

**తాత్పర్యము:–** శివపూజకు నా ప్రతిమను లోహంతో, తగరంతో, కంచుతో, ఇత్తడితో, పంచలోహ మిశ్రమముతో, రాగితో, వెండితో, బంగారముతోనైనా చేయవచ్చును. నానావిధ రత్నములతో కూడా చేయవచ్చును. మరకత లింగం, స్ఫటికలింగం మొదలైనవి.

**శ్లో॥ అథవా పారదేనైవ కర్పూరేణాఽథవా కృతా।**
**ప్రతిమా శివలిఙ్గం వా ద్రవ్యైరేతైః కృతం తు యత్।**
**తత్ర మాం పూజయేత్తేషు ఫలం కోటిగుణోత్తరమ్॥ 28**

**ప్రతిపదార్థము:–** అథవా=లేదా, పారదేనైవ=పాదరసముతోగాని, అథవా=లేదా, కర్పూరేణ వా=కర్పూరముతోగాని, కృతా=చేయబడిన, ప్రతిమా=ప్రతిమగాని, ఏతైః=ఈ, ద్రవ్యైః =వస్తువులతో, కృతమ్=చేయబడిన, యత్=ఏ, శివలింగమ్=శివలింగముగలదో, తత్ర= దానియందు, మామ్=నన్ను, పూజయేత్=పూజింపవలెను, తేషు=వాటియందు, ఫలమ్= ఫలితము, కోటిగుణోత్తరమ్=కోటిరెట్లు శ్రేష్ఠమైనది.



**తాత్పర్యము:–** పాదరసముతోగాని, కర్పూరంతోగాని శివుని బొమ్మ చేయవచ్చును. లేదా శివలింగమును ఇలా తయారు చేయవచ్చును. వీనియందు చేసిన పూజ మామూలు పూజలకన్న కోటిరెట్లు ఎక్కువ.

**శ్లో॥ మృద్దారుకాంస్యలోహైశ్చ పాషాణేనాపి నిర్మితా।**
**గృహిణా ప్రతిమా కార్యా శివం శశ్వదభీప్సతా॥ 29**

**ప్రతిపదార్థము:–** శశ్వత్=నిత్యము, శివమ్=క్షేమమును, అభీప్సతా=కోరునట్టి, గృహిణా= గృహస్థుచేత, ప్రతిమా=నా విగ్రహము, మృత్=మట్టి, దారు=చెక్క, కాంస్య=కంచుతోచేసిన, లోహైశ్చ=లోహములతోను, పాషాణేనాపి=రాతిచేతను, నిర్మితా=నిర్మింపబడినగా, కార్యా= చేయదగినది.

**తాత్పర్యము:–** శాశ్వత శుభము కోరు గృహస్థు నా ప్రతిమను మట్టి, చెక్క, కంచు, లోహము, రాయి – వీటితో నిర్మించవచ్చును.

**శ్లో॥ ఆయుః శ్రియం కులం ధర్మం పుత్రానాప్నోతి తైః క్రమాత్।**
**బిల్వవృక్షే తత్ఫలే వా యో మాం పూజయతే నరః।**
**పరాం శ్రియమిహ ప్రాప్య మమ లోకే మహీయతే॥ 30**

**ప్రతిపదార్థము:–** తైః=వాటితో (అనగా పైన చెప్పిన మట్టి మొదలగువానితో), క్రమాత్= వరుసగా, శ్రియమ్=సంపదను, పుత్రాన్=పుత్రులను, ఆప్నోతి=పొందును, యః=ఏ, నరః =మనిషి, బిల్వవృక్షే=మారేడు చెట్టునందు, తత్ఫలే వా=దాని పండునందుగాని, మామ్= నన్ను, పూజయతే=పూజించునో, సః=అతడు, ఇహ=ఈ లోకమున, పరామ్=గొప్ప, శ్రియమ్=సంపదను, ప్రాప్య=పొంది, మమ=నాయొక్క, లోకే=లోకమునందు, మహీయతే= ఆనందించును.

**తాత్పర్యము:–** మట్టి, ఆయువు, చెక్క, ఐశ్వర్యము, కంచు, కులము, లోహ, ధర్మము, రాయి, సంతానము – అనునవి ఆయా పూజలవలన వచ్చును. మారేడు చెట్టు క్రిందుగా లేదా మారేడు పండు మీద పూజించు వానికి ఇచ్చట మహైశ్వర్యము పరలోకమున కైలాసము లభించును.

శ్లో॥ బిల్వవృక్షం సమాశ్రిత్య యో మన్త్రాన్ విధినా జపేత్।
ఏకేన దివసేనైవ తత్పురశ్చరణం భవేత్॥ 31

**ప్రతిపదార్థము:–** యః=ఎవడు, బిల్వవృక్షమ్=మారేడు చెట్టును, సమాశ్రిత్య=ఆశ్రయించి, మంత్రాన్=శివమంత్రములను, విధినా=విధిపూర్వకముగా, జపేత్=జపించునో, తత్=వాని యొక్క, పురశ్చరణమ్=అక్షరలక్షగా జేయు మంత్రజపము, ఏకేనైవ=ఒకే, దివసేన=రోజుతో, భవేత్=పూర్తియగును.

**తాత్పర్యము:–** మంత్రములను వేటినైనా అందునా ప్రధానంగా శివమంత్రాలను బిల్వ వృక్షము క్రింద జపించినచో ఒక్క రోజులోనే పురశ్చరణ పూర్తి యగును.

*(పురశ్చరణ – అనగా మంత్రమును అందులో ఉన్న అక్షరానికి లక్ష చొప్పున జపించి తర్పణ హోమాదులు చేయుట. ఇలా అక్షరలక్షలు చేయకుండానే బిల్వవృక్షము వద్ద మంత్రము జపించినచో ఒక్క రోజు జపమే పురశ్చరణ ఫలితాన్నిచ్చును.)*

శ్లో॥ యస్తు బిల్వవనే నిత్యం కుటీం కృత్వా వసేన్నరః।
సర్వే మన్త్రాః ప్రసిధ్యన్తి జపమాత్రేణ కేవలమ్॥ 32

**ప్రతిపదార్థము:–** యస్తు=ఏ, నరః=మనిషి, బిల్వవన=మారేడు వనములో, కుటీమ్=కుటీరమును, కృత్వా=కట్టి, వసేత్=ఉండునో, తస్య=వానియొక్క మంత్రాః=మంత్రములు, సర్వే=అన్నియును,కేవలమ్=కేవలము,జపమాత్రేణ=జపముచేతనే, ప్రసిధ్యంతి=సిద్ధించును.

**తాత్పర్యము:–** మారేడు వనమున కుటీరము వేసికొని నివశించువానికి సర్వ మంత్రములు కేవల సాధారణ జపముతోనే సిద్ధించును.

శ్లో॥ పర్వతాగ్రే నదీతీరే బిల్వమూలే శివాలయే।
అగ్నిహోత్రే కేశవస్య సన్నిధౌ వా జపేత్తు యః॥ 33

శ్లో॥ నైవాస్య విఘ్నం కుర్వన్తి దానవా యక్షరాక్షసాః।
తం న స్పృశన్తి పాపాని శివసాయుజ్యమృచ్ఛతి॥ 34

**ప్రతిపదార్థము:–** యః=ఎవడు, పర్వతాగ్రే=కొండ కొమ్ముమీద, నదీతీరే=నదీతీరమునందు, బిల్వమూలే=మారేడు క్రింద, శివాలయే=శివాలయమునందు, అగ్నిహోత్రే=అగ్నిహోత్ర సన్నిధిలో, కేశవస్య=విష్ణువుయొక్క, సన్నిధౌ వా=సమీపమునందుగాని, జపేత్=జపము చేయునో, అస్య=అతనికి, దానవాః=దానవులు, యక్ష=యక్షులు, రాక్షసాః=రాక్షసులు, విఘ్నమ్=జపవిఘ్నమును, నకుర్వంతి=చేయరు. తమ్=వానిని, పాపాని=పాపములు,



న స్పృశంతి=తాకవు, శివ=శివునియొక్క, సాయుజ్యమ్=సాయుజ్యమోక్షమును, ఋచ్ఛతి=పొందును.

**తాత్పర్యము:–** కొండ కొమ్మున, నదీతీరమున, బిల్వవృక్షమూలమున, శివాలయమున, అగ్నిహోత్ర సమీపమున, కేశవ సన్నిధియందు జపము చేసినచో, ఆ జపమునకు దానవులు గాని, రాక్షసులు గాని యక్షులు గాని విఘ్నము చేయరు. పాపములు వారిని తాకవు. శివ సాయుజ్యమును పొందును.

శ్లో॥ స్థణ్డిలే వా జలే వహ్నౌ వాయావాకాశ ఏవ వా।
గురౌ స్వాత్మని వా యో మాం పూజయేత్ ప్రయతో నరః।
స కృత్స్నం ఫలమాప్నోతి లవమాత్రేణ రాఘవ!॥ 35

**ప్రతిపదార్థము:–** రాఘవ=రఘువీరా!, స్థండిలే=కటికనేలమీద, జలే=నీటియందు, వహ్నౌ=అగ్నియందు, వాయౌ=వాయువునందు, ఆకాశ ఏవ వా=ఆకాశమునందు, గురౌ=గురువు నందు, స్వాత్మనివా=తనయందుగాని ఉన్నట్లు భావించి, యః=ఏ, ప్రయతః=సావధానుడైన, నరః=వ్యక్తి, మామ్=నన్ను, పూజయేత్=పూజించునో, సః=అతడు, లవమాత్రేణ=లఘు పూజతోనే, కృత్స్నమ్=సమస్తమైన, ఫలమ్=ఫలితమును, ఆప్నోతి=పొందును.

**తాత్పర్యము:–** నన్ను పంచభూతములో దేనియందైన ఉన్నట్లు భావింపవచ్చును. గురువు నందున్నట్లు, తన యందాత్మరూపముగా నున్నట్లు భావింపవచ్చును. ఇందులో ఏ భావనతో నైనా ఆరాధించువాడు లఘుపూజతోనైనా అనంత ఫలితము పొందును.

శ్లో॥ ఆత్మపూజా సమా నాస్తి పూజా రఘుకులోద్భవ!।
మత్సాయుజ్యమవాప్నోతి చణ్డాలోఽప్యాత్మపూజయా॥ 36

**ప్రతిపదార్థము:–** రఘుకులోద్భవ=రఘువంశపుత్రా!, ఆత్మపూజా=ఆత్మయందు శివునిగా చేయు పూజతో, సమా=సమానమైన, పూజా=పూజ, నాస్తి=లేదు, చండాలోపి=చండాలు డైనను, ఆత్మపూజయా=ఆత్మపూజతో, మత్=నాయొక్క, సాయుజ్యమ్=సాయుజ్యమును, అవాప్నోతి=పొందును.

**తాత్పర్యము:–** రాఘవా! ఆత్మపూజ చాల గొప్పది. దానివంటి పూజ మఱొకటి లేదు. చండాలుడైనను ఆత్మపూజచేసినట్లయిన నా సాయుజ్యమును పొందును.

శ్లో॥ సర్వాన్కామానవాప్నోతి మనుష్యః కమ్బలాసనే।
కృష్ణాజినే భవేన్ముక్తిర్మోక్షశ్రీర్వ్యాఘ్రచర్మణి॥ 37

**ప్రతిపదార్థము:–** మనుష్యః=మనిషి, కంబలాసనే=కంబళి–ఆసనంమీద జపం చేసినట్లయితే, సర్వాన్=సమస్తమైన, కామాన్=కోరికలను, అవాప్నోతి=పొందును. కృష్ణాజినే=కృష్ణ మృగ చర్మము మీద తపస్సు చేసినచో, ముక్తిః=మోక్షము, భవేత్=అగును, వ్యాఘ్రచర్మణి=పెద్ద పులి చర్మము మీద జపము చేసినచో, మోక్షః=మోక్షము వచ్చును.

**తాత్పర్యము:–** మనిషి కంబళి–ఆసనంమీద జపం చేసినట్లయితే, సమస్తమైన, కోరికలను, పొందును. కృష్ణ మృగ చర్మము మీద తపస్సు చేసినచో మోక్షము లభించును. పెద్ద పులి చర్మము మీద జపము చేసినచో మోక్షము వచ్చును.

**శ్లో॥ కుశాసనే భవేత్ జ్ఞానమారోగ్యం పత్రనిర్మితే।**
**పాషాణే దుఃఖమాప్నోతి కాష్ఠే నానావిధాన్ గదాన్॥ 38**

**ప్రతిపదార్థము:–** కుశాసనే=దర్భాసనముమీద, జపంవలన, జ్ఞానమ్=జ్ఞానము, భవేత్=కలుగును, పత్రనిర్మితే=ఆకుల ఆసనముమీద జపమువలన, ఆరోగ్యమ్=ఆరోగ్యమును, పాషాణే=రాయిమీద జపంవలన, దుఃఖమ్=దుఃఖమును, కాష్ఠే=కట్టెమీద / చెక్కపీట మీద, నానావిధాన్=అనేక విధములైన, గదాన్=రోగములను, ఆప్నోతి=పొందును.

**తాత్పర్యము:–** దర్భాసనముమీద జపంవలన జ్ఞానము కలుగును. ఆకుల ఆసనముమీద జపమువలన ఆరోగ్యమును, రాయిమీద జపంవలన దుఃఖమును, కట్టెమీద / చెక్కపీట జపమువలన మీద అనేక విధములైన రోగములను పొందును.

**శ్లో॥ వస్త్రే న శ్రియమాప్నోతి భూమౌ మన్త్రో న సిద్ధ్యతి।**
**ప్రాఙ్ముఖోదఙ్ముఖో వాపి జపం పూజాం సమారభేత్॥ 39**

**ప్రతిపదార్థము:–** వస్త్రే=వస్త్రమునందు జపము చేసినచో, శ్రియమ్=సంపదను, న ఆప్నోతి=పొందదు, భూమౌ=భూమియందు జపము చేసినచో, మంత్రః=మంత్రము న సిద్ధ్యతి=సిద్ధించదు, ప్రాఙ్ముఖ= తూర్పుముఖముగాగాని, ఉదఙ్ముఖో వాపి=ఉత్తరముఖముగా గాని, జపమ్=జపమును, పూజామ్=పూజను, సమారభేత్=ప్రారంభింపవలెను.

**తాత్పర్యము:–** వస్త్రమునందు జపము చేసినచో ఐశ్వర్యము లభించదు. నేలమీద కూర్చొని చేసినచో మంత్రము సిద్ధించదు. జప ప్రారంభము చేయువాడు తూర్పు లేదా ఉత్తరం ముఖముగా కూర్చొనవలెను.

**గమనిక:– ఇచ్చటనుండి వావిళ్ళవారి ప్రతిలో 18వ అధ్యాయము ప్రారంభము.**

**శ్లో॥ అక్షమాలావిధిం వక్ష్యే శృణుష్వావహితో నృప।**
**సామ్రాజ్యం స్ఫటికో దద్యాత్ పుత్రజీవః పరాం శ్రియమ్॥ 40**



**ప్రతిపదార్థము:–** నృప!=రాజా!, అక్షమాలా=జపమాలయొక్క, విధిమ్=విధానమును, వక్ష్యే=చెప్పెదను, అవహితః=సావధానుడవై, శృణుష్వ=వినుము, స్ఫటికః=స్ఫటికము, సామ్రాజ్యమ్=సామ్రాజ్యమును, దద్యాత్=ఇచ్చును, పుత్రజీవః=పుత్రజీవము, పరామ్=గొప్ప, శ్రియమ్=సంపదను, దద్యాత్=ఇచ్చును.

**తాత్పర్యము:–** రాజా! జపమాలావిధానమును చెప్పెదను వినుము. స్ఫటికమాల సామ్రాజ్యము నిచ్చును. పుత్రజీవ విత్తనములు ఐశ్వర్యమునిచ్చును.

**శ్లో॥ ఆత్మజ్ఞానం కుశగ్రన్థీ రుద్రాక్షః సర్వకామదః।**
**ప్రవాలైశ్చ కృతా మాలా సర్వలోకవశప్రదా॥ 41**

**ప్రతిపదార్థము:–** కుశగ్రంథీ=దర్భముడులమాలిక, ఆత్మజ్ఞానమ్=ఆత్మజ్ఞానమును ఇచ్చును, రుద్రాక్షః=రుద్రాక్షమాల, సర్వ=సమస్తమైన, కామ=కోరికలను, దః=ఇచ్చునట్టిది. ప్రవాలైశ్చ=పగడమాలతో, కృతా=చేయబడిన, మాలా=మాలిక, సర్వలోక=సమస్త లోకములయొక్క వశప్రదా=వశములోకి ఇచ్చునది.

**తాత్పర్యము:–** దర్భముడులమాలిక ఆత్మజ్ఞానమును ఇచ్చును. రుద్రాక్షమాల సమస్తమైన కోరికలను ఇచ్చునట్టిది. పగడమాలతో చేయబడిన మాలిక సమస్త లోకములను వశములోకి ఇచ్చునది.

**శ్లో॥ మోక్షప్రదా చ మాలా స్యాదామలక్యాః ఫలైః కృతా।**
**ముక్తాఫలైః కృతా మాలా సర్వవిద్యాప్రదాయినీ॥ 42**

**ప్రతిపదార్థము:–** అమలక్యాః=పెద్ద ఉసిరికయొక్క, ఫలైః=పండ్లతో, కృతా=చేయబడిన, మాలా=మాలిక, మోక్ష ప్రదాచ=మోక్షదాయకమైనది, స్యాత్=అగును, ముక్తాఫలైః=ముత్యములచే, కృతా=చేయబడిన, మాలా=మాలిక, సర్వవిద్యా=సమస్త విద్యలను, ప్రదాయినీ=ఇచ్చునట్టిది.

**తాత్పర్యము:–** పెద్ద ఉసిరికయొక్క పండ్లతో చేయబడిన మాలిక మోక్షదాయకమైనది అగును. ముత్యములచే చేయబడిన మాలిక సమస్త విద్యలను ఇచ్చునట్టిది.

**శ్లో॥ మాణిక్యరచితా మాలా త్రైలోక్యస్య వశఙ్కరీ।**
**నీలైర్మరకతైర్వాపి కృతా శత్రుభయప్రదా॥ 43**

**ప్రతిపదార్థము:–** మాణిక్య=మాణిక్యమణులచేత, కృతా=చేయబడిన, మాలా=మాలిక, త్రైలోక్యస్య=లోకత్రయమునకు, వశంకరీ=వశము కలిగించునది, నీలైః=నీలములచేతగాని,

మరకతైర్వాపి=మరకత మణులచేతగాని, కృతా=చేయబడిన మాలిక, శత్రు=శత్రువులకు, భయప్రదా=భయము కలిగించునది.

**తాత్పర్యము:–** మాణిక్యమణులచేత చేయబడిన మాలిక లోకత్రయమునకు వశము కలిగించునది. నీలములచేతగాని, మరకత మణులచేతగాని చేయబడిన మాలిక శత్రువులకు భయము కలిగించునది.

**శ్లో॥ సువర్ణరచితా మాలా దద్యాద్ వై మహతీం శ్రియమ్।**
**తథా రౌప్యమయీ మాలా కన్యాం యచ్ఛతి కామితామ్॥ 45**

**ప్రతిపదార్థము:–** సువర్ణ=బంగారుపూసలతో, రచితా=చేయబడిన, మాలా=మాలిక, మహతీమ్=గొప్ప, శ్రియమ్=సంపదను, దద్యాద్వై=ఇచ్చును. తథా=అట్లే, రౌప్యమయీ= వెండిదైన, మాలా=జపమాల, కామితామ్=కోరబడిన, కన్యామ్=కన్యను, యచ్ఛతి=ఇచ్చును.

**తాత్పర్యము:–** బంగారుపూసలతో చేయబడిన మాలిక గొప్ప సంపదను ఇచ్చును. అట్లే, వెండిదైన జపమాల కోరబడిన కన్యను ఇచ్చును.

**శ్లో॥ ఉక్తానాం సర్వకామానాం దాయినీ పారదైః కృతా॥ 46**

**ప్రతిపదార్థము:–** ఉక్తానామ్=చెప్పబడిన, సర్వకామానామ్=సమస్త వాంఛలను, దాయినీ= ఇచ్చునట్టిది, పారదైః=పాదరసపు గుండ్లచేత, కృతా=చేయబడిన మాలిక.

**తాత్పర్యము:–** పాదరసపు గుండ్లచేత చేయబడిన మాలిక పైన చెప్పబడిన సమస్తవాంఛలను ఇచ్చునట్టిది.

**శ్లో॥ అష్టోత్తరశతా మాలా తత్ర స్యాదుత్తమోత్తమా।**
**శతసంఖ్యోత్తమా మాలా పఞ్చాశన్మధ్యమా మతా॥ 47**

**ప్రతిపదార్థము:–** తత్ర=అందులో, అష్టోత్తరశతా=108 పూసలుగల, మాలా=జపమాలిక, ఉత్తమోత్తమా=సర్వోత్తమమైనది, శతసంఖ్యా=100 పూసలుగలది, ఉత్తమా=ఉత్తమమైనది, పంచాశత్=50 పూసలుగలది, మధ్యమా=మధ్యరకమైన, మాలా=జపమాల.

**తాత్పర్యము:–** అందులో 108 పూసలుగల జపమాలిక సర్వోత్తమమైనది. 100 పూసలుగలది ఉత్తమమైనది. 50 పూసలుగలదిమధ్యరకమైన జపమాల.

**శ్లో॥ చతుష్పఞ్చాశతా యద్వా అధమా సప్తవింశతిః।**
**అధమా పఞ్చవింశత్యా యది స్యాచ్ఛతనిర్మితా॥ 48**



**శ్లో॥ పఞ్చాశదక్షరాణ్యత్రానులోమప్రతిలోమతః।**
**ఇత్యేవం స్థాపయేత్ స్పష్టం న కస్మై చిత్ప్రదర్శయేత్॥ 49**

**ప్రతిపదార్థము:–** యద్వా=లేదా, చతుష్పంచాశతా=54 పూసల మాలిక మధ్యరకం మాలిక అగును. సప్తవింశతి=27 పూసల మాలిక, అధమా=అధమ మాలిక. పంచవింశత్యా= 25 పూసల మాలిక అయినా, అధమా=అధమ మాలికయే. శతనిర్మితా=100పూసలచేత, నిర్మితా=చేయబడినది, యది స్యాత్=అయినట్లయితే, అత్ర=ఈ మాలికయందు, పంచాశత్ =50, అక్షరాణి=అక్షరములను, అనులోమప్రతిలోమతః=ఎదురుబదురుగా, ఇత్యేవమ్= అన్నట్లుగా,స్థాపయేత్=ఆవాహన చేయవలెను. కస్మైచిత్=ఎవనికైనను, స్పష్టమ్=స్పష్టముగా, న ప్రదర్శయేత్=జపమాలను చూపరాదు.

**తాత్పర్యము:–** లేదా 54 పూసల మాలిక మధ్యరకం మాలిక అగును. 27 పూసల మాలిక అధమ మాలిక. 25 పూసల మాలిక అయినా అధమ మాలికయే. 100పూసలచేత చేయబడినది అయినట్లయితే ఈ మాలికయందు 50 అక్షరములను ఎదురుబదురుగా అన్నట్లుగా ఆవాహన చేయవలెను. ఎవనికైనను స్పష్టముగా జపమాలను చూడరాదు.

**శ్లో॥ వర్ణైర్విన్యస్తయా యస్తు క్రియతే మాలయా జపః।**
**ఏకవారేణ తస్యైవ పురశ్చర్యా కృతా భవేత్॥ 50**

**ప్రతిపదార్థము:–** వర్ణైః=50 అక్షరములచేత, విన్యస్తయా=ఆవాహనచేయబడిన, మాలయా= మాలతో, యస్తు=ఏ, జపః=జపము, క్రియతే=చేయబడునో, తస్యైవ=దానికే, ఏకవారేణ= ఒకసారి, పురశ్చర్యా=పురశ్చరణ, కృతా=చేయబడినది, భవేత్=అగును.

**తాత్పర్యము:–** అక్షరమాలను ఆవాహనచేసిన మాలికతో జపం చేస్తే ఒకసారి జపం చేస్తే ఒకసారి పురశ్చరణ చేసినట్లు అర్థము. (పురశ్చర్య / పురశ్చరణ– అనగా గౌరవంగా ఆచరించటం అని మాలను ముందుకు త్రిప్పుట అని అర్థము. మంత్రగ్రంథాలన్నింటిలోను పురశ్చరణ అని ఉన్నది. 'పునశ్చరణ' అనటం పండితాహంకారుల సొంత ఉచ్చారణ మాత్రమే.)

**శ్లో॥ సవ్యపార్ష్ణిం గుదే స్థాప్య దక్షిణం చ ధ్వజోపరి।**
**యోనిముద్రా బన్ధ ఏష భవేదాసనముత్తమమ్॥ 51**

**ప్రతిపదార్థము:–** గుదే=ముడ్డియందు, సవ్యపార్ష్ణిమ్=ఎడమ మడమను, స్థాప్య=ఉంచి, దక్షిణం చ=కుడిమడమను, ధ్వజోపరి=జననేంద్రియముపైన, స్థాప్య=ఉంచినచో, ఏషః

= ఇది, యోనిముద్రా=యోనిముద్ర అను, బంధః=బంధము, ఉత్తమమ్=శ్రేష్ఠమైన, ఆసనమ్= ఆసనము, భవేత్=అగును.

**తాత్పర్యము:–** కూర్చొని ఎడమకాలి మడమను ముడ్డి క్రింద బిగించి, కుడికాలి మడమను జననేంద్రియము పై పెట్టినచో దీనిని యోనిముద్ర, మూలబంధము అందురు. ఈ ఆసనము ఉత్తమమైన ఆసనము. జపానికి, యోగానికి శ్రేష్ఠము. (యోనిముద్ర దేవతా స్వరూపము.)

**శ్లో॥ యోనిముద్రాసనే స్థిత్వా ప్రజపేద్యః సమాహితః।**
**యం కఞ్చిదపి వా మన్త్రం తస్య స్యుః సర్వసిద్ధయః॥ 52**

**ప్రతిపదార్థము:–** యోనిముద్రాసనే=యోనిముద్ర అను ఈ ఆసనమునందు, స్థిత్వా= కూర్చొని, యః=ఎవడు, సమాహితః=ఏకాగ్రతకలవాడై, మంత్రమ్=మంత్రమును, యం కంచిదపి వా=ఏదో ఒకదానిని, ప్రజపేత్=జపించునో, తస్య=వానికి, సర్వ=సమస్తమైన, సిద్ధయః=సిద్ధులు, స్యుః=కలుగును.

**తాత్పర్యము:–** యోనిముద్రాసనమునందు కూర్చుని ఎవడైనా ఏ మంత్రమునైనా జపించినచో అతనికి అది తప్పక సిద్ధించును.

**శ్లో॥ ఛిన్నా రుద్ధాః స్తమ్భితాశ్చ మిలితా మూర్ఛితాస్తథా।**
**సుప్తా మత్తా హీనవీర్యా దగ్ధత్రస్తారిపక్షగాః॥ 53**

**శ్లో॥ బాలా యౌవనమత్తాశ్చ వృద్ధా మన్త్రాశ్చ యే మతాః।**
**యోనిముద్రాసనే స్థిత్వా మన్త్రానేవం విధాన్ జపేత్।**
**తస్య సిద్ధ్యన్తి తే మన్త్రాః నాన్యస్య తు కథంచన॥ 54**

**ప్రతిపదార్థము:–** ఛిన్నాః=తెగినవి, రుద్ధాః=నిరోధింపబడినవి, స్తంభితాశ్చ=ఆపబడినవి, మిలితాః=కలిసిపోయినవి, మూర్ఛితాః=మూర్ఛపోయినవి, తథా=అట్లే, సుప్తాః=నిద్రించినవి, మత్తాః=మదించినవి, హీనవీర్యాః=బలహీనమైనవి, దగ్ధ=దగ్ధమైనవి, త్రస్త=భయపడినవి, అరిపక్షగాః=శత్రుపక్షమునందున్నవి అనగా శత్రువర్ణములతో కూడినవి, బాలాః=శిశు వయసులోనివి, యౌవనమత్తాశ్చ=యౌవనమదముగలవి, వృద్ధాః=ముసలివి, అగు, యే=ఏ, మంత్రాః=మంత్రములు, మతాః=తలచబడినవో, ఏవమ్ విధాన్=ఇటువంటి, మంత్రాన్= మంత్రములను, యోనిముద్రాసనే=పైన చెప్పిన యోనిముద్రలో, స్థిత్వా=కూర్చొని, జపేత్= జపింపవలెను, తస్య=అలా జపించినవానికి, తే=ఆ, మంత్రాః=మంత్రములు, సిధ్యంతి= సిద్ధించును, అన్యస్య తు=అట్లు చేయనివానికి, కథంచన=ఎట్లయినను, న సిద్ధ్యంతి= సిద్ధింపవు.



**తాత్పర్యము:–** మంత్రములు మాన నామాక్షరమును బట్టి, వాటి ప్రథమ బీజమును బట్టి లేదా వాటి ఆకారమును బట్టి వాటిలోని వర్ణముల స్థితిని బట్టి రకరకాలుగా నుండును. ఛిన్నములు, రుద్ధములు, స్తంభితములు, మిలితములు, మూర్ఛితములు, సుప్తములు, మత్తములు, వీర్యహీనములు, దగ్ధములు,త్రస్తములు, అరివర్గములు, బాలములు, యువకములు, వృద్ధములు – ఇవి కొన్ని ఫలించవు. కొన్ని వ్యతిరేక ఫలాలు. కొన్ని చేతబడులు మొదలగు వానికి పనికివచ్చునవి. కొన్ని సిద్ధించటం ఆలస్యం. ఇట్టి వన్నియును యోనిముద్రలో జపించినచో సిద్ధించును.

**శ్లో॥ బ్రాహ్మం ముహూర్తమారభ్యాఽఽమధ్యాహ్నం ప్రజపేన్మనుమ్।**
**అత ఊర్ధ్వం కృతే జాపే వినాశో భవతి ధ్రువమ్॥**

**ప్రతిపదార్థము:–** బ్రాహ్మమ్=బ్రహ్మ సంబంధమైన, ముహూర్తమ్=ముహూర్తమునుంచి, ఆరభ్య=మొదలుపెట్టి, ఆమధ్యాహ్నమ్=మధ్యాహ్నము వఱకు, మనుమ్=మంత్రమును, ప్రజపేత్=జపింపవలెను, అతః=మధ్యాహ్నం కన్న, ఊర్ధ్వమ్=పైన, జాపే=జపము, కృతే= చేయబడినచో, ధ్రువమ్=తప్పక, వినాశః=నాశనము, భవతి=జరుగును.

**తాత్పర్యము:–** తెల్లవారుజామున బ్రాహ్మీముహూర్తము నుండి మధ్యాహ్నము వఱకు జపము చేయవచ్చును. అంతకుపైన జపమునకు వినాశము ఫలము.

**శ్లో॥ పురశ్చర్యావిధావేవం సర్వకామ్యఫలేష్వపి।**
**నిత్యే నైమిత్తికే వాఽపి తపశ్చర్యాసు వా పునః।**
**సర్వదైవ జపః కార్యో న దోషస్తత్ర కశ్చన॥ 57**

**ప్రతిపదార్థము:–** ఏవమ్=ఈ విధముగా, పురశ్చర్యావిధౌ=పురశ్చరణవిధానమునందు, సర్వ=సమస్తమైన, కామ్యఫలేష్వపి=కామ్యజపములందును ఆచరింపవలయును, నిత్యే= నిత్యమునందును, నైమిత్తికే వాపి=గ్రహణము మొదలైన నైమిత్తికములవలన చేయు సమయమందును, పునః=మఱల, తపశ్చర్యాసు వా=తపస్సు చేయుటయందుగాని, సర్వదైవ =ఎల్లపుడు, జపః=జపము, కార్యః=చేయదగినవి, తత్ర=మధ్యాహ్నానంతర జపమునందు, కశ్చన=ఏదైనా, దోషః=దోషము, న=లేదు.

**తాత్పర్యము:–** మధ్యాహ్నానంతర జపనిషేధము మంత్ర పురశ్చరణానికి కామ్య కర్మలలో చేయు జపములకు మాత్రమే వర్తించును. కాని నిత్య పంచాక్షరీ జపము వంటి నిత్యము నందు, గ్రహణమువంటి నైమిత్తిక సందర్భములో చేసే జపమునకును, తపస్సులకును, ఈ కాల నియమం లేదు.

**శ్లో॥ యస్తు రుద్రం జపేన్నిత్యం ధ్యాయమానో మమాకృతిమ్।**
**షడక్షరం వా ప్రణవం నిష్కామో విజితేన్ద్రియః॥ 58**

**ప్రతిపదార్థము:–** యస్తు=ఎవడు, మమ=నాయొక్క, ఆకృతిమ్=ఆకారమును, ధ్యాయమానః =ధ్యానించుచు, రుద్రమ్=నమకమును, వా=లేదా, షడక్షరమ్=ఆరు అక్షరములుగల, పంచాక్షరిని గాని, ప్రణవమ్=ఓంకారమును గాని, నిష్కామః=కామరహితుడై, విజిత=గెలువ బడిన, ఇంద్రియః=ఇంద్రియములుగలవాడై, జపేత్=జపించునో –

**తాత్పర్యము:–** ఎవడు నిష్కాముడై, జితేంద్రియుడై నా ఆకృతిని ధ్యానించుచు రుద్రమును గాని, షడక్షరినిగాని, కేవల ప్రణవమునుగాని జపించునో –

**శ్లో॥ తథాథర్వశిరోమన్త్రం కైవల్యం వా రఘూత్తమ!।**
**స తేనైవ చ దేహేన శివః సంజాయతే స్వయమ్॥ 59**

**ప్రతిపదార్థము:–** రఘూత్తమ=రఘువీరా!, తథా=అట్లు, అథర్వశిరోమంత్రమ్=అథర్వ-శిరోపనిషత్తును, కైవల్యం వా=కైవల్యోపనిషత్తును జపించునో, సః=వాడు, తేనైవ=అదే, దేహేన=శరీరముతో, స్వయమ్=స్వయముగా, శివః=శివుడు, సంజాయతే=అగును.

**తాత్పర్యము:–** లేదా అథర్వశిరోపనిషత్తునుగాని, కైవల్యోపనిషత్తునుగాని పఠించినచో వాడు శరీరముదాల్చిన శివుడే అగును. అనగా జంగమ పరమేశ్వరుడగును.

**శ్లో॥ అధీతే శివగీతాం యో నిత్యమేతాం జితేన్ద్రియః।**
**శృణుయాద్వా స ముక్తస్స్యాత్ సంసారాన్నాత్ర సంశయః॥ 60**

**ప్రతిపదార్థము:–** యః=ఎవడు, జితేంద్రియః=ఇంద్రియములను జయించినవాడై, నిత్యమ్= సదా, ఏతామ్=ఈ, శివగీతామ్=శివగీతను, అధీతే=చదువునో, శృణుయాద్వా=వినునో, సః=వాడు, సంసారాత్=సంసారమునుండి, ముక్తః=విముక్తుడు, స్యాత్=అగును, అత్ర= ఇందులో, సంశయః=సందేహము, న=లేదు.

**తాత్పర్యము:–** ఎవడు జితేంద్రియుడై నిత్యం ఈ శివగీతను చదివినా, విన్నా సంసారము నుండి విముక్తి లభించును.

**సూత ఉవాచ-సూతుడు ఇట్లనెను.**

**శ్లో॥ ఏవముక్త్వా మహాదేవస్తత్రైవాన్తరధీయత।**
**రామః కృతార్థమాత్మానమమన్యత తదైవ సః॥ 61**



**ప్రతిపదార్థము:–** ఏవమ్=ఇట్లు, ఉక్త్వా=పలికి, మహాదేవః=శివుడు, తత్రైవ=అచ్చటనే, అంతరధీయత=అంతర్ధానము చెందెను, సః=ఆ, రామః=రాముడు, తదైవ=అప్పుడే, ఆత్మానమ్=తనను, కృతార్థమ్=కృతార్థునిగా, అమన్యత=తలచెను.

**తాత్పర్యము:–** ఈ విధముగా గీతోపదేశముచేసి మహాదేవుడు అచ్చటనే అంతర్ధానము చెందెను. రాముడు తక్షణమే తనను ధన్యునిగా భావించికొనెను.

**శ్లో॥ ఏవం మయా సమాసేన శివగీతా సమీరితా।**
**ఏతాం యః ప్రజపేన్నిత్యం శృణుయాద్వా సమాహితః।**
**ఏకాగ్రచిత్తో యో మర్త్యస్తస్య ముక్తిః కరే స్థితా॥ 62**

**ప్రతిపదార్థము:–** ఏవమ్=ఇట్లు, మయా=నాచేత, శివగీతా=శివగీత, సమాసేన= మొత్తముగా, సమీరితా=చెప్పబడినది, యః=ఏ, మర్త్యః=మనిషి, ఏతామ్=ఈ గీతను, సమాహితః=ఏకాగ్రత గలవాడై, నిత్యమ్=నిత్యము, ప్రజపేత్=జపించునో, ఏకాగ్రచిత్తః =ఏకాగ్ర మనస్సు గలవాడై, యః=ఎవడు, శృణుయాద్వా=వినునో, తస్య=అతనికి, ముక్తిః =మోక్షము, కరే=చేతియందు, స్థితా=ఉన్నది.

**తాత్పర్యము:–** మునులారా! నేను శివగీతను మొత్తము చెప్పితిని. దీనిని ఏకాగ్ర చిత్తముతో చదివినా, వినినా అట్టి వానికి మోక్షము కరతలామలకమని యర్థము.

**శ్లో॥ అతః శృణుధ్వం మునయో నిత్యమేతాం సమాహితాః।**
**అనాయాసేన వో ముక్తిర్భవితా నాత్ర సంశయః॥ 63**

**ప్రతిపదార్థము:–** అతః=ఇందువలన, మునయః=మునులారా!, నిత్యమ్=సర్వదా, ఏతామ్= దీనిని, సమాహితాః=సావధానులై, శృణుధ్వమ్=వినుడు, వః=మీకు, ముక్తిః=మోక్షము, అనాయాసేన=తేలికగా, భవితా=కాగలదు, అత్ర=ఇందులో, సంశయః=సందేహము, న= లేదు.

**తాత్పర్యము:–** కనుక, ఋషులారా! సమాహిత మనస్కులై మీరు నిత్యము శివగీతను పఠింపుడు. అతి సులభంగా మీకు ముక్తి లభింపగలదు.

**శ్లో॥ కాయక్లేశో మనఃక్షోభో ధనహానిర్న చాత్మనః।**
**పీడాస్తి శ్రవణాదేవ యస్మాత్ కైవల్యమాప్నుయాత్।**
**శివగీతామతో నిత్యం శృణుధ్వమృషిసత్తమాః॥ 65**

**ప్రతిపదార్థము:–** శ్రవణాదేవ=వినుట చేతను, యస్మాత్=దేనివలన, కైవల్యమ్=మోక్షమును, అప్నుయాత్=పొందవచ్చునో, తస్మాత్=దానివలన, కాయక్లేశః=శరీర కష్టము, మనఃక్షోభము

=చిత్తక్లేశము, ధనహానిః=ధననష్టము, ఆత్మనః=ఆత్మకు, పీడా చ=బాధయు, నాస్తి=లేదు, అతః=కనుక, ఋషిసత్తమాః=ముని శ్రేష్ఠురాలా! శివగీతామ్=శివగీతను, నిత్యమ్=సదా, శృణుధ్వమ్=వినుడు.

**తాత్పర్యము:–** శివగీత వినినంతమాత్రముననే ముక్తి వచ్చును. దీనివలన శరీర కష్టము, మానసిక క్షోభము, ధనహాని, ఆత్మపీడ మొదలైనవి కలుగవు. కనుక యిది సుఖకరమైన మోక్ష సాధనము. కనుక దీనిని నిత్యము వినుడు.

**ఋషయ ఊచుః-ఋషులిట్లనిరి.**

**శ్లో॥ అద్య ప్రభృతి నః సూత! త్వమాచార్యః పితా గురుః।**
**అవిద్యాయాః పరం పారం యస్మాత్తారయితాసి నః॥ 66**

**ప్రతిపదార్థము:–** సూత!=సూతమహర్షీ!, అద్యప్రభృతి=నేటినుండి, త్వమ్=నీవు, ఆచార్యః=గురువువు,పితా=తండ్రివి,గురుః=ఆచార్యుడవు, యస్మాత్=ఎందుకంటే, నః=మమ్ములను, అవిద్యాయాః=అజ్ఞానముయొక్క పరమ్=అవతలి, పారమ్=ఒడ్డును, తారయి తా=దాటించే వాడవు గూడా, అసి=అగుచున్నావు.

**తాత్పర్యము:–** సూతమహర్షీ! నేటి నుంచి నీవు మాకు తండ్రివంటివాడవు, ఆచార్యుడవు. గురువువు. ఎందుకంటే, నీవే మమ్ములను అవిద్యనుండి తరింపజేయువాడవు.

**శ్లో॥ ఉత్పాదకబ్రహ్మదాత్రోర్గరీయాన్ బ్రహ్మదః పితా।**
**తస్మాత్సూతాత్మజ! త్వత్తః సత్యం నాన్యోఽస్తి నో గురుః॥ 67**

**ప్రతిపదార్థము:–** ఉత్పాదక=పుట్టించిన తండ్రి, బ్రహ్మదాత్రోః=జ్ఞానదాత అయిన, గురువులలో, బ్రహ్మదః=బ్రహ్మజ్ఞానమును కలిగించువాడు, గరీయాన్=శ్రేష్ఠుడైన, పితా=తండ్రి అగును, తస్మాత్=కనుక, సూతాత్మజ!=సూతపుత్ర!, త్వత్తః=నీ కన్న, అన్యః=మఱొక, గురుః=గురువు, న=లేదు, సత్యమ్=నిజము.

**తాత్పర్యము:–** జనకుడు–గురువు వీరిలో బ్రహ్మ జ్ఞానమిచ్చిన గురువు గొప్పవాడు. కనుక సూతపుత్ర! మాకు నీ కన్న గురువు మఱొకడు లేదు.

**శ్లో॥ ఇత్యుక్త్వా ప్రయయుః సర్వే సాయం సన్ధ్యాముపాసితుమ్।**
**స్తువన్తః సూతపుత్రం తే సన్తుష్టా గోమతీతటమ్॥ 68**

**ప్రతిపదార్థము:–** ఇతి=అని, ఉక్త్వా=పలికి, తే=ఆ మునులు, సర్వే=అందఱు, సంతుష్టాః=సంతోషించినవారై, సూతపుత్రమ్=సూతపుత్రుని, స్తువంతః=స్తుతించుచు, సాయం



సంధ్యామ్=సాయం సంధ్యను, ఉపాసితుమ్=ఉపాసించుటకు, గోమతీతటమ్=గోదావరీ తీరమును గూర్చి, ప్రయయుః=వెళ్ళిరి.

**తాత్పర్యము:–** మునులందరు సంతోషంతో సూతమహర్షిని స్తుతించిరి. సాయం సంధ్యా వందన కార్యమునకై అందఱును గోదావరీ తీరమునకు వెళ్ళిరి.

**ఇతి శ్రీ పద్మపురాణే ఉపరిభాగే శివగీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీ శివరాఘవసంవాదే గీతాధికారినిరూపణం నామ షోడశోఽధ్యాయః॥**

**(వావిళ్లవారి లెక్కలో 18వ అధ్యాయము)**

**ఓం తత్సత్ ఓం**



**/// శివమస్తు ///**